# పులికంటి సాహితీ సత్కృతి

## నిర్వాహక మండలి



'॥ గుత్తా మునిరత్నం
గౌరవాధ్యక్షులు



శ్రీ కె. శివమోహన్ రెడ్డి
అధ్యక్షులు

శ్రీ వోలేటి పార్వతీశం
ప్రధాన కార్యదర్శి

్వాహక కార్యదర్శులు

॥ మన్నవ భాస్కరనాయుడు
యం. శంకరరెడ్డి

కోశాధికారులు

శ్రీ ఎన్. విజయరాఘవరెడ్డి
శ్రీ వై.యం. రెడ్డి

సలహా మండలి

ఆచార్య పి.వి. అరుణాచలం
ఆచార్య ఎన్. గోపి
శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు
ఆచార్య యార్లగడ్డ బాలగంగాధర రావు
శ్రీ సి.యస్. రెడ్డి
శ్రీ ఎ. ఎస్. రెడ్డి
శ్రీ కె. మాధవ రెడ్డి
శ్రీ వేంపల్లి అబ్దుల్ ఖాదర్
శ్రీ వై. బాలకృష్ణ
శ్రీ వి.ఎస్. బాలాజీ

*Pulikanti Saptathi* **"Abhinandana Sanchika"**

December 2000

***Editor***

Dr. Mannava Bhaskar Naidu

***Executive Editors***

Sri Voleti Parvatheesam
Prof. Yarlagadda Balagangadhara Rao
Sri V.M. Reddy
Sri Y. Balakrishna

***Designing & Type setting***

University Xerox, Tirupati

***Printing***

Nagarjuna Printers, Chennai.
Phone : 5951658

# కళల దీవి పులికంటి చిరంజీవి!

ద్ద పెద్ద వాళ్ల చిన్నవిషయాలు వార్తలవుతాయి. ఒక రాయలసీమ చిన్నోడు చేస్తున్న పెద్దపని వార్తలకు ంది. రాయలసీమ చిన్నోడు అంటే - రాయలసీమ హద్దులు దాటుకొని ఆంధ్రదేశపు ఎల్లలు, రిహద్దులు కూడా దాటుకొని చిత్తూరు నుంచి చికాగో దాకా సాహిత్య రసజ్ఞుల హృదయాలు పులికంటి ధన్యజీవి!

ప్తతిలో అడుగుబెట్టిన రాయలసీమ చిన్నోడు ఈనాడు సకల సాహితీ ప్రక్రియాపట్టభద్రుడుగా దను నిరూపించుకొన్నాడు.

నివెనుక నాలుగు దశాబ్దాల చిరదీక్ష వుంది. స్థిరదీక్ష ఉంది. సంకల్పం ఉంది. సాహసం ఉంది. ్వాసం ఉంది. లేకుంటే ఆనాడు తన జీవితానికే గాక తన కుటుంబ జీవితానికీ భద్రతగా నిలిచే భుత్వ ఉద్యోగాన్ని వదలిపెట్టి అక్షరయోగం స్వీకరించడు.

నకూ తెలుసు - తానెన్నుకున్న మార్గంలో భూతాల దుర్గాలు ఉంటాయని. భూతల స్వర్గాన్నికై ంటున్న కళాకారునికి, సాహిత్య కళాకారునికి పూలతల్పం అక్కరలేదు. సంకల్పం ఉంటేచాలు... దయ సామ్రాజ్యాలనైనా జయించవచ్చునని పులికంటి మరొకసారి నిరూపించారు.

థలో కవిత్వాన్ని, కవిత్వంలో కథా తత్వాన్ని ఇమిడ్చారు. నాటక రచనలో, ప్రదర్శనలో మెలకువలు చారు. గేయాలు రాశారు. పాటలు పాడారు. బుర్రకథలు తానే రచించి, గజ్జకట్టి వాటిని వారు. మాండలికంలో భూమండలాన్ని పొదిగారు. తన కలాన్ని తనగళంలో ధ్వనించారు. ూలల మట్టిమనుషుల శిథిలజీవన ఘోషలను ప్రతిధ్వనించారు. రాతలోనూ, కూతలోను తన ను నిలబెట్టుకున్నారు. మధురగాత్రంతో తన పదాలను గేయపాదాలను హృద్యంగా పలికించి యాలను మైమరపించారు.

ంధ్రసాహితీ క్షేత్రంలో ఫలపుష్ప సంభరిత పారిజాతమై మొలిచారు. 'ఒక చట్రంలో ఇముడని ుడుగా' సంభావింపబడినారు. ఈ శతాబ్ది కవులలో లబ్ధప్రతిష్ఠులైన హేమాహేమీల సరసన వేదికల మీద సమప్రతినిధిగా గళం విప్పారు.

నేక సంస్థలు, రాష్ట్రంలోనే కాకుండా రాష్ట్రేతర ప్రాంతాలలో సదస్సులు, పరిషత్తులు, ప్రభుత్వ తర కార్యక్రమాలు పులికంటిని ఘనంగా సత్కరించాయి! ఇన్ని సత్కారాలు, పురస్కారాలు ని, ఎందరో అందుకోలేని ఎత్తులకు ఎదిగినా పులికంటి చూపులో గోమాత సాధుత్వమే కాని రం కనిపించదు. నిరంతర సాహిత్య కృషీవలుడుగా సాహిత్యసేవలో అలుపెరుగని దీక్షాశీలుడుగా 'లో అడుగు పెట్టినా పులికంటి కృష్ణారెడ్డి "రాయలసీమ చిన్నోడు" గానే మిగిలిఉంటానన్న అతని సొత్తు. శాఖోపశాఖలుగా విస్తరించిన సాహిత్య తరువుకు అదే అసలైన విత్తు!

మాజిక బాధ్యత గుర్తించి సాహిత్యసేవ చేసిన తనకు ఇంత పరిగణనమూ గౌరవపురస్కార ప్రాభవమూ న్న పులికంటి, సమాజానికి తానేదో చేయాలన్న తపన. ఎప్పుడు కలిసినా ఆ మాటల ఆలాపన. రికి బాధ్యత వహిస్తున్న కవులు రచయితలే కదా ఈ సమాజానికి నిజమైన ప్రతినిధులు! కాబట్టి... కవులను రచయితలను తన శక్తిమేరకు సత్కరిస్తే సమాజాన్ని సత్కరించినట్లే కదా! అన్న మానసిక నుండి ఉద్భవించిన సద్భావామృత భాగమే...

**పులికంటి సాహితీ సత్కృతి!**

ష్ఠతిలో అడుగిడుతున్న సమయంలో ఈ సత్కృతి ఆకృతి ధరించింది. ప్రకటనకు చక్కని ందన లభించింది. 32 కవితా సంపుటాలు, 25 కథా సంపుటాలు పోటికి వచ్చాయి. 'సి న్యాయనిర్ణేతలు చిత్రిక పట్టిన తర్వాత ఐదేసి సంపుటాలు పోటీలో నిలిచాయి. వితా సంపుటాలను ఐదు కథా సంపుటాలను సుప్రసిద్ధ విమర్శకులు పరమార్శించిన బహుమతి విజేతల నిర్ణయం జరిగింది. బహుమతి విజేతలకు అభినందనలు. సర్వశ్రీ ౦ం రామారావు, వల్లంపాటి వెంకట సుబ్బయ్య, సింగమ నేని నారాయణ, వేంపల్లి ఖాదర్ (కథకు) అద్దేపల్లి రామమోహనరావు, సుధామ, డా॥ మన్నవ, అఫ్సర్ (కవితకు) ిర్ణేతలుగా వ్యవహరించిననారు. వీరికి అభివందనాలు.

ులికంటి సాహితీ సత్కృతి బహుమతి ప్రదానోత్సవం ఆయన సప్తతి సమాహారంగా ంచాలని తలపెట్టాం.

తలంపు అయినా ఆచరణలోనికి రావాలను కొన్నప్పుడు అసలు కడగండ్లు ుతాయి.

ంతటి సదాశయంతో రూపుదాల్చిన ఈ సత్కృతి సమాహార సభల నిర్వహణ సందర్భంగా టి సాహిత్య సేవా హేవాకం ప్రతిబింబించేటట్లు అభినందన సంచిక తేవాలనుకున్నాం. సీమ సిన్నోడి పేరుతో జరుప తలపెట్టిన సత్కార్యం ఎంత దుష్కరం అయిందో ానికి వచ్చింది. కరువు సీమగా స్థిరపడిన రాయలసీమలో బుద్ధిజీవుల ఔదార్యానికి రువు రావడం ఆవేదన మిగిల్చింది. రాయలసీమ రాతిగుండెల సీమ అని అక్షరాలా ంచుకొంది. ఒరిపిళ్ళ రాపిళ్లతో నిగ్గు తేలితేనే కదా పుత్తడి మెరుపు తెలిసేది!

యినా ఇక్కడ కూడా ఇంకా కొందరు సహృదయులు మిగిలి ఉండబట్టి ఈ అభినందన ఇంత సుందరంగా వెలువడ గలిగింది.

ష్ఠతి శుభవేళ పులికంటిని పలువురు ఆశీర్వదించారు. సందేశాలందించారు. పులికంటి ఫూర్తి విశిష్ట లక్షణాలను వ్యాసాలుగా చిత్రించారు. ప్రకటనలిచ్చి దోహదం చేశారు. చ్చి వెన్నుతట్టారు. మా ఆలోచనలకు అనుగుణంగా స్పందించి టైప్ సెట్టింగులో ర్శిటీ జిరాక్స్ సిబ్బంది సహకరించారు. ఇలా ఎందరో! అందరికీ కృతజ్ఞతాభివందనాలు.

**లికంటి అభినందన సంచిక!**
**'లిపలుకుల దేవేరి మీటుతున్న విపంచిక!!**

— డా. మన్నవ భాస్కరనాయుడు.

ో శ్రీమాన్ శంకరంబాడి సుందరాచారి తిరుపతిలో పులికంటికి ఏర్పాటుచేసిన సన్మాన గా ఒక సన్మానసంచిక తేవాలన్న ప్రయత్నం ఫలించలేదు. ఆ ప్రయత్నానికి స్పందిస్తూ అభిమానులు రాసిన వ్యాసాలను ఈ సంచికలో ఉపయోగించుకొన్నాం.

— సం॥

HYDERABAD






**CHIEF MINISTER**
**ANDHRA PRADESH**

**RA CHANDRABABU NAIDU**

# సందేశం

అచ్చ తెలుగు నుడికారంతో రాయలసీమ యాసలో సునిశితమైన కవిత్వాన్ని అల్లి మెదడును భావోద్వేగంతో చైతన్యపరచ గలిగిన శ్రీ పులికంటి కృష్ణారెడ్డి తెలుగు కవితకు కొత్త ఒరవడిని తీర్చిదిద్దారు.

సామాజిక స్ఫూర్తి, జానపద కవితానురక్తి పులికంటి కలాన్ని పదునెక్కించి గత నలభై యేళ్ళుగా తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. డెబ్బైయవ పడిలో సైతం చెక్కుచెదరని నిత్యనూతన పటుత్వంతో అందరినీ అలరించే ఆయన కవితావేశాన్ని అభినందిస్తున్నాను.

శ్రీ పులికంటి తనదైన శైలిలో మరింత ఉత్తేజంతో ముమ్ముందు మరెంతో కాలంపాటు సాహితీ సేవలందించగలరని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను.

(నారా చంద్రబాబు నాయుడు)








Minister of
Information & Broadcastin
Government of India
New Delhi - 110 001

shma Swaraj

# MESSAGE

It gives me great pleasure to learn that the Pulikanti Sahithi Sathkruthi, a :erary, cultural and social voluntary trust is coming out with a souvenir, 'ulikanti Saptathi Abhinandana Sanchika".

Literature and literary works reflect the evolutionary changes that take ace in the cultural and social milieu of people. Shri Pulikanti has made re- arkable contribution to the literature of Rayalaseema region in particular and e Telugu literature in general, voicing the woes and wishes of the people ough his pen.

The institution of Pulikanti Sahithi Sathkruthi with the objective of nouring and rewarding the talented writers and poets shows Shri Pulikanti's ionary outlook for carrying on the work of reverberating the unheard voices.

I take this opportunity to wish the Trust all the best in its endeavour for :ing up an active role in the promotion of Telugu literature.

(SUSHMA SWARAJ)

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy,** M.P.
M.A.,Ph.D., D. Litt
CHAIRMAN
**Andhra Pradesh State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad - 500 004
Phone : (O) 214603 (R) 3548451
Fax : (O) 214603



జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి.నారాయణరెడ్డి,** ఎం.పి.
ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్
అధ్యక్షులు
**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు – 500 004
ఫోన్ (ఆ) 214603 (ఇ) 3548451
ఫాక్స్ (ఆ) 214603

# అభినందన



నిండుగా, కండగా, కవితల కలకండగా కనిపించే మా పులికంటి సప్తతిలో ప్రవేశించడం నాకు సంభ్రమాన్నీ, సంబరాన్నీ కలిగించింది.

నా సహోదరుడు నాతో వయసులోనూ సైదోడుగా ఉన్నాడా అనిపించింది.

అచ్చమైన దేశీయతకు అపరంజి మచ్చుతునకలు పులికంటి రచనలు. కథ అల్లినా, కవిత చెక్కినా, పాటలు పలికినా, మాటలొలికినా పులికంటి కృష్ణారెడ్డిది తులలేని శైలి.

రాయలసీమ పలుకుబడి, జానపదుల ఒరవడి, ప్రగతిశీలం ఉరవడి అతని రచనల్లో త్రిముఖీనంగా వెల్లివిరిశాయి.

కవి సమ్మేళనాల్లో ఆకాశవాణి దూరదర్శన్ గోష్ఠుల్లో అతడు నిర్వహించిన భూమిక విలక్షణ వ్యక్తిత్వ సూచిక.

జానపద కవికోకిలగా సార్థక బిరుదుడైన ఆత్మీయుడు పులికంటి కృష్ణారెడ్డి సప్తతి వత్సర సందర్భంగా నా హార్దిక అభినందన.

ıs : "TELVERS"



Phone : 040-3234815
040-3236911
Res : 040-7037585
Fax : 040-3236045
Email:pstuvc@ap.nic.in

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY



Lalitha Kala Kshetram
Public Gardens, Nampally
Hyderabad - 500 004 (A.P.)

f. N. Gopi, M.A.,Ph D.
- CHANCELLOR

## అన్నకు అభినందనలు

రాయలసీమ చిన్నోడా!
ఇవాళ రాయలసీమ పెద్దోడివైనావు.
రాతిమీద సేద్యం చేసి
స్వేదాన్నే పండించావు
రాళ్లమధ్య మెలిగినా
కరిగిపొయ్యే వెన్నగుండె నీది.

అన్నమయ్య అక్షరాలు
అన్నం పెడితే
నువ్వు తిరుపతి భాషకు
పరపతిని పెంచావు.

అమ్మిపదాలకు
హృదయాన్ని అమ్మివేశావు.
వందలాది కథలు మలిచావు
నీ కథలన్నీ మట్టి వెతలే.

నాటకాల కోసం
రైల్వేనాటకాన్ని వదిలేశావు.
జీవితంతో ప్రయోగాలు చేశావు.
అనుభవాలను బంగారంగా మలిచావు.
'సీమచిన్నోడి గ్యాపకాలు'
భావితరాలకు జ్ఞాపికలుగా బహూకరించావు
మనిషిని మనిషిగా ప్రేమించే నిన్ను
అచ్చిరాని రాజకీయాలు
ఆత్మీయంగా చేయిపట్టి
నడిపించాయి 'అచ్చిరాల్లో'కి
అదృష్టమే!

రాయలసీమ చిన్నోడా
ఆంధ్రదేశం పెద్దోడా !!
అందుకో
తమ్ముడి అభినందనలు !





**BANARAS HINDU UNIVERSITY**
VARANASI - 221 005 (India)
Office : (0542) 368938/30-7220
Residence: (0542) 368339/30-7209
Fax : (91) (542) 316946
e-mail : vc_bhu@banaras.ernet.in
Website : www.bhu.ac.in

February 17, 20001

**fessor Dr. Y.C. Simhadri**
M.A.,Ph.D. (U.S.A.), D.Litt., LL.D.,
M.S.W., B.L. (INDIA), D.Y.W. (LONDON),
C.R.Y.W. (GERMANY), L.I.E. (JAPAN)
-CHANCELLOR

# MESSAGE

"Pulikanti Krishna Reddy" is a prelude, much beyond a name it articulates. It aks volumes of creative talents of a rare gene of Telugu literature, a versatile and ering personality, an erudite scholar and an artist par excellence that commands h esteem from all corners of human perception. The qualities and virtues inherent him, are by themselves testimony of his enormous contributions to Telugu in its ality.

May God grant him health and happiness for many years and enable him to ntribute more!

I am sure, the Souvenir in hand will serve as an inordinate source of inspiration literary pursuits.

. SIMHADRI
e-Chancellor

# DRAVIDIAN UNIVERSITY

KUPPAM - 517 425 : ANDHRA PRADESH



© (08570) 55650 (O) 55750 (R)

Fax No. : 08570-55920

*P. V. Arunachalam*

M.A.,Ph D.,Dip in German, F.N.A.Sc.

:hancellor

# MESSAGE

The establishment of Pulikanti Sahithi Satkruthi is a matter of great delight to all lovers of gu literature in general. On its behalf it is designed to award yearly prizes to 1. the best peotic position and 2. the best collection of short stories, both in Telugu.

I appreciate the laudable aims and objectives behind the Institution of these coveted awards. ng of these awards commenced with effect from the year 2000.

Sri Pulikanti Krishna Reddy has carved out a niche for himself in the modern Telugu literary d. During the last four decades of the last century his contribution to poetry, drama, short s, criticism, folklore and journalism have been phenomenal. Over and above all, he has endeared elf to the people of Andhra Pradesh as **"Rayalaseema Chinnodu"**. He is an actor and tor too. The regional dialect of Chittoor district got a place of prominence in his recent works.

Following the footsteps of his friend, philosopher and guide Late Sankarambadi Sundarachari, rishna Reddy has relinquished about 40 years ago a lucrative job in Indian Railways and has en to make a career as a man of letters.

A multifaceted personality like Pulikanti is a pride of Tirupati nay Rayalaseema. His well ers and admirers are overwhelmed with joy when the institution of awards in his honour nenced synchronizing with the point of time when he attained 70 years of age! Pulikanti is ity! Unbelievable for any one who looks at him. His joyous and boyish nature, dynamism, ional outpourings, active organizational abilities and agility of mind defy his age. To his close ds he is only a more grownup boy (mudirina kurradu), not at all an old man of seventy years

The literary felicitation programme, I am sure, will enthuse scores of poets and shortstory rs to compete for the prestigious awards that it offers. As a consequence the Telugu literature be enriched by the competitive writings of the aspirants in the years to come.

May Pulikanti be blessed by Almighty God with long and fruitful life!

(P. V. ARUNACHALAM)

M.S. RAJAJEE, I.A.S. (Retired)

19, Second Main Road
CIT Colony
Chennai - 600 004

Voleti Parvatheesam
retary
ikanti Sahithi Satkruthi

# MESSAGE

Sir

I am very happy to learn that you are planning to bring out a Souvenir and that the proceeds of the Souvenir will be utilized to start a Trust to help, assist and encourage writers of promise. I am indeed glad that such a thing is being done.

have known Sri Pulikanti Krishna Reddy, ever since I was a Collector, Chittoor (1974 - 1977) and I have watched his evolution as a poet and writer of merit. Sri Pulikanti Krishna Reddy has been sending the copies of his works and I was greatly impressed by his felicity of expression, turn of phrase and lucidity of thought. Even when I became the Chief Secretary, we were in touch and I knew that I was often in his thoughts, just as he was in mine whenever I saw his books or articles. His skill as a writer, his humility, and his innate warmth as human being are qualities, which always stood out.

wish Sri Krishna Reddy more years of substantial contribution and the organizers all success.

Yours faithfully,

Dr. M S Rajajee

ఆర్. వెంకటేశ్వర్లు
డైరెక్టర్

దూరదర్శన్ కేంద్రం
రామంతపూర్
హైదరాబాదు-500 013

ఆంధ్రదేశంలో సామాన్య ప్రజానీకానికి తిరుపతి పేరు చెప్పగానే శ్రీవేంకటేశ్వరుడు గుర్తుకు వచ్చినట్లు, సాహిత్యలోకానికి తిరుపతి చెప్పగానే శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారు స్ఫురణకు వస్తారు. కృష్ణారెడ్డిగారికి సప్తతి అంటే నమ్మశక్యంగా లేదు. వర్తమాన యువతరంతో పోటీపడుతూ, ఇప్పటికీ తన కలాన్ని కదను తొక్కిస్తూ ఉంటే, ఇంకా ఆయన యువకునిగా కనిపిస్తాడే గానీ, అప్పుడే ఏడు పదుల వయసున్నవాడిలా అనిపించడు.

బహుముఖమైన చాలా అరుదుగా లభించే ప్రతిభ, ఆప్రతిభను కైవశం చేసుకొన్న బహుకొద్దిమందిలో శ్రీ పులికంటి కృష్ణారెడ్డి గణ్యులు. కవిగా, కథకునిగా, వ్యాసకర్తగా, నటునిగా, జానపద కళారూపాల ప్రదర్శకునిగా, పాత్రికేయుడిగా ఇలా అనేక రంగాలలో ముద్రను పదిలం చేసుకోవడం పులికంటి గారికే చెల్లింది.

ఇక్కడ, ముఖ్యంగా నేను ప్రస్తావించదలుచుకొన్న అంశం, ప్రసారసాధనాలకు ఆయన అందించిన గణనీయమైనసేవ. ఒక ప్రథమ శ్రేణి Broadcasterగా పేర్కొనదగిన వ్యక్తి శ్రీ పులికంటి కృష్ణారెడ్డి. ఆంధ్రదేశంలో ఆయన గొంతును పలికించని ఆకాశవాణి కేంద్రం లేదు. ఇది నిజంగా ఘనత. కవిగా, కథకునిగా, నటునిగా, బుర్రకథకునిగా, జానపదగాయకునిగా, ఇలా అనేక రకాలుగా ఆయన ఆకాశవాణి కార్యక్రమాలలో పాలుపంచుకొన్నారు. మరొక విశేషమేమంటే, ఆకాశవాణి కేంద్రంలో సాధారణంగా ఉండే విభాగాలలోనూ ఆయన భాగస్వామి కావడం. అంటే, కేవలం ఒక సాహిత్య విభాగంలోనే కాకుండా, కార్మికుల కార్యక్రమాలలో, కుటుంబ సంక్షేమ కార్యక్రమాలలో, గ్రామీణ కార్యక్రమాలలో, విద్యాకార్యక్రమాలలో, ఆరోగ్య కార్యక్రమా లలో, ఇలా అనేక కార్యక్రమాలను రచన చేయడం ఆయన ప్రతిభకోనిదర్శనం.

ఆకాశవాణి ప్రతియేటా, జాతీయస్థాయిలో రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో నిర్వహించే సర్వభాషా కవిసమ్మేళనంలో శ్రీ పులికంటి కృష్ణారెడ్డి తెలుగుకవిగా చాలా సంవత్సరాల క్రితమే తనగొంతు విప్పారు. అలాగే ఆకాశవాణి జాతీయస్థాయిలో ఉత్తమకార్యక్రమ నిర్మాతలకు అవార్డులందించే ప్రక్రియలో ఆకార్యక్రమాల ఎంపికకు ఏర్పాటైన కమిటీలో శ్రీ పులికంటి కృష్ణారెడ్డి, తెలుగువారి తరఫున మెంబర్ జ్యూరీ కావడం వారి విశిష్టతను తెలియచేస్తుంది.

ఇక మరోప్రక్క దూరదర్శన్ కార్యక్రమాలలో కూడా ఆయన విశేషంగా పాలు పంచుకున్నారు. సాహిత్య సంబంధమైన అనేక అంశాలపై జరిగిన పరిచయ కార్యక్రమాలలో, చర్చా కార్యక్రమాలలో ఆయన భాగస్వామి. కవిగా తన గొంతును, గేయకర్తగా, కథకర్తగా తన కలాన్నీ అనేక పర్యాయాలు బుల్లితెరనుండి పలికించారు. ముఖ్యంగా హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం, .కేళిక కో., చిత్తూరు జిల్లా జక్కదన గ్రామం పరిసర ప్రాంతాలలో భారతోత్సవాలపై 20 భాగాల సుదీర్ఘ జానపద ధారావాహికాన్ని నిర్మించినప్పుడు, కేంద్రబిందువై బాధ్యతలు పంచుకొన్నారు.

ఆకాశవాణి, దూరదర్శన్ వంటి ప్రసార మాధ్యమాలకు ఆయన అందించిన సేవలకు గుర్తింపుగా, ప్రసార మంత్రిత్వశాఖ, ఆకాశవాణి, దూరదర్శన్‌లకు వారిని Adviser (Emeritus)గా మూడేళ్ళపాటు గతంలో నియమించింది. విజయవాడ ఆకాశవాణి స్వర్ణోత్సవాల సందర్భంగా విశిష్టసేవలందిన ఆరుగురు ప్రముఖులను సన్మానిస్తే అందులో పులికంటి ఒకరు కావడం గర్వించదగ్గ విషయం.

ప్రసారమాధ్యమం ప్రతినిధిగా, పులికంటి కృష్ణారెడ్డి గారి సప్తతి మహోత్సవ వేళ, వారు ఈ మాధ్యమానికి అందించిన గణనీయమైన సేవలను ప్రస్తుతిస్తూ వారిని అభినందిస్తున్నాను.

(ఆర్. వెంకటేశ్వర్లు)

'ervaram Jagannadham
er Vice-Chancellor
,u University
ssor of Telugu (Rtd.)
tiya University

Ph : 78392
1-8-120, Mithilanagar
Balasumudram, Hanamkonda
Warangal-506 001

Dae : 24-11-2000

# నాకిష్టమైన మా కిష్టన్న

సోదరుడు శ్రీ పులికంటి కృష్ణారెడ్డి నాకత్యంత ఆత్మీయుడు. ఆయన నేను కలిసి ఎన్నో కవి సమ్మేళనాల్లో పాల్గొన్నాం. ప్రభుత్వం తరఫున, ఆకాశవాణి తరఫున, వెనుకటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ తరఫున నిర్వహించిన పలుకవికమ్మేళనాల్లో ఒకే వేదికమీద కలుసుకునే వాళ్ళం. ఆయన గళం విప్పితే చాలు పల్లెటూరి సోయగాలన్నీ మనకనులముందు కదలాడుతుంటాయి. అచ్చమైన తెలుగుబాస, యాస ఆయన సొంతం. ముఖ్యంగా పల్లెపాటల్లోని బాణీలకు ఆయనే హక్కుదారుడు. ఆయన కథ రాసినా, కవిత రచించినా వాటిలో గ్రామసీమలే కదలాడుతుంటాయి. ఆయన కంఠసీమలో, కలంమొనలో తెలుగుదనం పట్టాభిషేకం చేసుకున్నదా అనిపిస్తుంది, రాయలసీమ రతనాలసీమ అంటుంటారు. ఆ రత్నాల్లో ఇదొక జాతి రత్నం .

మిత్రుడు శ్రీ కృష్ణారెడ్డికి ఏడు పదులు నిండడమంటే కాలం చాలా తొందరపడు తున్నదా అనిపిస్తున్నది. దానికి కళ్ళెం వేయలేమా అని కోపం కూడా వస్తున్నది. ఐనా ఇది ప్రకృతి తత్త్వంకదా అని మనకు మనం సముదాయింతుకోవడమే ప్రస్తుతానికి శరణ్యం.

కృష్ణారెడ్డిగారు నివసిస్తున్నది ఆ ఏడుకొండలవాడు శ్రీ వెంకటేశ్వరుడు వేంచేసి ఉన్న దివ్యక్షేత్రం తిరుపతి. ఆయనకు ఏడుకొండలవాని కొండంత అండ ఉండనే ఉన్నది. ఐనా ఆయనకు ఆ ఏడుకొండల దండిరాయడు సంపూర్ణ ఆయురారోగ్యములను, సకల సౌభాగ్యములను ప్రసాదించుగాక అని వేడుకుంటున్నాను. ఈ సందర్భంలో కృష్ణారెడ్డి గారిని మనసారా అభినందిస్తున్నాను, ఆనందిస్తున్నాను.

(పేర్వారం జగన్నాథం)



పులికంటి సప్తతి సాహితీ సత్కృతి సంబరాలకు వర్ణచిత్రమైలురాళ్లు !
స్మృతిపథంలో చెరిగిపోని అనుభూతికి ఆనవాళ్లు !!



పులికంటి సాహితీ సత్కృతి, సప్తతి మహోత్సవాలను ప్రారంభిస్తున్న సాహితీ సత్కృతి ప్రధాన కార్యదర్శి **శ్రీ వోలేటి పార్వతీశం.**



పులికంటి సాహితీ సత్కృతి, సప్తతి మహోత్సవాలకు ఆహూతులు



సాహితీ సత్కృతి అధ్యక్షులు
**కె. శివమోహన్ రెడ్డిగారు**
సభాధ్యక్షులు **డా॥ నాగభైరవ**
**ఆచార్య యార్లగడ్డ బాలగంగాధర గారు**
**పులికంటి, నాళేశ్వరం శంకరం**
**ఆడెపు లక్ష్మీపతి** తదితరుల సమక్షంలో
బహుమతి ప్రదానోత్సవాన్ని
జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న దృశ్యం.



సాహితీ సత్కృతి సభను
మా తెలుగుతల్లికి మల్లెపూదండ
ప్రార్థనా గీతంతో ప్రారంభిస్తున్న
గంధర్వ గాయని
**శ్రీమతి ద్వారం లక్ష్మి**



సాహితీ సత్కృతి సభాధ్యక్షులు
**నాగభైరవ కోటేశ్వరరావు** గారి
అభిభాషణ....




పులికంటి దళిత కథాసంపుటిని

సాహితీ సత్కృతి అధ్యక్షులు

**శ్రీ కె. శివమోహన రెడ్డి**

ఆవిష్కరిస్తూ....



ృతి భర్తగా **శ్రీ శిరిపి రెడ్డి కృష్ణారెడ్డి**

పులికంటి దళిత కథలను

కృతికర్త నుండి స్వీకరిస్తూ....



భీమాస్ అధినేత **శ్రీ రఘు,**

సాహితీ సత్కృతి అధ్యక్షులు

**శ్రీ కె. శివమోహన్ రెడ్డి** నుండి

మొదటి ప్రతిని అందుకుంటూ..





**డా॥ నాగభైరవ కోటేశ్వర రావు గారు**

పులికంటిని సన్మానిస్తూ....




**శ్రీ కె. శ్రీధర్** గారు

కంటి సప్తతి అభినందన సంచికను

ఆవిష్కరిస్తూ...



**శ్రీ కె. శ్రీధర్** గారు

అభినందన సంచిక తొలిప్రతిని

**ఆచార్య యార్లగడ్డ గారికి**

అందజేసూ....





పులికంటి దంపతులు సప్తతి మహోత్సవంలో **శ్రీ కె. శ్రీధర్** గారి నుండి అంగుళీయాలను అందుకుంటూ...



సప్తతి మహోత్సవంలో **పులికంటి దంపతులు** అంగుళీయాలు మార్చుకుంటూ...



సప్తతిలో **పులికంటి దంపతులు** విప్రోత్తముల ఆశీస్సులు అందుకుంటూ...



పులికంటి దంపతులను

అల్లుడు **మాధవరెడ్డి**

కుమార్తె ప్రపూర్ణ **పుష్పాక్షతలతో**

పులకరింప చేస్తు...



ర్య యార్లగడ్డ బాలగంగాధర రావు

పులికంటి సాహితీ కృషికి

కలికితురాయిగా

ాలుగ్గాళ్ల మండపాన్ని విశ్లేషిస్తూ....



నాలుగు దృశ్యాలు ఉత్తమ కథా

సంపుటిగా పులికంటి సాహితీ సత్కృతి

బహుమతి రూ. 5000/-

శ్రీ కె. శివమోహన్ రెడ్డి

**శ్రీ ఆడెపు లక్ష్మీపతి** గారికి

అందజేసూ....



సాహితీ సత్కృతీ గౌరవాధ్యక్షులు **డా॥ గుత్తా మునిరత్నం** గారు పులికంటి దంపతులను ఆశీర్వదిస్తూ....



దూదిమేడ ఉత్తమ కవితా సంపుటిగా పులికంటి సాహితీ సత్కృతీ బహుమతి రూ. 5000/- **శ్రీ కె. శివమోహన్ రెడ్డి** **శ్రీ నాళేశ్వరం శంకరం** గారికి అందజేస్తూ....




సప్తతిలో పులికంటి దంపతులను పెద్ద మనవడు **చి॥ తేజ్‌కుమార్** సన్మానిస్తూ...

# పులికంటి

- వేంపల్లి అబ్దుల్ ఖాదర్
(రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ పురస్కార గ్రహీత)

తొణికే స్వర లహరి గాదు
ఆ పసిడి పలుకొక తిరుక్కురళ్
కదిలిపోయే కలగాదు
వెన్నపూసంటి మనోగతం మణిమయ మణి మేఖల.
సొగసుకే సొగలు తెచ్చేవాడి ఊహల చిటపట
ఈడేరిన ఆడతనం ఎగసిపడే ఎదమీద రెప రెపలాడే జిలుగు పైట
వాడి నడక తీరు కదిలి వచ్చే కదిరి తేరు
వాడి మాటల జోరు గల గలపారే గజ్జల సెలయేరు
కళ్ళు విప్పుతున్న పత్తిపువ్వు కల్తీలేని ఆ కమ్మని నవ్వు
గుండె ఒక చిగురుటాకు మనసొక మల్లెరేకు.
వయసా అరవైతొమ్మిది, హుషారా పందొమ్మిది
శాంతమా కోరమండల తీరరేఖ
సత్యావేశమా అంటుకున్న అగ్నిశిఖ
అందరికీ అందని ఆ వ్యవహార శైలి
మనసు పడినదాని చెక్కిలి నొక్కే తొలిచక్కిలిగిలి
జనాన్ని శోధించే వాడి కథ ఒక చిగురించిన నాగరికత
మత్సరం మరుగులో ఆగని పరుగు వాడు
రాయిమీద రాపిడిలో పదునెక్కిన కత్తివాడు.
ఆరబోసిన అందం చాటున అరవిరిసిన అరకులోయ వాడు
కురిసే చప్పట్ల మధ్యన కైపెక్కించే చిగురు కైతల్ని
వేరు శెనగ పప్పులా ఒలిచి పెట్టింది వాడు
గురి తప్పకుండా అనుకున్న గురిని
అనుకోని వేగంతో తాకే రాయల సీమ వడిసెల రాయి వాడు
గుండె గుండెనూ తడిమి
గుండెను గొంతులో పలికించిన సప్తస్వర విస్ఫోటనం వాడు
గుండె పగలగొట్టి కంచెలెందుకురా మంచికని
నటించడమే చేతగాని మహా నటుడు వాడు
పదంపదం ముద్దాడి జానపదం అంటే ఇదని
అమ్మి రొమ్ములో తీపి ముల్లు గుచ్చింది వాడు
సజీవమైన సీమ పలుకుబడిని
మాండలిక నిధి నిక్షేపాలను బండ్లకెత్తింది వాడు
పెసరగాయ చీల్చినట్లు చిక్కు ముడులు విప్పి
తిరుపతి మండపానికి నాలుగ్గాళ్ళు నిలబెట్టింది వాడు
ఆయ్ ఎవర్రా...
అరుగులలికిన తెలుగింటి గుమ్మంలో
గెల వేసిన అరటి చెట్టు పెంచిందీనడుస్తున్న సాహిత్య చరిత్రకు?
ఎన్ని అక్షరహారతులెత్తితే మాత్రం సరిపోతుంది.
ఆ అల్పాక్షరానల్ప బహుముఖ ప్రజ్ఞకు?
వాడొక వ్యక్తిగాదు, మహా అభివ్యక్తి
చరించే నవ శక్తి
జనంలో నలిగిన చతురోక్తి
కృత్రిమత్వాన్ని చంపి పుట్టిన
రాయల సీమ స్వభావోక్తి





ఒరేయ్ తమ్ముడూ!
అని ఆప్యాయంగ పిలిచే అన్న పులికంటికి
'నాలుగ్గాళ్ళ మండపం' పుస్తకావిష్కరణ సందర్భంగ
–05.07.1999

# ఉగాది కవి(తా) గోడు!..

శ్రీ వై.వి. రామకోటయ్య

సూడు మాంవా!
సుతి మెత్తని మాటల్లో
ొమ్మ కలికి పలుకుల్లాంటి
పాటల్లో
వీనులవిందై
ంపు సొనల పొందై
శుభోదయాన ఉదయించే
బాలభానునిశోభలా
ూసిన వేపచెట్టు
సోయగంలా
ఎలానో ఎలానో... ఉంది
నీ ఉగాది కవితా గానం!!
స్వింటిలోనూ తలమానికమై
తేంట్లకు పాటలు చెప్పరీతిగా
ంధురంగావుంది
నీ కవిత - ఉగాది కవిత!!

ఉల్లిపొరలాంటి
సీరలు తెస్తావని
కల్పక పుష్ప మాలికలు
తెస్తావని
ంగా ఓ ముద్దిస్తావనీ
ఏదో పొగిడేస్తున్నానని
ంటున్నావా కవి మాంవా!
కాదు కాదు.
ాడా అలా ఏం కాదు.
నిజంగా అది సుకవి గానమే!
దు
అది వాణిదాల్చు సుకవి
ంధుర గానం!!

ంకు తెలుగు మాటల్లో
శుభప్రదమైన పద జాలంతో
వ్యంగ్యం, వాస్తవికత
ప్రేమ అనురాగం
బోసి ఉగాది పచ్చడిలా
మధుర తమంగాచదివిన
ల్ల అసూయ కలిగేలా
నీకు నీవు నిరతిశయ
తి శయం సంతరించుకున్నావు

అంటే అతిశయోక్తి లేదు!
లేదు మాంవా లేదు!!
నే రాసేది నిజమా అపద్ధమా
అని డోలాయమాన మానసుడవైతే
ఓ పన్జెయ్యి - చేస్తావు కదూ?
మన గ్యాంగులో - తప్పు - సుంపులో
నాలాంటి రసహృదయుడు
ఒక్కడైనా వుంటే
వాడనేవాడు ఈ ఉగాది
కవితా గోడు (లేదంటే గోష్ఠి)
వినివుంటే, విని ఆకళింపు చేసుకుంటే
నేరాసేది ఉల్లిపొరలాంటి
సీరకోసమో, లేక మాంవ
మీద కాకపోయినా మాంవ
కవిత్వం మీద ప్రేమ కోసమో
తెలుస్తుంది!!

''పులి''ని చూసి నక్క వాతలు
పెట్టుకున్నట్లు
మాంవ కవిత విన్న మైకంలో
కవిత్వం రాద్దామని మొదలు పెట్టి
మొదలు పెట్టి నాక ముందుకు సాగలేక
కపిత్థం గొంతులో చిక్కినట్లు
మైమరచిన కోయిల మావిచిగురు
కొరకబోయి
వేప చిగురు కొరికినట్లు అయ్యింది!!

''ఏమిదిని సెపితివి కపితము''
అని తిట్టి రాయమాకు మాంవా
నీ ఉత్తరం! అది ఎప్పుడూ
వలపు వక్కణ కమ్మలాగే వుండాలి.

మా ''పులి'' బావ - కాదు కాదు మాంవ
త్వరలో, అతి త్వరలో
మా పులిమాంవ, మా కవి మాంవ
ధరలో, అతి త్వరలో
డాక్టరు పులికంటి మాంవకావాలని
కాంక్షిస్తూ-

*(రవీంద్ర భారతిలో ఉగాది కవిసమ్మేళనంలో ఒక ప్రేక్షకుడిగా శ్రీ రామకోటయ్య స్పందన)*

# వెలకందని పులికంటికి కొలమానం!..

సరససల్లాపాలే తలంబ్రాలుగా అల్లసాని ఉల్లము పుల్కరించుకమ్మని కవితలల్లినాడట! నాగేటి చాళ్ళల్లో పోతన నవరసభరిత కవితాపంటలు పవమాన ప్రకంపన కూయలలూగుతుంటే సిరికి చెప్పకుండా శ్రీహరి పరుగులు తీసినాడట! గళమెత్తి పాడుతుంటే త్యాగయ్య కలం భక్తి రసాన్ని కాలువలు కట్టించిందట! శ్రీనాథుడు తొడ తట్టితే పటుత్వమైన కవిత్వం సవాళ్ళు చేసిందట! శ్రీశ్రీ మహాకవి పోరాట ఆరాటమే విప్లవ శంఖ నినాదమై ఒక కవితా యుగానికే శ్రీకారం చుట్టిందట!

మరి యిన్ని పనులు చేస్తూ కవిత్వం వ్రాస్తున్న మీ అంశయేది? మీరే వంశంవారు?

పచ్చ జండాకు బదులు ఎర్రజెండాను ఊపి, రైలు కంటే ముందు పరిగెత్తాలన్న మీ ప్రయత్నాన్ని కాదు పట్టుదలను చూస్తుంటే న్యూటన్ భూమ్యాకర్షణ సిద్ధాంతం తప్పని, మీ సాహితీ వృక్షం నుండి రాలిన ఫలాలు భూమిని తాకకుండా వేరే దిశలో పయనిస్తున్నాయని, మీది విభిన్న దృక్పథమని మా భావన! అందుకే ఈ సంభావన!!

మీరు కవులా? కథా రచయితలా? పత్రికా సంపాదకులా? విమర్శకులా? ఉపన్యాస కేసరులా? మీ కవిత్వం ఆధునికమా? జానపదమా? సంప్రదాయమా? విప్లవమా?

వసంతంలో పూవులు పూసినట్లు
గ్రీష్మంలో ఎండలు కాసినట్లు
పర్షర్తువులో వెన్నెలలు విరబూసినట్లు
శిశిరంలో ఆకులు రాలినట్లు

ఏ ఋతువులో ప్రకృతికి ఆ పని ఎంత సులభమో సాహిత్యంలో అన్ని ప్రక్రియలు మీ కంత సహజం.

మీ కవితలో, కథలో, నటనలో, ఉపన్యాస విన్యాసంలో ఒక గర్జన ఉంది. బహుశా మీ పేరులోనే కలగలసిన పులి శబ్దమే అందుకు కారణమా?

ఇంతగా మిమ్మల్ని గురించి చెప్పి మీ బలహీనతల్ని గురించి ప్రస్తావించకపోతే - అందమైన చంద్రునిలో అరచేతంత మచ్చను మరిచినట్లే!-

సహాయం-అర్థిస్తే ఎవరికైనా సరే!- సరే అనడం మా సర్వేలో తేలినా - కృతఘ్నులకు సహాయం చేయడమంటే బలే అలవాటు కాదు - మహాసరదా మీకు!

ఎవరేమనుకున్నా, ఎంతగా బాధపడినా, ముక్కుకు సూటిగా మాట్లాడి, అవసరమైతే కొట్లాడి దారి జగడం ఇంటిదాకా అనే వ్యక్తిత్వం మీది! ఔనా?

వరుస బెట్టి మీరు అవార్డుల్ని అవలీలగా కొట్టేస్తుంటే నిజం చెప్పమంటారా?- అలనాటి కృష్ణతులాభారానికి నగలు నాణేలు చాలనట్లు నేడు ఈ అవార్డులు ఆనడం లేదు. మరి ఆ తులసీదళ మర్మం కాస్త మా చెవిని వేయండి మహానుభావా!

ఉపశ్రుతి:

ఈ అభినందన సందర్భములో కవిగారికి ఈ సన్మాన పత్రం అత్తరు సాహెబ్ మీద పన్నీరు చల్లినట్లు.... ఆకుతోట యజమానికి తాంబూలం తట్టలో పెట్టి ఇచ్చినట్లు..., భీమాస్ అధినేత శ్రీ రఘును పిలిచి ఒక పూట భోజనం పెట్టినట్లు...., ఈ సభకు అధ్యక్షత వహించిన శ్రీ యస్. లక్ష్మీ నారాయణగారికి వేంకటేశ్వరుని ప్రత్యేకదర్శనం ఏర్పాటు చేయిస్తామని హామీ ఇచ్చినట్లు.... ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆచార్య జి.యస్. రెడ్డిగారికి తెలుగు నేర్పినట్లు...., శ్రీ బాలశౌరి రెడ్డిగారికి వహ్ క్యాహై! కి అర్థం చెప్పినట్లు.... శ్రీ సి.హెచ్. కోటేశ్వర రావు గారికి కవిగారి ఎలుకలబోను కథలో లాగా దొంగల్ని పట్టడం నేర్చినట్లు...., శ్రీ మబ్బురామిరెడ్డిగారికి రాజకీయం నేర్పినట్లు...., శ్రీ మిట్టా నరసింహులుగారికి, శ్రీ కె. మునిరెడ్డిగారికి వ్యాపారంలో ఓనమాలు నేర్పినట్లు - అవుతుంది అవునా?

అయినా మా సాహసానికి చిహ్నం ఈ సన్మాన పత్రం!..

సమయం : సంధ్యాదేవి చంద్రునితో సరసమాడువేళ

స్థలం : కుంచంతో రూకల్ని కొలిచి కొలిచి అలసి సొలసిన శ్రీ గోవిందరాజస్వామి నెలకొన్న నేల.

కాలం : మరీ కలికాలం. ఉడుగుతున్న చలికాలం. అంటే 1985వ సంవత్సరంలో కనుమ పండుగ రోజు!

**- శ్రీ పులికంటి సన్మాన సంఘం**

# Pulikanti - a poet of varied excellences

*- By Y.V. Ramakotaiah*

is born, like Beatrice, under g star. She is full of beatitude. o him a wandering Voice from hill to hill and from plain of this charmed Telugu land. Ammi in the dewy flowers nd fair. He hears her in the birds.

s he then?

Abbi.

s infatuated with this rustic They sit together and talk inhibitions. They share all ous experiences of life-hope, oy and fear.

and Abbi were first latent in Krishna Reddi's mind. Abbi nself, Ammi is the concrete ation of his will. What lies in d as thought, after all, is ed in matter as body.

nti Krishna Reddi, strong in ive, to seek, find and not to e, claims that "As yet a child, a fool to fame. I lisped in for came." In early life, Reddi formed a poetic style vn, of precision - musical, nd lucid. He has mastered style and speaks straight e heart to the primitive s of the race through his d Abbi. He strongly believes n principles that common are at heart romantic and the ideal, and their simple emotions furnish the s of true poetry. His poems cal melody of their own, with of words, yet so clear and ent of what is beautiful in n man, and woman. He thus e title of "Literary Agastya" - ed the oceans and the other cent Telugu idiom.

Dr. Challa Radhakrishna ho likened Pulikanti Krishna Agastya saying, "TELUGU BADINI BHAVUKATHANU APOSANAMPATTINA AGASTYUDU MAA PULIKANTI." Dr. Boyi Bheemanna, at a poets' gathering, once said, "Pulikanti is Janapada Geyakavithaa Srashta".

Prof. Viswanatham, Director of Post-Graduate Centre, Anantapur, has gone a step further and conferred the title of "Janapada Kavi Kokila" on Pulikanti at a function held at Anantapur under the joint auspices of Lalita Kalaa Parishad, District Writers Association and Janapada Kalaa Parishad.

It was a treat to hear Pulikanti in his own characteristic folk style rendering his Ammi lyrics telecast over Madras Doordarshan years ago.

A native of that famous temple town Tirupati, where the Lord of Seven Hills is affectionately and intimately called "Venkanna" in a typical Telugu folk style. Pulikanti Krishna Reddi is not a mere poet. He sings. Not his Ammi lyrics alone. He sings paeans in praise of Lord Venkanna for consecrating this Telugu land. Pulikanti is a Burrakatha artiste, the main singer in the team. It is needless to say that his programmes were broadcast over All India Radio quite often.

Pulikanti is equally popular with the Telugu readers as a short story writer. He keeps up the reader's interest mainly by the irrepressible quality of reality and subtle humour. In his narration he argues and illustrates instead of mere telling stories, and "observes instead of romancing." He is deeply interested in men and matters around him. Society, in all its aspects, is the perennial theme of his works which need to be collected and published in book form. To be precise, his stories hold mirror up to the fashion of his society. Pulikanti, as an infant, was a prodigy. He has extraordinary memory and talent for keen sympathetic observation and acting. He has a marvelously imaginative and creative mind. Besides regular school teachers, his real teachers were the men and women and the natural influences which surrounded him in that temple town.

As an artiste, his early occupation was acting. Pulikanti is a master in legitimate performance and in every respect he can be mentioned separately from the generality of actors. It would be better seen than explained when he acts the part of Duryodhana. He believes in restrained but effective action and deprecates all extravagance which does not "suit the action to the word, the word to the action." He has bagged many best actor prizes for social plays. Above all, Krishna Reddi is an active journalist. He is a poet, a master story teller, artiste, and a journalist – all rolled into one. A rare phenomenon, indeed.

It has been said that an artist that works in marble or colours has them all to himself and his tribe, but the man who moulds his thoughts in verse has to employ the materials vulgarised by everybody's use, and glorify them by his handling. Mrs. Vinjamuri Sitadevi can be credited with popularising Telugu folk songs over All India Radio. Mrs. Nayani Krishnakumari and Mr. B. Ramaraju were awarded Doctorates for their researches in Folk Literature. Konakalla Venkataratnam is a popular name in Telugu folk lore. The Telugu people have grown old with Nanduri's 'Enki' the dancing star on 'Folk' Firmament".

Pulikanti Krishna Reddi has now twitched his mantle blue and set out with his Ammi from Rayalaseema to fresh woods and pastures new.

"If thou indeed derive thy light from heaven,

Then, to the measure of that heaven-born light,

Shine, Poet! in thy place, and be content..." ●

# ıe Pride of Rayalaseema

ntı Krishna Reddy ıs one of the pecies in Telugu lıterature who has ıark in its various forms, with his le creatıve facultıes. As a folk-poet, er lıterary crıtic, Editor, a sınger, : all orator, he has earned a unique ı for himself and also brouht great his natıve region of Rayalaseema ı Pradesh.

)ken of recognition and apprecia- /Ir. Krıshna Reddy's multi-talented ty, he was appointed as Advıser ) for Akashvani and Doordarshan ıion Mınistry of Informatıon and ting Government of India. New th effect from October 2,1992.

ın July 30, 1931. 'Pulikanti' (as he rly known) had his high school at a T.T.D managed institution in After a brıef stınt in the Indian he made up his mind, once and for t for professional poetry.

ıa Reddy contributed to the Telugu short stories exceeding a hundred. s have been published in almost all ed Telugu Journals of Andhra le bagged as many as 14 first prizes ıort story competitions at the level.

nti penned 42 special articles on :casions which were published in urnals covering dıfferent subjects ary crıticısm, personalities and ;.

81, 'Pulikanti Krishna Reddy with preface by R.S.Sudarsanam, ıghout. In 1982 'Goodukosam ı collection of short stories with a by Malati Chandur, was published '84 one more collection of short ıtled 'Kotigadu Swatantrudu', with by Puranam Subrahmanya Sarma hed.

; Pulikanti's novels mentıon should ''Aggipulla' published in the Telugu Yuva', of February 1984. It won apani Award.

a Reddy's stories translated into ıded 'Mad Men' in 'Hundred Great ıries of India (1988), (Bhasha Calcutta), 'Rashtra Vani' in 'Bahu Kavita Sankalan' (1990:Bhasha Allahabad) and 'Pani Ek. Lota Alag' Inida Radio, New Delhi). His story l into Kannada was 'Panjarada ıublished in the Kannada daily Prabha'.

nt's poetry, 'Paadinde Paata', read ıal poets' symposium on the ɔf the Republic Day celebrations :lhi, was translated into 14 major guages.

ıa Reddy has great esteem for l poetry and, at the same time, sion for the unshackled modern ıds.

ithe Devude' stands as an authentic to Pulikanti's traditional poetry s published serially in 'Andhra



Jyothi' weekly. In free verse, more than 50 poems of Krishna Reddy were published in popular Telugu weeklies and Dailies.

'Ammi Padaalu' (folk styled lyrics) is a unique and major contribution of Pulikanti to the category of lyrıcal poetry in Telugu. Whıle the late Nanduri Subba Rao immortalised a village damsel Yenki, Krishna Reddy created the sister of Yenki in the form of 'Ammi' from Rayalaseema. Yenkı represents the village cult and diction of coastal Andhra, whereas Ammi inherits the rural heritage and language of Rayalaseema.

Pulikanti has contributed nearly 100 songs in different styles for choral singing and Lalitha sangeetham (Bhava Geetaalu) to akshvani and Doordarshan.

With his own script and troup on the assignment of the Government of Andhra pradesh, Pulikanti sang 100 ballads (Burra Kathas) on diverse subjects like adult education, tree plantation and family welfare to the rural folk of Chittoor District.

Krishna Reddy, who began his artistic career as an actor and landed in the field of literature, demonstrated his histrionics in classical, historical and social dramas, besides one act plays. He has earned a name as a veteran actor. He finds a place in 'Nata Ratnaalu', a series of articles written by Kalaprapoorna Dr. Mikkileneni Radhakrishna Murthy.

Pulikanti has taken part in as many as 45 symposia of major poets (Kavi Sammelans) of Andhra Pradesh organised by All India Radio, Doordarshan, Government of Andhra Pradesh and different literary and cultural organisations in Andhra Pradesh and at New Delhi.

Krishna Reddy delivered literary talks on a variety of subjects in various congregations throughout Andhra Pradesh on invitation from several literary organisations and educational institutions. During the period from 1976 to 1992, more than 150 programmes of his were broadcast from the AIR stations in Andhra Pradesh. He also presented 17 programmes through Doordarshan (Madras and Hyderabad) durıng 1980-1992.

From 1971 to 1986 Pulikanti worked as Editor and publisher of *'Kamadhenu'*, a fortnightly journal in Telugu, publıshed from Tırupati. From 1975 to 1986 he was correspondent of Deccan Chronicle'. (English) and Andhra Bhoomi (Telugu), dailies published from Secunderabad.

Krishna Reddy attended a large number of conferences and seminars and presented research - orıented papers on various ınteresting and important topics. He also participated in the Writers' Meet at Lakshadweep in 1992.

Pulıkanti was the recipient of many honours and awards, lıke 'Natasekhara' (from Rama Vilas Sabha, Chittoor) in 1972, 'Great Stage Actor' for his role as Duryodhana (from the Telugu Vignana Samithi, Bangalore) ın 1973, Award along with Mahakavi Sri Sri from Rasagnula Sangha Samakhya, Palamaner in 1976, honour at Nellore 11th National Library Week in 1978, 'Janapada Kavikokila' from the Rayalaseema Kalabharathi and Lalithakala parishad at Anantapur in 1979, honour from Andhra Pradesh Sangeetha Nataka Akademi, in 1980. Chakrapani Award from Yuva publications in 1980, 'Suprasiddha geya Kavi' at Cuddapah in 1981. Prasiddha Telugu Kavi at Chittoor in 1981, honour from EFAA, Eluru in 1981. Special invitee for poetical recitation on Vijayanagar Empire at Hyderabad in connection with the A.P. State Formation Day in 1981, honour as a special folk Lyricist from the Telugu Vidyarthi Sangham, Bangalore in 1981. Special participant in Kavı Sammelan conducted by the SHAR centre, Srihari Kota; in 1982, Special Invitee for the recitation of Folk Literature on the A.P. State Formation Day at Hyderabad; honour from Vemana Vignana parishad, Tenali in 1983; honour from cultural Association, Bellary ın 1984, Pathivada sudhakar Memorial Award from Rajahamundry in 1988; honour of 'Great Orator and poet' from Soorana Saraswatha Sangham Nandyal in 1990. State Satkaram from the C.M. of A.P. in 1992; honour as an actor from Kala Sudha, Nellore, in 1993 felicitated as a poet and writer by Vardhamana Samajam, Nellore in 1994.

The creative talents of Pulikanti Krishna Reddy naturally fetched him many a deserving positions; Member Audition Committee, Folk Music, All India Radio, Cuddapah (1988-91); vice President, Chittoor District Writers' Associations; Secretary, Rayalaseema Working Journalists' Association; Visiting Lecturer in Journalism, S.P.mahila Univiersity, Tirupati, Member Selection Committee, AIR Annual Competition for Childrens Choral singing, Hyderabad 1981; Five special lectures at Andhra University Waltair on Folk Literature and Theatre Arts during 1989.

*-Dr. N.H. SITHARAMA SARMA*

లికంటి కృష్ణారెడ్డి తెలుగు వచ్చిన వాడు.

కి 'కాకా' అని అరవడంలో వింత ్దది? కానీ తెలుగువాడు తెలుగు ితే తెలివి మీరినట్లే.

్వామాజీ ఉద్యోగి, కాఫీపొడి వ్యాపారి, ాలయ నిర్వాహకుడు, నటుడు, త, గేయాలు వ్రాసుకుని పాడేవాడు షాలతో అతడు జీవిత యాత్రను స్తున్నాడు తిరుపతిలో.

వేషాలనన్నింటినీ సమన్వయం ి గడుపుతున్నాడని ఆరోపించడం ీ ఇవి చాలావరకూ ఒకదానితో ఒకటి కాదు కదా? కృష్ణారెడ్డి కూడా వాటిని ుం లేదు. బతుకు తెరువు కొంత. ుతకొంత. ఎద సొద కొంత. జీవితం ి కొంతల వింత బొంత.

ాతెలుగు తల్లికి మల్లెపూదండ' కట్టిన ే॥ శంకరంబాడి సుందరాచారిని ఆమధ్య ఆకాశవాణిలో విశ్వనాథ 'వలం, దాశరథి మాట్లాడారు. ుయులు మాట్లాడారు అనుకున్నా. ాస్తే పులికంటి కృష్ణారెడ్డి కూడా ారు.పై వారికి ఏమాత్రం తీసిపోలేదు. ులచిన, అలంకరించిన సుందరాచారి ుక గుండెను అమర్చాడు కృష్ణారెడ్డి.

ుదరాచారి బతికి వచ్చి తనకు జరిగిన ్రగ సాహితీ అభిషేకానికి ఎంత ుచి ఏడ్చేవాడోకదా అనిపించింది.

ారెడ్డి కథలు అల్లుతాడు, కవితలూ ుం చేస్తాడు - కావ్యగాన సరళిలో ా, మిత్ర బృందానికి మేజువాణిగా! ుంవెలార్చే కంఠం - తెలుగు పలుకు ్ప్ వాగ్విలాసం.

్ వాసనలేని గ్రామీణుని నుంచి ునతో ఉక్కిరిబిక్కిరి అయ్యే తెలుగు ా - ఏ ఏ భాషలూ, యాసలూ తున్నారో అవన్నీ కృష్ణారెడ్డికి వీటిన్నింటిలో వ్రాస్తాడు.

ప్రేయసిని కూడా ఊహించు ఆమె 'అమ్మి'. లోకమే 'అమ్మి'

ుతో ఎప్పుడూ ఎడబాటు ు అబ్బికి. పోనీ ఏదో ఒకనాడు

# ఆంధ్రప్రభ విజ్ఞానవేదిక

# తెలుగువాడు పులికంటి కృష్ణారెడ్డి

కొంచెంసేపు కలిసి ఉంటారనుకోండి ఆప్రేమికులు. తీరా అమ్మికి విప్రయోగ ప్రేమ ముంచుకు వస్తుంది. అబ్బి అంటాడు-

*పోరే పడలేనంటావూ*
*పోతా పోతా పోతా నంటావ్!*
*పోతే పొయ్‌నావు గాని*
*పోతా పోతా ఒక్కమాట*
*ఇనిపించుకోయే అమ్మీ!*
*నువ్వు పొయ్యేదోవలోనా*
*నిలువు రాయీ ఒకటుండాది*
*నీరూపూ రాసేసి పోతే*
*మాపు రేపు సూసుకుంటుంటా!*

అమ్మి అంత సొంపు. ఎట్లా ఉంటుంది? ఏ కవి అయినా తేలికగా వర్ణించగలడు ఒక ఆడదాన్ని. ఒకాయనను పెళ్లి మాటలకు వచ్చిన పెద్దలు "మీ అమ్మాయి ఎట్లా ఉంటుంది?" అని ప్రశ్నించగా అతడు వ్యుత్పన్నమతి కాబట్టి వెంటనే దారిన పుణుకులు అమ్ముకుంటూ పోయే దానిని చూపి "అట్లా ఉంటుంది"-అని ఠకీమని చెప్పేశాడు. ఆ మాత్రం స్ఫూర్తి లేని కృష్ణారెడ్డి, పింగళి సూరన్న (చలువ గల వెన్నెలల...) వలే కొట్టుమిట్టాడాడు.

*ఎవరబ్బనీ అమ్మి*
*ఎట్టుంటదా అమ్మి*
*శాతనవుతుందేమొ*
*సెప్ప సూద్దా మంటే-*
*ఎట్టబ్బ - ఎట్టబ్బ*
*ఏంజేతునే సబ్బ -*
*నా అమ్మి అందానికి*
*ఈడు యాడుందబ్బ?*

ఆ అమ్మి కేవలం ఎదలో మెదిలేది. ఎదలోన, మదిలోన మెదిలేటి నా అమ్మి.

ఈ విధమైన భావనా లాలిత్యం చూస్తే ఏమవుతుంది?

*తలవంచి తప్పుకొనులోకం*
*ననుగాంచి కాళ్ళు తడబడనడుచు లోకం*
*నా మాట కటువుగా*
*వినిపించెనో యేమొ!*
*నారూపు ఘోరమై*
*కనిపించెనో యేమొ!*
*నాచూపు గుండెలకు*
*గుచ్చుకొనెనో యేమొ!*

ఇట్లా హాయిగా ఊహలతో కాలక్షేపం చేయగలడు కృష్ణారెడ్డి.

అయితే ఈ 'అమ్మి 'ని కడకు ఏం చేయాలనుకున్నారు అని అడగగా -

దానికి అప్పుడే మొగవాని వలెనే పథకం వేశాడు! తాను సైన్యంలో చేరాడు. ఆమెకు టపా మనిషి తప్పని సరిగా నిత్యం ఒక జాబు అందిస్తున్నాడు! అంతేగా? భావాలన్నీ పాఠకునికి అంది పోతున్నాయి. అచ్చు

*ఎదను నలిపిన మాట*
*నాగళములో పాట*
*పదిమంది పాడితే*
*ప్రగతి కిది పూబాట!*
*ప్రగతి కోరెడుమాట*
*పదును కక్కెడుమాట*
*పడలేకనో యేమొ*
*తలవంచి తప్పుకొనులోకం-*

నిజంగా వ్రాసుకుని పాడుకునిబతికే మనిషి ఎంత ధన్యుడు! ఆ పని శంకరంబాడి సుందరాచారి చేశాడు చిత్తూరు జిల్లాలో. అసలు అది ఒక విలక్షణమైన జిల్లా. అక్కడ పెద్దలు జన్మించారు. వాళ్ళ పెద్దరికం నిలిపే పిన్నలూ జన్మించారు. ఇప్పటికీ ఆ కోవ ఉంది. కృష్ణారెడ్డిని చూస్తే, వింటే, ఆ నమ్మకం కుదురుతుంది.

ఇంకా యువకుడే కృష్ణారెడ్డి. ముందు ముందు ఉంది గదా ముసలిగా పండుగ చేసుకుంటూ గడపడానికి !

— జి. కృష్ణ

# సీమసాహిత్య రత్నాలు

వనాన్ని కళ్ళకు కట్టినట్టు రచనల్లో
ంచడానికి సాహిత్యంలో ఒక వినూత్న
అవతరించిన మాండలిక పరిభాషలో
అభివ్యక్తీకరించే పద్ధతిని చేపట్టి
ుమ జీవన సరళిని, గ్రామీణ వాతావర
ధాన నేపథ్యంగా తీసుకొని రచనలు
ుమ కథకుడు, నటుడు, జానపద
డు, కవి, నాటక రచయిత, బుర్ర
శ్రీ పులికంటి కృష్ణారెడ్డి.

ాయమే ప్రధాన వృత్తిగా కలిగిన ఒక

ఎల్.సి. వరకు చదివి 1951లో రైల్వేలో
ర్క్‌గా చేరారు. అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్
ెగారు. ఆ దశలో కొన్ని కారణాల వల్ల
ానికి రాజీనామా చేయడంతో అప్పటి
ున అనేక ఒడిదుడుకుల్ని ఎదుర్కొన్నా
ప్పే నమ్ముకున్నారు. ఆయన రైల్వే
ద్యాలలో పనిచేసేటప్పుడు నటన పట్ల
ంచుకొని అక్కడి నటులతో పరిచయం
ొని బెల్లంకొండ రామదాసు రచించిన
నాటకంలో వృద్ధుని పాత్ర ధరించడంతో
ట జీవితం ప్రారంభమైంది. ప్రముఖ
నటుడు పూని నాగేశం దగ్గర ఆయన
మెళకువలు నేర్చుకున్నారు. దుర్యో
తాన్ రుస్తుం, కర్ణుడు, కీచకుడు లాంటి
భినయాలతో పలు బహుమతుల
న్నారు.

ంటి ఒక ప్రక్క నటునిగా ప్రశంసలందు
రచనా వ్యాసంగం పట్ల మొగ్గు చూపి
ా కథా సాహిత్యం వైపుకు దృష్టి
ు. 1961లో ఆంధ్ర పత్రికలో
మైన 'గూడుకోసం గువ్వలు' ఆయన
. ఆనాటి నుంచి ఈనాటివరకు ఆయన
150 కథలు రాశారు 14 కథలకు
ుమతులు అందుకున్నారు. కృష్ణారెడ్డి
పట్ల కూడా ఆసక్తిని పెంచుకొని 1971
కు సంవత్సరాల పాటు 'కామధేను' అనే
ు నడిపారు. తన రచనలకు ప్రేరణ
వ్యక్తి, ప్రముఖ కథారచయిత కలువ
ానంద అని, తనలోని సృజనాత్మకతను
ండానికి ఎంతగానో దోహదపడిన వ్యక్తి
కుడైన జి.దామోదర నాయుడని,
మధారను పెలికితీసింది గురువుగారైన
డి సుందరాచారి అని ఆయన విన
ప్పుకుంటారు.

ంటి కృష్ణారెడ్డి కథలు' (1981),
ం గువ్వలు' (1982), 'కోటిగాడు
ు' (1984) - ఇవి ఆయన కథా
. 'యువ' మాసపత్రికలో ప్రమరిత్మై
అవార్డు పొందిన 'అగ్గిపుల్ల' ఆయన
వలైతే 'ఎదగని మొక్కలు', 'ఆకాశ
ున అముద్రిత నవలలు. పులికంటి
బుర్ర కథకునిగా కుటుంబ సంక్షేమం, వాతావరణ కాలుష్యం, పొదుపు తదితర అంశాలపై సుమారు వంద బుర్రకథలను రూపొందించి తానే ప్రదర్శన లిచ్చారు. ఆకాశవాణి బి-హై టాప్ గ్రేడ్ ఆర్టిస్టుగా వివిధ ప్రక్రియల్లో ఆయన సుమారు 200 కార్యక్రమాలు రూపొందించారు. 6 సంగీత రూప కాలు రచించారు. కృష్ణారెడ్డి రిపబ్లిక్‌డే రోజున ఢిల్లీలో గానం చేసిన 'పాడిందే పాట' కవిత 14 భారతీయ




భాషల్లోకి అనువాదం కావడం ఆయన ప్రజ్ఞకు నిదర్శనం.

పులికంటి కళాసాహిత్య రంగాలలో చేసిన సేవలకుగాను ఎన్నో పురస్కారాలు, సన్మానాలు అందుకున్నారు. 1992 నుచి 1995 వరకు ఆకాశవాణి, దూరదర్శన్‌లకు అడ్వయిజర్ ఎమిరిటస్‌గాను, 1994 నుంచి 97 వరకు ఎస్వీయు బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లోని ఫెర్‌ఫామెన్స్ ఆర్ట్స్ విభాగంలో సభ్యునిగాను, 1988 నుంచి 91 వరకు కడప ఆకాశవాణి జానపద సంగీతానికి అడిషన్ కమిటీ మెంబర్‌గాను, జిల్లా రచయితల సంఘం ఉపాధ్యక్షుని గాను వ్యవహరించడం వాటిలో కొన్ని.

పులికంటి జానపద గేయ రచయితగా నండూరి సుబ్బారావు 'ఎంకి పాటల' వరవడిలో అమ్మిని సీమ ప్రతినిధిగా ఎంచుకొని 'అమ్మిపదాల'ను రచించారు. అమ్మి పాటల్లో కథానాయకుడు తన ప్రేయసి అయిన అమ్మి అందాలను గురించి ఇలా వర్ణిస్తాడు

'నా అమ్మి అందానికి
ఈడు యాడుందబ్బ
కలువరేకుల వంటి
కన్నులందామంటె
కలువరేకుల్లోన కనుపాపయాడుంది
చిగురుటాకుల్లాంటి చెక్కిళ్ళయనుకొంటె
చిగురుటాకుల్లోన సిగ్గెక్కడుండాది!'

ఆంధ్ర ప్రభ(దినపత్రిక) లో 57 వారాలపాటు ధారావాహికంగా పులికంటి నిర్వహించిన 'నాలుగ్గాళ్ళ మండపం' శీర్షిక పూర్తిగా రాయలసీమ మాండలికంలో కొనసాగి గ్రామీణ జీవితాన్ని, బడుగు రైతుల గుండెచప్పుళ్ళనీ ప్రతిబింబింపజేసింది. ఉదాహరణకు ఆయన శైలి ఒక చోట ఇలా సాగింది - ''చట్టి పొయిమింది కెక్కేది కల్ల, ఇంక కడుపులే పొవ్వులవుతాయి, అవి మండతాయి. ఆ మంటకు తట్టుకోవాలంటే తడిగుడ్డన్నా కడుపు మింద ఏసుకోవాల. తడిగుడ్డ కావాలంటే గుడ్డ తడుపుకోవాల గదా! గుడ్డ తడుపుకుండేదానికి నీళ్ళు కావాల్నా! యాడుండాయి నీళ్ళు! అవి గుండె కాయల్లో ఉండాయి. కావాలంటే కండ్లలోకి వొస్తాయి. పలపల రాల్తాయి. అవి చాల్తాయా? చాలవే! ఈ సీమలో చినుకు రాలేదెప్పుడో? ఈ బతుకులు చిగిరించేదెప్పుడో?''

కరవులో అల్లాడిపోతున్న సీమ రైతు జీవన దృశ్యాన్ని నేపథ్యంగా తీసుకొని రైతుకీ, అతడికి జీవనాధారమైన గొడ్డుకీ వున్న అవినాభావ సంబంధాన్ని కళ్ళకు కట్టినట్టు దృశ్య మానం చేసిన 'గొడ్లు' కథను పులికంటి కథాకథన శిల్పానికీ, కథాకథన వైభవానికీ ఉదాహరణంగా తీసుకోవచ్చు.

కరవురక్కసి బారిన పడిన రాయలసీమలోని ఒక గ్రామానికి వెళ్ళి అక్కడ కరవును ప్రత్యక్షంగా వీక్షించాలని బయలుదేరిన ఒక విలేకరికి దారిలో ఒక వృద్ధుడు తారసపడి గొడ్లను అమ్మి మతి స్థిమితం కోల్పోయిన నర్సిమ్ములు కథను చెబుతాడు. నర్సిమ్ములు తాను ఎంతో అపురూపంగా పెంచుకొనే రెండుకోడెదూడల్ని కరవు కరాళ నృత్యం వల్ల మేపు దొరకని పరిస్థితుల్లో ఒక ఆసామికి నాలుగువేల రూపాయలకు అమ్మివేస్తాడని, అయితే ఆ ఆసామి తన గొడ్లను లారీలో ఎక్కించుకొని వాటిని హింసిస్తూ కబేళాకు తరలిస్తున్నాడని తెలుసుకొని నర్సిమ్ములు తల్లడిల్లిపోయి మతి స్థిమితం కోల్పోతాడని వృద్ధుడు విలేకరికి వివరించడం ఈ కథ సారాంశం.

తన గొడ్లను ఆసామి లారీలో ఎక్కించుకొని తీసుకొని వెళ్లుతున్నప్పుడు వాటిని నర్సిమ్ములు ఎంత ప్రేమగా, ఎంత ఆత్మీయంగా పంపాడో ఆ దృశ్యాన్ని రచయిత ఇలా వర్ణిస్తారు - 'అయ్యా! అయ్యా! ఒకనిమిశం నిలబడండయ్యా! నా గడప దాటి పోతావుండే గొడ్లు ఏ గడపలో కాలుబెడ్తాయో! ఏవో! ఆ గడపలో పాలుపొంగల్ల గదా? టెంకాయ సుట్టికొట్టల్ల! ఎర్రనీళ్ళు దిగదీసి పొయ్యల్ల! వస్తానుండయ్యా' అంటూ ఇంట్లోకి పరుగెత్తినాడు నర్సిమ్ములు. - నర్సిమ్ములు తన గొడ్లకు దిష్టి తీయడానికి ఎర్రనీళ్ళు గంగాళంతట్టలో తీసుకు వచ్చేంతలోనే లారీ బయలుదేరేస్తుంది. ఆ లారీలో కాళ్లు తెగిపడిన గొడ్లు అరిచే దృశ్యం నర్సిమ్ములకు తీరని వ్యథను మిగల్చడం కాదు - పిచ్చోణ్ణిచేస్తుంది.

30-7-1931న చిత్తూరు జిల్లా వెదురుకుప్పం మండలం జక్కదన గ్రామంలో పులికంటి గోవిందరెడ్డి, పాపమ్మ దంపతులకు జన్మించిన పులికంటి కృష్ణారెడ్డి ప్రస్తుతం చిత్తూరు జిల్లా వీధి నాటకాల్ని బుల్లితెర కెక్కించే ప్రయత్నంలో నిమగ్నమైవున్నారు.

**-కొత్వాలు అమరేంద్ర**

ంటి కృష్ణారెడ్డి నటుడు, కథకుడు, కవి, ంపాపకుడు, గాయకుడు. మీదు ంఘు సేవకుడు "ప్రణయార్థ మెరిగిన ుడు" అంటూ పులికంటిని ప్రస్తుతిస్తాడు ాడి సుందరాచారి. "ఒక చట్రంలో ) త్రివిక్రమమూర్తి మా కృష్ణారెడ్డి" తణ్ణి సమ్మానించారు డాక్టర్ సి.నారా గారు. "శ్రీ పులికంటి పెక్కు కళలలో సాధించడం ఒక విశేషం. ఆయన పెక్కు సాహసాలు, విజయాలు సాధిం ఆదిలో రైల్వే ఉద్యోగిగా పదమూడు ాలు పనిచేసి సాహిత్యంమీద మోజుకు బంధకంగా భావించి బంగారంలాంటి ) పరిత్యజించి స్వతంత్రంగా జీవించ ుపడిన సాహసి". అంటారు ఆయనను .వి.ఎల్. నరసింహారావు గారు. "మేధా ంతానికి దేనికో తలవొగ్గి వ్రాసేరకం కాదు కృష్ణారెడ్డి, అతని చూపు గుండెల్లో ప్రసరిస్తుంది. తలలో నుంచికాదు. ంగీతం వుంది. అందుకే జానపదుడైన అంతస్సత్వం అతని కథలకు అనితర శక్తిని చేకూర్చుతున్నది" అంటారు టి కృష్ణారెడ్డి కథలు" పుస్తకానికి "అంతస్సత్వం" వెలయిస్తూ శ్రీ ఆర్. ృనం.



రంబాడిని గురించి వ్రాస్తూ ఒక చోట అంటాడు."ఆయనది స్వతంత్ర ల వ్యక్తిత్వం. అన్నింటికీ తిలోదకాలిచ్చి ునం చేపట్టారు. జీవితంకోసం కవిత్వం కవిత్వంకోసం జీవించారు". శంకరం ురించి ఈ వాక్యాలు ఎంతనిజమో, ) గురించి కూడా అంతే యథార్థాలు. కవితలు నృత్యం చేశాయి. అతని పాటలు రవళించాయి. అతని కథలు భావనలకు అద్దం పట్టాయి. ఆయన ్ని "అమ్మి" నండూరివారి ఎంకిని , మరపిస్తుంది. సీరకొంగు పైకెగసెక్కి, నడుమున సెక్కి, మొగ్గపూల రయిక ుగ్గిపిండి సిప్పాకసేతా, ముగ్గేస్తా

# తెలుగు పూలు

**'సెలయేరు ప్రవహిస్తే, కోయిల కూస్తే, మెరుపు మెరిస్తే, మనిషి ఆనందానికి అవధులుండవు. అంతులేని ఆనందం ఇంతింతై అక్షరరూపం దాల్చితే అదే జానపద గీతిక – భావ మాలిక'.**

**బెంగుళూరు సభలో, పులికంటి కృష్ణారెడ్డి**

యింకొకసేతా వాకిట్లో వంకోనుండే అమ్మి నిగ్గు లొలికే పల్లెపడుచు. ఆమె ముత్తేలమ్మ ముందు ముచ్చటయిన బొమ్మ. వయ్యారాల పోట్లగిత్త. "కలుపు తియ్యనేర్చిందానా, వలపు కలుపు తియ్యలేవా?" అని తన వలపు కాని చేత అడిగించు కునేనేర్పుల వయారికుప్ప. ఆపాత్రసృష్టిలో పులికంటి నండూరి కొనకళ్ళ ప్రభృతుల సరసన నిలబడగల అర్హతను సంపాదించుకున్నాడు. తెలుగు వచ్చిన తెలుగువాడుగా అందరికీ పరిచయమయ్యాడు.

అయితే అతని జీవితంలో బతుకుతెరువు కొంత, మతికి మేత కొంత, ఎదసొదకొంత అయి అది కొంత కొంతల వింత బొంతఅయిందని ఎక్కువ మందికి తెలీదు. అతను పుట్టింది రాయలసీమలోని చిత్తూరు జిల్లాలో ఒక మారుమూల గ్రామమైన "జక్కదన" లో. పులికంటి గోవిందరెడ్డి పాపమ్మలకు 1931లో జూలై ముప్పైన పుట్టాడు. చదువు పాఠశాల గడపదాటేవరకు. తిరుపతిలో చదువు పూర్తి కాకుండానే రైల్వేలో ఉద్యోగం బుక్కింగ్ క్లార్క్‌గా. మెట్టు మెట్టుగా పైకెక్కి అసిస్టెంట్ స్టేషన్ మాష్టరుగా వున్నప్పుడు, పదమూడు సంవత్సరాల సర్వీసునూ వెంకటేశార్పణం చేసి, తిరుపతిలో కాఫీపొడి వ్యాపారం పెట్టాడు. ఆ తర్వాత ఓ ముద్రణాలయం నిర్వహించాడు. "కామధేను" పక్షపత్రిక నడిపాడు. ఆ తర్వాత విలేఖరయ్యాడు. తల బొప్పికట్టిన దశలో సాహిత్యం వైపు దృష్టి సారించి కథల్ని, కవితల్ని, బుర్రకథల్ని, వ్యాసాల్ని వ్రాస్తూ బ్రతకడం మొద లెట్టాడు. ఉద్యోగం చేస్తూన్నంతసేపూ కళాకారుడు గా ఎలా జీవించాలన్నది సమస్య. కళాకారుడుగా జీవించాలన్న తపనతో ఉద్యోగాన్ని వదులుకొన్నప్పుడు మరో సమస్య. బ్రతుకు కొనసాగుతున్నప్పుడేమో ప్రేమించిన ఓ స్త్రీ సమస్య. పూర్తిగా వ్యవసాయానికి అంకితమైన మధ్య తరగతి రైతుకుటుంబం నుంచి రావడంతో అడుగు బడుగు వర్గాల మీద వల్లమాలిన అభిమానం. వారి వారి బాసల్లో, యాసల్లో, చిత్తూరు జిల్లా పెద్దరికానికి వారసుడౌతున్నాడు. రంగు పిచ్చితో, రచన పిచ్చితో మట్టి గుర్రాలను నమ్ముకుని జీవితమనే ఏట్లో దిగినా, నిలువు ఈత నేర్చుకున్నాడు. రాయలసీమ జానపద కళాపరిషత్తు, లలిత కళాసమితి, జిల్లా రచయితల సంఘం సంయుక్త ఆధ్వర్యంలో అనంతపురంలో జరిగిన మహాసభలో జానపద కవికోకిల బిరుదాంకితుడైనాడు. అంతకుముందే ఓ దశాబ్దం క్రితం చిత్తూరు రామ విలాస సభలో, నటశేఖరుడుగా ఆర్.బి. రామకృష్ణ రాజుగారిచేత సన్మానం పొందాడు. 1980లో చక్రపాణి అవార్డు నందుకున్నాడు. అనేక పత్రికలు నిర్వహించిన కథానికల పోటీల్లో బహుమతులు గెల్చాడు. కథ తిండిగా, కవిత చిరుతిండిగా, బుర్రకథలు వ్రాసి టీ.వి.లో చెబుతూ, కవిత, నాటకం రెండు కన్నులుగా తపస్సు చేస్తున్నాడు – మధ్య మధ్యలో తపోభంగానికి లోనవుతూ.

అయితే పులికంటి ఏమి వ్రాసి, ఎన్ని చేసినా, కథకుడుగానే పదికాలాలపాటు మనగలడని విమర్శకుల భావన. అతని కథల్లో ఇప్పటి యువతరం తమ అస్తిత్వం కోసం పడే తపన గాఢంగా కనిపిస్తుంది. "అరచేతిలో గీత" అనే కథలో భావుకుడైన ఓ యువకుడు స్వప్నానికీ, యథార్థతకూ మధ్యపడే బాధనూ, "మరుపురాని మా ఊరు"లో స్వగ్రామాన్ని వదిలి పట్టణానికి వచ్చినా లోలోపల తన వున్న పూరితనం వదులు కోలేక పట్టణంలో నాగరిక జీవితాన్ని నటిస్తూ, గతానికీ, వర్తమానానికీ మధ్యనలిగిపోవడమూ, "తీయలేని కలుపు" లో ఊరికి ఉపకారం చెయ్యబోయి వైఫల్యం పొందిన ఓ అమాయకుని నిస్సహాయతా, "కర్త, కర్మ, క్రియ" లో అపురూపంగా మలిచిన లచ్చుమక్క జీవితమూ, భీమా, భామాకలాపంలో జయలక్ష్మి పాత్రా, కథానాయకుని భ్రాంతీ, జీవితాన్ని విచిత్రకోణాల్లో దర్శింప చేస్తాయి. ఆ కథల్లో, ఆపాత్రల్లో నాటకీయత వుంది. తెచ్చిపెట్టుకున్న చమత్కారం వుంది. కథా గమనానికి అడ్డువచ్చే అలంకారం వుంది. కవి చాపల్యం వుంది. సెంటిమెంటలిజమ్ వుంది. అన్నింటినీ అలముకొన్న కృష్ణారెడ్డి విచిత్ర వ్యక్తిత్వం వుంది. "నెంబర్రాళ్ళు, కీచకవధ, పులిగుండు, గూడుకోసం గువ్వలు, సృష్టికే అందం, ఊహకందని లోతులు, చిరునవ్వు వెల, ముల్లును ముల్లుతో, అప్పావు పిళ్ల ఆత్మఘోష, రోడ్లు నాగరికతను సూచించును, దొంగ గొడ్లు, సిన్నోడినమ్మా సిన్నోడిని" అతణ్ణి కథకుడుగా నిలబెట్టే ఆణిముత్యాలు. ఈ కథలన్నింటిలోనూ ఒక భవ్యమైన సామాజిక చేతన వుండడంతో, రచయితకూ, రచనకూ కూడా పరిపుష్టి చేకూరు

జడివానలో తడిసి, తడిసి ఎన్నో మైలు రాళ్ళునధిగమించి ఎంతో దూరం వచ్చిన కృష్ణారెడ్డి తన వేదన కగ్గలమైన పరిణత రచనలు మరెన్నో చేయగలవాడని భావుకలోకం విశ్వాసం!

–కొండముది శ్రీరామచంద్రమూర్తి

ఆంధ్రజ్యోతి

శుక్రవారం తిరుపతి 19.6.1992



శ్రీ ఆర్. యం. ఉమామహేశ్వర

కథకుడిగా, కవిగాపులికంటి కృష్ణారెడ్డి తెలుగు పాఠకులకు తెలుసు. అయితే ఆకాశవాణి, దూరదర్శన్‌ల కళాకారుడిగా ఆయన రెండు వందలకు పైగా కార్యక్రమాలు నిర్వహించారు. అందుకు తగిన పురస్కారం ఆయనకిప్పుడు లభించింది. ఆకాశవాణి, దూరదర్శన్‌ల సలహా సభ్యుడిగా ఆయన నియమితులయ్యారు. ఇది జాతీయ స్థాయి గుర్తింపు. ఇప్పటిదాకా నలుగురు తెలుగు వారికి మాత్రమే ఆగౌరవం లభించింది. ఎం.ఎస్.సుబ్బలక్ష్మి, ఈమని శంకరశాస్త్రి, బాలాంత్రపు రజనీకాంతరావు, ప్రజాకవి దాశరథిల తర్వాత పులికంటి కృష్ణారెడ్డి ఈగౌరవ పదవిలో నియమితులయ్యారు. పదవీ కాలం మూడేళ్ళు. వివిధ రాష్ట్రాల నుంచి వివిధ కళా రంగాలలో ప్రముఖులైన 14 మందిని సలహా సభ్యులుగా నియమిస్తారు. ప్రస్తుతం 12 మందినే నియమించారు. దూరదర్శన్, ఆకాశవాణి కార్యక్రమాలను సమీక్షించడం... పని తీరు మెరుగుకు సలహాలివ్వడం... మంచి కార్యక్రమాలను, మరుగున పడ్డ కళాకారులను సిఫారసు చేయడం - వీరి పని. కేంద్ర సమాచార. ప్రసారశాఖ సిఫారసు మేరకు ఆకాశవాణి డైరెక్టర్ జనరల్, న్యూఢిల్లీ ఈ సలహా మండలిని నియమిస్తారు. రాయలసీమ నుంచి ఈ పదవి పొందిన తొలి కళాకారుడు పులికంటి కృష్ణారెడ్డి. ఈ సందర్భంగా దూరదర్శన్, ఆకాశవాణి కార్యక్రమాల గురించి, ఈ వ్యవస్థల పని తీరు గురించి ఆయన అభిప్రాయాలను యిక్కడ యిస్తున్నాం.

## టి.వి.రేడియో పల్లెకి నడవాలి!

తిరుపతి బండ్ల వీధిలో వొక యిరుకిరుకు మిద్దిల్లు. పైన చిన్న గది. రంగు వెలసిన సోఫా. పాత టేబుల్. అడ్డదిడ్డంగా పడివున్న పుస్తకాలు, ఫైళ్ళు, వాటి మధ్య టెలిఫోన్. గోడల నిండా సన్మాన పత్రాల పటాలు. వీధి కిటికీలోంచి తొంగి చూస్తున్న మల్లెతీగ. నిశ్శబ్దపు ఖాళీ గదిలో కూర్చున్నాం - ఈయన ఎక్కడికి వెళ్ళినట్టు అని ఆలోచిస్తూ! ఇంతలో వెన్నీపుకి యింతలావు సంచీ తగిలించుకుని స్కూల్ డ్రెస్‌లో ఆయన మనవడు వచ్చాడు. 'తాత కోసమా?' అని చీకటి గది తలుపు చప్పుడు లేకుండా తెరిచాడు. మాసిన అడ్డపంచె, వొళ్ళంతా చెమటలు కారుతూ కృష్ణారెడ్డి బయటకు వచ్చారు. ఆయన వయసు అర్వై రెండేళ్ళు. ఈ వయసులో ఎక్సర్‌సైజులా అంటే, '' ఈ వయసులో ఈ ఆరోగ్యానికి ఇదే కారణం. ఎంత పనున్నా రోజూ ఈ పని మాత్రం తప్పదు'' అన్నారు.

వచ్చిన పని చెప్పి, నేరుగా ప్రశ్నల్లోకి దిగాం. ''అవును, ఇంత కాలానికి రాయలసీమకి జాతీయ స్థాయి గుర్తింపు''లభించింది అన్నారాయన.

...న దేశంలో రేడియో పుట్టి వందేళ్ళయితే, రాయలసీమ ...లకి ప్రవేశం లభించింది యిర్వై యేళ్ల కిందటే. అదీ కడప ...ప్టిన తర్వాతే! అంతదాక రాయలసీమ అంటే రేడియో వాళ్ళకి ...పు. రేడియోలో ఒకానొక పెద్ద ఆఫీసర్ అన్నాడు 'రేడియో ...తగిన కళాకారులు రాయలసీమలో లేరు' అని. కడప స్టేషన్ ...ర్వాత తెలిసింది వాళ్ళకి రాయలసీమ సత్తా ఏమిటో?- ఎన్నెన్ని ...పాలు, ఎన్నెన్ని కార్యక్రమాలు - జాతీయ స్థాయిలో ప్రసారమైనాయని? 1985లో రిపబ్లిక్‌డే కవిసమ్మేళనాకి ఢిల్లీకి పిలుపు వచ్చింది. ఆ తర్వాత ఆకాశవాణి డైరెక్టర్ జనరల్ వచ్చాడు. ఇదిగో ఈ యింట్లోనే, యిదే సోఫా మీద యిలాగే కూర్చున్నాడు - 'బోలియే రెడ్డీ సాబ్' అంటూ - అవును యిప్పటికి తెలిసింది ఉత్తరాది వాళ్ళకి సీమను గురించి -'' అని కాసేపు ఆగి ఆయన కొనసాగించారు. ''ఆంధ్రలోని వాళ్ళుకూడా మొదట్లో మమ్మల్ని చేరదీలేదు. హైదరాబాదు వాళ్ళు పట్టించుకోలేదు. విజయవాడ కేంద్రం వాళ్ళు పిలవలేదు. కడప

ప్ముల్ని గుర్తించింది. రాళ్ళపల్లి విశ్వనాథం, టి.ఆర్.రెడ్డి, డాక్టర్ ప్మనాభరావు - వీళ్ళు రాయలసీమలోని పల్లె పల్లె తిరిగారు. లని వెతికెతికి పట్టుకున్నారు. కార్యక్రమాలు రూపొందించి చేశారు. ఆ తర్వాతే మిగతా స్టేషన్లు గుర్తించాయి'' అన్నారు.

***తకీ ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రస్తుతం వస్తున్న ాలు ఎలా వున్నాయి? అని అడిగితే -***

నాల్సిన దాన్ని చూస్తున్నాం - చూడాల్సిన దాన్ని వింటున్నాం'' కార్యక్రమాల్ని గురించి వ్యాఖ్యానించారు.

***పరిస్థితి మార్పుకి అవకాశం వుందా? అంటే -***

ంది - దానికి తగిన శ్రద్ధ కావాలి, చొరవ కావాలి. అయితే ంలో అది కొరవడింది. మద్రాసు కార్యక్రమాలకీ, హైదరాబాద్ న్ కార్యక్రమాలకీ ఎంత తేడా వుందో చూడండి. తమిళనాడులో ్శన్ కేంద్రం పెడతామన్న వార్త రాగానే అప్పటి ముఖ్యమంత్రి ిధి వెనువెంటనే నగరం నడిబొడ్డున తగిన స్థలాన్ని కేటా రు. రాష్ట్రం ఖర్చుతో భవనాలు నిర్మించి యిచ్చారు. ఆ ం కేంద్రం యివ్వబోతే తీసుకోలేదు. పైగా ఆ మొత్తాన్ని కూడా ద్రాసు కేంద్రానికి మంచి ఎక్విప్‌మెంట్ కొనండి అని చెప్పారు. మన దేశంలోనే వొకానొక అత్యాధునిక టి.వి. కేంద్రంగా అది ంది. మరి మన వాళ్ళో? హైదరాబాదులో స్థలం చూపడానికి ాలు పట్టింది. అదీ నగరానికి 18 మైళ్ళ అవతల యిచ్చారు. ంటుది మన తెలుగు వాళ్ల శ్రద్ధ'' అంటూ పెదవి విరిచాడు.

దరాబాద్ కార్యక్రమాలు స్థాయిని పెంచాలని ఆయన ంచారు. కార్యక్రమాల నిర్వాహకుల సొంత ప్రయోజనాలు, , ఆయా రంగాలలో పరిచయం లేకపోవడం కారణాలని ుపడ్డారు. ''జానపద కళారూపాలు స్టూడియోలకి నడిచిరావు. ాలే పల్లెలకి వెళ్ళాలి'' అని అన్నారు.

***్తే, సలహా సభ్యులుగా మీరేం చేయదల్చుకున్నారు? అని ప్రశ్నిస్తే,***

ైనా మంచిగానే చేయాలి - వాళ్ళతో తగాదా పడితే నెగ్గకు మంచిగా పోతే నాలుగు మంచి కార్యక్రమాలైనా చేసే అవకాశం ంది.

ిజానికి ఈ వయసులో పదవి వొచ్చింది. నెలకి నాలుగు వేలు. ుమ్మళంగా పడుకుని, మీటింగులకి వెళ్లి బిల్లు తెచ్చుకోవచ్చు ను కళాకారుడ్ని - ఎందరెందరు కళాకారులు మరుగున ్రో నాకు తెలుసు. నేను గమ్మునుండలేను, పల్లెలన్నీ తిరగాలి, కళాకారులను వెలికి తీసి కార్యక్రమాలు రూపొందించాలి. వాటి ప్రసారానికి సిఫారస్‌లు చేయాలి. ఇంతపని చేయడానికి తగిన ఆరోగ్యం దేవుడి దయవల్ల నాకింకా ఈ వయసులోవుంది'' అన్నారు.

***చిత్తూరు జిల్లా జానపద కళారూపాలకి సంబంధించి మీకు నిర్దేశిత కార్యక్రమం ఏమైనా వుందా? అంటే***

''చాలా వుంది - ముందు చెయ్యాలి - చెప్పడానికే ముంది, ఎంతైనా చెప్పచ్చు - రాయలసీమ జానపద కళారూపాలన్నింటినీ దృశ్యానికి ఎక్కించాలనీ, ధ్వనిముద్రణ చేయాలనీ నా ఆశ'' అని చెప్పారు. ''సలహా సభ్యుడిగా నాకు ఎంతో కొంత మతింపు వుంటుంది - హైదరాబాద్‌లో కాని పనిని ఢిల్లీలో చేయించకోగలను. కాళహస్తిలో వొక ముసలి గుడ్డాయన వున్నారు. లెక్కల్లో తలపండిన వారు. పేరు సంజీవ రాయశర్మ. ఆయన్ని గురించి దూరదర్శన్ వాళ్ళకి ఎన్నిసార్లు రాసినా పట్టించుకోలేదు - ఆయన మీద మంచి కార్యక్రమం చేయాలని తపనగా వుంది'' అన్నారు. ''రాయలసీమలో ఎన్నో అపురూపమైన జానపద కళలు మరుగున పడిపోయాయి. పుట్టపర్తి నారాయణా చార్యులు శివతాండవం చదివితే వినాలి. వొళ్ళు జలదరిస్తుంది. దాని ధ్వని ముద్రణ చేయలేదు ఎవ్వరూ. ఇది మన దౌర్భాగ్యం'' అని ఆవేదనగా అన్నారు.

రేడియో గురించి మాట్లాడుతూ, ''టి.వి. ప్రవేశంతో రేడియోకి కొంత ఆదరణ తగ్గిపోయింది. దీన్ని తిరిగి నిలబెట్టడానికి చాలా కృషి చేయాల్సి వుంది. తిరుపతిలో ఎఫ్.ఎం. స్టేషన్ పెట్టారు. దాని పరిధి చాలా తక్కువ. అందులోనూ ఎఫ్. ఎం. బ్యాండ్ వున్న రేడియోలు ఎన్ని? దీని స్థాయి పెంచి జనరల్ చేస్తే - పల్లెల్లో వాళ్ళైనా తిరుపతి కార్యక్రమాలు వినే అవకాశం వుంటుంది'' అన్న అభిప్రాయం వ్యక్తం చేశారు.

***ఇంతకీ మీకు ఈ పదవి ఎల్లా వచ్చింది? రాజకీయ సిఫారసులేమైనా వున్నాయా? అని అడిగితే -***

'అదేం లేదు - నేను కష్టం చేసేవాణ్ణి. మంచి వయసులో వుండగానే ఎస్.ఎం.ని కొట్టి రైల్వే వుద్యోగం వదులుకొని వచ్చాను. రోజూ ఏదో వొకటి రాస్తానే వుంటాను - కథ, కవిత్వం, పాట, బుర్రకథ, నాటకం, నటన వీటన్నింటిలో నాకు ప్రవేశం వుంది. వీటివల్లే నాకు గుర్తింపు లభించింది. అయితే నలుగురూ నాలుగు మాటలంటారు. నేనుపట్టించుకోను. పేపరోళ్ళకీ మీకూ పడదా? మీ వార్తలే రావే? అని అందరూ అడిగేవాళ్ళే!

నిజమే! నన్నేం చేయమంటారు చెప్పండి? నేను వొకరి మాటకి పోయేవాడినికాదు. నా పనేదో, నేనేదో, రాసుకోడమో, పాడుకోవడమో. అయినా అందరికి నేనెందు పగ అవతానో అంతుబట్టడం లేదు. కానీయండి, నా వొళ్ళుంది, నాకు రాసే శక్తి వుంది' - అంటూ పులికంట ఆగ్రహాన్ని ఆవేదనను కలబోసి తన అభిప్రాయాన్ని అభివ్యక్తం చేశారు.

## ఆశీరక్షతలు

పండితులార్యవర్యులిటు శ్రేయఃకాములై నిత్యసం
ప్రాభవగౌరవంబునకు మర్యాదల్ ఘటింపంగ సం
గాంచితి హర్షమున్ గనితి నిట్లే నీవుమున్ముందు స
ం గాంచి యశంబు నొందెదవు కృష్ణారెడ్డి ధీశేఖరా!

శ్రీ నారాయణ రెడ్డి పీఠమధివాసింపన్ నృసింహార్యుడే
నౌనంచున్ వినుతింప సన్నుతుడు రామారెడ్డి సన్మాన సం
ధానంబున్ వెలిగింప సుందరకవీంద్ర ప్రార్థనన్ సాగు స
న్మానంబున్ గడించినావు యశమున్ మాన్యంబునుం గాంచుమా!

సుధీవిధేయ సదాశివ రెడ్డి
తిరుపతి

# మీడియా నుంచి మీడియాలోకి...

## కీ॥ శే॥ దాట్ల నారాయణమూర్తి రాజు

అన్ని సాహితీ ప్రక్రియల్లో అంతో ఇంతో ప్రవేశం ఉన్న వాళ్ళు సాధారణంగా మనకు ఎక్కువగా కన్పిస్తారు. కానీ అన్ని సాహితీ ప్రక్రియల్నీ ఆకళింపు చేసుకుని లబ్ధ ప్రతిష్టులైన వ్యక్తులు అరుదుగా కన్పిస్తారు. అలాంటి వ్యక్తి శ్రీ పులికంటి కృష్ణారెడ్డి. రాయలసీమ అనగానే తిరుపతి, చంద్రగిరి కోటలు ఎలా జ్ఞాపకం వస్తాయో, అలాగే శ్రీ పులికంటి కృష్ణారెడ్డి కూడా జ్ఞాపకం వస్తారు.

నిత్యవినోదుడు, నిత్య విషాదుడు, నిత్యనిషాదుడు శ్రీ కృష్ణారెడ్డి, తన రాయలసీమ మాండలికంలోనే జోకులేసే వినోదుడు. కొంత మంది రాయలసీమ మాండలికం సొగసుల పేరుతో 'నానా చెత్తా' రాస్తున్నారని వగచే విషాదుడు. వాల్మీకి మానిషాద శ్లోకంలోని ఆర్తికి అక్షర రూపం ఇవ్వాలని కలలుకనే నిషాదుడు శ్రీ పులికంటి కృష్ణారెడ్డి.

కవిగా, కథకునిగా, సాహితీ విమర్శకుడుగా మరీ ముఖ్యంగా గాయకుడుగా, ఇంకా ముఖ్యంగా ఊపిరి సలపని వక్తగా నిరంతరం సాహిత్య భూమి చుట్టూ ఎన్ని ప్రదక్షిణలు చేస్తారో శ్రీ కృష్ణారెడ్డి! శ్రీ పులికంటి కృష్ణారెడ్డి ఇటీవల ఆకాశవాణికి, టెలివిజన్‌కు ప్రత్యేక సలహాదారుడుగా కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఒక తెలుగు రచయితకు, అందునా రాయలసీమ రచయితకు అలాంటి గౌరవం దక్కడం సాహితీ ప్రియులకు సంతోష కారణం. ఆ సందర్భంగా శ్రీ పులికంటి కృష్ణారెడ్డితో ప్రత్యేక ఇంటర్వ్యూ!

***స్తున్న కథ, కవిత, పాట, నవల మీద మీ అభిప్రాయం?***

కథ రాసి పెరిగింది కానీ, వాసి తగ్గింది. వాస్తవానికి పత్రికలు ఎక్కువయ్యాయి. అందులోనూ మసాలా పత్రికలు ్యాయి. సీరియల్ కథలు, నవలలు కనిపించినంతగా సీరియస్ కథలు కనిపించడం లేదు. నాసిరకం కథలు ు. 1960-70 తర్వాత కథ సహజత్వాన్ని కోల్పోయిందని నా అభిప్రాయం. కథలో 'వేగం' పెరిగింది ేనం, శిల్పం తగ్గాయి.

ొగసు శిల్పమైతే వస్తువు ప్రాణం. మునగకొయ్య తీసుకుని శిల్పంచెక్కితే దానికి విలువ ఏముంటుంది? లేనివాళ్ళు గంధపు చెక్కని తీసుకుని కొయ్యముక్కగా తయారు చేస్తున్నారు. దానిని సాహిత్యంగా చలా ేసుకుంటున్నారు. దానిని పత్రికలు సొమ్ము చేసుకుంటున్నాయి. పత్రికలు ఏమి అచ్చేస్తే పాఠకులుఅది ున్నారు. బాధ్యతా రాహిత్యం పత్రికలదే తప్ప పాఠకులది కాదు గదా?...

***జత్వానికి దూరంగా ఉందన్నారు... సహజత్వమంటే మీ దృష్టిలో?...***

జీవితం తెల్సి కథ రాయడం వేరు. తెలీకుండా రాయడం వేరు. ప్రస్తుతం జీవితం తెలీకుండా చాలామంది రు. అలా రాస్తున్న వారు అన్ని ప్రాంతాల్లోనూ ఉన్నారు, రాయలసీమ ప్రాంతంతో సహా. అవే మంచి కథలుగా ి అవుతున్నాయి. కథ ఇప్పుడు తలా తోకా లేకుండా తయారైంది. మినీ కథ, కార్డు కథ, చెత్తకథ ప్రయోగాలు ్చు. ప్రయోగాల చాటున సాహిత్య ప్రయోజనం దెబ్బతినకుండా చూసుకోవాలి గదా!

ాహిత్య ప్రయోజనం దెబ్బ తినకుండా చూసుకోవాలంటే ముందుగా సంపాదకుడికి సాహిత్య స్పృహ ఉండాలి. ్రాలు సాహిత్యం కాదు.

థ ఒక ఉద్యమంలా రావాలి. తమిళనాడులో ఉత్తమ కథకు వాళ్ళే బహుమతి ఇస్తారు. ఆ కథల్ని వాళ్ళే ్తారు. కానీ మన తెలుగులో అలా లేదు. మద్రాసులో 'కథా వేదిక, చిత్తూరులో సాహిత్య సమితి, ాదులోకథా సాహితి, వైజాగ్‌లో కథా సముద్రం' ఇవ్వన్నీ ఎక్కడ మునుగుతాయి, ఎక్కడి కథలు అక్కడ కున్నపుడు? ముఠాలు, కథలు, కథా సంపుటాలే వస్తున్నపుడు నాలుగు వైపుల నుంచి వస్తున్న తెలుగు కథకు ిచ్చేది? ఉదాహరణకు సాహిత్య అకాడమీ ఒక కథా సంపుటిని తెస్తే, అందులో కృష్ణారెడ్డి కథ లేదు. నాకా ా? దీనిక్కారణం ఏమిటి? అందుకే నేనంటాను, సాహిత్యంలో ముఠాలుండకూడదని!

***్తున్న కవిత్వం చదువుతున్నారు కదా! అస్పష్టత, సంక్లిష్టత, నిబద్ధత... నిమగ్నత... 'నీలి కవితలు' ఇలా ంగా గొడవలున్నాయి కదా. ఆగొడవల మీద మీ అభిప్రాయం?***

విత్వంలో అస్పష్టత, సంక్లిష్టత రెండూ ఎక్కువ శాతమే ఉన్నాయి. ఊహా చిత్రాలకు ఏవోరంగులు పులిమితే త్వం ఎట్లవుతుందో! నాకైతే అర్థం కాకుండా ఉంది. ప్రజల కోసం కవిత్వం రాస్తున్నపుడు, ప్రజల స్థాయికి ?నీ స్థాయికి ప్రజలు రావాలా? నెమ్మదిగా ప్రజల అవగాహన స్థాయి పెంచుతూ రావాలి.

అర్థతాత్పర్యాల కవిత్వం వద్దనుకున్న వాళ్ళం మనం. మళ్ళీ ప్రతి పదార్థాల జోలికి వెళ్ళడం కాకుండా, ప్రజా ను ప్రజల హృదయాల వద్దకు వెళ్ళేటట్లు చేయడం కనీస బాధ్యత. ఏ రచనకైనా పరమార్థం కావాలి. ప్రజా ు ప్రజలకు అర్థమైతేనే, వాళ్ళు ఆలోచించగలుగుతారు.

ఉదాహరణకు!

కాడెద్దులు ఒకరికి కంకి కొడవలొకరికి
ఆవు దూడ ఒకరికి నాగలి ఇంకొక్కడికి
గుడిసె గుర్తు ఒక్కడికి గుర్తులుగా ఇచ్చేసి
గుర్తింపుకు నోచుకోక గొంతెత్తి అరవలేక
సంఘటిత శక్తిని సమీకరించు యుక్తిలేక
చేతులు రెండు ముడుచుకొని చింతపడి పోతుంటే
ఆ చెయ్యి కూడా ఇంకొక్కడు చెప్పకుండా లాక్కుంటే
ఏమి చేత మిగలనోడు ఎట్ట బతకబోతాడని
దిగులు పడవద్దన్నా రైతన్నా!'
భ్రమ పూరిత జీవితాల బాటనీది కాదన్నా
చెమట చిరునామాను తుడుపుటెవడితరమన్నా?
ఈ భావాన్ని ఏ మాండలికంలో చెప్పినా ఒకటే! సమస్యను చెప్పడానికి మాండలికం అడ్డురాదు.
ఉదాహరణకు నేను రాసిన 'అమ్మి పదాలు' తీసుకోండి.
'మరిసి నన్నిడి సుండ మణుసెట్ట వొప్పింది మాఁవా'
గుట్టుగా నేనుంటే రట్టు చేస్తివి బతుకు
గురుతెట్ట రాలేదె మాఁవా?
చెట్టడుగు తుండాది పుట్టడుగుతుండాది
చేనిలో అలసంద పువ్వడుగుతుండాది
బదులేమి చెప్పేదిమాఁవా
ఈ బతుకెట్టబతికేదిమాఁవా!

భావం సొగసుతో పాటు, మాండలికం సొగసు కూడా ఈ పదాల్లో ఉందని రా. రా. లాంటి వారే కితాబిచ్చాడు. )కానికి సిసలైన సాహిత్య గౌరవం ఇవ్వాలి. కుహనా మాండలికం మాండలికం కాదు. మాండలికం అంటే భాషకే పరిమితమైందని భావించడం తప్పు. మాండలికం భాషలో ఒక భాగం మాత్రమే. మాండలిక లత్వం మాండలికం కాదు.'

కవిత్వ విషయానికి వస్తే సాహిత్య అకాడమీ అవార్డు పొందిన శివారెడ్డిలో అద్భుతమైన స్పష్టత ఉంది. గోపీలో దేవరాజు మహారాజులో ఉంది. అలతి అలతి మాటలతో అద్భుతమైన భావ వ్యక్తీకరణచేసే అఫ్సర్‌లో ఉంది. తరం కవులకు మార్గదర్శకుడు శివారెడ్డి అని నేను నమ్ముతాను.

**ురించి**

నవల గురించి హుఁ! అది ఆకాశం నుండి అధః పాతాళంలోకి వెళ్ళిపోయింది. కె.ఎన్.వై. పతంజలి లాంటి దురీదుతున్నారు. పతంజలి ఇటీవల రాసిన గోపాత్రుడు, ఒక దెయ్యం ఆత్మకథ. ఇప్పటి జనాలకు అర్థం ునా, రేపటి తరానికి నిలిచే సామాజిక కావ్యాలు.

***త్య జీవితం ఎలా ప్రారంభమైందో ఒకసారి చెప్తారా?***

న్నెవడూ భుజాల మీదికెత్తి 'వీడే కృష్ణారెడ్డి' వీడి రచనలు చచ్చినట్టుగా చదవండ'ని అనలేదు.

వాళ కలం పట్టిన ఏ రచయిత అయినా సహజంగా కలం పట్టినవాడే. ఇన్స్పిరేషన్స్ ఉంటాయి. తప్పదు ప్పుడు నా ఇన్స్పిరేషన్ శరత్. చరిత్ర హీనులు అటు నుంచి ఇటు తిప్పి తిప్పి చదవడంతో రచన మీద ఏర్పడింది.

ప్పటికీ నటన మీదనే ఇంట్రెస్టు... నటుడిగా చంద్రగుప్తుడు, అమరత్యాగి, ఏకలవ్యుడు, దుర్యోధనుడు, ు, హరిశ్చంద్రుడు, కర్ణుడు వేసిన అనుభవం. నాటకాల్లోనే బతకాలనే తపన.

ఆసమయంలో ఇంచుమించుగా 'కలిశాడు' మధురాంతకం రాజారాం ఒక సభలో!, ఒక సవాలు విసిరాడు. వరకూ పద్యం రాసిన వాడే కవి అన్న భావనలో ఉన్నాన్నేను. కథ ఎవడైనా ఎప్పుడైనా రాయగలడని, ఈరోజు ' అచ్చయిన కథ పేజీలు మరుసటిరోజు పకోడీ పొట్లాలుగా రూపాంతరం చెందుతాయన్న తేలికభావం తర్వాత సాధన చేశాక తెల్సింది. కథ రాయడం ఎంత కష్టమో?... ఆరు వందల పేజీల నవల కన్నా, ఆరు థ రాసి, ఒప్పించిన వాడు నిజంగా, సాహిత్య కారుడన్న నమ్మకం కలిగింది.

1960లో ఆంధ్ర ప్రభ దీపావళి ప్రత్యేక సంచికలో 'కెరటాలు'స్కెచ్, 1961 ఆంధ్ర పత్రికలో 'గూడు ంవ్వలు' అచ్చయ్యాయి. నా కథల్లో మాండలికం, నాకు తెలీకుండానే చోటు చేసుకుంది. అప్పట్లో ఒక సారి శంభుప్రసాద్‌గారు నన్ను పిలిపించారు.

''అబ్బాయి! రాయలసీమ, తెలంగాణా, కోస్తా, ఉత్తరాంధ్రా, స్వరూప స్వభావాల రీత్యా, నైసర్గిక రీత్యా ైనా, భాషాపరంగా మనం ఈ మూడు ప్రాంతాల్నీ సూత్రీకరించాల్సిన అవసరం ఉంది. అలాంటప్పుడు ాండలికంలోవాళ్ళు రాస్తే ఎలా?'' అని మందలించారు.

అంతవరకూ రాయలసీమ రచయితలందరూ తమ రచనల్లో కృష్ణా జిల్లా భాషనే వాడుతున్నారు, అలా పోతే పత్రికల్లో అచ్చుకావన్న భయంతో! నా కథల్లో నేను, మాండలికం రాయడానికి ప్రయత్నించాను.

నేను పుట్టి పెరిగిన నేల, ఆ నేల ఎండకు ఎండి, వానకు తడిసి, వెదజల్లిన వాసనలు, మా అవ్వ నన్ను వొడిలో ట్టుకొని చెప్పిన ఊకుడు కథల్లో దూకుడు; మా చెంగమ్మత్త చేటలతో చెరిగి పోసిన నుడికారాలు, నన్నొదిలి

అప్పటి నుంచి ఆ నుడికారం, ఆ మమకారంతోనే కథలురాశాను.

*సీమ మాండలికంగా వస్తున్నదంతా రాయలసీమ మాండలికమేనా?*

కాదు. యాస వేరు. భాషవేరు. తిట్లు వేరు. సాహిత్యంవేరు. తిట్లే సాహిత్యం కాదు. అనవసరంగా కొంతమందికి కితాబులు ఇస్తున్నారు. – ఈ 'అతి' కితాబుల వల్ల కొంతమంది రచయితలు పువ్వుల్లా వికసించాల్సిన పిందెలై రాలిపోతారు. అలాగే అయిపోయారు కూడా. వాళ్ళ సాహిత్య మనుగడ తాత్కాలికం. సాహిత్యానికి పత పునాదిగా ఉండాలి. మాండలికాలు, భాషలో సొగసులు ఇవ్వన్నీ ఉపకరణాలు మాత్రమే! ఇది నా వ్యక్తిగత యం.

*'విమర్శ' గురించి... తెలుగులో 'విమర్శ' రానురానూ 'పరామర్శ' స్థాయికి దిగజారిపోతోందని ఉన్నాయి. దీనిక్కారణం.. మీ అభిప్రాయం.*

ుిరు నారాయణ రెడ్డిగార్ని ఇంటర్వ్యూ చేశారు. దాదాపు వారితో నేనూ ఏకీభవిస్తాను. విమర్శ గురించి ిం మాట్లాడలేని పరిస్థితి ఉంది. నచ్చితే పొగడ్డం, నచ్చకపోతే తెగడ్డం విమర్శ కాదని నా అభిప్రాయం.

*దూరదర్శన్‌కు మీరు సలహా దారు కదా? ప్రస్తుతం నాసిరకంగా ఉన్న తెలుగు దూరదర్శన్ కార్యక్రమాల లో మీరుతీసుకునే చర్యలేమిటి?*

ి మీడియా అయినా ఒక సమగ్రతకు గుర్తు. నేను కేవలం 'వ్యక్తి'ని. వ్యక్తి ఎప్పుడూ సమగ్రుడు కాడు. మీడియా నికం కావాలి. మీడియా అనేది మానవ, మానసిక పరిధిని విస్తరింపచేసే ఆయుధం కావాలి. దానికోసమే

కార్యక్రమాలు నాసిరకంగా ఉన్నాయంటే నేనొప్పుకోను. టీ.వీ. ఉన్నది మేధావుల కోసం మాత్రమే కాదు. ైరవి' సినిమాను మాత్రమే పది సార్లు చూసే ప్రతివాడూ, 'హిందూ' పేపర్ని ఇంటికి తెప్పించుకునే ప్రతివాడూ, ో డప్పాలు కొట్టే ప్రతివాడూ, చేతిలో ఏదో నవల పుచ్చుకొని తిరిగే ప్రతివాడూ మేధావి కాడు.

వి.వీ. ఉన్నది ఆ బాల గోపాలం కోసం. ఆనందిచడం కోసం. ఆనందింపజేయడం కోసం.

ా వంతు కర్తవ్యం నేను చిత్తశుద్ధితో చేయగలనన్న నమ్మకం నాకుంది.

ెలుగు కార్యక్రమాల కాలవ్యవధిని మనంపెంచాల్సిన అవసరం ఉంది. పక్కన తమిళ రాష్ట్రానికున్న సౌకర్యం ర్యక్రమాల విషయంలో కూడా రావాలి. అందుకు నా వంతు కృషి చేస్తాను.

*విమానించే వ్యక్తిగా ఈ తరంరచయితల్లో మీకు నచ్చిన కథారచయితలు....*

ా.సో., కాళీ పట్నం, రావిశాస్త్రిని వదిలేయండి.. ఆతర్వాత తరం మధురాంతకం తదితరుల్ని వదిలేస్తే ఎను సదానంద 'రామదాసు చెర' శ్రీపతి 'కుర్చీ' పి.సత్యవతి 'పగిలిన గ్లాసు', దాట్ల నారాయణ మూర్తి రాజు ఊగరా, ఉయ్యాకొయ్యా నందుకుని ఊగరా', వి. రాజారాం మోహనరావు 'వరద', ఇలా ఎన్నెన్ని.. ఎంతమంది.. కథమీద, కథా రచయిత్రుల మీద నాకెంతో నమ్మకం ఉంది, ఈ జాతి గర్వించదగ్గ కథలు రాయగలరని!

***''ప్రజా పక్షం'' పక్ష పత్రిక నుండి***

# నట రత్నాలు

*గానమ్ములో నొక్క గంభీర ధోరణి*
*గంటల మోయించు కర్ణములను*
*పాత్రోచితా హార్య వైభవమొప్పార*
*భాసించు నటనా ప్రభావ గరిమ!*

ంటూ కృష్ణారెడ్డి నటుడనీ, కథకుడనీ, ), పత్రికా సంపాదకుడనీ, గాయకుడనీ, ుక్కిలి సంఘసేవకుడనీ, ప్రణయార్థమెరిగిన ంటూ పులికంటిని గురించి ప్రస్తుతించారు, తెలుగు కవి శంకరంబాడి సుందరాచారి.



ఃక్రమాన్ని బట్టి చూసినప్పుడు మున్ముందుగా ుసింది కృష్ణారెడ్డి మహానటుడనీ, అనేక లనూ, నాటికలనూ దిగ్విజయంగా చి ఉత్తమ నటుడుగా ఆయన ఎన్నో చోట్ల ఎన్నో బహుమతులు ున్నారనీ, ఆయన నటించిన ఏకపాత్రాభినయాలు రసిక నాటికి మరపురానివనీ అంటారు సుప్రసిద్ధ కథారచయిత ంతకం రాజారాంగారు.

ాయలసీమ నాటక కళామతల్లి రత్నకిరీటంలో రంగారు ీ' అంటూ ప్రస్తుతించాడు రాయలసీమ రాజన్న కవి. కథ ుగా, నటుడిగా, కవిగా ప్రసిద్ధి పొందినవారు పులికంటి కృష్ణారెడ్డి ంసించాడు శ్రీశ్రీ. తిరుపతి దైవదర్శనానికి వచ్చిన సుప్రసిద్ధ, ేసరుడు కీ॥ శే॥ బసవరాజు సుబ్బారావు కృష్ణారెడ్డిని 'పఠాన్ పాత్రను అభినయించమని అడిగి, ప్రదర్శింపచేసి 'సెహభాష్ ష్ణి' అని ప్రశంసించాడంటే కృష్ణారెడ్డి నటనా ప్రాభవాలు ుో అర్థం చేసుకోవచ్చు.

ంతకూ కృష్ణారెడ్డి నటుడా? ఆయన రచయితే కాని నటుడు ున్నాడొక మిత్రుడు. అవునని నేనూ అనుకున్నాను ఇన్నాళ్ళూ. బహుముఖ ప్రజ్ఞశాలి కావటం వల్ల ఉత్తమ రచయితగా ుదిన వెలుగులో, నటుడు మరుగున పడిపోయి రచయిత కొచ్చాడు. అందువల్ల ఆయన నటుడన్న విషయం నలుగురికీ ుండా పోయింది.

ముకే కృష్ణారెడ్డి ఒకచోట అంటాడు – 'ఆర్థిక వనరులు లేని ుమలో నటుడుగా కొనసాగలేక రచయితగా రూపాంతరం ' అని. అది నిజమని నిరూపించాడు. 'తెలుగు పలుకుబడినీ, నూ అపోశనంపట్టిన అగస్త్యుడ'ని చల్లా రాధాకృష్ణశర్మా ుగారి కలంలో కన్నీరు ఒలికించే కారుమేఘముందని మాలతీ ా, ఒక్క చట్రంలో ఇమడని సాహితీ త్రివిక్రమమూర్తి మా ' అని సి. నారాయణరెడ్డి, 'ఉద్యోగం వదలుకుని సాహితీ ులో దిగింది కొంత సాహసమేమో అని అప్పుడనిపించిందనీ, ంలో నా పొరపాటును తెలుసుకొన్నాననీ, బహుముఖమైన ఆయన సాహితీ రసికతను గమనించి సంతోషిస్తున్నా'నని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు ప్రశంసించారంటే కృష్ణారెడ్డి సాహిత్య ప్రజ్ఞను గురించి ఆలోచించాల్సింది ఏముంది?

ఆయన పుట్టింది రాయలసీమలోని చిత్తూరు జిల్లా, మారుమూల పల్లె జక్కదనలో. పులికంటి గోవిందరెడ్డి పాపమ్మలకు 1931 జూలై ముప్పైవ తేదీన పుట్టాడు. చిన్న చదువులు ఊళ్ళో చదువుకుని హైస్కూలు చదువులకు తిరుపతి వచ్చి చదివినా వ్యాస రచనలోనూ, వక్తృత్వంలోనూ, పద్యపఠనంలోనూ బహుమతులు గెలుచుకోవడం తప్పిస్తే నాటకాల మీదకు మోజు పోలేదు. చదువు పూర్తి కాకుండానే రైల్వే ఉద్యోగం. అంచెలంచెలుగా స్టేషన్ మాస్టర్ పదవికి ఎదిగి పదమూడు సంవత్సరాల సర్వీసునూ వదులుకుని కాఫీ పొడి వ్యాపారం చేస్తూ, తరువాత ఒక ముద్రణాలయం పెట్టాడు. ఆ తరువాత 'కామధేను' స్థానిక పక్షపత్రిక సంపాదకత్వం వహించాడు. పత్రికా విలేఖరయ్యాడు. కథలు రాశాడు. కవితలల్లాడు. వ్యాసాలు రాశాడు. బుర్రకథలు చెప్పాడు. ఇలా నిలకడ లేని జీవితంలో గతుకుల రోడ్డుమీద ఒంటెద్దు బండి ప్రయాణంగా సాగిపోయింది ఆయన జీవితం.

ఎట్టొచ్చీ 1958లో తిరుపతి లలితకళాసమితి వారు నిర్వహించిన నాటిక పోటీలలో 'ఇదేనా లోకం'? నాటికలో ఒకే పాత్రను అద్భుతంగా పోషించి, ఉత్తమనటుని బహుమతిని గెలుచుకున్నాడు. న్యాయనిర్ణేతలలో అనంతకృష్ణశర్మగారు, రాయప్రోలు సుబ్బారావు ఉండడం గమనార్హం. ఆ సందర్భంలో ఆయన గురువు గారైన పి. నాగేశంగారు ముక్కుమీదవేలేసుకుని "ఏరా కృష్ణారెడ్డీ? ఇంత కాలంగా ఈ అద్భుత అభినయాన్ని ఎక్కడ దాచుకున్నావురా?" అంటే "ఆ విషయం ఇంత కాలం నాకూ తెలియదు గురువుగారూ" అని జవాబిచ్చాడట. అలా ప్రారంభమైంది నటనా ప్రాభవం.

తరువాత బెల్లంకొండ రామదాసు "పునర్జన్మ" నాటకంలో ముసలి పాత్ర, జనార్దనరావు పాత్రను ధరించి అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు. అప్పుడే అనుకున్నాడట తనలో కూడా గొప్ప నటుడున్నాడని.

అలా నలుగురికీ తెలిసిపోయింది కృష్ణారెడ్డి మంచి నటుడని. గుంతకల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ కళాసమితితోనూ, చిత్తూరు ఆర్టులవర్స్‌తోనూ సంబంధాలు ఏర్పడ్డాయి. సూళ్ళూరుపేట వరద బాధితుల సహాయార్థం మధురాంతకం రాజారాం రచించిన 'ఆనాటి రాత్రి' నాటకంలో ఒక పాత్ర ధరించి మెప్పును పొందాడు. ఆ తరువాత వరుసగా జరిగే తిరుపతి లలిత కళాసమితి వారి నాటక పోటీల్లో ప్రదర్శనకూ, వ్యక్తిగత ప్రతిభకూ బహుమతులందుకోవడంతో ఇక నటుడుగా స్థిరపడవచ్చన్న నమ్మకంతో, నటకాగ్రేసరుడైన పి. నాగేశం

రువుగా ఎంచుకున్నారు. తరువాత చెన్నపురి ఆంధ్ర మహాసభ
ోటీల్లో పాల్గొని ఉత్తమ నాటికకు ప్రథమ బహుమతిని
న్నాడు. చిత్తూరు జిల్లా రచయితల సంఘం వార్షికోత్సవంలో
ాళ్ళపల్లి, విద్వాన్ విశ్వం, తిరుమల రామచంద్ర మొదలైన
ులసమక్షంలో దుర్యోధన ఏకపాత్రాభినయాన్ని అభినయించి,
ర్వక అభివందనాలను అందుకొన్నారు. "కృష్ణారెడ్డీ...
 నేను ఎన్నోసార్లు పరిశీలించాను కానీ దుర్యోధనుడు ఇంత
ర్థం కాలేదే" అని మెచ్చుకున్నారట పి.రాజగోపాల
ుగారు.

ిట్ రావు చాణుక్యుడుగా, పూర్ణిమ మురగా, కృష్ణారెడ్డి
ప్తుడుగా నటించిన చంద్రగుప్త నాటకాన్ని దర్శించిన పింగళి
తం "మంచి విగ్రహం. నటనలో నిగ్రహం. ప్రస్ఫుటమైన
 అనుగుణమైన ఆంగికం. ఎటొచ్చీ కొంచెం మూమెంటు
వే గొప్ప నటుడవుతావోయ్" అని భుజం తడితే ఉబ్బితబ్బిబ్బై
ంటాడు కృష్ణారెడ్డి.

॥ బి.వి.యన్. ఆచార్య నాటకం "గురుదక్షిణ" లో కృష్ణారెడ్డి
ాగేశంగారు ద్రోణుడు. కృష్ణారెడ్డి ఏకలవ్యుడయితే ఈ గురువు
 లాంటి గురువు కాదు. 'నన్నొక నటుడిగా తీర్చిదిద్దిన
అంటాడు పులికంటి. అయినా ఆరోజు ప్రదర్శన చూసిన
 గురువును మించిన శిష్యుడన్నారు.

నటుడిగా ఎన్నెన్నో బహుమతులు అందుకున్నాడు. ప్రశంసలందు కున్నాడు. చిత్తూరు రామవిలాస సభలో నటశేఖరుడుగా ఆర్.బి. రామకృష్ణంరాజుగారు సన్మానించారు. ఏది ఏమైనా పులికంటి నటుడుగా కంటే రచయితగా ఈనాడు ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాడు. ఆరేళ్ళ కాలంలో ప్రముఖ దినపత్రికలన్నింటిలో కథలు రాసి నాల్గు బహుమతుల్ని అందుకున్నాడు. నాటకాల్ని రచించాడు. సాహిత్య జగత్తులో ఎన్నో మెట్లు పైకెక్కిన పులికంటి జాతీయ కవి సమ్మేళనంలో జాతీయ కవిగా పాల్గొన్నాడు. ఈనాడు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కృష్ణారెడ్డి మీద సి.హెచ్.కూర్మయ్య డాక్టరేట్ కోసం పరిశోధన చేస్తున్నారు. ఉత్కళ యూనివర్శిటీలో బి.ఏ. విద్యార్థులకు కృష్ణారెడ్డి కథల్ని పాఠ్యాంశంగా నిర్ణయించారు. చక్రపాణి అవార్డును అందుకున్నారు. రాయలసీమ జానపద కళాభారతి, అనంతపురం రచయితల సంఘ లలితకళా పరిషత్ సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన సన్మాన సభలో జానపద కవికోకిల, బిరుదు అందుకొన్నాడు. 'ఓ కోటిగాణ్ణి', 'ఓ సిన్నోణ్ణి', 'ఓ అమ్మిని' తెలుగునాట ఒక్క పులికంటి మాత్రమే బైటకు లాగారని, వి.వి.యల్. నరసింహారావు ప్రశంసించాడు.

ఎంత ఉత్తమ నటుడనిపించుకున్నా ఈతరం వారికి అందులోనూ కృష్ణారెడ్డి కథలను ప్రేమించేవారికి కృష్ణారెడ్డి ఒక గొప్ప నటుడని తెలియదనడం అతిశయోక్తి కాదు!

– కళాప్రపూర్ణ డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి.

# రాయలసీమ కోయిల

*కళ మీ శిరమున కరమున*
*నెలవై మీ కంఠరవము నిగ్గులుకులుకన్*
*తెలుగున్ కళామ తల్లికి*
*పులికంటీ మిమ్మువంటి పుత్రుడు గలడే?*

*పల్లీ కైతల కీవే*
*ఢిల్లీ పట్టమ్ముకట్టి రేవి నొనర్పన్*
*ఉల్లమునందు ముదమ్మున*
*చల్లగ కవితామతల్లి చల్లును సేసల్!*

*పులివై కంటిన్ చలువలు*
*చిలికింతువు కథలలోన జిలిబిలి పలుకుల్*
*చెలివెట్టెడు గిలిగింతలు*
*కలుగున్ నీ రచన పఠన కళావిధానా!*

*సాహసము నీదు జీవిత*
*సాహిత్యమె బ్రతుకు కొక్క స్తంభముకాగన్*
*బాహువులు విండి నిలిచిన*
*సాహసి! కర్మిష్ఠి! నీకు జయమగు నంటిన్!*

*రాయల సీమకు నీవొక*
*కోయిలవో! తెలుగుతల్లి కొప్పున విరివో!*
*గేయమ్మై చాటి చెప్పును*
*ఖాయమ్మీమాట - కవిని కాదనగలరా!*

**అవధాన సార్వభౌమ మాడుగుల నాగఫణిశర్మ**

# చేతులెత్తిదణ్ణంపెట్టాల్సిన మహామనీషి!

## శ్రీ వై. బాలకృష్ణ

ే కథకాదు. కల్పన అసలేకాదు. ఇందులో ఆవగింజంత అపద్ధం
క్క అక్షరం అతిశయోక్తిలేదు. ఒక సామాన్య వ్యక్తిగా నా జీవితంలో
ంఘటనకు యథాతథంగా రూపకల్పన చేయడమే ఈ ప్రయత్నం.
ంటే ఈ సంఘటన డెబ్బైవసంతాలు నింపుకొంటున్న శ్రీ పులికంటి
గారితో ముడిపడి ఉంది కాబట్టి!

ఏ నిముషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు?'' ఇది సినిమా
ఒక గీటే కావచ్చు. కానీ జీవితానుభవం పండి రాల్చిన పసిడి పలుకు!

రోజు ఒకే ఒక్క పదినిముషాలు ఆలస్యం జరగకుండా ఉంటే ఈ
న జరిగేదికాదు. నాకీ అవకాశం దొరికేదీ కాదు.

ర్ధగంటో లేదు గంటో అటూ ఇటుగా మూసినా తెరిచినా ఏషాపు
ఎవ్వరూ పట్టించుకోరు. ఈ పద్ధతి బ్రాందీషాపులకు వర్తించదు.
ం నిముషాలు ముందుగా తెరవడానికిలేదు. అదే అయిదు
ాలు ఆలస్యంగా మూయడానికి లేదు. ఆరోజు అప్పటికే
ుషాలు ఆలస్యమైంది. అదే అంటూ 'షట్టర్‌దింపి లాక్ చెయ్యండి'
్ని. అప్పుడు దిగబడ్డాడు ఒక వీధిరౌడీ. లోపల కూర్చొని తాగాలన్నాడు.
కే పదినిముషాలు ఆలస్యమై పోయింది!' అంటే ''ఇంగొక్క
శాలు ఆలీసెమైపోతే ఈడేం కొంపలు మునిగిపోవులే!''అంటూ షాపులో
ం.

ఁడికోపం పిచ్చోడి చేతిలో రాయి. కాదనే సాహసం అనర్థాలకు మూలం.
అయిష్టాన్నే ఇష్టంగా మార్చుకొని భరించాల్సిన పరిస్థితి. వాడేమో
ేసినంత ధీమాతో కాలుమీద కాలేసుకొని నింపాదిగా తాగుతూ నా
్ని పరీక్షిస్తున్నాడు. అవుననలేక కాదనలేక కుడితిలో పడ్డ ఎలుకలా
డుతున్నాను. ఇటువంటి సందర్భాల్లోనే మనస్సు వద్దన్నా గతంలోకి
గాస్తుంది.

ట్టింది రామచంద్రాపురం మండలం నెత్తకుప్పం గ్రామంలో.
ొనింది ప్రతినిత్యం ఆరారు పన్నెండు మైళ్లు నడిచి కుప్పంబాదూరు
ల్లో. 1975 సం.రం మార్చినెలలో కుప్పం బాదూరు హైస్కూలు
3 మంది విద్యార్థులు ఎస్సెస్సీ పరీక్షకు హాజరైతే పాసయింది నేనొక్కణ్ణే!
ిన గళాన్నిచ్చిన దేవుడు చేతికి కలాన్ని కూడా ఇచ్చాడు. ఏ డాక్టరో
ో కావాలన్న కలలు ఆర్థిక పరిస్థితుల చేతుల్లో కరిగిపోతే బ్రదుకు
షాపుకు పరిమితమై ఈలాంటి చిత్రమైన పరిస్థితుల్లో చిక్కి బిక్క
ిన పరిస్థితి కలిగిందే? అని మనస్సు పరిపరి విధాల పోతూ ఉంది.

క్షణంలో అయినా ఎక్సైజు పోలీసులు రైడింగ్ పేరుతో షాపుమీద
. కేసు పెట్టవచ్చు. అందుకే షట్టర్ మూయించాను. అయినా లోపలి
ు నేనున్నానంటూ బయటికి తొంగిచూస్తూ ఉంది. అనుమానం
తం. నా అనుమానం నిజమైంది. రొద చేసుకొంటూ వచ్చిన జీప్
ుదు ఆగింది. లాఠీ కర్రల్తో షట్టర్‌ను బాదుతూ షట్టర్ తెరవమన్నారు.
పైకిలేచిందే తడవుగా తాగుతున్న వాడి కాలర్ పట్టి ఈడ్చుకొని పోయి
మన్నారు. లేచి నమస్కరిస్తున్న నన్నుచూసి,

ం? నీకు బుద్ధుందా లేదా? ఎంత టైం? పదిన్నర అవుతూ ఉంటే
ప్‌లో తాగిస్తున్నావే?'' అంటూ రికార్డ్సు తీసుకొని షాప్ సీల్‌చేసి
ారు.

పరిస్థితిలో దొరలచిత్తం. లైసెన్సు రద్దుచేయవచ్చు. లేదా ఒకటి రెండు
పు సస్పెండ్ చేయవచ్చు. ఏది జరిగినా మూలిగే నక్కమీద తాటికాయ
ర్థిక పరిస్థితి అంతంత మాత్రం కావడం వల్ల ఈ పరిస్థితిని తట్టుకొని

నిలబడేదెలా? అన్న సందేహంపురుగు మెదడును తొలుస్తూ ఉంది. ఎటూ తోచలేదు. ఏమిచేయడానికి పాలు పోలేదు. ఎదురవుతున్న పరిస్థితి ఒకభూతమై భయపెడ్తూ ఉంది. ఆ దశలో చేతులు నెత్తిమీదికొస్తే ఒక వ్యక్తి ''ఎందుకయ్యా? ఇంతగా భయపడుతున్నావ్? పులికంటి కృష్ణారెడ్డి నీకు తెల్సుగదా! ఆయన్ను పట్టుకో. నీపని సానుకూలమై పోతుంది'' అని సలహా ఇచ్చాడు.

పులికంటి కృష్ణారెడ్డి అప్పుడప్పుడు తనమిత్రులతో కలిసి బ్రాందీ షాప్‌కు వస్తుంటాడు. అంతమాత్రమే తెలుసు. వాళ్లు లోపల గదిలో కూర్చుంటే ''అద్దో ఆయనే మధురాంతకం రాజారాం. ఈయనే కలువ కొలను సదానంద!'' అని చుట్టుప్రక్కల జనం గుసగుసలు పోతుంటే వాళ్లు గొప్ప రచయితలని పట్టించుకోలేదు. కనీసం పలకరించిన పాపాన పోలేదు. ఎంతోమంది వాళ్లకు అడుగడుగు దండాలు పెడుతుంటే నేను చెయ్యెత్తి నమస్కరించలేదు. ఈ పరిస్థితిలో ఆయన్ను ఆశ్రయించడం సముచితమా? ఆశ్రయించినా ఎదుటోడి కష్టాన్ని తన కష్టంగా భావించే సహృదయత ఉంటుందా? ఉన్నా వేళకాని వేళ అర్ధరాత్రివేళ తలుపు తట్టడం తగునా? అని నాలోని సగటు మనిషి తర్జన భర్జనలు పడుతున్నా అవసరం నాచేయిపట్టి పులికంటిగారి ఇంటికి బరబరా లాక్కొని పోయింది.

అర్ధరాత్రి. ప్రతిప్రాణి ఆదమరచినవేళ, సంశయిస్తూనే కాలింగ్ బెల్ నొక్కాను. లేచి వచ్చి తలుపుతీస్తూ 'ఎవరూ?' అన్నారు.

''నేను బాలకృష్ణ సార్!''

''ఈ వేళప్పుడు....''

''సారీ సార్! షాప్‌లో పదిగంటలపైన వద్దన్నా ఒక రౌడీకూర్చొని తాగుతున్నాడు. అది ఎక్సైజ్ సూపరెంటు కంటపడింది. రికార్డ్సు తీసుకొని షాప్ సీల్‌చేసి వెళ్లిపోయారు. ఎలాగైనా ఈ పరిస్థితినుండి...''

నోట్లోమాట నోట్లో ఉండగానే ఆయన గిరక్కున వెనక్కు తిరిగి వెళ్లిపోయారు. నా మనస్సు కలుక్కుమనింది.

''నా పిచ్చిగానీ - రాత్రి కాని రాత్రి. మంచి నిద్ర చెడగొట్టే ఎవరు మాత్రం సహిస్తారు? ఒకడి కష్టాన్ని తనకష్టంగా భావించి స్పందించే గుణం ఎంతమందికి ఉంటుంది. ఉంటే వాళ్లు మహనీయులై ఉంటారు కానీ మామూలు మనుషులు కారు. ఎవడో దారినపోతున్న దానయ్య మాట విని ముందు వెనుకలు ఆలోచించకుండా ముందుపడడం - నాతెలివి లేని తనమే!'' ఒక్కొక్క ఆలోచన మెడపట్టి నెట్టుతూ ఉంటే ఒక్కొక్క మెట్టుగా గడపమెట్లు దిగుతున్నాను.

''బాలకృష్ణా!'' అన్న పిలుపు!

తిరిగి చూస్తే స్కూటర్ కిందికి దింపే ప్రయత్నంలో కృష్ణారెడ్డి గారు. నా తొందరపాటు ఆలోచన తప్పని తేలితే తేలిగ్గా ఊపిరి పీల్చుకొన్నాను.

'సైకిల్ అక్కడపెట్టు!' అంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడు. నన్ను వెనక కూర్చోమన్నాడు. స్కూటర్ కదిలింది. రెక్కలు విప్పుకొన్న నా ఆలోచనలు ఈ గండం గడిచి పిండం బయటపడ్తేచాలు అని రకరకాలుగా పోతున్నాయి. స్కూటర్ శరవేగంతో వెళ్లి దొడ్డాపురం వీధిలో ఎక్సైజ్ సబ్‌ఇన్స్‌పెక్టర్ సుబ్రమణ్యంరెడ్డి ఇంటిముందు ఆగింది. స్కూటర్ నిలబెట్టి గబ గబ మిద్దెమెట్లు ఎక్కారు. కాలింగ్‌బెల్ నొక్కారు.

సబ్ ఇన్స్‌పెక్టర్ లేచి వచ్చాడు. ''నమస్కారం రెడ్డిగారూ! వేళకాని వేళ....'' అన్నాడు.

ది సరేనయ్యా! తిరుపతిలో ఇంకెవడూ లేడా? వీడే దొరికాడా?''

ది మాపనికాదు రెడ్డిగారూ! మా ఎక్సైజ్ సూపరెంటు దొరగారు వస్తూ ఉంటే ఆయన కంటపడింది.''

ు మీ దొరగారు ఊళ్లోనే ఉంటున్నారా?''

ంటారు సార్!''

ు మాట్లాడకుండా కిందికి దిగివచ్చారు. స్కూటర్ మీద ఇద్దరం ఇంటిముందుదిగాం. 'రేపు ఉదయం ఆరుగంటలకు కలువు' అంటూ ఇంట్లోకి వెళ్లిపోయారు.

సైకిలెక్కి ఇల్లుచేరాను. కృష్ణారెడ్డిగారు ఏదైనా చేయగల సమర్థులు సాయం అభయహస్తమై భుజం తడుతున్నా రేపు ఏమవుతుందో హం. ఈద్వైదీభావనలో నలుగుతున్న మనస్సు కన్నుల్లోకి ప్రాకి ురుతుంటే కండ్లు ఎప్పుడు మూతపడ్డాయో నాకే తెలియదు!....

లకృష్ణా!''

డెల మీద గుద్దినట్లు పిలుపు. ఎగిరిపడిలేచాను. కండ్లు ంటా ఇంటిముందు కొచ్చాను. రెడ్డిగారు ఒక్కచూపు చూశారు. ''అనుకొన్నదేమి? నీవుచేస్తున్నదేమి? ఇపుడు టైమెంత?'' అన్న ు సూదులై గుచ్చుతూ. సిగ్గుతో తలవాలిపోయింది. వంచిన ా ఇంట్లోకి పరిగెత్తి దోసిడు నీళ్లతో మొగం తుడుచుకొని ఆయన ు.

ఒక్క పదినిముషాల్లో ఆర్ అండ్ బి గెస్ట్‌హౌస్ ముందు స్కూటర్

క్కడికెందుకుసార్? - మనం ఎక్సైజ్ స్టేషన్‌కి.....''

ర్ముయ్!'' అన్నట్లుగా ఒక ఉరుము ఉరిమారు.

ౌస్‌లో అడుగుపెట్టాం. అన్ని కాకీ దుస్తుల ఆకారాలే. గెస్ట్‌హౌస్‌ను న్నట్లుగా హడా విడిగా తిరుగుతున్నాయి, ఎక్సైజ్ మినిష్టర్ శ్రీ టరెడ్డిగారు అక్కడ మకాంచేసిన కారణంగా దాదాపు జిల్లాలోని కారులందరూ అక్కడే ఉన్నారు.

సరం నాది. అయితే ఆ అవసరాన్ని తనదిగా భావించింది ఆయన. నేను నిద్రపోయినా ఆయన నిద్రపోలేదు. నాకంటే నిద్రలేచారు. ఫోన్‌మీద వివరాలు సేకరించారు. వచ్చి నన్ను . అదీ బాధ్యత! ఎంతమంది ఇలా మాటకు కట్టుబడతారని ను. ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోతే ఆశ్చర్యపడ్డాను. అంతవరకు చేయని ్సలోనే ఆ మహానుభావునికి చేతులెత్తి నమస్క రించాను!''

రెడ్డిగారు తిరుపతి ఎక్సైజ్ సర్కిల్ ఇన్స్‌పెక్టర్ శ్రీరాములు గార్ని ్నడు. ''నమస్కారం సార్! నేను పులికంటి కృష్ణారెడ్డిని'' అన్నాడు.

ుతే నాకేం!'' అన్నట్లుగా ఆయన నిర్లక్ష్యంగా చూస్తే రెడ్డిగారి అసహనం ఒక్కక్షణం తొంగిచూసి తొలిగి పోయింది. నా గుండెలు తుల్లోకొచ్చాయి.

ువాత ఎక్సైజ్ సూపరెంటుగారితో మాట్లాడాలని నమస్కరిస్తే ఆయన కూడా ఆడించలేదు.

! పులికంటిగారు దెబ్బతిన్న పులే అయ్యారు. మంత్రి రెడ్డివారి ారి గదిలోకి దూరారు. చెంగారెడ్డి గారు ఎంతో మర్యాదగా లేచి రిని ఆహ్వానించి కూర్చోమన్నారు. అయినా ఆయన కూర్చోలేదే?

్యాదలు మన్ననలు కాసేపు ప్రక్కనపెట్టండి. ఎప్పుడైనా మేము మీకు ండాల్సిందే తప్ప... మీరుమాత్రం?''

''ఏం జరిగిందో ఏం కావాలో చెప్పకుండా పులిలాగా గాండ్రిస్తే ఎట్టబ్బా?'' అంటూ చెంగారెడ్డిగారు నవ్వేందే నవ్వు!

''ఇద్దో! వీడు నా మిత్రుడు. పేరు బాలకృష్ణ. రైల్వే స్టేషన్ ఎదురుగా బ్రాందీషాప్. ఎవడో ఒక యాత్రీకుడు కక్కుర్తిపడి బ్రాందీ షాప్ ముందరే నిలబడి అంత తాగాడట. అదొక మహానేరమైనట్లు వాడి షాప్ సీల్‌చేశారు ఎక్సైజ్ అధికారులు.''

''ఎవరక్కడ! ఆ ఎక్సైజ్ ఇన్స్‌పెక్టర్ని పిలువ్.''

క్షణాలమీద శ్రీరాములుగారు గదిలో ప్రవేశించారు. మంత్రి ప్రక్కన కూర్చున్న రెడ్డిగార్ని గమనించి అసలు విషయాన్ని గ్రహించారు. మంత్రిగారికి కొక్క సెల్యూట్ కొట్టి నిలబడి. ''ఇది నాపనిగాదు. మా ఇ.యస్. దొరగారే స్వయంగా సీల్ చేశారు సార్!''

''అయితే మీ దొరగార్నే వచ్చి కలవమను.'' అని రెడ్డిగారివైపు తిరిగి ''పదన్నా మనం టిఫిన్ చేద్దాం!'' అంటూ కృష్ణారెడ్డిగారితో కలిసి డైనింగ్ హాలు చేరుకొన్నారు. అక్కడ ఎక్సైజ్ మినిష్టర్ గాదె వెంకటరెడ్డిగారు వీళ్లతో కలిశారు. అందరు కలిసి టిఫిన్ తింటున్నారు. అప్పుడు ఎక్సైజ్ సూపరెంటు దొరగారు వచ్చి మంత్రులకు విష్‌చేసి నిలబడ్డారు. అయితే మంత్రివర్యులు అతని రాకను గమనించలేదు. కనీసం కన్నెత్తి కూడా చూడలేదు. పదిహేను ఇరవై నిముషాల్లో టిఫిన్ కార్యక్రమం పూర్తి అయిన తరువాత -

''రైల్వేస్టేషన్ ఎదురుగా బ్రాందీషాప్. ఎందరో యాత్రీకులు వస్తూ పోతూ ఉంటారు. ఎవడో ఒకడు కక్కుర్తి పడి షాప్‌లోనే అంత తాగినంత మాత్రాన కొంపలేమీ మునిగిపోవు. ఇలాంటి చిన్న చిన్న విషయాలకే మీరు షాపులు సీల్‌చేస్తూ పోతే - రేపు ఎలక్షన్లలో మేము ప్రజలమొగం చూడాలా? వద్దా? చాలా ఘనకార్యం చేశారు కానీ వెళ్లి షాప్ తెరిపించడయ్యా - ఆc! ఈమాట నేనుచెప్తేచాలా? లేదు మీ ఎక్సైజ్ మినిష్టర్‌గారే చెప్పాలా?'' ఎగతాళి రంగరించి ఎత్తిపొడిచారు చెంగారెడ్డిగారు!

తరువాత ఏం జరిగిందో చెప్పాల్సిన అవసరం లేదు.

అయితే తప్పనిసరిగా చెప్పాల్సిన ముఖ్యమైన విషయమేమంటే కృష్ణారెడ్డిగారు చేసిన సహాయానికి ప్రతిగా ఆ సాయంకాలం ఆయనకు పార్టీ ఇవ్వదలచుకొన్నాను. ఆమాటే ఆయనతో అంటే ఆయన నవ్వి ''సహాయం నీకు జరిగిందని కాదు. పట్టింది సాధించాగలిగానన్న తృప్తి నాకు మిగిలింది. అందుకే ఈ పార్టీ నాదిరా!'' అన్నారు. అలానే ఇచ్చారు. అప్పుడన్నారు. ''ఇలా నేను చేసిన ప్రతి పనికి ప్రతిఫలం ఆశిస్తూ పైరవీలు నడిపి ఉంటే నేను ఇలా ఉండేవాణ్ణి కాదు.'' అని

అక్షర సత్యమైన మాట! ఇది జరిగి దాదాపు ఒక్క దశాబ్దం కావస్తూ ఉంది. ఆనాటినుండి ఈనాటివరకు ఏ అవసరం కలిగినా ఏ అవాంతరం ముంచు కొచ్చినా 'ఆయన ఉన్నాడులే!' అన్న ఆత్మస్థైర్యాన్ని ప్రసాదించిన మహామనీషి పులికంటి గారు!

నాకేదో సహాయపడ్డారని పడుతున్నారనీ, మహామనీషి అని తెగ పొగడుతున్నానని భావిస్తే అంతకంటే తప్పు మరొకటి లేదు.

ఈ దేశంలో ఆయన కంటే సుప్రసిద్ధులైన మహా రచయిత లున్నారు. మహాకవులూ ఉన్నారు. ఎంతో పేరు ప్రఖ్యాతులు కలిగిన వాళ్లున్నారు. అయితే ఎంతమంది ఆయన లాగా బంధుత్వాలు, మిత్రత్వాలు, కులాభిమానాల జోలికి పోకుండా మనిషిని మనిషిగా ప్రేమించి వాళ్ల కష్టాలకు స్పందించి తమకున్న పేరు ప్రతిష్టల్ని పరపతిని ఉపయోగించి సహృదయంతో సహాయపడుతున్నారు?

ఒక్క పులికంటి కృష్ణారెడ్డే కాదు - అలా ఎవ్వరున్నా నా దృష్టిలో వాళ్లు చేతులెత్తి దణ్ణం పెట్టాల్సిన మహనీయులే!

# దీపం పెట్టిన చేతులు

శ్రీ గోపిని కరుణాకర్

కు చదవటమనేది చిన్నవయసులోనే అలవాటు అయింది. స్కూల్ చందమామ, బాలమిత్ర పెట్టుకొని చదవతావుంటే అయ్యోర్లు చూసి పట్టుకోని కొట్టివుండారు. అలా చదవటమనేది వొక వ్యసనమై

ం పీలేరులో ఇంటర్మీడియేట్ చదువుతున్నప్పుడు రోజూ లైబ్రరీకి ప్పి. గంటల తరబడి చదువుతూ వుండేవాణ్ని. ఒక రోజు ఆంధ్రభూమి ంచికను చూశాను. ఆ సంచికలో మొదటి బహుమతి పొందిన 'పాపం! 'గాడు' కథను చదవడం జరిగింది. ఆ కథరాసిన రచయిత పులికంటి

థలోని చిత్తూరు జిల్లా భాష నన్ను ఆకట్టుకొనింది. అంతవరకు ంలో కథరాస్తారని నాకు తెలీదు. నేను చదవను కూడా లేదు. అప్పటికి ినదంతా యండమూరిని, యద్దనపూడిని మాత్రమే.

కథ నా అభిరుచిని పూర్తిగా మార్చేసింది. సృజనాత్మక సాహిత్యం వైపుకు పించింది. ఆ దారంటే మెల్లగా నడుచుకొని పోయినాను. గొప్ప సంపద నాకు దొరికింది. వజ్రవైఢూర్యాలు, మణులు, మరకత ల్లాంటి కథలు రాసిన రచయితలు నాకు పరిచయమైనారు. మా చీకటి మూలల్లో ఎవరూ తాకని గొప్ప గొప్ప పుస్తకాలను చూశాను.

మ్ముదులిపి చదివినాను. అలా సృజనాత్మక ప్రపంచం వైపుకు కిటికీలు థ 'పాపం! కుంటేలుగాడు'. గొప్ప సాహిత్య సంపద వైపుకు వేలు నడిపించిన రచయిత పులికంటి కృష్ణారెడ్డిగారు.

లైబ్రరీలోనే గురువుగారి గూడుకోసం గువ్వలు, పులికంటి కృష్ణారెడ్డి ువినాను. అప్పుడు పులికంటి నా అభిమాన రచయితైపోయినాడు.

కు గురువుగారిని కలవాలని బలే కోరికగా వుండేది. ఎలాగైతేనేమి ంపాయించి, నాలుగు కాళ్ళమండపంకాడ దిగి, నాలుగడుగులు కు నడిచి బండ్లవీధిలో వుండే వాళ్లింటికి పోయినాను. ఎక్కడికో ి పోయినాడనీ, మధ్యాహ్నంగా భోజనానికి ఇంటికి వస్తాడనీ ఆయక్క నేను ఎక్కడెక్కడో తిరిగి పొద్దు పోగొట్టుకొని మళ్ళీ వచ్చాను.

రువుగారు భోజనం చేసి మిద్దెమింద పడుకొని వుండారు. చెప్పులు దిలి పైకి పోయినాను. సోఫాలో కూర్చున్నాను. లోపల గురువుగారు వుండారు. గోడలకు వున్న సన్మానపత్రాలను, ఫోటోలను చూసినాను. లేచి పంచె, బనీను మిందనే వచ్చి ఎవరన్నట్లు చూసినాడు.

ం పైకి లేచి నమస్కారం చేసి ''సార్ నా పేరు కరుణాకర్. మాది ం కథలు చదివినాను. మీరంటే నాకు ఎంతో ఇష్టం'' అని చెప్పినాను. ంతో అభిమానంగా పలకరించినాడు. నా గురించి అడిగి న్నాడు. ఆరోజు గురువుగారితో రెండు గంటలపైనే గడిపివుంటాను.

తరువాత ఆ ఇంటికి ఎన్నోసార్లు పోయి ఉండాను. కథలు గురించి, ంరించి ఎన్నో మాట్లాడుకోని వుండాము.

బు తెగ చదవడం వలన రాయాలనే కోరిక బుర్రలో పుట్టింది. పుట్టిందే ంక కథరాసి గురువు గారికి పోస్టులో పంపించాను. ఆయన చదివి గాహన వుంది. రాయగలశక్తి కూడా వుంది. కొన్ని అక్షర దోషాలు అనుభవాన్ని కథగా చేయడంలో పసితనపు ఛాయలున్నాయి. ఇలా ్తా పోతే కథ గుట్టుమట్లు నీకే తెలుస్తాయి. నీవు రచయిత కాగలవన్న 'కుంది'' అని లెటర్ రాసినాడు.

ఆ లెటర్ నా మీద నాకు ఎంతో నమ్మకాన్ని కలిగించింది. నాకు మరింత ప్రోత్సాహాన్ని ఇచ్చింది. ఆ ఉత్తరాన్ని నా హృదయంలో దాచుకొన్నాను. తొందరపడకుండా ఎక్కువగా చదువుతూ, తక్కువగా రాస్తూ వుండేవాణ్ని. మా నాయన జన్మనిచ్చిన తండ్రి అయితే, గురువుగా సాహిత్య జన్మనిచ్చిన తండ్రి పులికంటి!

★★★

రాయలసీమ జీవితాన్ని తీసుకొని మొదటిగా కథరాసింది సభాగ్గారైతే, రాయలసీమ మాండలికంలో మొట్టమొదటి కథ రాసింది పులికంటి కృష్ణారెడ్డి గారే! అప్పటికి తెలుగు సాహిత్యంలో కోస్తా జిల్లా భాషల ఆధిపత్యమే ఎక్కువగా వుండేది. వాళ్లే కథక చక్రవర్తులు.

అలాంటి వాతావరణంలో మధురాంతకం లాంటి రచయిత కూడా తన ఉనికిని కోల్పోయి, కోస్తా భాషలో రాస్తేనే సాహిత్య గౌరవం వుంటుందన్న అభిప్రాయంలో పడిపోయి, ఆ భాషను అరువు తెచ్చుకొని కథలు రాయవలసిన పరిస్థితి వుండేది. ఆయన చాలా సార్లు ఈ విషయాన్ని ప్రస్తావించి వున్నాడు.

అలాంటి వాతావరణాన్ని ధ్వంసం చేస్తూ రాయలసీమ మాండలికంలో కథలు విరివిగా రాసి పెద్దల గౌరవాన్ని, మెప్పులను పొందిన మొగలాయి మా గురువు పులికంటి. ఆయన నిజంగా పులే! ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు 'అసామాన్య సృష్టి' గా పొగిడిన నాలుగ్గాళ్ళమండపం గురువుగారి సాహితీ కృషిలో కలికితురాయి.

ఆత్మాభిమానం వున్న మనిషి. కథలు రాయడం కోసం వున్న ఉద్యోగానికి రాజీనామా చేసి, కాఫీపొడి అమ్ముకొంటూ, బతకడం చేతకాక, కథలు రాయడం కోసమే బతికిన మనిషి. సాహితీ రాజకీయాలకు దూరంగా వుంటాడు. గ్రూపులు, ముఠాలు కట్టడు. ఏదన్నా మాట్లాడితే కుండ బద్దలు కొట్టినట్టు మోహం మింద మాట్లాడుతాడు.

అది ఈ మోసకారి ప్రపంచానికి నచ్చదు. ఆయనను పక్కన పెడతారు. ఆయన గురించి మాట్లాడరు. కథల గురించి చర్చించరు. శిష్య గణాల భుజాలమీద కూర్చుని, వాళ్ళనే ఫోకస్ చేస్తూ, వాళ్ళ చేత భజన చేయించుకొనే రకమూకాదు. తియ్యతియ్యని మాటలతో వశం చేసుకొనే రకమూకాదు.

ఏదైతే అనుభవించినాడో దాన్నే కథలు కథలుగా రాసినాడు. దళిత ఉద్యమం ఆంధ్రదేశంలో వూపిరి పోసుకోకముందే దళితుల జీవితాలను ఇతి వృత్తాలుగా తీసుకొని ఎన్నో కథలు రాసిన ఘనత పులికంటికే దక్కింది. పులికంటి దళిత రచయిత. గురువుగారి కథల్లో చిత్తూరు జిల్లా యాస కాకుండా భాష ఆత్మ వుంటుంది.

నామిని, నాలాంటి రచయితలకు గురువుగారు ముళ్లకంపల్ని, రాళ్ళను రప్పలను ఏరి, మట్టిపోసి చదును చేసి ఒక దారి వేసి వుంచారు. ఆ దారిమీద నామిని, నేను సులభంగా బండిని నడపగలిగినాము.

★★★

నాకు అక్షరాలు నేర్పిన గురువు సుబ్బారెడ్డి అయ్యోరు. ఆయన బలే సేద్దిగాడు. మా చేత సేద్దిం పనులు కూడా చేయించేవాడు. మడక దున్నడం, అండకొట్టడం, గెడ్డలు తోలడం, ఇవన్నీ చదువుతో పాటూ నేర్పించినాడు. నాకు సృజనాత్మక సాహితీ వ్యవసాయానికి దారి చూపించిన గురువు పులికంటి కృష్ణారెడ్డి.

కథా సేద్యంలో కలం పట్టడమూ, కథ రాయడమూ నేర్పించింది గురువుగారు. గురువు అంటే చీకటి జీవితాల్లో జ్ఞాన జ్యోతులు వెలిగించే వాడు కదా? నా జీవితంలో దీపాన్ని వెలిగించిన ఆ చేతులకు జన్మజన్మలకు ఋణపడి వుంటాను! ●

# సీమచిన్నోడి పెద్ద ప్రపంచం!

## శ్రీ అఫ్సర్

క్షరాలా మా ఊహలు తలుపులు తెరుచుకునే ఇరవయ్యేళ్ల క్రితం... సీమ రచయితలంటే ఇద్దరో! ముగ్గురో! కూడా లెక్కకొచ్చేవాళ్లుకాదు. వొకటీ... రెండు అని వెతుక్కోవాల్సి వచ్చేది.... మరి ఇప్పుడంటే కనీసం ఓ చెప్పుకోవచ్చు. ఇప్పటితో పోల్చినప్పుడు ఆ ఇరవయ్యేళ్ల క్రితంనాటి పరిస్థితి కనాకష్టమే. తోడు ఎవరూలేని ుం ఎంత కష్టమో చెప్పలేం. అందునా సంవేదనలతో నవనవలాడేటప్పుడు, మనసంతా అనేకానేక భావాల ాటలో వున్నప్పుడు మరీ కష్టం. ఆ ఇరవయ్యేళ్ల క్రితం రాయలసీమలో రచయితగా నిలదొక్కుకోడానికి ి ఎంతగా కష్టపడివుంటారో ఇప్పుడు ఎవరి ఊహకూ అందకపోవచ్చు. మళ్లీ బయటిలోకానికి తననొక కగానో, కవిగానో పరిచయం చేసుకోడానికి తొలితరం రచయితలెవరైనా నరకయాతన పడాల్సిందే. అలాంటి లన్నీ అనుభవించిన రచయిత పులికంటి. ఆయన ఏకానొక రచయితల సమూహంలోనో, కవిగుంపులోనో కడిగా వుండిపోలేదు. తను వున్నచోట తన వునికిని బలంగా చెప్పుకున్నారు. తన భాషని పదునుగా పలికారు, చనల్ని నిజాయితీగా పంచుకున్నారు. తన దారిని ధైర్యంగా మలుచుకున్నారు. ఈ మూడుకోణాల నుంచి సీమకు పులికంటి చేసిన మేలు సీమసాహితికి వొకపునాది.

ంతీయతని ఇప్పుడు వొక బలమైన వాదంగా నిలబెట్టడానికి మనం ప్రయత్నిస్తున్నాం కానీ సీమలో ఎప్పట్నించో స్వాతంత్ర్యానికి పూర్వమే ఆ దిశగా సాహిత్యపరంగా విశేషమైన కృషి మొదలైంది. 1943 ప్రాంతాల్లోనే ఓ రచయిత మాండలికంలో కథ రాశారు. గుత్తి రామకృష్ణ గంజికేంద్రంతో మొదలై ఇప్పటివరకూ ఆ ుం అలా సాగుతూండగానే 'సీమచిన్నోడి' అక్షర ప్రపంపం ఎంతో విశాలంగా తలుపులు తెరుచుకుంది. ిగిన, తనని పెంచిన నాలుగ్గాళ్ల మండపాన్ని వదలకుండానే అక్షర ప్రపంచమంతా షికార్లు కొట్టిన సాహసి ి. చిత్తూరు, పాకాల, పుత్తూరు, స్వర్ణముఖి... ఇలా తన చుట్టూరా వున్న స్థలజ్ఞాపకాల్ని ఆయన ఎక్కడా ోలేదు. ఈ భూమ్మీద ఆయన ఎటు తిరిగి ఎటు వచ్చినా వీటి చుట్టే తిరిగాడు. మనసుని వాటికి కట్టిపడేసి యాలమూలలూ శోధించివచ్చాడు.

బట్టే, సీమలో ఏ రచయితా చూపించని వస్తువైవిధ్యాన్ని చూపించగలిగాడు. కథ రాసినా, కవిత్వం రాసినా, నేకానేక పరిమితులుండే కాలమ్స్ రాసినా తనతనాన్ని ఎక్కడా మరచిపోలేదు. తన బలాన్ని ఎక్కడా పట్టు వ్వలేదు. నిజజీవితాన్ని మాత్రమే ప్రమాణంగా తీసుకున్న రచయితగా పులికంటి కనిపిస్తాడు. దీనికి ప్రత్యేకించి రాన్ని వెతకాల్సిన పనిలేదు, పులికంటి ప్రతి కథా దీనికి సాక్ష్యంగా నిలుస్తుంది. సాధారణ ఇతివృత్తం కొని అట్టడుగు బతుకుల్లోతులు తరిచే ప్రత్యేకమైన ఇతివృత్తాల వరకూ ఏ కథ రాసినా పులికంటి ముద్ర ుది. జీవితాన్ని పైపైన చూసే అలవాటు ఆయనకు లేదు. తన జీవితంలోని అనుభవాన్ని ఇతరులతో కుండా వుండే దురలవాటూ లేదు. ఆ విషయంలో పులికంటిది అచ్చంగా పల్లెహృదయం. అన్నీ విప్పడమే ుకోవడం తెలియదు దానికి! ఆ మాటకొస్తే జీవితాన్ని విప్పడమే పులికంటి కథని నడిపించే శిల్పం. పాండిత్యం ద్దీ, లోకం తెలిసే కొద్దీ ఆలోచనల్ని రకరకాల శిల్పసంవిధానాల్లో కప్పుకోవడం ఫ్యాషనైన కాలంలో ఇది ఓ ిరి. ఆ దారిలో ముక్కుసూటిగా ప్రయాణించిన రచయిత పులికంటి.

ంతీయ నేపథ్యం నుంచి వచ్చిన రచయితకు వైవిధ్యాన్ని ప్రదర్శించడం అంటే కత్తిమీద సాము. ఎంత ి నాలుగ్గోడల మధ్యనే సంచరించాల్సి వుంటుంది కాబట్టి ఎక్కడో వొకచోట ఆగిపోక తప్పదు. కాని అలా వ్యక్తిత్వం పులికంటిది. అనుభవవిస్తృతి, పరిశీలనానైశిత్యం, కాల్పనికశక్తి... ఈ మూడూ పులికంటి రచనలోని ుని భద్రిరాజు కృష్ణమూర్తిగారు అన్నమాటనే మళ్లీ ఇక్కడా మనం చెప్పుకోక తప్పదు. ప్రాంతీయత వల్ల ఈ లక్షణాలూ విస్తరించాలి కాని ముడుచుకుపోకూడదు. ఆ సాహిత్య సత్యాన్ని చెప్పడానికి పులికంటి కృషి ఓ

# మామకు మంచిగంధం పూత

సహవాసి శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారి సప్తతి మహోత్సవం వైభవోపేతం.

ుత గమనంలో ఒక్కో జయంతి స్వాగతిస్తూ ఉంటే, ట్ల నీటిమూటలోంచి ఒక్కోబొట్టూ జారిపోతున్నట్లే లెక్క. ంటే విలువైన డబ్బు లేదు.వయస్సు పెరుగుతున్న కొద్దీ, పెన్నిధి తరిగిపోతున్నట్లే! ముందు వెనుకల దూరాలు ఈ బొమ్మా - బొరుసూ! అయితే, లోకంలో అత్యధికులైన ులకు మాత్రమే వర్తించే మాట యిది. సామాన్యులు కాని వారిని ణాలు అడ్డగించవు. వారి ప్రతిఅడుగూ అమరత్వానికి తూ ఉంటుంది. వారి నడక ఆగిపోయిన తదనంతరం కూడా ు బతుకుతారు వాళ్ళు.

ప్టైఏళ్లు నిండాయంటే, అది సాధారణ విషయం. ఈ డెబ్బై సాధించిందేమిటీ అన్న ప్రశ్నకు సరైన సమాధానం ఉంటేనే ాధారణ విషయం అవుతుంది. డెబ్బై ఏళ్ళ జీవితం అనే విలో అడుగడుగునా కోరలు సాచి దారికాచే క్రూరమృగాలతో విషకంటకాలను ఛేదించుకుని, ఎగుడు దిగుళ్ళనీ, జారుడు , వరద వెల్లువల్నీ, చీకటి గుయ్యారాల్నీ అధిగమించి విజయ ో వెలికిరావడమనేది మాత్రం సాధారణ విషయంకాదు. దగిన సాహసమే అవుతుంది.

ిస్థితులు శాసించిన మార్గంలో నడిచివచ్చిన వాడు కాదు ి. పరిస్థితుల్ని శాసించి తనదారిని తానే మలుచుకొన్న వాడు. ి రాళ్లను పువ్వులుగా మార్చుకొన్నవాడు.

ఇరువురి సాన్నిహిత్యం నలభై మూడేళ్ళ నాటిది. నాకంటే ళ్ళు పెద్దవాడతను. మా పరిచయపు తొలినాళ్ళలో కృష్ణారెడ్డి క కాదు. స్థానికంగా గొప్ప పేరూ ప్రఖ్యాతీ సంపాదించుకొన్న ి నటుడు. ఆప్యాయంగా "బామ్మర్దీ" అంటుంటాడు నన్ను. ా" అంటుంటాను నేను. ఒంటినిండా తేనెలద్దుకుని తీపి కుంటాయి ఆ పిలుపులు.

ప్వులు మాత్రమే పంచుకుంటూ ఉండేవాళ్ళం మేము. ఒకరి ఒకరితో చెప్పుకునే వాళ్ళం కాము. అయినా ఒకరి కష్టాలు తెలియనివీ కావు.

ులు లేకుండా నెలనెలా ఎంతో కొంత జీతం చేతిలో పెట్టే ద్యోగం వదులుకున్నాడతను. ఎందుకు వదులుకున్నావని అధికార గర్వాంధుల ముందు చేతులు కట్టుకోవడం తనకు దంటాడు.

ి పొట్టగడిచేదెట్లా? అవసరాలు తీరేదెట్లా? భార్యాబిడ్డల్ని ోవడం కోసం ఎన్నో తిప్పలు. రకరకాల వృత్తి - వ్యాపకాలు. రికలేదు. మనస్సుకు కుదురులేదు. ఎప్పటికప్పుడు కొత్త కొత్తగా చుట్టుముట్టే సమస్యలు. వాటినుంచి బయట పడేందుకు మార్గాన్వేషణలు. జీవితంలో ఆర్తిని మించిన దైవం మరొకటి లేదు. కష్టాలలో మునిగితేలటాన్ని మించిన ధన్యత, దుఃఖాన్ని మించిన పవిత్రత మరిలేవు. 'అలాంటి వారు దేవునికి ప్రీతిపాత్రులు' అంటాడు ఏసు.

భవసాగరాన్ని ఈదడంలోనే తొలి దశకాలను ఖర్చుపెట్టేసిన కృష్ణారెడ్డిగారు రచయితగా రొమ్ములు విరుచుకొని నిలబడ గలగడం అద్భుతాలలో కెల్లా అద్భుతమే మరి! కాలక్రమంలో 'అడవి'నే జయించాడతను. కృషి ఫలితంగా జీవితాన్ని తనచెప్పు చేతల్లోకి తెచ్చుకో గలిగాడు. తనను చుట్టుముట్టిన జీవిత సమస్యల ముందు మరుగుజ్జులా బిక్కరిస్తూ నిలబడిన పులికంటి త్రివిక్రముడై పెచ్చు పెరిగి, ఆ సమస్యలనే మరుగుజ్జులుగా మార్చాడు. పద్మవ్యూహంలో అలనాడు అభిమన్యుడై చిక్కుకుపోయిన పులికంటి దానిని ఛేదించి, ఈనాడు తలపండిన భీష్మాచార్యుడయినాడు. దాదాపు తన కోరికలన్నీ తీర్చుకో గలిగాడు. తాను చెయ్యగలిగిన వెన్నో చేశాడు. డెబ్బై ఏళ పులికంటిని అభినందించకుండా ఉండలేము.

అందాలన్నీ అచ్చు గుద్దించుకొన్న సీతాకోకచిలుక రెక్కలార్చు కుంటూ సుందరోద్యానాలలోకి రావాలంటే, ఈ పరిణామ దశలన్నీ దాటిరాక తప్పదు.

పులికంటి రచనా వ్యాసంగంలోకి అడుగుపెట్టిందే ఆలస్యంగా అంతకు మునుపు అతనికి సాహిత్యంపట్ల ఆసక్తి ఉన్నట్లు కనిపించదు మంచి పుస్తకాలు చదువుకున్నాడని కూడా చెప్పలేము. ఈ దోహద క్రియలేవీ లేకపోయినా, అతడు ఈనాడు ఓ ప్రముఖ రచయితగా గణనకెక్క గలిగాడంటే, అందుకు కారణాలు అతని కృషి, పట్టుదలే అని చెప్పక తప్పదు.

జీవితంలోని ఆర్తి వీటికి తోడైంది. ప్రధాన సుగుణం అదే! ఈ ఆర్తి ఎక్కడి నుంచి వచ్చింది? తన ఎదురీతలోంచి వచ్చింది. అందుకే అంటారు, బాధలు కూడా వరాలేనని! రచయితకు కావలసింది ఈ వరాలే! పులికంటిలోని రచయితను అధినేత కటౌట్ లాగా దృఢంగా నిలబెట్టినది - అతని స్వీయ జీవితంలోని ఆటుపోట్లలో ఊగిసలాడి చెమ్మగిల్లిన ఆలోచనా నేత్రమేనని నిస్సందేహంగా చెప్పవచ్చు.

జీవితాన్ని జీవిత గవాక్షంలో నుంచి తప్ప, సాహిత్య గవాక్షంలో నుంచి చూడరు పులికంటి. సాహిత్య గవాక్షానికి అందమైన రంగుటద్దా లుంటాయి. జీవిత గవాక్షానికి అవి ఉండవు. అందులోంచి చూస్తే కనిపించేది వాస్తవ జీవితమే. జీవిత నగ్నత్వమే! పులికంటి చేతిలోనిది కలంకాదు. వీడియో కెమెరా! అంతటి వాస్తవికతను అతని చుట్టూ ఉన్న జీవితంలోను, అతని రచనలోనూ తప్ప మరెక్కడా చూడలేము. తాను చూడనివీ, విననివీ రాయడతను. అవసరమైతే తప్ప కల్పనలు కూడా చేయడు. తన స్వానుభవాల గురించో, స్ఫూర్తి నిచ్చే పరిచయాల

రాస్తాడు. తన ఇంట్లోని వాళ్ళు, తన ఊళ్ళోని వాళ్ళూ, లెక్కకు ంగా ఉన్న తన పరిచితులు, స్నేహితులు, బంధువులూ అతని రచనల్లో పాత్రలే. వారితో స్నేహానుబంధాలన్నీ అతనికి వులే. వాళ్ళందరూ నిజ జీవితంలో ఎలా మాట్లాడుతారో, అలాగే మాట్లాడుతారు, అలాగే ప్రవర్తిస్తారు. పులికంటి గా నటుడు కాబట్టి నాటకాన్ని రక్తి కట్టించడానికి అవసరమైన నాటకీయత అతని రచనల్లోకి చొచ్చుకు వస్తూ ఉంటాయి. ంనుషుల్నీ, సామాన్య జనజీవన శైలినీ, పలుకుబళ్ళనూ ఇంత ఖంగా అక్షరాలలో పెట్టిన ఇద్దరు ముగ్గురు నిపుణులలో ఒకరు.

తంత్ర జీవనం కోసం, స్వేచ్ఛాజీవనం కోసం ఉవ్విళ్ళూరి, ద్యోగానికి దూరమై, మనుగడ కోసం మల్లగుల్లాలు పడి, చివరికి ్యసంగం ద్వారానే కూడు, గుడ్డ, నీడ సమకూర్చుకో గలుగు లికంటి యోధాగ్రేసరుడే!

ష్ణారెడ్డిలో - నైతిక నిబద్ధుడైన నాకు నచ్చిన ఒక్క సుగుణం- , దళితులకు, ఆర్తులకు, అన్యాయ సర్పదష్టులకు కొమ్ము . ఆ వీరావేశం - సాహిత్యలోకం మెచ్చుకుని బిరుదులూ ఖలూ యిస్తుందని మాత్రంకాదు. స్వభావం లోంచి తళుక్కున త్తి వాదర అది. దీనుల దుఃఖాన్ని వర్ణించే సందర్భాలలో, లో రౌద్ర వీరభద్రుణ్ణి చూస్తాం మనం.

ంపేదలూ నిర్భాగ్యుల పక్షాన దూకి తొడచరిచే ఈ అంతరాత్మ తలలోనే కాదు; బాహ్య జీవితంలోనూ బయటికి ఉరుకుతూ ది. నడివీధిలో ఓ నిస్సహాయుడికి అన్యాయమో, అవమానమో ంటుంది... చుట్టూ నిలబడి చోద్యం చూసే వాళ్ళుంటారు... మకులే అని తమ దారిన తాము సాగిపోయే వాళ్ళూ ఉంటారు... కృష్ణారెడ్డి అలా ఊరుకోడు. పక్కన నాలాంటి వాడు - 'ఇది అన్యాయం కదా' అని చెవిలో ఊదే వాడొకడుంటే చాలు, కృష్ణారెడ్డి భండన భీముడైపోతాడు. గుంపులోకి చొచ్చుకుపోయి, నిస్సహాయుడి పక్షాన నిలిచి కంచుకంఠంతో కయ్యి మంటాడు. సామాన్య జనంలోనే కాదు, సగటు రచయితలో సైతం కనిపించని

అతణ్ణి ముందుకు నడిపించి విజయసోపానా లెక్కించినది ఈ పోరాట పటిమే! భూలోక యమకింకరుల్లాంటి ఆర్థిక సమస్యల్ని అధిగమించగలిగాడు పులికంటి. మూతికి అద్దుకున్న రంగు తుడుచుకుని సాహిత్యరంగం వైపు నడకలు సాగించాడు. నాటిక, పద్యం, వ్యాసం, గేయం, జానపదం, బుర్రకథ, నృత్య రూపకం, నవలిక, కథ, పత్రికా రచన - ఇట్లా అన్ని ప్రక్రియల్లోనూ కలాన్ని నడిపించాడు. పత్రికల చేత, పాఠకులచేత, ప్రముఖుల చేత 'సెహబాస్' అనిపించుకొన్నాడు. ప్రముఖ రచయితగా లేచి నిలబడ్డాడు. పులిగుండులా కంటికి నిండుగా కనిపిస్తున్నాడిప్పుడు.

ఈ సప్తతి మహోత్సవ సంరంభంలో ఈ 'పులిగుండు'కు వేస్తున్న అభినందన సుమహారం చంద్రునికో నూలుపోగు!

ముందు వెనుకల దూరాలు బతుకు నాణేనికి బొమ్మా - బొరుసూ! సామాన్యులు కానివారిని జరామరణాలు అడ్డగించవు. ఇందాకా నడిచివచ్చిన దూరం కంటే యింకా ఎక్కువ దూరమే ముందుకు నడవాలి పులికంటి. అతని వాంఛితాలన్నీ నెరవేరాలి. అతని వల్ల సమాజానికీ, సాటివారికీ ఇతోధికంగా మేలు జరగాలి.

మామకు మంచిగంధం పూతతో మనః పూర్వక నమస్కారం.

**-కలువకొలను సదానంద, పాకాల**

# అభినందన

## కళా ప్రపూర్ణ డా॥ దాశరథి

నా ప్రియమిత్రులు; కామధేను సంపాదకులు శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారిని సన్మానించడం సామాజిక స్పృహగల యువ సాహితీ జగత్తునే సన్మానించడం అవుతుంది.

"అమృత హృదయుడు కాని వాడు ఉత్తమకవి కాలేడు" అని ఒకసారి నేను ఒకానొక సభలోఅనగా "అమృత హృదయులంతా ఉత్తమ కవులవుతారా?" అని ఒక సుప్రసిద్ధ కవి ప్రశ్నించాడు. కాకపోవచ్చు కాని ఉత్తమ కవి అమృత హృదయుడై ఉండి తీరాలి. అలా కాని వాడు అతడు పేరు ప్రఖ్యాతులు కలవాడు కావచ్చును కాని ఉత్తమ కవి కాలేడు.

"యేనకేనాప్యుపాయేన
ప్రసిద్ధ పురుషోభవ"

అనే ఆర్యోక్తి ఉంది. ఆ రకంగా కొందరు ప్రసిద్ధులు కావచ్చు. కాని తియ్యని హృదయంతో మానవతా గుణభరితమైన రచన చేయగల వారే నాకు ఆత్మీయులు. అట్టి చాలా కొద్ది మందిలో మా పులికంటి కృష్ణారెడ్డిగారొకరు. తాను నమ్మిన దాని కోసం పోరాడే శూరుడు. ఎంతటి వారికైనా జడియనివాడు. ఆయన కవితలో నాకు స్పష్టంగా కనిపించేది మానవాభ్యుదయకాంక్ష. ఆయన రచనలో అయోమయత్వం లేదు. పులుముడు లేదు. సూటిగా వెళ్ళే కవి మా పులికంటి నిజంగా పులివంటివాడే. పులి తనకు అపకారంచేసే వారిపైనే దాడి చేస్తుంది. మా పులికంటి సామాన్య మానవులకు అపకారం తలపెట్టిన వారిమీద దాడి చేస్తాడు.

# వయసును జయించిన ముసిలోడు !

శ్రీ డి. రామచంద్రరాజు

)నిషి లౌకిక లంపటాల్లో చిగులుకొని కొట్టుమిట్టాడుతున్నా ంయత్నిస్తే ఆకలిని జయించవచ్చు. నిద్రనుకూడా జయించ ఈ కుళ్లిపోయిన వ్యవస్థలో దౌర్జన్యాలకు పట్టంగట్టి డుబ్లు ప్లు పంచిపెట్టి ఎన్నికల్లో అధికారాన్ని జయించవచ్చు. సాక్ష్యాలకు ఉప్పుతినబెట్టి నిజం గొంతు నొక్కేసి కోర్టుల్లో గెలవచ్చు. మాటలకింత తేనెపూసి మమతానురాగాల ల్లో ఎదుటి మనిషి మనసును అవలీలగా జయించవచ్చు. ానికి ఎదిగిన మనిషి అనుకోవాలేకానీ ఈ లోకంలో తాను లేనిది ఏదీ ఉండదు ఒక్క చావు, వయస్సు తప్ప!

ుణా రహితుడైన కాలపురుషుడు మనకు తెలియకనే మన )ను కొంచెం కొంచెంగా నంజేస్తుంటే ఎంతో అందమైన .. అవయవ సౌష్ఠవం దినదినానికీ సడలివడలిపోతూ ఉంటే ఆనందం!

ె అవుననా్న కాదన్నా లోకసహజం!

సహజత్వాన్ని అసహజం చెయ్యడం అలవికానిపని. అయితే నే ఒక ఛాలెంజీగా తీసుకొన్న పులికంటి వయసు మీదకూడా ెంజీ విసిరాడు. పులికంటి డెబ్భైయవ సంవత్సరంలో పాదం ుకాదు - కొన్ని నెలల్లోనే సప్తతి పూర్తిచేసుకోపోతున్నాడంటే ్మలేనినిజం!

టి కథారచయితగా ఇది నేనెరిగిన సత్యం.

రాయలసీమ చిన్నోడు తిన్నప్పుడు ఏమి తిన్నాడో? లేనప్పుడు ొని బ్రతికాడో కానీ నడకలో అరేబియావాడి గుర్రమే!.... ో పదహారేండ్ల రెపరెపలాడే కుర్రతనమే!

తని వెంటపడి నడుస్తూ ఉంటే ఒకరిని 'అన్నా' అంటూ ంగా పలకరిస్తాడు. ఇంకొకడిని 'తమ్ముడూ!' అంటూ భుజం తట్టాడు. వేరొకరిని 'ఏరా?' అని నిర్లక్ష్యంగా స్తాడు... వయస్సులతో నిమిత్తమే లేకుండా!

తడు ఎవరిని ఎలా సంబోధించినా ఈ మధ్య నేను మాత్రం 'డా!' అనే అంటున్నాను. ఆమాట అంటే లోకం వొప్పుకోదు. వాడనేదానికి నానోరు పెగల్దు. నా ద్వైదీభావాన్ని పులికంటి ినట్లుంది. ఒక దినం ఒకరికొకరు ఎదురెదురుగా ్గం. 'ఆ! చెప్పు ముసిలోడా!' అన్నాను నేను.

్నీ రక రకాల అనుభవాల సువాసనలు ఎగపేల్చి పీల్చి గుండు క్కు.... కష్టాల కన్నీళ్ల జడివానలో తడిసి తడిసి నాని ఎండి ుడీలేనట్లున్న జుట్టు... ఏడు దశాబ్దాలు ఏకబిగిని ఎన్నో ుభవాల చేతులకు జీవితప్రయాణాన్ని అర్పించినా అలుపు ఆకారం నావూటతో పెదాలపై చిరునవ్వుల పూలు ్గ.... సవాలుచూపులు నాపై రువ్వుతూ-

రే అబ్బోడా! నువ్వూ కుర్చీలో కూర్చున్నావ్, నేనూ ్నిను. ఒక్క గంటసేపు అటు ఇటూ కదలకుండా ు. ఎవడు కదిలితేవాడే ముసిలోడు!" అన్నాడు గంభీరంగా!

ఒకే ఒక్క పదినిముషాల్లో అటునుండి ఇటు ఇటునుండి అటు రెండుసార్లు కదిలిన నన్నుచూసి పకపకనవ్వుతూ "చెప్పురాజూ చెప్పు ఎవ్వరు ముసిలోడో?" అంటూ నిలదీశాడు పులికంటి - కాదు కుర్చీలో కుదేసిన నల్లతుమ్మ దిమ్మ!

బ్రదుకు బాధ్యతల విస్మరించి బంగారంలాంటి ఉద్యోగాన్ని వదులుకొన్నా కష్టాల సుడిగుండంలో తనకు తానే దూకినా ఈ పట్టుదలే పులికంటిని గట్టెక్కించిందేమో?!

అయినా వయసుకు మనసుకు సంబంధమే లేదంటున్నారు గదా సైకాలజిస్టులు! - గతాన్ని తలచుకొని వగచేవాళ్లంతా ముసలి కాళ్లేనని, భవిష్యత్తు వైపు ఆశగా ఎగచూస్తూ బ్రదికే వాళ్లంతా యువకు లేనని ఎవరుచెప్పింది? - సర్వేపల్లి రాధాకృష్ణన్ కదా? - అవును. అక్షర సత్యమైనమాటే. అందుకే పులికంటిని 'ముసిలోడు' అనాలని మనసు మునాస పడ్తున్నా అనలేకపోతున్నా! అయినా అంటూనే ఉన్నా!

నా తిరుపతి ప్రయాణం ఎప్పుడూ ఏడుకొండలవాడి దర్శనంతో లేదా పులికంటిని కలవడంతో ముడిపడి ఉంటుంది. అలాంటి ఒకానొక సందర్భంలో పులికంటిని కలవడానికి బయలుదేరాను. తిరుపతి ఎండలు మాడు మాడుస్తున్నాయి. 'ఈ ముసిలోడు అంతో ఇంతో తిని నిమ్మళిగా పడకేసి ఉంటాడు. ఈ వేళప్పుడు వెళ్ళి నిద్రాభంగం చెయ్యడం సముచితమా?' అన్న సందేహం పట్టి వెనక్కులాగుతుంటే ఎప్పుడూ నవ్వుతూ నవ్వించే ఆ మనిషితో సత్కాలక్షేపం చేయాలన్న కోరిక ముందుకు లాగుతుంటే - నాకు తెలియకనే నేను పులికంటి ఇంట్లో అడుగుపెట్టాను. మిద్దెపైకి ఎక్కాను. నా కండ్లను నేనే నమ్మలేకపోయాను.

ఆ వేళప్పుడు కూడా ఎప్పుడూ రాకపోకల రంపు రగలబడి పోతుండే బండ్లవీధిలో మిద్దెపైన కూర్చొని వంచిన తలెత్తకుండా ఏదో రాస్తున్నాడు.

"ఒరే ముసిలోడా! ఎట్టొచ్చిందిరా నీకింత ఓపిక?" అని అనేశాను. అంటే - ఆప్యాతలు అందలమెక్కిన బతుకుల్లో సంబోధనకు 'వచనం' ప్రసక్తి వైతొలిగిపోతుందేమో?

అలుపు ఎరగని కృషితో ఇలా తనకు తానే పోటీగా రాయబట్టే గదా దాదాపు రెండువందల కథలు తెలుగు కథా సాహిత్యంలో చోటు దక్కించుకొన్నాయి. ఒకే ఒక్క రచయిత ఒకే ఒక్క దశాబ్దకాలంలో పద్నాలుగు కథలకు ప్రథమ బహుమతులు అందుకోవడమంటే మాటలా?

తనకు ప్రాపంచిక దృక్పథం లేదని విమర్శకులు విమర్శించినా... ఆకారణంగానే కథా సాహిత్యంలో తాను ఎదగాల్సిన ఎత్తుకు ఎదగ లేదని అభిప్రాయపడినా - 'మనిషిని మనిషిగా ప్రేమించడమే నా మతం' అంటూ నలుగురు తిరుగాడే నాలుగ్గాళ్ళ మండపం వద్ద తొడదట్టి మరీ నిలబడుతున్నాడు. పాత్తూరి వారన్నట్లు ఆయన రాయలసీమ రాః

ాణం సుబ్రమణ్యశర్మగారు అన్నట్లు పులికంటి మీద ఎవరి
ముా పడలేదు. కథన పద్ధతిలో తనదైన శైలిని కష్టపడి
కొన్నాడు. అందుకే పులికంటి కథలంటే చాలమందికి లాగే
ష్టం!

ండ్లు దీగూళ్లు. ఆ దీగూడు కండ్లల్లో కొడిగడుతున్న దీపాల్లా
''

క్క ఊపులో తడిబట్టల బుట్టని చంకనేసుకొని వరాలు
గా విసిరిన చూపులు సమాధానం దొరకని ఎన్నో ప్రశ్నలై
ే రమణ మనసు తడిసిందో లేదోకానీ మనిషిమాత్రం ముద్దగా
ుక పోయాడు.''

ంటింటి కొక్క ముత్తైదు. ముత్తైదు చేతికొక్క కుంభం
ం. పళ్లెం పళ్లానికొకదీపం. అమావాస్య ముందుముందు రోజు
చీలుస్తూ చిరుదివ్వెలు... ఆ దివ్వెల వెలుగులకే వెలుగు
మాయంగా వెలిగే కొన్నికండ్లు.... పోటీలు పడ్తూ కోటేరేసి
కొన్ని ముక్కులు.... నునుసిగ్గు దొంతరల చెక్కిళ్లు... అల్లంత
నిలబడి గమనిస్తుంటే చీకటి లాంటి నీళ్లపై తేలిపోతున్న
లుగుతున్న దివ్వెలు...''

విస్తరి ముందు మేఘవర్ణంకాదు. అస్థిపంజరం ముందు
ర్థించిన విస్తరి''.

తో పరిశీలనాశక్తి ఆలోచనా పటిమ ఉంటే తప్ప ఈ దృశ్యాలు
కి ఒదిగి వాక్యాలై మనిషిని అవాక్కుచేయలేవు.

గారిన బతుకుల్లోని దైన్యాన్ని హైన్యాన్ని ఈ ముసిలోడు
ట్టిన తీరు ఎంతగొప్పగా ఉందో ఆలోచించండి.

కటి బతుకుల్లో రోకటిపోట్ల గాయాలమాదిర ఆ రోడ్డంతా
గుంతలుగా... రెండు మూడు దినాలుగాముసిరిన
లో ఆ గుంటల్లో నిల్చిన నీళ్లు చీకటి బ్రదుకులు కార్చిన
... ఆకన్నీళ్లను నిర్దాక్షిణ్యంగా వెదజల్లుతున్న కలిగినవాళ్ల
ర్యాటర్లూ ఆబాటమీదుగా...''

మాటలు ప్రాపంచిక దృక్పథంలేని మనిషి అనగలడా? -

తండ్రి పాత రిక్షా తొక్కితొక్కి కాన్వెంటు పిల్లలకు కేరియర్లు
ే కొడుకును చదివించాడు. ఈ చదువుతో కొడుకు పెద్ద
అయ్యాడు. ఉద్యోగం చేసే అమ్మాయినే పెండ్లాడాడు. ఆ
ండ్రిని తనవద్దకు రమ్మని పిలిచాడు. ఆ పిలుపు తాను
ప్ప కష్టాన్నుండి విడిపించిన పలుపైతే - భవిష్యత్తును
కల్లో ఊహించు కుంటూ ఉన్న ఊరికీ చేస్తున్న పనికీ
కొడుకు వద్దకు వెళ్లాడు. వెళ్తే ఏమయింది? - మనవడిని
స్కూలుకు తీసుకొని పొమ్మన్నాడు కొడుకు కొత్తరిక్షాలో!-

త్తరిక్షా' కథ గతాన్ని అటక కెక్కించిన చాలమంది
కు కనువిప్పు!

సర్టిఫికెట్, మండుతున్న మా ఊరు, బంగారు సంకెళ్లు,
ట్లు, మేడిన్ఇండియా, కోటిగాడు స్వతంత్రుడు, ముత్తడు
గుడిసె గుండెల్లో - చెప్పాలంటే ఒక్కొక్క కథ ఒక్కొక్క
వుతుంది.

'పిచ్చిమనుషులు' ఒక అద్భుతమైన కథ. నిజంగా మనసుపెట్టి చదివిన వాళ్లకు పిచ్చెక్కుతుంది. అందుకే హిందీలోకి అనువాదమై 'Hundred great short stories of India'లో చోటుచేసుకొనింది.

ఈ ముసిలోడి ఏ కథ చదివినా ఒక లక్ష్యం ఖచ్చితంగా దర్శనమిస్తుంది. సమాజంలోని అట్టడుగు వ్యక్తుల ఆర్తి, ఆవేదన, అభద్రత, అశాంతి బహుముఖాలుగా విస్తరించివున్న సమాజ వికృత స్వరూపాలు వాటి స్వభావాలు మనల్ని వెంటాడుతాయి. ఒక్కొక్కచోట వెగటుగా తోస్తాయి. అది ముసిలోడి లోపం మాత్రం కాదు. ఈ నికృష్ట దౌష్ట్య సంఘ పరిస్థితి అంతే!

ఈ కథలనిండా ఈ ముసిలోడి గుండెచప్పుళ్లు ఖచ్చితంగా వినవచ్చు.

ఇంకొక చిత్రమేమంటే తానేమీ చదువుకో లేదంటాడు. ఇంగ్లీషులో అతని రాత మాట ఆశ్చర్యం కలిగిస్తుంది. ఏమీ ఎరగని అమాయకుడులానే కన్పిస్తాడు. అతనితో ఉన్నంతసేపూ కడుపుబ్బ నవ్వుకోవాల్సిందే! - అదేమంటే రాజూ! 'ఆ నవ్వే ఆరోగ్యానికి దివ్యౌషధం' అంటాడు.

నాకు తెలిసి ఈ ముసిలోడి కథ ఇంకా చాలా చాలా ఉంది. కథతో పోటీపడినట్టుగా కవిత్వం రాస్తాడు. రాష్ట్రంలో ఉద్దండులైన కవుల సరసన కవి సమ్మేళనాల్లో కూర్చుంటే ముసిలోడికి దుప్పట్లకు చప్పట్లకు కొదవే ఉండదు. టీవీలో చూస్తూ చప్పట్లు తట్టేవాళ్లలో భవదీయుడూ ఉన్నాడు.

కవిత్వమేనా? అంటే - పాట రాస్తాడు. పద్యం రాస్తాడు. నాటికలు రాస్తాడు. నటిస్తాడు. బుర్రకథ రాస్తాడు. కాలికి గజ్జె కట్టి గానంచేస్తాడు. ఇన్ని విద్యలూ ఎలా సాధ్యపడిందంటే? - ''సారవంతమైన నేలలో అన్ని పంటలూ పండాలి రాజూ!'' అంటాడు.

ఇవన్నీ ఒక ఎత్తయితే ముసిలోడి నోట 'అమ్మిపదాలు' వినడం ఒక మధురానుభూతి. అనకూడదు కానీ మదువు సేవిస్తూ గుండెల్లో గూడుకట్టుకొన్న అమ్మిని ఆమె అందచందాలను ఆవిష్కరిస్తూ ఉంటే నిజం చెప్పొద్దూ? సాగిలపడి - ముసిలోడి కాళ్లకు మొక్కాలనిపించేది. అతిశయోక్తి అనుకొంటారేమో? - కాదు. ముమ్మాటికీ కాదు. చూడండి.

''సక్కనైన సుక్కల్ని
సుక్కల్లో చెందురుణ్ణి
సుద్దంగా తుడ్సిపారేసే
పొడసకచ్చే పొద్దేమో
సుక్కల్లో నిన్నుచూసి
సందమావా నువ్వని తల్సి
సిగ్గుతోడచస్తుండాడు
సూడవేసూడమ్మీ!'' - ఇంటి వాకిట్లో వంగి ముగ్గేసు కొంటున్న అమ్మిని బొమ్మ కట్టించాడు. ఎంత నిగూఢమైన భావచిత్రం. అలతి అలతి పదాలతో ఆవిష్కరించిన తీరు అనితరసాధ్యం.

ఆనాడు ఒకనాడు ఆ చెట్టునీడా
చెదురు మదురుగ ఎండసెండికొడుతుండ
నా ఎదురుగా నువ్వు నీ ఎదురుగా నేను
నాపాట యినుకుంట నువ్వునవ్విన నవ్వు

్యాగాదది సూడ అమ్మీ!
రాకు చాటులో మలిమొగ్గ
'రిసె నసుకొంటినమ్మీ? -

ప్మ నవ్వును మారాకు చాటులో మలిమొగ్గ వొళ్లువిరుపుతో
వొళ్లుగగుర్పొడుస్తూ ఉందికదూ? -

ర్మారి గుడిమింద అలసంద పూత
త ఇడిగి నట్టె నాగుండె ఇడిగింది!

యుడి నుండి ఉత్తరం అందుకొన్న ప్రియురాలి గుండె
'! అలసందపూవుకు కావ్యగౌరవం కలిగించడం ఒక్క పులి
సెల్లింది.

సభవాల అనుభూతుల్లో తడుస్తూ తడుస్తూ చెట్టనకపుట్టనక
కాననక యాళపాళాలేక యాడేడో తిరిగిన జంటకు ఎడబాటు
డు గుండెలోతుల్లో భావం భాషకు వొదిగితే -

ట్ల మర్సిపొయ్యేదమ్మీ
ర్సి ఎట్లబతికేదమ్మీ! -

అనడం అక్షరక్షంలో మనకు ఆత్రేయ కనిపిస్తాడు. ఈపాట
'డి నోటినుండి వినకపోతే ఇది ఆత్రేయగాక ఇంకెవ్వరూ
రని వాదించేవాడిని!

లా ఎన్ననిచెప్పను? - నండూరి వారి ఎంకి ముప్పై మూడు
కు పరిమితమైతే పులికంటి వారి అమ్మీ మరొక పది
మేసినట్లుగా నలభైమూడు పాటలకు ఎగబడింది.

ప్పుడైనా ప్రయాణంతటస్థిస్తే ప్రయత్నించి కిటికీ ప్రక్కన సీటు
సావకాశంగా కూర్చొని వేగంతో పోటీపడలేని నా అనుభవాల
పొగవలయాలు ఆకాశంలో మబ్బుల్ని చూసి సిగ్గుపడుతుంటే
పొలాల్లో ఆ పొలాలకు స్వేదజలాభిషేకం చేస్తున్న గ్రామిక
అమ్మీ కనిపిస్తుందేమో అని ఆశలను కంటిచూపులకు
మకొని వెదికేవాడిని - ముసిలోడి గొంతులో పాటలపూలు
డెవాకిట రాలుతూ ఉంటే! -

' పిచ్చిగానీ -

ఎక్కడైనా ఎండపొద్దనా
డకోసం నిలబడి నువ్వూ
డజాడ నిలిపిపోతే
డలోనే మేడగట్టీ
డలోనే కలవరిస్తుంటా!''

నిజంగా 'నీడజాడచాలు' ననుకొన్న ప్రియుడి ముందు నేను వామనుడినైపోతాను. సిగ్గుతో తలవాలిపోతుంది. అయినా ఒక అదృశ్య హస్తం నా భుజం తడుతుంది. చేతిలో చేయి కలుపుతుంది. కట్టెను ఆ రైలుపెట్టెకో బస్సుకో పరిమితంచేసి నా మనస్సును చేయి పట్టి నడిపించుకొంటూ మళ్లీ ఆముసిలోడి ముందరే కూర్చోబెడుతుంది.

ముసిలోడు ఊరికే ఉంటాడా? అమ్మీ తలపోతలతో తడిసి ముద్దవుతూ ఉంటాడు - పెదాలను మదువు తడిచేస్తూంటే,

ఆ మధుర సన్నివేశంలో భాగస్వామిగా అమ్మీ అందాన్ని ఇతర కవుల కల్పనలతో పోల్చినంజుకొంటూ ముసిలోడి ఆనందావేశాలను పుంజుకొన్న గుండె కన్నుల్లో కరిగి కన్నీటిభాష్పాలను విరజిమ్ముతుంటే ముసిలోడు కన్నీళ్లు తుడుచుకోవడం నేను ఎన్నోసార్లు గమనించాను.

ఈ కన్నీళ్ల వెనుక ఎన్నిపూలగుండెల సొదలున్నాయో? ఎంత మంది ప్రేమికుల మూగవేదనల నినాదాలు నిక్షిప్తమయ్యాయో? వివరణలకు అందని వర్ణనలకు లొంగని ఎన్ని ఊసులరాసులు ఊసిపోయాయో? -

అందుకే అమ్మీపాటలంటే నేను చెవికోసుకొంటాను. ఆ పాటల్లోని తీయదనం వలపువెచ్చదనం ప్రేమ తత్త్వం ముసిలోడి విద్వత్తుగాక మరొకటి కాదు! -

చివరగా ఒక్కమాట! -

నిన్నగాక మొన్న థీమాస్ డీలక్స్ కాన్ఫరెన్స్‌హాల్లో పులికంటి సాహితీ సత్కృతి బహుమతి ప్రదానోత్సవసభలో పాల్గొన్న తరువాత రాసిన వ్యాసమిది. ఆ సభలో డా. నాగభైరవ, శ్రీవోలేటి పార్వతీశం, ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు, డా. మన్నవ ఇలా ఎంతోమంది పులికంటిని గురించి మాట్లాడారు. అయితే నాకు నచ్చిన ఒకే ఒక్కమాట "మనకు వాలుచూపులున్నాయి... వక్రపు చూపులూ ఉన్నాయ్!... క్రిందిచూపులున్నాయి... పైచూపులున్నాయి... ప్రక్కచూపులున్నాయి... నేరు చూపులు లుండడం చాలా కష్టం. పులికంటి ఆ నేరు చూపుల్తోనే చాలమందికి దూరమవుతున్నారు!'' అని ఆచార్య సర్వోత్తమరావు అన్నారు. అక్షర లక్షలు చేసేమాట!

'నేరు చూపులున్న ఎవ్వరికీ మా ముసిలోడు దూరంకాడు' అన్నది నేను గ్రహించిన సత్యం. మనం గుర్తుంచుకోవాల్సిన సత్యం అనునిత్యం.

*ఉన్నతులైన వారు లోకం తీరును గ్రహిస్తారు. శక్త్యానుసారం కృషి చేస్తారు. విషయాలను తక్కువ కాలంలో గ్రహిస్తారు. స్తుత ప్రసంగాలు చెయ్యరు. దుర్లభమైన వస్తువులను కోరరు. పోయిన వాటి కోసం విచారించరు. ఆపదలలో ధైర్యాన్ని ఋకోరు. ప్రారంభించిన పనులను మధ్యలో ఆపరు. సోమరిగా కూర్చోరు. మనస్సును స్వాధీనంలో నిలిపి సంచరిస్తారు. డూ మంచిపనులే చేస్తారు. కృతజ్ఞతతో మెలుగుతారు.*

*గంభీరమైన గంగాసాదృశ్య హృదయంతో వుంటారు. వస్తువుల యదార్థ స్వరూపం వారికి తెలుస్తుంది. ఏ కార్యాన్నయినా చడానికి ఉత్తమ సాధనాలను కలిగివుంటారు.*

*-విదురుడు*

# సాహితీ సంపుటి పులికంటి

## డాక్టర్ విశ్వనాథ అరుణాచలం

ి - సంప్రదాయ మార్గంలోనూ, ఆధునిక మార్గంలోనూ వితా సృష్టి చేసేవ్యక్తి, విమర్శకుడు, పత్రికాసంపాదకుడు, యుత, జాను తెనుగులో జానపదగేయాలు వ్రాసే గేయకవి, , సమాజంలోని అవినీతిని వక్రోక్తులతో విమర్శించే సంఘ ప్రియుడు, నటుడు, నాట్యావధానంకూడా చేయగలిగిన శించిన పది నిముషాల్లో ఆకాశవాణి ప్రసారాలకు ప్రచార న్ని తయారుచేసే కూర్పరి, స్వయంగా పాల్గొనే నేర్పరి, వ్యగానం చేయగల మధురహృదయుడు, అవసరమైనప్పుడు ాలను తలపింపచేసేటట్లు మాట్లాడగలవాడు, ఆర్ద్రతను ధురాతిమధురంగానూ ముచ్చటించ గలవాడూ - వాగ్మి, లను చిరునగవుతో ఆహ్వానించే గుండెదిటవు మానిసి, కాలం ప్పుడు, ఎన్నో ఊహలు ఎదలో కొట్టుమిట్టాడు తున్నప్పుడు, ధరించి 'క్రమశిక్షణ'కు తలవొగ్గి ఒక ప్రభుత్వోద్యోగం ంతకాలం నిర్వహించిన కళాజీవి, ఐహిక వ్యవహారాలను పుణ్యంతో, విసుక్కోక పర్యవేక్షించుకొనే పరమ లౌకికుడు వ్యక్తిత్వాలు, ఛాయలు, మేధావి భావాలు సంగమించి, ము సాహితీ సంపుటిగా రూపొందినది కృష్ణారెడ్డి వ్యక్తిత్వం.

దుకే సాహితీ సంపుటి పులికంటి అన్నాను.

ష్ణారెడ్డి నాకు సాహిత్యం తరపున చుట్టం. మేమిద్దరము దాదాపు దశాబ్దాల కాలంగా స్నేహితులము. మొట్టమొదట నాకూ, ి కృష్ణారెడ్డికి పరిచయం కల్గించిన మిత్రుడు, చిత్తూరు ఒక పరిషదున్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుగా ిశ్రాంత జీవనం గడుపుతున్న ఒకనాటి నా సహపాఠి శ్రీ కె. రమ్.

ప్పుడు కృష్ణారెడ్డి రైల్వేడిపార్టుమెంటులో ఎ.ఎస్.ఎం.గా ్తూ ఉండేవారు. ఊదారంగు ఉన్నికోటు వేసుకొని, ండి తిరిగివస్తూ ఒక్కొక్కరోజు నన్ను కలుసుకొనేందుకు . అలా కలుసుకొన్నప్పుడు ఇరువురం సాహిత్య విషయాలను కొనేవాళ్ళము. స్వీయరచనలను చదువుకొనేవాళ్ళము. విమర్శించుకొనేవాళ్ళము. నాకంటే ఎక్కువగా తానే ండేవాడు కాబట్టి తన రచనలే చర్చనీయాంశాలుగా మొట్టమొదట నేను విన్న కృష్ణారెడ్డి రచన - ఒక స్కెచ్. తన నబడే నిరాశలను, నిస్పృహలను తలచుకొంటూ, ఏకోశాన ంలేని మనస్థితిలో ఒక యువకుడు తిరుపతి రైలుపట్టాల నడుస్తూ ఉంటాడు. అతని మనస్సనే అవనికమీద ల, ఊహల చిత్రపటాలు పడుతూవుంటాయి. ఈ స్కెచ్‌ను స్వయంగా చదివినప్పుడు విన్నాను. రచనలోని శిల్పము, ి నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. వెంటనే 'కృష్ణారెడ్డి! ఈ రచనను ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికకు పంపుదా' మన్నాను. పంపిన కొద్దిరోజుల్లోనే అది ప్రచురితమైంది. మంచి రచనాఘట్టం ప్రారంభ మయింది. ఆ రోజులలో వ్రాసిన కథలను భారతికో, ఆంధ్రప్రభకో, ఆంధ్రపత్రికకో పంపేముందు, ఎంతో సౌహార్ద్రంతో రెక్కలు కట్టుకొనివచ్చి నాకు వినిపించేవారు శ్రీకృష్ణారెడ్డిగారు. కథను సాంతంగా వినిపించి దీనికి "మీరే నామకరణం చేయాలనే" వారు. కథాభాగంలో రచయితవాడిన ఏదో సార్థకమైన ఒక పదబంధాన్ని ఏరి, యిలా నామకరణంచేస్తే బావుంటుందనే వాణ్ణి. కాసేపు ఆలోచించి. నచ్చితేనే తలపంకించడం లేకుంటే కొద్ది మార్పులతో వేరేపేరు సృష్టించడం జరిగేది.

ఆంధ్రప్రాఠకలో కానికి అందకముందే రచయిత ముఖతః నేను ఎన్నో ఉత్తమశ్రేణికి చెందిన కథల్ని విన్నాను. అది ఒక అదృష్టఫలంగా నేను భావిస్తూఉంటాను. కృష్ణారెడ్డి చిత్తూరుజిల్లా రైతుజీవితాన్ని, గ్రామీణ వాతావరణాన్ని, పల్లీయుల పలుకుబళ్ళను, జీవిత సంఘర్షణలను మనస్సులకు హత్తుకొనేట్టుగా చిత్రించడంలో సిద్ధహస్తులు. పాత్ర చిత్రణలో, శబ్దచిత్రాలను రూపొందించటంలో, ఉపమానాలను సంధించటంలో, మలుపులు త్రిప్పటంలో కృష్ణారెడ్డి ఎవ్వరినీ అనుకరించడు. అనుకరణ కళ కాదనే విశిష్ట వ్యక్తిత్వం పులికంటిది!

మనం చదివిన సాహిత్యాంశం రసవంతమైనదో కాదో నిర్ణయించేం దుకు ఒక చిన్న పరీక్షచాలు! చదివినది లగాయతూ, చాలరోజుల వరకు అందలి పాత్రలు, వారి అనుభూతులు మన మనస్సీమల్లో సుస్థిరంగా నిలువవలె అప్పుడప్పుడు ఎద తలుపులు తట్టి ఆలోచన రేకెత్తించవలె. అప్పుడు చదివినది కథ కానివ్వండి.... గేయం కానివ్వండి.... నాటకం కానివ్వండి.... రసవత్సాహిత్యాంశంగా పరిణ మిస్తుందని నేను అనుకొంటాను. ఈ పరీక్షలో నెగ్గే కథలను, గేయాలను, పద్యాలను, సంపాదకీయాలను ఎన్నో వ్రాశారు కృష్ణారెడ్డి. వీరు రచించిన కథలన్నిటినీ నేను విన్నాను. చదివాను - ఆనందించినాను. ప్రత్యేకించి 'కర్త, కర్మ, క్రియ' అనేకథను గురించి రెండుమాటలు చెప్పవలె. ఈ కథ నాకు ఎంతో నచ్చింది. ఈ సంగతి కృష్ణారెడ్డితో ఎన్నోసార్లు చెప్పినాను. ఇతరభాషల్లోకి అనువదించి ప్రచురించ తగిన కథ ఇది.

భారతిలో ప్రచురితమైనది. ములుకుల్లాంటి పలుకులతో ఎదుటివారి ఎదలను కెలకడం మనం తరచూ చూస్తుఉంటాము. కానీ మౌనంతో ఎదుటివారి హృదయాల్లో మానని గాయాలను ఏర్పరచడం ఒక అసామాన్య ప్రక్రియ. ఈ చిత్రణ అత్యద్భుతంగా సాగింది 'కర్త, కర్మ, క్రియ'లో. ఇప్పుడు స్త్రీవాదమంటున్నారు కానీ ఈ వాదాల ప్రసక్తి రాకమునుపే పులికంటి అపూర్వమైన స్త్రీ జీవిత

ేశారు. కర్మ - కర్మ - క్రియలో మహడీ లక్ష్మమ్మ మాడీ
క్కగా మారినవైనం ఉదాత్తపాత్ర చిత్రణ!

ందోబద్ధమైన పద్యం ఈయన కలములో సొగసులు
చుకొనింది. పదవిని గురించి పలికినా పెదవిని గురించి
చెలిమిని గురించి చెప్పినా కలిమిని గురించి కలమెత్తినా
ేమన గుర్తుకొస్తాడు.

్రరాయి దెచ్చి నాజూకుగా చెక్కి
నిచ్చి చూడు గట్టితనము
లికి పలుక నున్న ఊరేగు లోకాన
అంటాడు పదవి కవితల్లో. అదే పెదవి మీద
వి తీపి మరిగి పెడ దారులందున
ిగి తిరిగి కడకు తిక్క కుదిరి
వి కాల్చుకొన్న పెద్దలెందరు భువి?
ంటూ చురకంటిస్తాడు.

ా ఎన్నో ఉదాహరణలు ఉటంకించవచ్చు. అందుకే ఈ
్యసంలో కృష్ణారెడ్డి కథాకథన నైపుణ్యాన్ని, పద్య రచనా
్రాన్ని, నటనా సామర్థ్యాన్ని, వాచాలత్వాన్ని, పత్రికా
ా కౌశలాన్ని సమగ్రంగా చర్చించడం కష్టం.

ఒక పక్షి వీక్షణంగా మాత్రమే పాఠకులు గ్రహించవలె.

ప్రదాయ కవిత్వాన్ని మెచ్చే వాళ్ళలో సంప్రదాయ కవిగా,
ులలో ఆధునికుడుగా విలసిల్లే కృష్ణారెడ్డి సవ్యసాచి. శ్రీమాన్
అనంతకృష్ణశర్మ, కీ. శే. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం,
ోలు సుబ్రహ్మణ్య శర్మ, కీ.శే. శంకరంబాడి సుందరాచారి,
వలెంకశంభుప్రసాద్, కీ.శే. రావూరి వెంకట సత్యనారాయణ,
డ్డి (విజయా), కీ.శే. తిరుమల రామచంద్ర, కీ.శే. శ్రీ జి.
ారావు (భారతి సహాయ సంపాదకుడు) ప్రభృతుల మెప్పులు
్రసిద్ధులు, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా. డి. జగన్నాథ
ాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ ప్రభృతులు
ంది, శ్రీ ఆచంట జానకిరామ్, శ్రీమధురాంతకం రాజారాం,
కొలను సదానంద, శ్రీ నూతలపాటి గంగాధరం, శ్రీ
ిరి ఇనాక్, శ్రీ వి.వి.ఎల్. నరసింహారావు వంటి ఆధునికుల
్ధవ సంపదను పొంది సాహిత్య వ్యవసాయం చేస్తూ ఉన్న
కి తిరుపతి పట్టణంలో సప్తతి సన్మానం జరగడం నాకు ఎంతో
న్ని కలిగిస్తూ ఉంది.

ులికంటి కృష్ణారెడ్డి ఒకానొకసందర్భంలో కీ.శే. శంకరంబాడి
చారిని గురించి చెబుతూ "ఆయన జీవితం కోసం కవిత్వం
కవిత్వంకోసం జీవించారు" అన్నారు. శ్రీ కృష్ణారెడ్డి "జీవితం
ిత్వం వ్రాస్తున్నారు కవిత్వం కోసం జీవిస్తున్నారు." అని
ంగా చెప్పవచ్చు.

ఆ్మని సృష్టించి, ఎంకి ప్రక్కన పీటవేసి, ఆమెను
ట్టారు కృష్ణారెడ్డి. కృష్ణారెడ్డిని సాహిత్య లోకం ఎలా
ఆదరిస్తుంది? అన్నది పెద్ద ప్రశ్న. "పులికంటి ఏమి వ్రాసి ఎన్ని చేసినా, కథకుడుగానే పదికాలాల పాటు మనగలడు" అని కొందరంటారు. ఇదే నిజమయితే ఆయన గేయరచనలు, కావ్యగానాలు, జానపద సాహిత్యశిల్పం, మాండలిక భాషారచనా విన్యాసం ఏమవుతాయి? ఆయన అనేక రంగాలలో సిద్ధహస్తుడయిన సాహిత్యకారుడుగా సమ్మాన్యుడైనాడు. ఆ విస్తృత కీర్తి మరింత ఇనుమడింప చేసుకొంటాడు.

పులికంటికి ఎన్నో సన్మానాలు జరిగినవి. ఆయన లెక్కలేనన్ని అవార్డులు అందుకున్నారు. పదవులు పొందారు. "అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యంగల్గు దేశమ్మునన్" అని చెళ్ళపిళ్ళగారు అన్నారు. "అటు శ్రీకాకుళం మొదలు ఇటు శ్రీకాళహస్తి వరకే కాదు. ఢిల్లీ నుండి, లక్షద్వీపాలవరకా? అంతేకాదు, అమెరికా వరకు" పులికంటి సాహిత్య విజయయాత్రలు అద్భుతంగా సాగాయి, సాగుతున్నాయి.

భగవంతుడు ఆయనకు చక్కని ఆరోగ్యాన్ని ప్రసాదించారు. ఉత్తరోత్తర మరింత మంచి సాహిత్యాన్ని సృష్టించి దేశ స్థాయిలో విఖ్యాతుడై వర్ధిల్లాలని నా ఆకాంక్ష.

అతిశయోక్తి అని కొందరు ఆక్షేపించినప్పటికీ మీర్జా గాలిబ్ పల్కిన పంక్తులను శ్రీ కృష్ణారెడ్డికి అన్వయించవచ్చునని నేను అనుకొంటాను.

*ఏను స్వయముగా కయిత వరించలేదు*
*తానె వరియించె కయితలరాణి నన్ను*

(దాశరథి అనువాదము)

ఈ మాట ఎందుకంటున్నానంటే - కృష్ణారెడ్డి పట్టుమని పదినిముషాలు ఒక గ్రంథాలయంలో గడిపినట్లు నాకు తెలియదు. పోనీ! పండితవంశమా? కాదు. చదువుకొన్న చదువా? - ఒక కళాశాలలో అడుగు పెట్టని పరిస్థితి. ఈ సందేహాలన్నీ సమకూర్చుకొని ప్రశ్నగా సంధిస్తే కృష్ణారెడ్డి నవ్వుతూ! "నువ్వు గూడా! అట్లడిగితే ఎట్టబ్బా? ఈ లోకమే ఒక గ్రెందాలయం. అందులో ఒక్కొక్క మణిసి ఒక్కొక్క పుస్తకం" అంటాడు.

కవితల రాణి తనకు తానుగా వరించిన కారణంగానే అంత ఆత్మస్థైర్యమని సమాధాన పడుతుంటాను.

మిత్ర రత్నము శ్రీ పులికంటి కృష్ణారెడ్డి ఇంకా మంచి మంచి కథలు వ్రాయవలె. రసవంతంగా కవితలల్లవలె. ఎన్నో సన్మానాలు అందుకోవలెనని ఆశించే వారిలో నేనూ ఒక్కణ్ణని చెప్పి ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

"అతని జీవితరథము హర్షాంకితమయి
విరులు పరచిన బాటలో నరుగవలెను -
ఆయురారోగ్య భోగభాగ్యములు నింపు
వేంకటేశ్వరు దీవెనల్ వెలయుగాత"

# డాక్టర్ పులికంటి ?

డా॥ బిక్కి కృష్ణ, M.A;M.Ed.,M.Phil;Ph.D;

ఒకరోజు ఉదయం ఏదో పనిమీద పులికంటి కృష్ణారెడ్డిగారికి ...ను. "డెబ్బై ఏళ్ళలో అడుగిడుతున్నాను. ఈ సందర్భంగా ... ఒక సావనీర్ తెస్తున్నారు. మీరు ఒక ఆర్టికల్ రాయాలి"

ఆయనకు డెబ్బై ఏళ్ళు నిండాయని నాకనిపించలేదు. ...టే పాతికేళ్ళ యువకుల్లోలేని చురుకుదనం, ఉత్సాహం, ...్వాసం,కరాల బిగువ, నరాల సత్తువ ఆయనలో ఉన్నాయి. దేహంలో విద్యుత్తు, మెదడులో విద్వత్తు తగ్గనేలేదు మరి. ...గురించి ఆర్టికల్ రాయాలి అంతేకదా! రాసి పంపుతా'

అయితే తర్వాత తెలిసింది అన్నంతసులభంగా ఆయన ఆర్టికల్ రాయడం అసంభవమని! అందుకే రాయకుండా ...మే శ్రేయస్కరమని ప్రయత్నం మానుకున్నాను. అయితే ...ండా మళ్ళీ తిరుపతిలో పులికంటి కృష్ణారెడ్డిగారిని కలవడం 'నాగురించి ఆర్టికల్ రాశారా?' అన్నారు. 'మీనాలుగ్గాళ్ళ ... మీద రాయాలని ఉన్నాను. కానీ దానిమీద చాలామంది ...టారు. మీ అమ్మిపదాలు ఇవ్వండి రాస్తాను' అన్నాను (ఇవన్నీ ...కోడానికే అని వేరే చెప్పనక్కరలేదు) మళ్ళీ దేనిమీద ...ని ఆయన్నే అడిగాను. 'నాతో మీ అనుభవాలు చాలవా?' మళ్ళీ... రాయలేకపోయాను. అనేక అంశాలపై పుంఖాను ...గా... వందలాది ఆర్టికల్స్ రాసిన ఈ జర్నలిస్ట్... కవి... కథ ...... పులికంటి కృష్ణారెడ్డిని గురించి రాయాలంటే కలం ...కు కదలటం లేదేమిటి? ఆయన గురించి రాయడానికి ఏమీ ...క రాత కందని వ్యక్తిత్వమా ఆయనది? ఏమోమరి? ఆయన రాయాలంటే ఎంత సాహిత్యం లేదు. 1961 లో రాసిన ...ం గువ్వలనుండి ఇటీవల విడుదల చేసిన దళిత కథలవరకు ...న్ని గురించైనా రాయవచ్చు. నటుడుగా, రచయితగా, ...గా, వక్తగా, ప్రయోక్తగా జానపదగాయకుడుగా, కవిగా ఉ(శ్రోతలూగించే మోడరేటర్‌గా, ఇలా ఎన్నో అవతారాలెత్తిన ...ి కృష్ణారెడ్డిగారిని ఏ దృక్కోణంలో చూసి ఓ వ్యాసం ...డదు? అన్నింటినీ మేళవించి, 'బహుముఖ ప్రజ్ఞాశాలి' ...ి అంటూ ఆకాశానికెత్తి పొగిడేయకూడదా! ఆ పని నిముషాల్లో చేయవచ్చు. కాని బహుముఖ ప్రజ్ఞాశాలి ...ి కృష్ణారెడ్డిగారు! అని రాస్తే అంతకంటే అపద్ధం ...ంటుందా? ఆయన నిజంగా బహుముఖ ప్రజ్ఞావంతుడే ...టే రాయలసీమలో రచయితగా మారేవారా? ఒకవేళ ...పోషంతో రైటర్‌గా మారినా బంగారంలాంటి ఉద్యోగాన్ని ...ని రచనలకోసం జీవించేవారా? ఒకవేళ రచయితగా ...్పుగా ఓ వెలుగు వెలిగినా కాకాలు పట్టడం, బాకాలు పదవులు కొట్టేయడం చేయలేదు. చిత్తూరు నుండి చికాగో ...న్న పలుకుబడిని పెట్టుబడిగా మార్చుకొని చేతినిండా ...చుకోవడం నేర్చుకోలేదే! ఇవేవీ చేయని, పులికంటిగారిని ...ఖ ప్రజ్ఞాశాలి అని ఎలా అనగలం? గొప్పకోసమో! ఆయనమెప్పుకోసమో! పులికంటిని ఎదురుగా పొగిడి మరుగున తెగడేవాళ్ళు చాలామందే ఉన్నారు. పులికంటి సృష్టించిన గొప్పపాత్రలను కాకుండా ఆయన సీసాల గురించి ప్రస్తావించేవాళ్ళు.... ఆయన రాసిన అద్భుతమైన కథల గురించిగాక ఆయన కథానాయికుల గురించి చాటుమాటుగా చర్చించుకునే మేథావులు (వాళ్ళ తప్పులు వాళ్ళకు తెలియని వాళ్ళను) చాలామందినే చూశాను. అయితే ఇవేవీ ఆయన దాచుకోలేదే! అసలు దాపరికమన్నదే రెడ్డిగారి జీవితంలో లేదు. ఏదైనా కుండబద్దలు కొట్టినట్టు చెప్పడమే ఆయన నైజం. నిజాయితీగా తప్పును ఒప్పుకునే వ్యక్తిత్వం ఆయనది... ఆయన మాటల్లోనే చెప్పాలంటే "ప్రతిమణిసి ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక తప్పు చేస్తాడు. తెలిసి చేసినా, తెలియక చేసినా అది తప్పు తప్పే! ఉత్తముడుగా ఉండేవాడు చేసిన తప్పును ఏ జంకూ, కొంకు లేకుండా వొప్పు కుంటాడు... అటుమంటి ఒక ఉత్తముల్లో ఉత్తముణ్ణి నేను..." (సీమ చిన్నోడి గ్యాపకాలు-ఆంధ్రభూమి 22-3-2000) అంటారు. ఆంధ్రభూమిలో సీమ చిన్నోడి గ్యాపకాలలో పులికంటి కృష్ణారెడ్డిగారి వ్యక్తిత్వం స్పష్టంగా మనకు కనిపిస్తుంది. ఆయన రాసిన కథలు, నవలలు, అమ్మిపాటలు, ఒక ఎత్తు. సీమ చిన్నోడి గ్యాపకాలు ఒక ఎత్తు. స్వీయానుభవాలను దాపరికం లేకుండా రాయలసీమ జానపదుల మాండలికంలో చెప్పడంవల్ల సీమచిన్నోడి అద్భుతమైన గ్యాపకాలను చదవడానికి వారం వారం రాయలసీమవాసులు ఆంధ్రభూమి పత్రిక కోసం ఎదురు చూశారు. రెడ్డిగారు తన గ్యాపకాల్లో ఎన్నో అంశాలను స్పృశించారు. ప్రతి అంశాన్ని విశ్లేషిస్తూ విమర్శిస్తూ సూటిగా, ఘాటుగా తనదైన వ్యంగ్య హాస్య ధోరణిలో అధిక్షేపిస్తూ రచనలు కొనసాగించారు. ఉదాహరణలు కోకొల్లలు. "ఒకసారి అమెరికాకు పోతి. ఆడికి పోతే గూడా రామేశ్వరం పోయినా శనేశ్వరం వదల్లేదన్నెట్టు కమ్మోళ్ళంట!... కాపోళ్ళంట!... తానా (తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా) కమ్మోళ్ళది. అట (అమెరికా తెలుగు అసోసియేషన్) రెడ్లది. ఆకాశమంత ఎత్తెగిరి అమెరికాలో పాయ్ వాలినా మణిసిని ఈ పిచ్చి వదిలి పెట్లేదే! ఇంకా ఈ కులాల్ను పట్టుకొని కుమ్ములాడుకుంటా ఉండారే?" అంటూ కులగజ్జిగాళ్ళకు మహా చురక అంటించారు. మరోచోట పార్టీ మార్చిన రాజకీయ నాయకుని గురించి చెబుతూ "ఒరే! నీ పాసుగూల, నిన్న మొన్నటిదాకా ఒక పార్టీలో ఉండి టికెట్టు ఇయ్యనంత మాత్రాన పార్టీ మార్చేస్తే ఇదేంన్యాయం? ఏ పార్టీలో ఉంటే ఆ పార్టీసిద్ధాంతాలకు కట్టుబడి ఉండాల్సినపని ఉండాదా? లేదా?" అని (13-9-99, ఆంధ్రభూమి) నిలదీస్తారు. అందుకే కొందరు అటువంటి ఓటు వేస్తే ఏమి? వెయ్యకుండా పోతేఏమి? అంటారన్నాడు. వాస్తవానికి పులికంటి కృష్ణారెడ్డికి ఓటుపైన ప్రజాస్వామ్యంపైనా నమ్మకం లేదన్న విషయం ఆయన రాతలు బట్టి ఇట్టే తెలుసుకోవచ్చు. మాటలకు చేతలకు పొంతన లేని వ్యక్తులంటే కృష్ణారెడ్డికి గిట్టదు. సిద్ధాంతాలు వల్లించే కుహనామేధావుల స్వార్థాన్ని ఎండగడుతూ "ప్రాపంచిక దృక్పథం

ం ఎపుడు కనిపెట్నాడో ఏమో కానీ ఆమహన్నబావుడికి రొండు దణ్ణంపెట్టాల. ఎందుకంటే ఈమాటను అడ్డం పెట్టుకోని ంది పెద్దోళ్లు పెద్దపెద్దోళ్ళు అయిపోతా ఉండారు. మల్లా చేతలకాడికొస్తే మాటకు చేతకు సంబందమే కుదర్దు. ంద గురి గౌరవం ఉంటే గుడెసెల్ను అడ్డం పెట్టుకోని మిద్దెల్లో కులకలేరు..." అంటూ కృష్ణారెడ్డి వ్యక్తిత్వం లేనివారిని విమర్శిస్తారు. కృష్ణారెడ్డిలో ఒక గొప్పరచయిత ఉండటం ంలమ్మలాంటి స్త్రీలను ఆపదలో ఆదుకున్నారు. "కమలమ్మోళ్ళ ణ్ణెట్టుండి ఒకదినం కన్నుమూసె. ఆ కట్టెను కడతేర్సాల. చెప్తిని ంమెతల్లి బలిజ, ఆమె పుట్టిందొక బ్రామ్మడికి, మల్లాకట్టు ఒక బ్రామ్మణ్ణే! అయితే ఆకట్టెను కడతేర్చేదానికి ఇట్ట ళ రాలా! అట్టా బాపనోళ్ళు ముందుపళ్ళా! దీంట్లో కమలమ్మ ండాది?... మణిసిని గదా ఆ బాద్దెత నేనే ఎత్తినెత్తేసుకుంటి!" 2-99 ఆంధ్రభూమి) ఆపదలో ఎవరున్నా ఆదుకునే తత్త్వం ది. ఇలా ఆయన స్వీయానుభవాలను ఎన్నింటినో సీమచిన్నోడి లను సామాజికపరం చేసి సాహితీ గౌరవాన్ని సమకూర్చారు.

లికంటి గొప్పగాయకుడన్న విషయం అందరికీ తెలిసిందే! అమ్మిపాటలు పాడుతుంటే ఎంకిపాటలు వాటిముందు పోతాయి... సీమ చిన్నోడిగ్యాపకాలు (19-1-2000) లో సమ్మేళనంలో పాడిన పాట....

*బునిలూనిలువమ్మీ*
*సీ వొకమాటినవమ్మీ*
*నలోనా...మతిలోనా*
*దిలేటి...నాఅమ్మీ!*
*కమటీ రాజ్జాన...కలిసెర్ల గ్రామాన*
*ండంటా ఒకరెడ్డీ...గనుడంటా ఆరెడ్డీ!*
*సేటా ఆరెడ్డీ-...ఏడిగ్గా జరిపేనూ*
*ద్దులా పరసంటా...ఇద్దరమూపోదామా!*

ఆయన గళ భాస్వరలలితస్వరంలో అమ్మిపాట వెలువడితే చప్పట్లు మారుమ్రోగాల్సిందే! రెడ్డిగారు నేను... ఇతర మిత్రులు కలిసి నపుడల్లా... అమ్మి పాటల జడిలో తడుస్తూ మదుసేవలో మైమరచిన సందర్భాలెన్నో !

*రాయలసీమ చిన్నోణ్ణి*
*రాళ్ళమద్దె బతికేవాణ్ణి*
*రాగాలే ఎరగకపాయ్‌నా*
*అనురాగానికి అందేవాణ్ణి!*

అంటూ పులికంటి గళంలో పాట జలపాతంలా దూసుకొచ్చి నపుడల్లా ఇంత గొప్పపాటలు పుస్తకరూపంలో రాలేదేమిటని బాధపడిన వారిలో భవదీయుడూ ఉన్నాడు. పులికంటి స్పందన సమాజనిష్ఠం అనడానికి ఆయనరాసిన దళిత కథలే నిదర్శనం. దళిత కథలను దళితులే బాగా రాయగలరన్న సిద్ధాంతాన్ని ఆయన బద్దలు కొట్టి దళిత వాదం వెలుగు చూడని రోజుల్లోనే అద్భుతమైన దళితకథలు రాసి ఆంధ్రసాహితీ కేదారంలో అధిక దళితకుసుమాలను పూయించిన తోటమాలిగా నిలిచిపోయారు. తిరుపతిలో ఆయన స్వగృహానికి సమీపంలో ఉన్న చారిత్రక కట్టడమైన నాలుగ్గాళ్ళమండపాన్ని కేంద్రంగా చేసుకొని రాయలసీమ జీవనశైలిని ఆవిష్కరించిన క్రాంతదర్శి పులికంటి. ఎంతఎత్తుకెదిగినా... సామాన్యునివలె ప్రజల్లో కలిసిపోయే ప్రజాకవి ఆయన. నిగర్వి. సున్నిత మనస్తత్వం, అపారజీవితానుభవం, మానవప్రీతి, స్నేహశీలత వెరసి కృష్ణారెడ్డిగారి వ్యక్తిత్వం. "ఏమంచి పూవులన్ ప్రేమించినావో నినుగనే నీతల్లి కనకగర్భమున" అన్న రాయప్రోలు వాక్యం కృష్ణారెడ్డిగారికి అక్షరాలా వర్తిస్తుంది. కృష్ణారెడ్డి వల్ల రాయలసీమకు ఎంతో పేరు వచ్చింది. రాయలసీమలో పుట్టడం వల్ల కృష్ణారెడ్డి శ్రమకు తగిన ఫలితం లభించలేదు. అనామకులకు అయోగ్యులకు అనర్హులకు గౌరవ డాక్టరేట్లు ఇచ్చే యూనివర్సిటీలు పులికంటి కృష్ణారెడ్డిగారికి గౌరవ డాక్టరేటు ఇచ్చి ఆయన స్థాయిని దిగజార్చనందుకు ఆయా యూనివర్సిటీలకు కృతజ్ఞతలు తెలుపుకొంటూ...

**కంటి ఆదరాభిమానాలతో ముడేసుకొన్న ఈ కవి మనస్సు సప్తతి సందర్భంలో ఆనందంతో పురులు విప్పుకుంటే -**

ంపులి ఎవరంటే?
ికంటి అంటారు
మతో పులికథలు
ంరేసుకుంటారు
ికంటి కైతలకు
ికోసుకుంటారు!

ికంటి కంఠంలో
కేటి రాగంలో
ళించు జానపద
ాలు..... వింటూ!
ంలో కోయిలలు
గ్గతో తలవంచె!

పులికంటి కంటిలో
కనురెప్ప వింటిలో
భావాల పిట్టలు....
గంతులేస్తుంటాయి
కమ్మ కమ్మని కథల
గూళ్లల్లు తుంటాయి!

పులికంటి శ్వాసలో
పలికేటి యాసలో
సీమ జీవద్భాష
చిగురులే తొడిగింది
ఇంపైన మాండలికం
ఇల్లరికం చేసింది!

పులికంటి గళములో
పదునైన కలములో
రాళ్లసీమ ప్రజల
కన్నీటి కథలెన్నో!
కరవు సీమరైతు

దళితుల పతితుల
బతుకు కథ లెన్నెన్నో!

అతని పెదవుల విరిసె
నవ్వుల నెలవంక....
అతని గొంతుక చేరె
అమ్మి గోరింక

అతని కథనం
ఆహా! హాస్యరస స్ఫోరకం
అతని అభివ్యక్తి
ఓహో! అనితర సాధ్యం
అతని రూటే వేరు
అతని పాటే రేరు
అతని కతడే సాటి
కథలలో ఘనాపాఠి!

సపతిలో అడుగిడిన

మనసార అల్లిన అక్షరసుమాల
సుమహారాల తలదన్ను
ఒక నూలుపోగు!

# 'పులికంటి' పిడికిట్లో భవిష్యత్తు భద్రంగా ఉంది!

శ్రీ. ముంగర శంకరరాజు

)లికంటి అంటే ధీరుడు, దక్షుడు, సమర్థుడు అన్న అర్థం
ే రూఢి అయిపోయింది.

(రాలా ఆయన దక్షుడు. జీవితంలో అడుగడుగునా తన దక్షత
చుకున్న ధీశాలి.

ువకుడివి. భవిష్యత్తుయెంతో వుంది. తొందరపడి ఉద్యోగం
ోవచ్చునా!'' అని ఒకప్పుడు కృష్ణారెడ్డితో సంశయించాను.

వవిష్యత్తు నా ఉద్యోగంలో ఇరుక్కొని లేదు. అది నా పిడికిట్లో
ఉందిగురూ'' అన్నట్లు సమాధాన మిచ్చారు అప్పుడు.

ముడు అయోధ్యను వదిలి అడవికి పోతున్నాడని యెవరో వెళ్ళి
ే చెప్పగా - ''అడవిలోనే నూరు అయోధ్యలు నిర్మించుకోగల
ర్థకుంది. భయంలేదు'' - అన్నదట కౌసల్యాతల్లి. ఆ మాట
చ్చింది నాకు ఆ సందర్భంలో!'

వయితల సభలు - సాహిత్య గోష్ఠులు అన్నీ చిత్తూరులోనే ఏటా
ంటున్నారు-' అని ఒక తిరుపతి నేస్తం వాపోగా, అప్పుడు
ుయేమన్నారో తెలుసా?

ునుకుంటే అవలీలగా ఆచిత్తూరునే తెచ్చి ఈ తిరుపతిలో
ుయ్యా-'' అన్నట్లు ధైర్యం పలికాడట.

్రికా నిర్వహణ కష్టభూయిష్టమైంది నేస్తం! తొందరపడి
'' అన్నా - పత్రిక ప్రారంభించడానికి ముందు శ్రీ కృష్ణారెడ్డితో.
ముసలి సలహాకు ఆయన చిన్నమందహాసం చేసి - ''మరేం
ను. అన్నీ ఆలోచించాను. అడ్డు చెప్పకండి. ముందుకు
'' అన్నారు.

ి ఆయన ఆత్మస్థైర్యం. అదే ఆయన సంకల్పశక్తి. అదే ఆయన
ం. అవే ఆయన అభివృద్ధికి బలమైన పునాదిరాళ్ళు.

ుకనే మిత్రులు శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారిలో ఉన్న ఆ
న్ని' పదే పదే మనసారా అభినందిస్తుంటాను. మెచ్చుకుంటూ
ు. అది మాకు గర్వకారణం.

ం బలం - అభినయ కౌశలం - వాగ్వైభవ వైదుష్యం - అన్నీ
)లో కలిపి దిట్టంగా కట్టిన సిమెంటు దిమ్మెపై - తాహధ్వజం పై
టి కృష్ణారెడ్డి కీర్తిపతాక చిత్తూరు మండల రంగస్థలాంగణంలో
ు కనబడేటట్టుగాదిగ్విజయంగా యెగురుతూంది. ఇది మాకు
ుకం.

మన కృషికీ, కీర్తికీ, దీక్షకూ 'కామధేను పత్రిక' పతాక ప్రాయంగా
మనముందు నిలబడింది.

ఏనుగును మేపడానికి ఒక సార్వభౌముని శక్తి అవసర
ుది. పులికంటి కుబేరునిలా కామధేనువునే పోషించాడు.
ైర్యం సర్వదాభివందనీయమైంది.

ష్లు గడిచాయి. ఒకసారి ఆయన దుర్యోధన ఏకపాత్రాభినయం
, తన్మయుణ్ణయి చూస్తున్నా. అప్రయత్నంగా నానోట 'సెభాష్'
బైటికొచ్చింది. చూస్తును గదా! వెనకాముందూ ఇటు అటూ
ప్రేక్షకుల్లో 'సెభాస్.. సెభాస్...' అంటూ హాలు ప్రతిధ్వనించి పోయింది
ఆనాటీ నుండి ఈనాటి వరకూ -

కథాకథనంలో, నటనానైపుణ్యంలో, రచనా వైదుష్యంలో,
పత్రికారంగంలో, సభల్లో సమావేశాల్లో అన్నిటా అన్ని చోట్లా అందరి
నోటా - సెభాష్ పులికంటీ! అన్న అభినందనలే. ప్రశంసా వాక్యాలే.
అర్హత ఆయన హక్కు. ఆయన సాహచర్యం మాకు ఒక దిక్కు.

సరసుడు - సహచరుడు - సహృదయుడు - సాహితీమిత్రుడు
అయిన శ్రీపులికంటి కృష్ణారెడ్డి గారిని తిరుపతిలో సన్మానిస్తున్నారని
తెలిసి సంతోషిస్తున్నాను.

సాహితీ మిత్రునికి సప్తతి సన్మానం!
స్పృహణీయమైన శుభవార్త
తిరుపతి నగరానికే శోభగా
మిత్రులు చేస్తున్నారంట రంజకంగా.
దొరపుట్టుక పుట్టినా - దరిద్రులను వరించిన
పట్టణవాసం చేసినా - పల్లెల్నే ప్రాణంగా భావించిన
రాజకీయాల్లో రుచి వున్నా - రచయితగా రాణించిన
రసికుడైనా - రాజతీవి విడనాడని
కృష్ణునికి - కృష్ణారెడ్డికి - కళల కాణాచికి
సప్తతి సన్మానమంటే సంతోషం కాదా?
కొండలనడుమ కాసారంలో పుట్టనాడు
ఇచ్చగా విచ్చుకొని వాసనలు వెదజల్లుతున్నాడు
సూర్యుడూ చంద్రుడు చూచి మెచ్చుకుంటున్నారు
తెల్లగా తేటగా చూపుకు సూటిగా
అమలిన అంతరంగంతో, ఆత్మవిశ్వాసంతో
బ్రతుకు బాటలో భయరహితంగా పరుగిడుతున్న
పులికంటికి సప్తతి సన్మానం! పులకించదా హృదయం!
చిరునవ్వుల్లో ఛురకత్తులు దాచలేడు
అడుగడుక్కు ఆరడుగుల గోతులు త్రవ్వలేడు
వలలు పన్నలేడు, విషం చల్లలేడు
అడవుల్లో అశ్రమంగా ఆహారం సాధించే
అడవిపులిలాంటి- పులికంటికి - కంటికింపుగా
సన్మానం అంటే స్పృహణీయం కాదా!
గోకులంలో పుట్టిన గోపాలుడు గోళాన్నియేలినాడు
జక్కదనలో పుట్టినవాడు అమెరికాలో అడుగుపెట్టినాడు
అందకుండా యెంత యెత్తుకు యెదిగి పోయాడో,
ఎట్లా అందివ్వను నా అక్షరాక్షతలు!
ఎట్లా అభినందింతును అంత దూరమైనవాణ్ణి! ●

# నా పరిచయ గాథ

। శే॥ విద్వాన్ టి.వేంకట కృష్ణయ్య (కృష్ణ ధూర్జటి)

అది దాదాపు పదహైదేండ్ల క్రితం విషయం. అప్పటి అలవాటు
ఁకు శ్రీ లలితా సమితి ఆధ్వర్యంలో నాటక వారోత్సవ పోటీ
ర్శనాలు జరుగుతూ ఉన్నాయి. సామాన్య ప్రేక్షకునిగా వానికి హాజరు
తూ వుండేవాణ్ణి. అలాంటివానిలో ''ఇదేనాలోకం'' అన్న నాటిక
ర్శనం నన్నెంతో ఆకర్షించింది. అంతేకాక అందలి నాయక పాత్రధారి
తోముఖ ప్రతిభ నన్ను ముగ్ధుణ్ణి చేసి వేసింది. పోటీలో ఆ నాటక
ర్శనానికి ప్రథమ స్థానంరావడమే గాక దాని విజయానికి మూల
ం అయిన ఆ నాయక పాత్రధారికి అత్యుత్తమ పారితోషికం కూడా
ించింది.

సాహిత్య సమ్రాట్టు పూజ్యకులపతివతంసులు శ్రీరాయప్రోలు
ురావుగారి దివ్య ఆశీః పరంపరలకు పాత్రుడైన ఆ యువనటునికి
ల భవిష్యత్తున్నదని ఆనాడే గుర్తించాను. ఆ కళాకారునితో
యం కల్పించుకోవాలని మనస్సెంతో తహతహలాడింది. కానీ
ికది కేవలంహృదయాభిలాషగానే ఉండిపోయింది. అతని
న వివరాలకోసం ప్రయత్నించగా అతడప్పట్లోచిత్తూరులో పని
ు ఒక రైల్వే ఉద్యోగి అనీ, ఆయన స్వస్థానం తిరుపతే అనీ
వచ్చింది. ఏడుకొండల స్వామి దయయుంటే నా కోరిక తప్పక
అవుతుందన్న నమ్మకంతో అప్పటికట్లే ఉండిపోయాను.

ట్లే కొన్ని యేండ్లు గడిచిపోయాయి. ''కథక చక్రవర్తి'' అన్న
ం సార్థకం చేసుకొన్న మా ప్రియమిత్రుడు శ్రీ మధురాంతకం
ం తమ వెంట వచ్చిన నూతన వ్యక్తి నొకరిని నాకు పరిచయం
వీరు కూడా మంచి కథానికా రచయితే'' అనిన్నీ, ఆంధ్రప్రభ
కలో ప్రచురింపబడ్డ విస్తృత చారిత్రక స్థల వ్యాస పరంపరలో
ి దుర్గాన్ని గూర్చి, కార్వేటి నగరాన్ని గూర్చిన ''అక్షర చిత్రాలు''
వీరివేనని తెలియజెప్పారు. విశేషించి చిత్తూరులో నాటక
ల్లో చాలా ప్రముఖ పాత్ర వహిస్తూ వుంటారని తెలిసింది.
యిన తీర్థమెదురయిం''దన్న సామెత అనుకోనట్లు
లించినందుకు నేనానంద పారవశ్యంలో మునిగిపోయాను.

ుర్యోధనుడు''
ామదాసు''
ురాన్ రుస్తుం''
ర్ణుడు''

ుదలైన ఏకపాత్రాభినయ పోటీలలో పాల్గొని యావదాంధ్ర
ుక్కు పట్టణాల్లో అనేక కళా సంస్థల్లో స్వర్ణపతకాది బహూకరణ
దికములను పొందిన యీ కళారాధకుని యెడ
భిమానములు నానాటికి యినుమడింప సాగాయి. ''ఆదర్శ''
మన్న స్వకీయ విరచిత నాటికను తమ నాట్యకళా గురుదేవులకు పూజ్యశ్రీ
నాగేశంగారికి అంకితమిచ్చి వారి ఛాత్ర కోటిలో ఆదర్శప్రాయుడు
కావడం నావంటి వారికెందరికో హర్షప్రదమయింది.

అటు శృంగారరసము వెల్లివిరిసే (పల్లె పాటలు ) ఇటు భక్తి -
తత్త్వ చింతనలతో జానపద గీతాలు, పరవశింపజేసే గేయాలు సవ్యసాచి
లాగా అవలీలగా అదొక హేలగా రూపొందించే అద్భుత ప్రతిభ
యీతనికి ఆజన్మసిద్ధమనిపిస్తుంది.

సంగీత పరిజ్ఞాన సహితమయిన స్వాదుకంఠాన్ని కలిగియుండడం
వల్ల సాంఘిక రూపకములందేగాక పౌరాణిక, చారిత్రాత్మక నాటకముల
మూలంగా కూడా రసికజన చిత్తములను రంజింపజేసే విశిష్టత వీరిలో
భాసిస్తూఉంది.

వేతన సమృద్ధితో భావ్యాభ్యుదయ సిద్ధిని చేకూర్చే యితరుల
కసూయ పాత్రమయిన తన కేంద్ర ప్రభుత్వ రైల్వేస్టేషన్ మాస్టర్ పదవికి
స్వస్తి చెప్పి. కళాభారతీ సేవనే జీవిత ధ్యేయంగా వరించిన యీ మిత్రుని
త్యాగనిరతి, నన్నేకాదు అతని పరిచయస్తులందఱినీ ఆశ్చర్యచకితుల్ని
చేసివేసింది.

తన కళాసాహిత్య ప్రచారాభిలాషకు సౌలభ్య సానుకూలతను
సాధించే ఉద్దేశంతో అక్షరకూటాన్నొకటి స్థాపించాడు. సర్వాంగ
సుందరమయిన ఉత్తేజభరితమయిన పక్షపత్రికా సంపాదకత్వానికి
ముందంజవైచి, విద్యానిధులనే గాక ప్రజాసామాన్యపు మెప్పుల్ని కూడా
చూరగొన్నాడు. ఘాటైన సూటి సంపాదకీయాలతో, ''వాణీదాసుని
వీణానాదము''తో ''మూఢమతి'' మూర్ఛనలతో, ఇంకా అవసరమయిన
అన్ని హంగులతో అందఱినీ అలరించే ''కామధేను'' పాఠకలోకానికే
కామధేనువయింది. కానీ కళాసాహిత్య విజ్ఞాన విస్తృత ప్రచారానికి
నిరంతరం పరిశ్రమించే సంపాదక ప్రచురణాధిపతి పాలిటికి మాత్రం
ఈ 'కామధేను' ఐరావతంగా పరిణమించింది. సజావుగా దాన్ని మేపడం
ఆగర్భ శ్రీమంతులకే అలవికాదన్న సత్యం అందరెఱిగినదే. అత్యంత
సాహసంతో బాలారిష్ట దోషాలన్నీ అధిగమించి యీ పత్రికామణిని
పురోగమింప జేస్తున్న శ్రీ పులికంటి వారి దీక్షయెంతైనా ప్రస్తుతింప
తగివుంది. సర్వశక్తిమంతుడయిన సప్తగిరీశుడే శ్రీ పులికంటి
కృష్ణారెడ్డిగారికి సకలాభ్యుదయంతో పాటు పత్రికా ప్రచురణ
కవసరమయిన ఆర్థిక సౌష్ఠవాది సమస్త సదుపాయాల్ని పుష్కలంగా
అనుగ్రహించి కాపాడుగాక!

నటశేఖరుడు, మధురగాయకుడు, సరసకవి, కథకుడు, పరిణత
పత్రికా సంపాదకుడు అదిగాగల బహుముఖ ప్రజ్ఞాదక్షుడయిన ఇట్టి
సుమనస్వి మైత్రి పెన్నిధిగా సన్నిహితులూ ఆత్మీయులూ సదా
సంభావింతురనుటలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు! ●

# అనుభవాల మనీషి

శ్రీ వి. రాజారామమోహన రావు

జీవితానికీ అనుభవాలకు అవినాభావ సంబంధం. అందుకే అనుభవాలు లేని వాళ్ళు ఉండరు. పులికంటీ అంతే. ల్లా, ఆ అనుభూతిని తన మనసుకు హత్తుకుని, పదిలంగా యితరులకి పంపిణీ చెయ్యటంలోనే !

పులికంటినాకు పాతికేళ్ళకు పైగా తెలుసు. తోటి కథారచయితగా, సహరైల్వే కులజుడిగా, మాది చిత్రమైన ం. తను హైద్రాబాదు వచ్చినప్పుడో నేను తిరుపతి వెళ్లినప్పుడో.. అలా ప్రయాణంలో అప్పుడప్పుడు కలవటం... ంరికలు లేకుండా కబుర్లాడు కోవటం... అలాంటి కబుర్లవల్లే మా పరిచయం ఎదిగి ఎదిగి మిత్రస్థాయిని 'నింది.

ాకు తెలిసిందానిలో నాకు బాగా నచ్చింది పులికంటికీ అతని రచనలకీ అంతగా తేడాలేక పోవటం. రచనా, వ్యక్తీ దగ్గరగా ఉండటం రచనలో గొప్పవిజయంగా నేనుభావిస్తాను. నీతిని అవినీతిని గొప్పని, అవమానాన్నీ ప్రేమని, ని సమంగా చూడగలిగి పలవరించగలిగితేనే రచనకి, రచయితకి ఆ దగ్గరతనం చేరువవుతుంది.

ుర్యాదనే యిష్టపడి, గొప్ప గొప్ప కబుర్లే చెప్పుకుంటూ, తమ చీకటిని తెరమరుగున దాచాలని తాపత్రయ పడేవాళ్ళు ుున రచన చెయ్యలేరు.

ఁట్టుమని అరగంట పులికంటితో గడిపితే చాలు, అతనిలో ఎంత దాపరికం వుందో అతని మాటలే చెపుతాయి.

ొన్ని దశాబ్దాలుగా ఉద్యోగంలేకుండా (ఎంతో సెక్యూరిటి వున్నట్టు భావించే రైల్వే ఉద్యోగం ఎప్పుడో వదిలేశాడు) సంపాదన లేకుండా, అక్షరాల మీద, ఎన్నోరకాల సాహితీ ప్రక్రియల మీద తరగని పట్టుదలతో యిప్పటికీ ం యిష్టపడుతున్నాడంటే అదొక్కటిచాలు జన్మసార్థకతకి!

ుబ్బు గురించి తను పడిన బాధలు, ఒక్కో పుస్తకం వెలువరించటానికి అతను అందుకున్న ఎందరివో సహాయాలు న్నెన్నో దాచుకోవాల్సిన విషయాలు, కన్నీళ్ళు, అవమానాలు, మోహాలు, మోసాలు, సంబంధాలు చాలా తేలిగ్గా ు కబుర్లలా చెప్పుకోగలిగిన పులికంటి అంటే నాకు వల్లమాలిన అభిమానం!

ూదరులని, వ్యభిచారులని, మోసగాళ్ళని మనుషులుగా తనకి దగ్గరి వాళ్ళుగా చెప్పుకోగలిగిన అతని మంచిగుణం యం. తను ఏరకంగానూ స్థితిపరుడుకాకపోయినా ఏదోరకంగా అందరికీ దగ్గరగా వుండాలనే మనిషితనం సౌందర్యం. అతని కూడా మనుషులు లేకపోవటం, జనంలేకపోవటం నాకు తెలిసినంత వరకూ జరగలేదు. కన్నా అతని గురించి రకరకాలుగా గుసగుసలాడే జనం ఎక్కువ ఉన్నారన్న విషయం పులికంటికీ తెలుసు! అతని పద్ధతి అప్పుడూ, యిప్పుడూ, ఎప్పుడూ అంతే !

, శంకరంబాడి గురించి చెప్పినా, పాకల్లో శంకరమ్మ సంగతి చెప్పినా, అమ్మిగురించి, అమ్మగురించి రాసినా అదేభాష.. అదే తీరు!

ులాంటి అనుభవాల మనీషి పులికంటి సప్తతి నాలాంటి ఎందరో ఆప్తమిత్రులకానందం. ఈ సందర్భంగా పులికంటి ప్రతిఏటా తోటి రచయితలని అభిమానంగా పలకరించే కార్యక్రమం పులికంటి సాహితీ సత్కృతి ం! ఇంతకాలంగా కూడుపెట్టిన అక్షరానికి అభిషేకం!

ఁరి ఎన్నోనాళ్ళు యిలాగే పులికంటి పేరు కలకాలం నిలిపే ప్రయత్నాలు మిత్రుని చేతులమీదుగా జరగాలని ుబరాలేకాదు – సహస్రమాసోత్సవాల మహోత్సవం కూడా జరుపుకోవాలని కోరుకుంటూ.... ●

# అభినందన !

శ్రీ పోరంకి దక్షిణామూర్తి

[పు]లికంటి కృష్ణారెడ్డిగారితో నాకున్నది పరోక్ష పరిచయమేనని [చెప్పాలి. ఏ]మంటే, సుమారు మూడునాలుగు దశాబ్దులుగా ఆయన [పేరు] నాకు పరిచయముంది. ఆయన కథారచయిత, నటుడు, [నాటక ర]చయిత, గీతరచయిత అని నాకు తెలుసు. అప్పుడప్పుడు [ఆయన] కథలు కొన్ని చదివాను. చిత్తూరు జిల్లా ప్రాంతపు సామాన్య [జీవితా]న్ని ఆ ప్రాంతపు పలుకుబడిలో చక్కగా కథలుగా తీర్చిదిద్దు[తారన్న] అభిప్రాయం ఏర్పడిన మీదట ఆయన మీద నాకు [అభిమాన]ం ఏర్పడింది. నిజానికి, ఏ రచయిత అయినా అభిమాన [పాత్రుడు] కాని ఒక నిశ్చితమయిన ఆదర్శాన్ని ఏర్పరచుకొని చిత్తశుద్ధితో [కృషి చేస్తే] దానికి అంకితుడయిన వ్యక్తి ఏరంగంలో ఉన్నా మన్నన [పొందు]తాడు. అయినా మేము ముఖాముఖిగా కలుసుకొన్నది [...] బహుశా మూడు నాలుగు సార్లేమో! అప్పుడయినా [...]కు పలకరించుకోవడం తప్ప మాటలు సాగినట్టు లేదు. [...]లు అటువంటివి.

పులికంటి కృష్ణారెడ్డిగారు ఆ మధ్య 'నాలుగ్గాళ్ళమండపం' [రాశా]డు. ఆంధ్రప్రభలో సుమారు సంవత్సర కాలం [ధారావా]హికగా ప్రచురణ కావడం తెలుసు. అది రాయలసీమ జీవన [...]ద్దం పట్టిందనీ తెలుసు. పుస్తక రూపంలో వచ్చేటప్పుడు, [ఆంధ్రప్ర]దేశ్ ప్రెస్ అకాడెమి అధ్యక్షులు (ఆంధ్రప్రభ పూర్వ [సంపాద]కులు) పొత్తూరి వెంకటేశ్వర రావు గారు, 'రాయలసీమ [...]'గా కృష్ణారెడ్డిగారిని ప్రశంసిస్తూ పరిచయ వాక్యాలు [రాయడ]మూ తెలుసు. అందువల్ల పుస్తకం అందుకోగానే నాకు [...]ం కలిగింది. అందులో భాషాశాస్త్రంలో అంతర్జాతీయ [ఖ్యాతి] ఆర్జించిన ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు 'అసామాన్య [...]'ని మెచ్చుకోవడం, ప్రతిభకు పెద్ద గుర్తింపు అని రూఢి [...]. ఈ రెంటికీ తోడుగా మరొక ప్రతిస్పందన, వల్లంపాటి [వెంకటసు]బ్బయ్యగారి 'మిత్రవాక్యం'. వీరందరూ నాకు ఆత్మీయులే.

['నా]లుగ్గాళ్ల మండపం' నాకు బాగా నచ్చింది. ప్రతిఒక్క [...] ఎంచుకొన్న విషయం, చెప్పేతీరు, ముత్తారెడ్డి ముక్తాయింపు, [...]యిన – అతిముచ్చటగొలిపే పలుకుబడి బాగా ఆకట్టు[కునేట్టు]గా ఉన్నాయి. ఒకటా, రెండా? 'ఛప్పన్నారు' కథలకు కొసరు [...]టి!

[ఈ] సంపుటానికి రాసిన 'నామాట'లో రచయిత, తమ జీవన [...] సింహావలోకనం చేసుకున్నారు. "జీవితాన్ని నాటకరంగానికి [అంకితం] చేసి రాయలసీమ నాటకరంగాన్ని పునరుద్ధరించాలన్న [...]ో ఎందరో పెద్దల మాటలను పెడచెవిని పెట్టి రైల్వే [ఉద్యోగా]నికి రాజీనామా చేయడం..." తొందరపాటు అని ఆ తరువాత [...] ఉండవచ్చు. నొచ్చుకొనీ ఉండవచ్చు. అయినా, వేరేచోట [ఉంటే వా]ల్ల కావలసిన పని ఉండిపోయినప్పుడు, ఆ పనే ఆయన్ని [వెతు]చి దింపి ఊళ్ళోకి తీసుకువచ్చింది. లాభనష్టాల బేరీజుతో [ప్ర]మేయం లేదు. సిరిమల్లె పూలు కోయవలసినవాడు [...]ం మీద కూర్చున్నా దిగిరాక తప్పదు! కొందరి జీవితాలు [...] ఉదాహరణలుగా కనిపిస్తాయి. ఎవరికి నచ్చినా, నచ్చక[పోయినా] అవి అంతే. జరిగేవి జరుగుతాయి. హేతుబుద్ధీ కార్యసిద్ధీ ఇక్కడ పనిచెయ్యవు. చిత్తశుద్ధి ఒక్కటే ప్రమాణమవుతుంది. ఇది భవదీయుడి అనుభవం కూడా!

"నా దృక్పథం ఒక్కటే. మనిషిని మనిషిగా ప్రేమించడం". ఎంతో విలువయిన మాట ఇది. నిజానికి ఇంతకన్నా కావలసింది ఏముంది? సర్వాత్మనా అలా ప్రేమించే స్థాయికి చేరుకున్నవాడు విశ్వమానవు డవుతాడు. "నాకు 'యిజాలు' తెలియవు. 'వాదాలు' తెలియవు 'నిబద్ధత అంటే తెలుసుకోవాలని నేను ప్రయత్నించలేదు''. అంటూ, .... 'యిజా'లలో నిజం, 'వాదా'లలో పదును కేవలం పెదాల వరకే పరిమితమని నా అనుభవం నాకు నేర్పింది'', అని కృష్ణారెడ్డిగారు కంఠోక్తిగా చెప్పడం సంతోషించదగ్గ విషయం. ఏమంటే, ఈ 'యిజాలు', 'వాదాలు' ఏవీ రాకముందు కూడా సాహిత్యం ఉంది. వచ్చాకా ఉంది. వాటితో ప్రమేయంలేకుండానూ ఉంది; ఉంటూనూ ఉంటుంది – జీవితమున్నంతకాలం! 'యిజా'లకు, 'వాదా'లకు కొంత విలువ ఉన్నమాట వాస్తవం. వాటివల్ల కొంతమేలూ జరిగింది. జీవితంలో కొత్త కోణాలను చూపించి, అవగాహనను విస్తృతం చేసింది. వాటి ప్రేరణతో కొంత మంచి సాహిత్యం వచ్చింది. కాని, వాటితోనే సాహిత్యానికి మనుగడ ఉందని కాని, అవి లేనిదేదీ సాహిత్యంగా పరిగణించడానికి వీలులేదని కాని, ఉత్తమ సాహిత్యం కాదని కాని చెప్పే హక్కు ఎవ్వరికీ లేదు. సాహిత్యం వేరు, శాస్త్రం వేరు, సాహిత్యానికి ఏ శాస్త్రమూ ఏ వాదమూ గుదిబండ కాకూడదు.

"నాకు తెలిసింది ఒక్కటే. అది నా తల్లి – అఆలు నేర్వని అయ్యోరమ్మ చెప్పినమాట. 'ఎదుటోడి కష్టం నీకష్టం అనుకోరా అబ్బోడా!' అని. ఈ మాటే నేను నమ్మినవేదం," అన్నారు రచయిత, ఆ చల్లని తల్లి చెప్పినది నిజంగా వేదవాక్యమే. దీన్ని అవగాహన చేసుకొని జీవితంలో ఆచరణలో పెట్టినవాడు, సాహిత్యానికి ప్రాణనాడిగా గుర్తించినవాడు చేతులెత్తి దండం పెట్టదగ్గవాడు.

"నాకు భగవంతుని మీద నమ్మకం ఉంది. పునర్జన్మమీద నమ్మకం ఉంది. ఈ జన్మలో సంప్రాప్తమైన ఈ మాత్రం కళాభిరుచికూడా పూర్వ జన్మ సుకృతఫలమనే నానమ్మకం", అన్నారు. ఊహాల మబ్బుల మీద కాక, నేలమీద కాలూనినవాడు అనేమాట ఇది. సుఖభోగాన్నో, అందాన్నో, అధికారాన్నో, ఆరోగ్యాన్నో, ఐశ్వర్యాన్నో, దేన్నో ఒకదాన్ని నమ్ముకున్నవాళ్ళే అందరూ. నమ్మకమున్న వాళ్ళెవ్వరూ నాస్తికులు కారు! ఇవేవీ కొరగాకుండా పోయినప్పుడు, ఇక భగవంతుడు ఉండనే ఉన్నాడు. అడ్డువచ్చేదల్లా అహంకార మొక్కటే! దానికే కదా మన నిబద్ధత!

'నాలుగ్గాళ్ల మండ'పాన్ని కేంద్రంగా చేసుకొని 'రాయలసీమ జీవనశైలి'ని చిత్రించారు రచయిత. ఈ మాదిర ప్రయత్నం ఏ ప్రాంతంలో ఏ రచయిత చేసినా సంతోషించేవాళ్ళలో నేను మొదటివాణ్ణి. రచయిత పుట్టినకులం, ప్రాంతం, వర్గం, జీవనస్థితులు – ఇవేవీ అతని ఇష్టానిష్టాలతో ప్రమేయముండి వచ్చినవి కావు. అతడు చూసినవాటిని, విన్నవాటిని, స్పందన పొందినవాటిని, తలచిన వాటిని రచనలో పొందుపరుస్తాడు. అప్పుడు అది అందరికీ ఉమ్మడిసొత్తు అవుతుంది. రచయిత అందరివాడూ అవుతాడు. రచన ఒక (ప్రాంతీయ/వర్గ) 'విశేషం' సామాన్యీకరణ చెందినప్పుడు రచయితకు పరిధులు ఉండవు. అతడు ప్రాంతాలకు అతీతుడు.

రచయిత అయినా సహజత్వం కోసం మాండలికం ు. జీవద్భాషలో మాండలికాలు ఉంటాయి. గనుక వాటిలో ు అవమాన కరంగా ఎవ్వరూ ఎప్పుడూ భావించనక్కరలేదు. కా లన్నీ, మనవే. మనకు ఇష్టమయినవే. వీటిలో ఒకటి ుకటి తక్కువదీ అనడానికి ఆస్కారం ఎంతమాత్రం లేదు. ప్రమాణభాష అనేది ఏదీ ఆకాశం నుంచి ఊడిపడలేదు. ుకాల్లోనే ఒకటి, రాతకోతలకు ఎక్కువగా వాడుకలోకి ువల్ల అది ప్రామాణికం అనిపించు కుంది. దీనివల్ల ఇతర ుకాలకూ వాటివల్ల ప్రమాణ / సామాన్య భాషకూ రుతుంది. ప్రతిదేశంలోనూ ఇలాగే జరుగుతోంది. దీనివల్ల ుసంపత్తి సంపూర్ణంగా అందరికీ అందుబాటులోకి వస్తుంది. ుతోనే నేనూ మూడు ప్రాంతీయ జానపద మాండలికాల్లో ు చెప్పేదానితో సహా) నవలలు రాయడానికి పూనుకొన్నాను నవల - వెలుగూ వెన్నెలా గోదారీ - రచనా కాలం 1958 ండో మాండలిక నవల - ముత్యాలపందిరి - రచనాకాలం మూడో నవల - రంగవల్లి రచనాకాలం 1974). ఇవి ఆయా ప్రాంతీయ మాండలికాల్లో మొదటి విగా గుర్తింపు ు. వీటిలో ప్రతి నవలనూ ఇతర ప్రాంతాల వాళ్ళుకూడా చదివి అర్థంచేసుకున్నారు. ఆ మాండలికాల్లోనే నాకు ఉత్తరాలు కూడా రాశారు. కాబట్టి పూర్తిగా అర్థంకాకపోవడమన్నది లేదు. కొన్ని మాటలకు, పలుకుబళ్ళకు అర్థాలు తెలియకపోతే ఎవరి నయినా అడిగితెలుసుకుంటారు. అటువంటి మాటలన్నీ నిఘంటువులకు ఎక్కాలి. అప్పుడవి అందరికీ అందుబాటులోకి వస్తాయి. అంతవరకు సాధారణ పాఠకులను శ్రమపెట్టవద్దనుకుంటే, మాండలికాన్ని సంభాషణలకు పరిమితంచేసి రాయవచ్చు. ఒక్కమాట మాత్రం నిజం - సాహిత్యంలో శైలీ వైవిధ్యసంపత్తి పెరిగేది ఎక్కువగా మాండలిక ప్రయోగాలవల్లనే. ఇందుకు కృష్ణారెడ్డిగారు కూడా దోహదం చేస్తున్నందుకు చాలా సంతోషం.

మరొక విశేషం, ఇన్నాళ్లు రచయితగా బతికి - సాహితీ లోకానికి ఏదో వొకటి చేయాలన్న తపనతో పులికంటివారు సాహితీ సత్కృతిని ఏర్పాటు చేయడం. ప్రతి ఏటా ఒక ఉత్తమ కథాసంపుటికీ ఒక కవితా సంపుటికీ పురస్కారాలు ఇచ్చే వ్యవస్థ నెలకొల్పడం ఎంతో అభినంద నీయం.

'పులికంటి సప్తతి' అభినందన సంచిక ప్రచురణ సందర్భంగా కృష్ణారెడ్డిగారిని మనసారా అభినందిస్తున్నాను. ●

# కట్టుదిట్టమైన నాలుగ్గాళ్ల మండపం



ులుగ్గాళ్ల మండపం ఓ కాలమ్‌గా గతంలో ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో యాభై ఏడువారాలపాటు ుచన. కాలమ్ రచన అనేది కథా రచన కన్నా క్లిష్టమైనది. కష్టమైనది. ఎందుకంటే కథ అనేది సబ్జెక్ట్ స్ఫురించినపుడు, వచ్చినపుడు అక్షరబద్ధం చేసేది. కానీ కాలమ్ అలాకాదు. దానికి ప్రతివారం ఓ గడువు ఉంటుంది. ఆ గడువులో ు, చక్కనైన రచనను పండించాలి. అలా రాయలసీమ జీవన చిత్రాన్ని అనేక కోణాల్లో పండించిన కాలమ్ ఇది. ుసీమ మాండలికంలో ఈ కాలమ్‌ను నడిపి ప్రాంతీయపు మమకారాన్ని చాటుకున్నారు రచయిత పులికంటి ుష్ణ. మాండలికాలకు సహజసిద్ధమైన సొగసు ఉంటుంది. అలాటి సొగసు ఉట్టిపడేలా, ఎన్నెన్నో జాతీయాలతో, ులతో నుడికారాలతో రచనకు ప్రాణం పోశారు. మరి మాండలికంలో రచనలు చేస్తే పాఠకులందరికీ చదవటానికి ుతరంగా ఉండదేమో అని కొందరి అనుమానం. కానీ ఆసక్తి అంటూ ఉండాలే కానీ చదవటం మొదలెడితే అదే మనల్ని లాక్కుపోతుంది ునాలుగ్గాళ్ల మండపం చదివాక అనిపించిన భావన. పరభాష అయిన ఇంగ్లీషునే వంటబట్టించుకునే మనకు ఒకే భాషలోని మాండలికాలను ుకోటానికి ప్రయత్నించడం పెద్ద కష్టమేమీ కాదు. వివిధ ప్రాంతాల వారి మధ్య అవగాహనకు, సామరస్యానికి అది అవసరం కూడాను. 'ులుగ్గాళ్ల మండపం'లోని అధిక రచనల్లో చిరకాలంగా మట్టినే నమ్ముకొని, వానచినుకు కోసం చిగురాశతో కాలం గడుపుతున్న ుసీమ రైతుబిడ్డల వ్యథలు, గాథలు కళ్ళకు కట్టాయి. రాయలసీమ సమస్యలనూ ఎత్తిచూపారు. ఈ రచనల్లో ప్రధాన పాత్రలు రచయిత. (రచయిత భార్య - బాశాలి అంటే భాగ్యశాలిని), ముత్తారెడ్డన్న. కొన్నిట్లో రచయిత స్నేహితుడు వెంకటరెడ్డి కూడా చోటుచేసుకున్నాడు. ో ఓ నాలుగు రచనలు మాత్రం, రాయలసీమలో ప్రసిద్ధి కెక్కిన స్వాతంత్ర్యవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, దాతగా పేరు చేసుకున్న బుడ్డా వెంగళరెడ్డి, రాయలసీమ రాబిన్‌హుడ్ అంబోదల గిడ్డడు, నీచుడుగా అపకీర్తిని మూటగట్టుకున్న పళ్ళిపట్టు ుడ్డిల గురించి ఉన్నాయి. మొదటి రెండు రచనలు 'తావరం, జాతకసెత్రం' లలో తిరుపతిలోని నాలుగ్గాళ్ళ మండపాన్ని పరిచయంచేసి, ుథాన్యాన్ని వివరించారు. ఆ తర్వాతి రచనల్లో సమకాలీన రాజకీయాలను వ్యంగ్య ధోరణిలో తూర్పారబట్టారు. లోకం పోకడలను, ు మనుషుల మనస్తత్వాలను ఎంతో సహజంగా పాఠకులకందించారు. ప్రభుత్వ పథకాల వెనక రాజకీయ పథకాలు, పార్టీల లోగుట్లు, ఆర్భాటాల గుట్లు, పౌరుల అమాయకత్వం చదువుల తీరు, ఇలా ఎన్నెన్నో మన ముందుంచారు. ఇందులో పేర్కొన్న సంఘటనల్లో ురకు యథాతథంగా కాకపోయినా చాలావరకు సామీప్యంతో మన అనుభవంలోకి వచ్చేవే.

ు ఒకటికి రెండుసార్లు పులికంటిగారు బాశాలి కష్టాన్ని తమ తల్లి పడ్డ కష్టంతో పోల్చుకుని అన్ని సుఖాలున్నా బాశాలి ఇంకా 'ఆడనొప్పి, ునొప్పి అంటా సాణకొట్టతానే ఉంటింది. ..యాడుండాదబ్బా దీనికి కిటుకు?' అనుకుంటారు. అయితే కాలక్రమంలో ఏర్పడ్డ లు కేవలం స్త్రీలకే వర్తించవు, పురుషులకూ వర్తిస్తాయి. తరానికి, తరానికి నడుమ ఈ తేడా ఎవరికైనా సాధారణమే అన్న విషయం విస్మరించినట్లనిపించింది. బాశాలిని గయ్యాళిగా చిత్రిస్తూనే అంతలోనే గతంలోనూ తమ ఇంట్లో తల్లిదీ అదే వరస అనుకుంటారు. ు బాశాలి అథార్టీ, జోరు ఆయనకిష్టమే అనేది స్పష్టం. బయట వ్యవహారాలకు ప్రాధాన్యతనిస్తూ ఇల్లు, పిల్లల విషయాలను నిర్లక్ష్యం ునుమాటలతోనే చీల్చిచెండాడే బాశాలి పాత్ర చిత్రణ ఎంతో హృద్యంగా ఉంది. ఈ రచనల్లో రచయిత తనలోకి తాను చూసుకోవటం ునిపిస్తుంది. ఎలాటి దాపరికం ఉండదు. ఉదాహరణకు 'కూలోడిగ్గూడా మొగబిడ్డా?' లో చివరన ముత్తారెడ్డన్న.. 'ఈళ్ళతో నీకేం ుళ్లను చూసుకుంటా గుక్కిళ్ళు మింగతా నిలబడుకుంటే చలికాలానికి వొకశాలవ పొగొట్టుకొని యిశారపడ్తావ్" అంటే "ఎవురేమనకుంటే ుకున్నా. ఒక్క శాలవకోసరం కక్కుర్తిపణ్ణెట్టు ఆ పండగపూట కల్లబొల్లి మాటల్నే కవిత్తం పేర్తో కక్కేసినా!" అంటారు. ుభవ సత్యాలను అక్షరాల ఇటుకలతో కట్టుదిట్టంగా నిర్మించిన 'నాలుగ్గాళ్ల మండపం' చదివితే ఇందులోని ముత్తారెడ్డన్న వివేకం ునూ మేల్కొల్పుతుంది.

-జె. శ్యామల (ఆదివారం వార్త కృతి, 14-01-2001)

# అసామాన్య సృష్టి

## ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి

**ౖగ్గాళ్లమండపం రచనా ప్రణాళిక, కాల్పనికసౌష్ఠవము:**

ౖలికంటి కృష్ణారెడ్డిగారు చెయ్యి తిరిగిన కథకుడు, కవి, నవలా . ఆయన ఇది వరకు రాసిన కథలు నవలలు ఒక ఎత్తు. ఈ ళ్లమండపం ఒక ఎత్తు. సంభాషణల్లో పాత్రోచితంగా ఏమ మాండలికం యిది వరకు వాడుతుండేవారు. నాలుగ్గాళ్ళ ంలో కథనం (రచయిత మాటలు) కూడా రాయలసీమ ల మాండలికం లోనే నడిచింది. ఈ రకంగా అడపా దడపా కాల్పనిక సాహిత్యంలో పూర్తిగా ఒక ప్రాంతపు వర్గమాండలికం కనిపిస్తుంది. వాళ్లు ఎవరి మాండలికంలో రాస్తున్నారో వాళ్లకు ాదు కాబట్టి వాళ్ళు ఆ రచనలు చదవలేరు. ఇతర మండలాల తమ ప్రాంతంలో చదువురాని సామాన్య ప్రజలు పడే పాట్లను లుకుబడిలోనే వినిపిస్తే బాగుంటుందని చూపించడం ఆ ల ఉద్దేశమై ఉండాలి. మరి సంభాషణల్లో పాత్రోచితంగా ికం వాడితే ఈ లక్ష్యం సిద్ధిస్తుంది కదా అనవచ్చు. ఈ ిరించిన సిద్ధాంత చర్చ, నా వ్యక్తిగత అభిప్రాయాలు మూడో వ్రాస్తాను.

ుగ్గాళ్ళమండపంలో శీర్షికతో సహా యాభైఏడు అధ్యాయా ు. ఒక్కో అధ్యాయంలో ఒక్కో కథ. రాయలసీమ జీవితంతో ుస పోయిన కృష్ణారెడ్డి గారి ఆత్మకథ ఈ చిన్న కథలన్నిట్లోనూ దారంలాగా కనిపించీ,కనిపించకుండా ఉంటుంది. నూటికి ాళ్ళు ఆత్మకథ అంటానికి వీల్లేదు. ఆయన ఊహలు, ూలు, అనుభవాలు పాటకం జనం పడే పాట్లు, రైతుల ు, కుళ్ళు రాజకీయాలు, మోసాలు, ఓట్లు, నీటి యెద్దడి, జ్ఞాపకాలు... అదీ ఇదీ ఏమిటి కృష్ణారెడ్డి గారి అనుభవ ఉన్న అన్ని సంగతులు ఈ కథలకు ప్రాణం పోశాయి. లు జనం వాడుకలో వున్న సామెతలు, నుడికారాలు ఈ ోకొల్లలు. ఏమైనా తెలుగు సాహిత్యంలో విషయ మాధ్యమాల ీ దృష్టితో చూస్తే ఇదొక కొత్త ప్రయోగమని చెప్పవచ్చు. దిన ప్రయోగమని కూడా చెప్పవచ్చు. మరి తారీఖులు, లు, డైరీలు లేవు కాబట్టి నూటికి నూరు పాళ్ళు ఆత్మకథ చ్చు అనుకొంటున్నాను.

కథ నిర్మాణంలోనూ ఒక ప్రణాళిక, కట్టుబడి తీరు ని గ్రహించవచ్చు.

ీథ కృష్ణారెడ్డి గారు నిద్దర లేవటంతో మొదలై మళ్లీ ఆయన మంచం ఎక్కేదాకా నడుస్తుంది.

ుక సన్నివేశం కల్పించుకోవటం, దాంట్లో భాగంగా కథకుడికి త్రలతో జరిగే సంభాషణ, చర్చ, కథకుడి ఆలోచనా పరంపర, ంతర్మథనం కథలో ముఖ్యాంశాలు. చివరికి రచయిత ు కోసం నాలుగాళ్ళ మండపం వైపు వెళ్తాడు.

3) అక్కడ తప్పకుండా ముత్తారెడ్డి కనబడతాడు. ఆయనతో చివరి సంభాషణ, ముత్తారెడ్డన్నతో రెండు నిమిషాలు మాట్లాడగానే కథకుడి మానసిక సంఘర్షణ పటాపంచలౌతుంది. ఆ ముత్తారెడ్డి చాలా వివేకవంతుడు, లోకజ్ఞానం గలవాడు. మహాభారతంలో విదురుడి లాంటి వాడు. ఆయన కృష్ణారెడ్డిని, 'అబ్బోడా!, పిచ్చోడా!' అని సంబోధిస్తాడు (ఆయనా కృష్ణారెడ్డి సృష్టించిన పాత్రే). ఆయన సందేశంతో మనస్సు తేలిక చేసుకొని కథకుడు ఇల్లు చేరుతాడు.

-ఇదీ స్థూలంగా ప్రతి కథలోని ఇతివృత్తం. ఈ కథలు చదివిన వాళ్ళకు రచయిత అనుభవ విస్తృతి, పరిశీలనా నైశిత్యం, కాల్పనిక శక్తి కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. ఒక సంస్కారవంతుడు తన ఆలోచనా విధానాన్ని జానపదుల పలుకుబడిలో పొదగటానికి కాస్త సతమతమయినట్టు గూడా కనిపిస్తుంది. రచయిత తన ఆత్మ సంస్కారాన్ని ఎలా కప్పి పుచ్చుకోగలడు? చాలా ముందు వెనుకలు ఆలోచించి శ్రమించి 'ఛాలెంజ్'గా తీసుకొని రూపొందించిన విశిష్ట రచన యిది. అందుకని కృష్ణారెడ్డిగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. అయినా-

"మన కిష్టారెడ్డి బాగా సదువుకున్నోడు. మంచి కతలుకైత్తాలు రాసినాడు. మరి ఆ మద్దె నాలుగ్గాళ్ళమండపం అని పెద్ద గ్రెందం రాసినాడంట గదా! మరి ఆ గ్రెందమంతా మన సీమ మాటలే ఉండాయంట గదా! ఏందబ్బా? తెలుగోళ్ళంతా సదగాలని రాసి ఉండాల గదా. మరి ఇట్టా రాసేసి నాడేంది? అని నాలో నేనే ఆలోసించుకుంటా ఎవుర్నైనా తెలిసినోళ్ళని అడగదా మనుకుంటా నాలుగ్గాళ్ళమండపం కాడికి ఎలబార్నా. అక్కడ ముత్తారెడ్డి మామ నిలబడుకోని బీడి తాగతా ఉండె. ఆయన కాడికి పొయ్ 'ఏంది ముత్తారెడ్డి మామా! మన కిష్టారెడ్డి ఇట్టసేసినా'డని అడికే కుందికి- ముత్తారెడ్డి మామ నవ్వతా, "ఒరే అబ్బోడా! ఈ మాత్రం అర్తం కాలేదురా నీకు. అయితే ఇనుకో! మన కిష్టారెడ్డి బాశాలి ఉండాది కదా! అయమ్మకి ఈయనకి మద్దె నడిసిన మాటలు, కతలు, ప్రేమ కలాపాలు అన్నీ ఎక్కించినాడు గదా ఆ గ్రెందంలో. ఆ యవ్వారమంతా అయినోళ్ళకీ కానోళ్ళకీ- ముక్కెంగా తూరుపోళ్ళకి ఉత్తరాదోళ్ళకి- ఎందుకులే తెలవాల అనుకుంటా మన సీమ బాసలో రాసినాడ్రా. కాపరం గుట్టు యాది రట్టు గదంట్రా! అబ్బోడా". అని మామ అనేకుందికి అంతా తెలిసిపాయ! ఇంగ అడిగేదానికేముండాదిలే? అని ఇంటి దారి పట్టి".

ఇది ఒక విద్యార్థికి ముత్తారెడ్డికి మధ్య నడచిన సంభాషణగా ఊహించుకోండి. ఇది పేరడీ గాదు. ఒక చిన్నప్రయోగం. కృష్ణారెడ్డిగారి పుస్తకం కాస్త ఒకసారి చదివిన నాకే ఆయన బాణీ ఆమాత్రం పట్టుబడితే రాయలసీమలో పుట్టిపెరిగిన వాళ్ళకు ఇది చదవడంలో క్లేశమే ఉండదు.

ప్రాంతాల వాళ్ళకు గూడా అర్థం చేసుకోటంలో కష్టం నుకుంటా. మరి ఇంత శ్రద్ధగా 'ఫిక్షన్ 'ఎంతమంది ారు అనే ప్రశ్న ఉండనే ఉంది.

**నిక ప్రమాణ భాష : రాయలసీమ మాండలికం :**

య వృత్తుల్లో వాడే మాటల ప్రాంతీయ విస్తృతి ఆధారంగా ుగులో నాలుగు భాషా మండలాలు ఉన్నాయి. అని ంగా నిర్ణయించడం జరిగింది. అవి : ఉత్తర మండలం ణా జిల్లాలు), దక్షిణ మండలం (రాయలసీమ, నెల్లూరు, జిల్లాలు), పూర్వ మండలం (శ్రీకాకుళం, విజయనగరం, ప్నం జిల్లాలు), మధ్య మండలం (ఉభయ గోదావరులు, ంటూరు జిల్లాలు). మధ్య మండలంలో వాడుకలో ఉన్న ం, మోట, నాగలి, మేడి, కఱ్ఱు, ఏడి కఱ్ఱ, చక్రం, తమిదె, చె - మాటలకు సమానంగా దక్షిణ మండలంలో తూము, ాట, కాడిమాను/కాడిమాకు, నాగేలి/మడక, మేడితోక, కఱ్ఱు/ ాగ/నగ, గాను/గాలు, రాగి, సద్ద, కర/కంచె-అని. ఉత్తర ంలో - తూము, మోట, కాండి/కాణి/కాని, నాగలి, పాలె, టికఱ్ఱ / ఏటికోల, గారె/గిఱ్ర/గీర/గిల్ల, తమిదె, సజ్జ/సద్ద, కంచె-అని. పూర్వ మండలంలో - మదుము, మోట, పూజు/ ాగలి, మేడి, నక్కు, ఏటికఱ్ఱ ఉండ, చోడి/చోళ్ళు, గంటె/ ులుగు/కంచె- అని వాడుతారు. కొన్ని మాటలు రెండు మూడు ల్లో ఉన్నా కొన్ని ఆమండలానికే విలక్షణమైనవి ఉన్నాయి. ఉప మండలాలు కూడా ఉన్నాయి. దక్షిణ మండలంలో ండక, కాడిమాను/కాడిమాకు, మోట/కపిలె, నొగ / నగ మొ. ్ని చూపిస్తాయి. సాంస్కృతిక-ఆర్థిక కారణాల వల్ల మధ్య ం మనం ఇప్పుడు విస్తృతంగా వాడే రచనా భాషకు ంది. (వివరాలకు, చూ. మాండలిక వృత్తిపదకోశం, వ. .., ు పదాలు : 1582. హైద్రాబాదు: ఆం.ప్ర. సాహిత్య : ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయం).

ాక ప్రతి భాషా మండలంలోను వర్గ మాండలిక భేదాలు ు మధ్య ఉన్న స్థాయీ భేదాలను బట్టి ఏర్పడతాయి: చదువు, వృత్తి, కులం, నగర ప్రజలతో సంబంధం మొదలైన వాటివల్ల ఏర్పడతాయి. అన్నింటికంటే ముఖ్యమైనది చదువు అని మా లో తేలింది. భాషలో ప్రధానంగా మనం గుర్తించేవి పదాల వచ్చే వర్ణాలు, వాటిని ఉచ్చరించే తీరు, ప్రకృతి ప్రత్యయా ్రడే పదాల నిష్పత్తి, అలాంటి పదాల కలయికతో ఏర్పడే ాపం. ఈ మూడింటిలోనూ నాగరికులు (చదువుకున్న పట్టణ మాట్లాడే తీరుకు చదువురాని జానపదుల వాడుకకు మధ్య ాలుంటాయి. ఉచ్చారణలో వచ్చే ఈ తేడాలు కొన్ని మాత్రం ంతాల్లోనూ ఒకే రకంగా ఉంటాయని గుర్తించవచ్చు. ఉదా..

శిష్టుల ఉచ్చారణలో ఒత్తక్షరాలు, హ-కారం, చ-కారం, ్తక్షరాలు, పదాది వి, వీ, వె, వే లు శ-ష-స ల భేదం, పదాది ిలుస్తాయి: భారతం, ధర్మం, హరివిల్లు, రోహిణి; చాప, ాచో: భక్తి, హస్త, చేస్తాడు; విలువ, వెన్నెల, వీధి, వేడి; శాస్త్రి, ుు; గట్టు, గడ్డం, గంట.

(2) శిష్టేతరుల్లో (అంటే, విద్యా గంధం గానీ చదువుకున్న వాళ్ళతో రోజూ మాట్లాడే అవకాశం గానీ లేని జానపదుల్లో) ఒత్తక్షరాలు, హ-కారం, చ-కారం పోతాయి: చ (ద్విరుక్తిలో తప్ప) 'స' అవుతుంది : సంయుక్తాలు ద్విత్వాలన్నా అవుతాయి, లేదా అచ్చులు చేరి విరుగుతాయి; వి, వీ, వె, వే లలో వ-కారం పోయి ఇ ఈ ఎ ఏ లవుతాయి; శ ష స లన్నింటికి బదులు స ఉంటుంది; పదాది గ 'గె' గా మారుతుంది; బారతం, దర్మం/దరమం, అరిల్లు రోయిణి; సాప, సిలక, కూసో; అస్త, బత్తి/బగితి, సేత్తాడు; ఇలవ, ఈది, ఎన్నెల, ఏడి; సేత్రి, బాస, కాసు; గెట్టు, గెడ్డం, గెంట.

పులికంటి వారి రాయలసీమ జానపదుల మాండలికంలోనూ పై తేడాలు కనిపిస్తాయి. కానీ కొద్ది పాటి చదువు సంస్కారం ఉన్న వాళ్ళల్లో కొన్ని లక్షణాలు మారతాయి, కొన్ని మారకుండా ఉండవచ్చు. వ్యక్తికి వ్యక్తికి శిష్ట వ్యవహార ప్రభావశాతంలో భేదాలుంటాయి. సంస్కృతం-ఇతర భాషలనుంచి తెలుగులోకి వచ్చిన మాటలను తత్సమాలుగా వాడితే అది శిష్ట వ్యవహారమైంది; తత్భవాలు శిష్టేతరుల వాడుకకు లక్షణాలైనాయి. కృష్ణారెడ్డిగారు తావరం, పాణం, పుణ్ణాత్తులు, కత, అర్తం, ముక్కెం, యెనక, ఈది, ఇనీ యిన్నట్టు, ఎఱ్ఱి, సంకురాంతి, గెంటన్నర, సెగితి, బగితిలాంటి మాటలు, జానపదుల మాటలకు లక్ష్యాలుగా ప్రయోగించారు. ఈ మార్పుల వెనుక ఉన్న సూత్రాలను ప్రయోగించి కొత్తమాటలు సృష్టించారు. ఉదా-దనాకర్షణ, కారివేది, పాణదాత, పరిచ్చితి, ఇస్వ ఇందూ పరిసత్ మొదలైనవి (శ ష స లను గురించి నాకు కాస్త అనుమానంగా ఉంది). రాయలసీమకే పరిమితమైన మరికొన్ని విలక్షణోచ్చారణలున్నాయి. ఎవురు, సీగిటి, మణిసి, మాదిర్తో, అందురు మొదలగునవి. క్రియల్లో శిష్ట భాషతో భేదించే లక్షణాలు జాస్తిగా ఉన్నాయి: ఉండాయి. ఉణ్ణాడు, అన్నెట్టు, చేసేదానికి, పోతింది, చెప్పిండ్లా? (చెప్పి - ఉండ లేదా?), చెప్పబాక, ఇనాల, చేసినాడు, పాయ (పోయె), చూస్తా, వింటా ఇత్యాది. తన ఆలోచనా విధానం జానపదుల చేత చెప్పించటానికి రచయిత కొన్ని రచనా శైలికి సరిపడే మాటలను చొప్పించారు: ఏక పాత్రాభినయం, ఆశా పాశం మొదలగునవి. కథకుడికి ఈ రకమైన సృజనా స్వాతంత్ర్యం ఉండాలని నేను అంగీకరిస్తాను. మాండలికం లోనే పూర్తి రచన నిర్వహించడంలో వున్న కష్టానికి ఉదాహరణగా పై ప్రయోగాలు చూపించాను.

**3. రచనా భాష : ప్రాంతీయ వర్గ మాండలికాలు :**

ఏడుకోట్ల మంది తెలుగు వాళ్ళలో సుమారు యాభైశాతం ప్రస్తుతం అక్షరాస్యులుగా ఉండవచ్చు. కానీ ప్రతిరోజూ పత్రికలు చదివే అలవాటున్న వాళ్ళు రెండు కోట్లకు మించి ఉంటారని అనుకోను. ఇప్పటి రచనాభాషకు ఒక నిలకడ వచ్చి నలభై యాభై ఏళ్ళకన్నా ఎక్కువ ఉండదు. ప్రస్తుతం పత్రికల్లో, నవలా కథానికల్లో, వ్యాసాల్లో సభల్లోనూ వాడేది ఆధునిక ప్రమాణ భాష. ఇది ఎలా ఏర్పడ్డదన్నది మరో ప్రశ్న - ప్రపంచంలో ఇతర భాషలకు ప్రమాణ రూపాలు ఎలా ఏర్పడ్డాయో అదే విధంగా దీనికీ కొన్ని చారిత్రక సాంస్కృతిక పరిస్థితుల నేపథ్యం ఉంది. అది ప్రస్తుతం చర్చనీయాంశం కాదు. అయితే ఈ ప్రమాణ భాష లక్షణాలేమిటి, దీన్లోనే అందరూ ఎందుకు రాయాలి, అనే ప్రశ్నలకు జవాబు చెప్పాలి. నేటి రచనాయోగ్యమైన తెలుగు లక్షణాలు–

ప్రాంతీయ మాండలికాలకు, వర్గ మాండలికాలకు అతీతంగా ర్పడుకున్నది ఇది. అంటే ఎక్కువ మందికి చదువుకునే ్, రచనా సాధనంగా దీనికొక ప్రామాణ్యం ఏర్పడ్డది.

తెలుగు భాషా సంస్కృతులకు ప్రమాణ భాష ఒక ప్రతీక ది.

ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలైన వాటి లాగా దీని ప్రమాణీకరణకు లు జరగక పోయినా దీనికి సార్వజనీనత ఏర్పడ్డది. వైవిధ్యం అయినప్పటికీ తొంభై పాళ్ళకు పైగా ప్రమాణ భాషలో ఏక ఉన్నది.

ప్రమాణ భాష చదువుకుంటేనే అలవడుతుంది. అంటే భాష నేర్చుకోటం, నేర్పటం చదువు ప్రయోజనాల్లో యినవి.

చదువు వల్ల వ్యక్తుల సామాజిక స్థాయి పెరుగుతుంది. ఇక్కడ వే ఇంగ్లీషు మాధ్యమంగా నేర్చుకునే చదువు కాదు.

ప్రమాణ భాషలో ఏ విషయాన్ని గురించి అయినా చ్చు. ఏ యితర భాషా పదాలనైనా అవసరాన్ని బట్టి ప్రమాణ తెచ్చుకోవచ్చు. శాస్త్ర వైజ్ఞానిక విషయాలకే కాక సృజనాత్మక ఏ కూడా పనికి వచ్చేది ప్రమాణ భాషే. ఈ సాగుదల టీ) మాండలికాల విషయంలో సాధ్యం కాదు.

కారణాలవల్ల ఒక సృజనాత్మక రచనలో పాత్రోచిత ంత, వర్గ, వృత్తి, మాండలికాల్లో ఉన్నా రచయిత చేసే కథన తాత్విక చర్చ ప్రమాణ భాషలో ఉండడం వాంఛనీయం. క పదాలు ప్రమాణ భాషకు పుష్టిని ఇస్తాయి. ఈ పుస్తకంలో ఋనాస, గెగ్గిరెట్లు, కుశాల, ఒగిరింపు, కంతు, బాశాలి మొదలైనవి ఇలాంటివి. పుస్తకం చివర ఇతర ప్రాంతాలకు తెలియని మాటలకు అర్థాలిస్తే బాగుంటుంది. పదరూప నిష్పత్తి, ఉచ్చారణ, వాక్య నిర్మాణంలోనే మాండలికాలకు ప్రమాణ భాషకు తేడాలుంటాయి. కొత్త పదాలు ఎక్కణ్ణించి వచ్చినా ప్రమాణ భాషలో చేరవచ్చు. ఒక విషయం ప్రధానంగా గుర్తుంచుకోవాలి. రచనా భాషకు కేవలం మౌఖికంగానే ఉన్న మాండలికాలకు, ఉన్న సంబంధం ఇదివరకు గ్రాంథిక వ్యవహారికాల మధ్య రేగిన వివాదం వంటిది కాదు. ఆధునిక రచనా భాష -పూర్తిగా శిష్టులనబడే వాళ్ళ వ్యవహారానికి ప్రతిబింబం కాదు; ఉచ్చారణ లోనూ పదరూప నిష్పత్తిలోనే ఇది సన్నిహితం.

**4. ముగింపు :**

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి సృజనాత్మక రచనలు చేసేవారు, చేసినవారు. నాలుగ్గాళ్ళమండపం లాంటి రచనల వల్ల తెలుగు భాషకు మేలే జరుగుతుంది. రాయలసీమ జన జీవితం ఇతర ప్రాంతాల వారికి చూపటానికి పాత్రోచిత భాష పాటిస్తూ, ఇతర భాగం (రచయిత మాటలు, భావాలు, తార్కిక చర్చ, విమర్శ) ప్రమాణ భాషలో చేస్తే అయనకు శ్రమ తగ్గేది, పుస్తక ప్రయోజనం పెరిగేది. ఇది మిత్రుడిగా నా సలహా గానీ, ఈ ఉత్తమ గ్రంథం విలువ తగ్గించడం గాదు. రాచకొండ విశ్వనాథ శాస్త్రి కొడవటిగంటి కుటుంబరావు వంటి అగ్రశ్రేణి నవలాకారులు రచించిన మార్గం నేను సూచించిన మార్గం ఒక్కటే. ప్రపంచ భాషలన్నింటిలోనూ జరిగే పద్ధతి ఇదే. నాలుగ్గాళ్ళమండపం చదవటం నాకు ఆనందం కలిగించడమే కాకుండా ఆధునిక కాల్పనిక సాహిత్య రచనాశైలిని గురించి నన్ను ఆలోచించేట్టు చేసింది. పులికంటి ఈ అసామాన్యసృష్టిని అభినందిస్తూ నా కృతజ్ఞతను కూడా చెప్పుకుంటున్నాను.

# లక్షణమైన సన్మానం

**– కీ॥ శే॥ నూతలపాటి గంగాధరం**

కు సన్మానాలమీద నమ్మకం లేకపోయినా సన్మానం చేసుకునేవాళ్ళమీద నమ్మకం లేకపోలేదు. ఒక మంచి మిత్రుడికి, అంతకు మించి ప్రతిభావంతుడికి జరుగుతోందంటే అంతకంటే ఆనందం మరేముంది?

పులికంటి కృష్ణారెడ్డిగారికి జరిగే నేటి సన్మానం మా మిత్ర బృందానికంతా సంబరం.

సన్మానంలో రెండు విలక్షణతలున్నాయి. సామాన్యంగా కుర్రకారు కలిసి ఒక వృద్ధకవికి సన్మానం చెయ్యడం చూస్తాం. ఈ సన్మానం – అనుభవంలోనూ, లోనూ పండిన కవిపండితులు కలసి ఒక యువరచయితకు చేస్తున్నారు. ఇది మొదటి విలక్షణత.

న్మానం – యువరచయితకు చేసినా ఏదో ఒక అవార్డు సందర్భాన్ని పురస్కరించుకొని చెయ్యడం చూస్తాం మామూలుగా. ఈ సన్మానానికి అలాంటి లేమీ లేకపోవడం రెండవ విలక్షణత.

రెండు విలక్షణతలూ మిత్రులు శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారి విశిష్టతకు నిదర్శనాలు. వారిలోని ఈ విశిష్టతే లోకసామాన్య సందర్భాలతో నిమిత్తం సన్మానార్హమైందిగా మా గురుదేవులు భావించారు, నేనూ భావిస్తున్నాను. అదనంగా నా భావన ఏమిటంటే ఈ సన్మానమే మిత్రునికి ఒక వాంటిది.

ష్ణారెడ్డిగారు నటులు, రచయితలు, పత్రికా సంపాదకులు, అన్నింటినీ మించి మంచి మిత్రులు.

ముఖ్యంగా వీరు రచయితలు, కథ, కవిత, నాటకం, వ్యాసం ఇంకేదైనా సాహిత్య ప్రక్రియలు వీరికి అవలీలలైనా అసలు లీలమాత్రం కథానిక. వీరి చేతిక్రింద క్రొత్త సొగసులు పోవడమే కాదు, తెనుగు నుడికారంలోని తియ్యదనాన్ని సంతరించుకుంది. వీరి ఆకారంలాగే వీరి కథలకు కూడ పెద్దది. వీరి సంభాషణకు మల్లేవీరి కథనశైలి కూడా ఎదుటివాడి గుండెలో ఎక్కడ తడివుందో వెతికి పట్టుకుంటుంది. వీరి నెరేటివ్ పద్ధతి భూతద్దంలో పడానికి ప్రయత్నిస్తుందనడంలో కొంత చమత్కారం ఉన్నా దీన్నే సహజోక్తిలో అనాలంటే – అదనంగా రెండు మాటలు ఖర్చుపెట్టయినా చెప్పే న్ని రసవత్తరం చెయ్యడానికి ప్రయత్నిస్తుంది వీరి రచన. ఈ నిజాన్ని వీరి 'కామధేను' సంపాదకీయాలు మరింత రుజువు చేస్తాయి.

న్ను కాదన్న దేన్నీ లక్ష్యపెట్టక తిరగడం వీరి స్వభావం. ఏ వేళలోనైనా మిత్రులతో కలిసి సరదాగా నవ్వుకోవడం, మిత్రులుకోరితే కొండమీద తెచ్చిపెట్టడానికి సిద్ధపడటం – వీరి సరదాలు.

నమీదా, తన శక్తిమీదా, తను నమ్మిన నమ్మకాలమీదా నమ్మకమైన నమ్మకమున్న నమ్మదగిన మనిషి సన్మాన సందర్భంలో నా హృదయపూర్వక వలు తప్ప మరేమివ్వగలను?

# మళ్ళీ మహాభారతాన్ని చదివినంత అనుభూతి!

## ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు

హ్రదయం ఆత్మతలుపును తట్టి సంయోగ పారవశ్యంలో పొందే ఒక స్థితి అనుభూతి. అనుభూతి అనుభవంతో ముడిపడింది. అభీష్టమైన ఆత్మీయులతో చర్చిస్తూ విషయ స్వారస్యాన్ని చవిచూడడం ఒక ి. ఆత్మకింపైన భోజనం ఒక అనుభూతి. మనసిచ్చి పుచ్చుకొన్న వాళ్ల పాల్లో తేలియాడడం ఒక అనుభూతి. తలనెరిసిన కాలం తమాషాలు బే గతస్మృతుల మలుపుల్లో తడిసి ముద్దవడం ఒక మధురానుభూతి. లకు అంతంలేనట్లే అనుభూతులకూ అంతంలేదు. అయితే ఒక వ్యాన్నో గ్రంథాన్నో చదివినపుడు పొందే అనుభూతి మాత్రం అన్ని కులు కంటే అతీతమైనది – నామట్టుకు నాకు!

దుకే మహాభారతాన్ని నేను తొమ్మిదిసార్లు చదివాను.

షాశాస్త్రం నా అభిమాన విషయం. మాటల్లోమర్మం... ఊర్ల పేర్ల వేర్లు త్తుకోవాలన్న తపన తపస్సుగా మారితే ఉడతాభక్తి కృషిచేశాను. హిత్యం నన్ను ఆకట్టుకొన్నట్టుగా ఆధునిక సాహిత్యనాడిని నేను క పోయాను. అది నాలోపమేకావచ్చు!

ారణంగా నేను ఒక కావ్యాన్ని కానీ లేదా ఒక గ్రంథాన్ని కానీ కనీసం చదివితేనే 'ఫలానా పుస్తకాన్ని చదివాను' అంటాను. అంతకు తక్కువ ఆ పుస్తకాన్ని చూశాను' అంటాను. ఈ మేరకు నేను ప్రాచీన ్ని చదువుకున్నాను. ఆధునిక సాహిత్యం చూశాను.

ుతే ఆధునిక సాహిత్యానికి – అందులో పూర్తి మాండలికానికి చెందిన కృష్ణారెడ్డిగారి నాలుగ్గాళ్లమండపాన్ని మాత్రం చదివాను. ఈ మాట ి ఇంత ఉపోద్ఘాతం అవసరమైనది.

ాట కామాట చెప్పుకోవాలి. నాలుగ్గాళ్ళమండపం చదివినపుడు నాకు హాభారతాన్ని చదివినంత అనుభూతి కలిగింది. అతిశయోక్తి ూ? అయితే దానికీ నాకూ ఆమడల దూరమే! ఉన్నది ఉన్నట్లు ులిపినట్లు దులిపేయడం తప్ప అత్యుక్తులకు అశక్తుణ్నే! లయాల చరిత్రలో ఇది చాలామంది అనుభవానికి వచ్చిన సత్యమే! ళ్లకు ఒక నమస్కారం. నమ్మనివాళ్లకు పదివేల నమస్కారాలు!

తకూ ఈ పులికంటి కృష్ణారెడ్డి ఎవ్వరో నిన్నమొన్నటి వరకు నాకు తెలియదే! అసలు మా పరిచయమే అత్యంత యాదృచ్ఛికం. ఏడో ఆయన. ఆరో దశకంలో నేను. ఈ దశలో జరిగిన పరిచయం మా పెనవేసి... అన్నా తమ్ముళ్ల బాంధవ్యానికి ముడేసి ఈ కాగితం మీద ిదగడానికి పాదు కట్టించిందిమాత్రం – అక్షరం సాక్షిగా నాలుగ్గాళ్ళ ు!

్ వాస్తవాలు అద్భుతాలు కావడమంటే ఇదే!

ద్భుతం జరగడానికి కారకుడు ఆచార్య సర్వోత్తమరావు. ఆయనకు ుగా ఋణపడి ఉండాలి. ఆ సంగతీ చెప్తాను.

కొద్దిరోజుల్లో విశ్రాంతజీవితం ఆహ్వానం పలుకుతున్న సమయంలో ్శ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో మిత్రులు ఆచార్య పి. ెడ్డిగారి నుండి ఆహ్వాన పూర్వక వర్తమానం అందింది. పాఠ్య ర్చాసదస్సులో పాల్గొనమని ఆ వర్తమానం, ప్రణాళికలో ప్రయోజన ర్పులు చేర్పులు సూచించడం.. ఇతరుల సూచనలు విశ్లేషించడం– నిర్వహిస్తున్న ఉద్యోగపరమైన బాధ్యత అయితే, ఈ అవకాశం సాటిమిత్రుల్ని కలుసుకోవడానికి లభించిన సదవకాశంగా భావించి తిరుపతి ప్రయాణం. ఇది జరిగింది నిరుడు మే మాసంలో. సదస్సులో కర్తవ్యనిర్వహణ నిమిత్తం విశ్వవిద్యాలయ అతిథి గృహంలో మకాం. సదస్సులో పాల్గొన్న సహృదయ మిత్రుల సమాగమం. సమాలోచనల సౌరభంలో కాలం కమ్మగా కరిగిపోతూ ఉంది.

వివిధ విశ్వవిద్యాలయాల్లో ఆంధ్రశాఖలో ఆచార్యులుగదా? విభిన్న విషయాలమీద చర్చకూడా ఆసక్తికరంగానే సాగుతూ ఉంది. ఒకరోజు మిట్టమధ్యాహ్నం ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు పనిగట్టుకొని నావద్దకు వచ్చారు. అంటే ఏదో ఒక సంశయం పురుగు మెదడు మొదళ్లను తొలిస్తేకానీ ఇల్లువదలలేని వేళ అది! వచ్చి కూర్చుంటూనే–

"గరువుగారూ! నిన్న రాత్రి మీరు మాటల మధ్యలో బుద్ధుడు ఆంధ్రుడన్నారు. ఇదేమాట మా విశ్వవిద్యాలయానికి వచ్చినప్పుడు కూడా అన్నారు. నిజంగా ఈయనకేదో తలతిక్కపట్టిందని నాలోనేను నవ్వుకొన్నాను. కానీ రాత్రి మీరిచ్చిన వివరాలు కొన్ని సహేతుకంగా తోచాయి. అయినా మరికొన్ని సందేహాలు పీడిస్తూనే ఉన్నాయి. ఈ అపరవేళ ఆ సందేహ నివృత్తికోసమే వచ్చాను" అన్నారు.

"అయ్యా! ఈ విషయంగా నేను వివరింప వలసిందంతా వివరించే ఉన్నాను. కాదుగీదంటే మీ సంశయాలను ప్రశ్నలుగా సంధించండి. సమాధానాలు చెప్తాను." అన్నాను.

నా వివరణ పూర్వక సమాధానాలతో సంతృప్తి చెందిన ఆచార్య లక్ష్మీనారాయణ –

"ఇది తప్పక వెలుగులోకి రావలసిన ముఖ్యమైన విషయం. అశ్రద్ధ పనికిరాదు. వెంటనే వ్రాసి ప్రచురించండి. లేదా నేనైనా ప్రచు రిస్తాను." అన్న అభినందనపూర్వకమైన హామీతో వెళ్లడానికి ఉద్యుక్తుడ వుతున్నవేళ – ఇద్దరు అపరిచితులు వొకింతసంశయాన్ని ముఖాలకు తగిలించుకొని గదిలోనికి అడుగుపెట్టారు. అందులో ఒకాయన ఒకపాటి ఎత్తరి. ఎత్తుకు దగ్గలావు. దేహచ్ఛాయ నాకంటే కొంతమెరుగు. రెండవవ్యక్తి ఆయనకు తోడుగా వచ్చినట్లుంది. ఆగంతకులు నా చూపులకు ఒదిగినా 'ఎవరా?' అన్న ప్రశ్నను మాత్రం భృకుటి ముడి వ్యక్తంచేసింది. గ్రహించినట్లుగా –

"నేను పులికంటి కృష్ణారెడ్డిని, కలిసి వెళదామని వచ్చాను". అన్నాడు మొదటి వ్యక్తి.

నిజం చెప్పాలి. పేరు వినినట్లే ఉంది. అయితే ఆ పేరు నంటిన ఇతర విషయాలేమీ స్మృతిలో మెదలలేదు. ఆ సంశయాన్ని వెనక్కునెట్టి సభ్యత ముందుకు వచ్చింది! కూర్చోండి! అన్నాను. కూర్చున్నారు. అప్పటికే ఆ గదిలో వున్న కె. దామోదరనాయుడు, మా చక్రవర్తి గూడపాటి సాంబశివరావు ఆచార్య లక్ష్మీనారాయణ ఆతనిపట్లచూపిన గౌరవభావం నిద్రపోతున్న నా ఆలోచనల్ని తట్టిలేపాయి!

"ఒక ప్రసిద్ధుడైన వ్యక్తి నన్ను వెదుక్కొంటూ వస్తే ఆయన స్మృతి మతిలోకి రాక సారించిన అపరిచితపు చూపులు.... కనీసం మర్యాద కోసరం తెలియకపోయినా తెలిసినట్లు నటించే చేతగాని తనం ఎదుటి వ్యక్తిలో ఎలాంటి

ప్రాయాలకు దారితీశాయో - నాలాంటి ఒక వ్యక్తిని కలవడానికి ప్రసిద్ధుడైన
తనకు తానుగా వస్తే ఎదురైన పరిస్థితికి ఆయన స్పందన ఏమిటో అన్న
దేహం నన్ను ఇబ్బంది పెడుతుంటే - ఏదైనా మనసులో పెట్టుకొని మగ్గే
పావం కాదు కాబట్టి -

"అయ్యా! మీపేరు చెప్పగానే మిమ్మల్ని గుర్తుపట్టవలసినా గుర్తు లేకపోయాను. మన్నించాలి. ఆధునిక సాహిత్యంతో నా పరిచయం కంతమాత్రమే. మీరు అన్యథా భావించకండి, అయినా మీరు నన్ను క్కొంటూ రావడం నాకు చాలా ఆనందంగా ఉంది. ప్రత్యేకించి నన్ను గాల్సిన అవసరం ఏమో చెప్పండి." అంటూ ముందుగా ఆయన్ను గూర్చి తెలియని వాస్తవాన్ని నిర్మొహమాటంగా వ్యక్తం చేశాను.

దాపరికం లేని నా తత్వాన్ని ఆయన చిరునవ్వు అభినందిస్తుంటే,

"నన్ను గురించి మీకెంత తెలుసో అంతమాత్రం కూడా మీగురించి తెలియదు. ప్రాచీన సాహిత్యంమీద నా పట్టు మీ ఆధునిక సాహిత్య నికి ఏమాత్రం తీసిపోదు. కాబట్టి మనం ఒకరినొకరు అపార్థం వాల్సిన అవసరమే లేదు. సరిగ్గా పదిహేను నిముషాలకు ముందు ఆచార్య క్షమరావు గారితో ఉన్నాను. ఆయన అన్నారు. "రెడ్డిగారూ! మీరు తప్పక ల్సిన వ్యక్తి యూనివర్శిటీ గెస్టహౌస్‌లో ఉన్నారు. పేరు యార్లగడ్డ ంగాధరరావు. నాగార్జున యూనివర్శిటీలో ఆచార్యులు. వెళ్లికలవండి" ‌ు. 'బొత్తిగా పరిచయం లేని వ్యక్తిగదా?' అని సంకోచిస్తే - 'కలిసిన త నన్ను కలవండి' అన్నారు నవ్వుతూ! ఒక మంచి మిత్రుడి మాటమీద ంతో మిమ్మల్ని కలవడానికే వచ్చాను' అన్నారు.

అదే మా మొదటి పరిచయం

'ఏం చేస్తున్నారు?"

'కథలు రాసుకొంటున్నాను."

అది సరేనయ్యా! నేను అడుగుతున్నది బ్రతుకు కథను గురించి"

అంటే?"

అదేనయ్యా బువ్వకత"

అక్షరమే బువ్వ పెడ్తూ ఉంది."

కు చాలా ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే - వేలాది రూపాయల జీతం. రాడు నెలల్లో పదవీ విరమణ. అదే జరిగితే వ్యాసంగం మాట అటుంచి ముమెలాగా? అన్న సందేహం అప్పుడే ఈ మనసును పట్టి సలుపుతూ యినా నిజమా? అని అడగలేదు. కారణం ఈలాంటి సమాధానమే ండలో శ్రీ పురాణపండ రంగనాథ్ నుంచి విన్నాను కాబట్టి! -

రుబ్బు! ఎంత ఆత్మవిశ్వాసమో? - నా మట్టుకు నేనూ ఆత్మవిశ్వాసం అనుకొంటూ ఉంటాను. అయితే ప్రావిడెంట్ ఫండ్ ఇతరత్రా వలన కలిగే ఆర్థిక ప్రయోజనాలున్నా రిటైర్మెంట్ తరువాత నం ఎన్నో సమస్యలతో ముడిపడి భయపెట్టుతున్న నాకనిపించింది శ్వాసమనే పదానికి సరైన అర్థం అందిరాలేదని! ఎన్నో పదాలకు లకు మూలాల్ను వొడిసిపట్టుకున్నానన్న అహంకారం కాదుగానీ - కుతున్న నాకు - అప్పుడు జ్ఞానోదయం కలిగింది - భావనను డం కాదు కావలసింది - దానికి మూలమైన చేతనా వ్యాఖ్యానాన్ని మాటలోకి ఒదిగించుకోవాలని!

త్మవిశ్వాసం శ్వాసగా మారి అధ్యాపకవృత్తి ఆశ్వాసాలను పరిహసిస్తుంటే సానికి హద్దులు వెదికే ప్రయత్నంలో నేనున్నా!

ంతా ఏమీ పట్టించుకోని ఒక సాదాసీదా వ్యక్తిగా "మీరు నమ్మినా మనా అక్షరాన్నే నమ్ముకున్నాను. ఆ నమ్మకాన్ని ఆచరణ రూపంలోకి తేవడానికి ప్రతిబంధకమైన రైల్వే ఉద్యోగాన్ని వదులు కొన్నాను. పువ్వులమ్మిన చోట కట్టెలమ్మాను. అయిదుమంది ఆడపిల్లలను పెండ్లిండ్లు చేశాను" అన్నాడాయన.

ధీరత్వానికి వ్యాఖ్యానం నిజంగా అప్పుడు దొరకిందినాకు.

తాను వ్రాసిన 'నాలుగ్గాళ్లమండపం' నాచేతిలో పెడ్తూ 'సెలవు' అన్నాడు.

"ఇంతకూ మీరు వచ్చిన పనిచెప్పనే లేదు" అన్నాను.

"ఏమీలేదు. ఒక సాహితీవేత్తచెప్పారు - మరొక మంచి సాహితీ మిత్రుడు అందుబాటులో ఉన్నాడు కలవండని. కలిసిన తృప్తి మిగిలింది. అంతే!" అన్నాడు.

"అయితే మంచిదే. మళ్లీ సాయంత్రం కలుద్దాం!" అన్నాను.

'సరే!' నంటూ బయలుదేరాడు.

మాటల్లో పడ్డాం కదా! - భోజనం వేళమించింది. సమయం దాటితే అది సమకూరే అవకాశాలు అక్కడ తక్కువ. అయితే ఆ అతిథి గృహంలో నామంచిచెడ్డలు గమనించే ఒకవ్యక్తి దొరకడం నాఅదృష్టం. ఆ పూటకు అంత పెరుగన్నంతో తృప్తిపడి నాలుగ్గాళ్లమండపం చేతికి తీసుకొని పక్కమీదికి వాలాను. అన్నపు మత్తు అరగడియ కదా? అది ఆవహిస్తూ ఉంది. పుస్తకం చదివిస్తూ ఉంది. మత్తు మతిని మరిపిస్తూ ఉంది. ఇదికాదు పని అని లేచి కూర్చున్నాను. పుస్తకం ఆసాంతం పూర్తిచేశాను. ఏదో ఒకరకమైన అవ్యక్తభావధారమనసును ముంచెత్తింది. తీవ్రతరమైన ఆలోచన 'నాలుగ్గాళ్ల మండపాన్ని ఎలా నిర్వచించాలి?' అని తికమక పెడుతూ ఉంది. పెద్దలు ముందు మాటల్లో వారి వారి అనుభూతిని వ్యక్తీకరించారు. ఎవరిభావనలు వారివి. అయితే అది అంతమాత్రమే కాదన్న సందేహం. అయితే అది ఎంతమాత్రమో అందిరాని సందిగ్ధం. భావం భాషకు ఒదిగి ఒకరూపాన్ని సంతరించుకో లేని నిస్సహాయస్థితి - వివరణకు లొంగని ఒక చిత్రమైన స్థితి. ఆ స్థితిలో ఆలోచనలు రెక్కలు విప్పుకొన్నాయి.

చిత్తూరు జిల్లాలో ఒక మారుమూలగ్రామం మిద్దూరు. మిద్దూ రోడు కృష్ణారెడ్డి చదువు నిమిత్తం తిరుపతిలో అక్కగారింటికి చేరాడు. అకారణంగా అందరి లాగానే ఎన్నోమారులు స్వగ్రామానికి రాకపోకలు. అది తత్కాలీనకార్య నిర్వహణం. అంతే! కాకపోతే పుట్టి పెరిగిన మట్టిమీద మమకారం. చిన్ననాట పసి మనస్సుల్లో బలమైన ముద్రవేసిన గ్రామీణ కుటుంబ జీవన సరళి అందరికీ జ్ఞాపకం ఉంటుంది. అప్పుడప్పుడూ అది మనో నేత్రం ముందు వద్దన్నా కద్దన్నా తెరలుతెరలుగా దర్శనమిస్తూ ఉంటుంది, దానికి తగిన నేపథ్యం వర్తమానంలో చోటుచేసికున్నప్పుడు. లేకపోతే లేదు. కారణం తత్కాలీన కార్యవ్యగ్రత. కానీ అది కృష్ణారెడ్డికి నేపథ్యంకాదు. నిరంతరం ప్రత్యక్షం. కాకపోతే - అమ్మ ఎర్రగడ్డలు ఒక సంతకు.. తమలపాకులు మరొక సంతకు అమ్ముకోడానికి పోయిన సంగతులు... బానామొకు... ముత్తేలు చెరకు తింటూ పడిన వగలు... ఆకుతోటకు కంచెవేయడం... తీగె దించడం.. చింతచెట్టు కింద ఇస్కూలు... కానబాయిలో కప్పల అరుపులు... పొయ్యి మండకపోతే అమ్మ ఊదనబుర్రతో పుర్‌పుర్‌మని ఊదడం... అప్పావుపిళ్ల అయ్యోరు... పరవగుట్ట... దుర్గంరాజులకయ్య... అంగిడోళ్లపాదులు... ఎద్దుచ్చులు పోసినట్లున్న చాళ్లు... చింతమాని కిందకొలిమి... సవరమట్టాకలబందనార... ఆకుపచ్చని దుప్పిటి మింద అద్దకం అద్దినట్లుగా గుంటనిండికి దామరపూలు... చెరుకుగానిగి ఆడినన్నాళ్లు కయ్యిలో కాపరం - ఇలా ఎన్నెన్ని విశేషాలు?... వాటిచుట్టూ అవరించుకొన్న జీవనం.... ఆ శైలి - ఎంత గొప్పగా చెప్పాడు? - అయినా ఇంతమాత్రమే అయితే అది పల్లెటూరి జీవితానుభవ స్మృతి శకలాలుగా కొట్టి పారెయ్యచ్చు. ఈమాత్రం రాయడానికి కృష్ణారెడ్డే కావాలా?

ఘకొండల వాడు ఏడాదికొకమారు చిత్తూనూరు పయనం... ఆ పార్టీవాళ్లు
ాళ్లు ఉన్న ఉద్యోగాల్ని పంచుకొని వేలంపాట పెట్టడం... ఎమ్జీఆర్
మందికి మారాముళ్లు... జానకి జయ లలితల కొట్లాట... జనాల
. సబ్సిడీ రేట్లో చవగ్గా దొరికిన ఎండ్రిన్... సాలంతా యాతన పడ్డా
స నోచనిరైతుల ఆత్మహత్యలు.... బాయిలో బండపడితే బతుకు
ప్రలైన తీరు... వేమన్న పద్యాల్ని పుణ్యంకట్టుకొన్న బ్రౌనుదొర కత...
ృదయంపై అన్ని పార్టీల మొసలికన్నీళ్లు - ఇలా సీమబ్రతుకుల్ని
సినవైనం.. వీటన్నింటిని గుదిగుచ్చడానికి ఆయన కొదిగిన రాయల
ం... దానికి తోడు లెక్కకు మిక్కిలైన పలుకుబళ్లు, సామెతలు, ఓహ్!
్రను. కస్తూరిబాయి సందులో సగం రేత్రి కాడ కస్తూరి ఇంటి తలుపు
ే సంగతి నుంచి సగంరాత్రి వేళ గడియారంలో ముల్లుమీద
సరసం వరకు సకల విషయాలకూ, రచ్చబండ అయిన నాలుగ్గాళ్ల
ఇది సెటైరా? అవునంటే అవుననిపించవచ్చుకానీ నిజానికి నాకిదొక
ంగా సాక్షాత్కరించింది.

వేదాంతి... ఒక రాజకీయవేత్త... ఒక కథకుడు... ఒక కవి - మించి
ఖుడుగా ఆయనమీద గొప్ప గౌరవభావం కలిగింది. అంతే! ఏదైనా
ిద్యాలయం ఈయనకు డాక్టరేట్ ఎందుకు ఇవ్వకూడదు? అన్న
కలిగింది. వెంటనే ఆలోచన అక్షర రూపాన్ని సంతరించుకొనింది.
చాలిన వారికొక విన్నపం. అలాచేయకపోతే అదొక అపరాధ
దని నానిశ్చితాభిప్రాయం. ఇవేమీ ఆయనకు తెలియవు!

టప్రకారం ఆ సాయంత్రం ఆయన రానేవచ్చారు. కుశాల
లు నెత్తికెక్కితే కాలం మాతో కలిసి కులికింది. అప్పుడన్నారు.
ిడ్ల రాయల సీమచిన్నోణ్ణి! అని. నమ్మశక్యం కానిమాట. కానీ
్షంగా 'అన్నయ్యా!' అన్నాను. 'ఒరే తమ్ముడూ!' అన్నాడు.
లు లేని ఆ పిలుపులో ఎంత ఆప్యాయత! అన్న సప్తతి అభినందన
ఇది తమ్ముడి ఉపాయనం. ఆయన భాషలోనే పలకరించాలన్న
ం! - చూడండి.

న్నా! కిష్టారెడ్డన్నా! బాగుండావా? మీ బాశాలిబాగుండాదా? మన
న్న ఎట్టుండాడు? ఈసారి కనిపిస్తే అడిగినానని చెప్తావా? ఆయన
ఏమనిచెప్తావ్? - ఆయన్ను నువ్వు ఎరగవు. నిన్నాయన
ిచెప్పు. అవునుగానీ - నీకు డెబ్బై ఏండ్లా? - ఇంకా జాస్తిగా
? - వయస్సు అడిగితే ఆడోళ్లు మూతి మూడు తిప్పులు తిప్పుతారు
ి? మణుసు ఇంకా మనుగుడుపుల కాడనే ఉండాదిగదా? -

ోకేం గానీ - ఒక్క డెబ్బై ఏండ్లకే ఓయబ్బ! ఇంత యేదాంతం ఎట్లా
ందబ్బా నీకు? - మరి ఇన్నేళ్లొచ్చాక ఇప్పుడు తగిలావేంది నాకు? -
డ్డిలో మెల్ల. ఇప్పుడైనా తగిలావు. అప్పుడప్పుడు నీకతలు కవిత్తాలు
చూస్తా ఉంటిగానీ నువ్వింతటోడనుకోలా. ఇదిగూడా మాట
ూటే. ఇంతకూ నువ్వెంతటోడివో అంతు చిక్కలా. అవునూ! నువ్వు
ంమారి వంటగదా? అదేలే కతలు రాస్తావంటగదా? నువ్వు ఏమన్నా
ను నీకతలు కవిత్తాలజోలికి పోలా. నువ్వా పుస్తకాలిచ్చినా తొలీతగా
సణ్ణిందే నాలుగ్గాళ్ల మండపం. ఇంకచూడు నాసామిరంగా!
ంలే నాబుగులు. సత్తింగా చెప్తా ఉండా. నాకు రొంత ఈసుపుట్టి
ఒక మారుమూల కొంప మిద్దూరి రెడ్డోడు బతుకును వొడిసిపట్టి
ి ఇడమర్చిచెప్పనాడే అని! చేతికొచ్చిన కావ్యాన్నంతా ఈకడనుండి
చదివినా! ఒక సారిగాదు. ఎన్నిసార్లో. నాకదొక మునాస. ఆ మణు
అర్తమైనకాడికి అర్తమాయెకానీ ఈమణుసులకత అయోమయంగా

ఒకేళ మతికందొచ్చినా మాటకంది రాలేదే? ఆ ముచ్చట నీమూలాన తీరె. అందుకే నాకు శానా కుశాలగా ఉండాది. ఎందుకంటే నామాట కందంది నీమాట కొదిగింది. అందుకే నువ్వు నాకు శానా అయినోడి వనిపించె. అది అంతేనబ్బా! జలమజలమల అనుబందమంటారే - అదంటే ఇదేనబ్బా. మల్లా మీయమ్మను గురించి రాస్తివిగదా? ఆమెను నేనెప్పుడైనా ఈకంటితో చూసినానా? లేదే! - అయితే చూసినట్లే ఉండెనే. కాదు - నాకూ అమ్మేనని పించెనే. మీ సీమకు నేనెపుడూ వచ్చిందిలే. అయితే నువ్వురాసింది చదవతా ఉంటే ఆడంతా నేన్ను తిరుగులాడినట్టుండెనే. ఇంక ముత్తారెడ్డంటావా? - నాకు బాగా ఎర్కైన మణిసే అనిపించెనే! - అదట్టా! ఉణ్ణీ -

నాలుగ్గాళ్లమండపం! మాయబ్బసాచ్చిగా చెప్తా ఉండా. అదొక మామూలు పుస్తకం అనిపించలా. అదొక వేదం. ఈమాటింటే లోకులు కాకులు. ఎంత అబిమానముంటే మాత్రం వేదంతో పోలస్తాడా?" అని పాటిక్ పాటిక్ మని ముక్కుల్తో పొడవరా? అట్టాపొడ్సే వాళ్లు వేదంలో ఏముండాదో ఎప్పుడైనా చూసినారా? అని. 'పోనీ! నువ్వు చూసినావా?' అని అడగతారేమో? చూసేది గాదు - చదివినాను కాబట్టే చెప్తా ఉండా! అది ఆకాలపు బతుకుబాటకద్దం. ఇది ఈకాలపు బతుకుబాటల ప్రబందం. ఒక్క మాటకారితనం తప్ప అదిచెప్పిందీ ఇది చెప్పిందీ రొండూ వొగిటే!

రాయలసీమ మాటల్లో రతనాలసీమై శాతల్లో ససిలేక రాళ్ల సీమగానే ఉండే వైనమేందబ్బా? ఇంద్రుణ్ణి వేడుకుణ్ణారు. వృత్రాసురుణ్ణి చంపేసి వాన కురిపించమని. ఆ ఇంద్రుణ్ణి మనం ఎప్పుడూ చూడలా. వాళ్ల నమ్మకాని కొకరూప మిచ్చినారంతే! ఈనాటికి మనకందిరాని చేతతో యాగం చేసినారు. కరుడు గట్టిన మేగం కరిగింది. వానకురిసింది. అందురికి అంత అన్నం దొరికింది. లోకం సంతోసించింది. మరి మనం దానెబ్బట్టాయాగంలో సమిదెల మాదిరి ఓట్లేసి గెలిపిస్తిమిగదా? ఇక్కడ వృత్రాసురు డెవుడూ లేడే? మంది ఉంది. మార్బలముంది. మతి ఉండే మంచోళ్లుండారు. కానీ మన కోరికలు తీర్తా ఉండాయా? సీమకిన్ని నీళ్లు దక్కినాయా? కన్నీళ్లుదప్ప. ఈమాటే గదన్నా నువ్వుచెప్పింది. ఈ ఒక్కమాటేనా నువుచెప్పింది? మనబతుకులు బాగుపడేదెట్లనో? అవి అమ్మబోతే అడివి కొనబోతే కొరివిగా ఎందుకు అగ్గిపడిపోతా ఉండాయో? అంతా పొందువొల్సి అరిచేతిలో పెట్నిట్టుగా చెప్తివిగదా! మరి ఇది వేదంగాదా? ఇది ఈనాటివేదం. జీవననాదం. దాన్ని గొంతెత్తి పలికినోడు ముత్తారెడ్డన్న. అదొక ముగతాయింపయితే మీ బాశాలిది తాళం. నీదిపల్లవి! అనుపల్లవి మీయమ్మది మరికొందరిది. ఇదొక జీవన నాట్యవేదం. జాయప నుడులకు శిల్ప వ్యాఖ్యానం రామప్పగుడి. ఈ కాలంలో సమస్తజీవవానికి అచ్చిరరూపవ్యాఖ్యానం నాలుగ్గాళ్లమండపం! అవునంటే కాదనే వాళ్లు ఎప్పుడూ ఉండారు. వాళ్లు ఊరుచూడమంటే ఉత్తరం చూసేవాళ్లు. వాళ్లనట్టుండనీ!

అవునుగానీ ఇంత చదువుయాడ చదివితివన్నా? - ఇదంతా ఒక జీవిత కాలంలో అబ్బే విద్దెగాదే! - ఎంత పున్నెం చేసుకుంటివో? అయినా ఆపున్నెం నీదిగాదులే. నిన్ను కన్నోళ్లది. అదురుష్టమంటే నిన్ను చదివినోళ్లది!

మీ అయ్య కిష్టపరమాత్తుడి మాదిర్తో బతుకుసారాన్ని గీతాసారానికి ముడేసిచెప్తే నువ్వు చెప్పింది ఒక్క కతా? రొండుకతలా? తిరుగు మరుగులేని బతుకు బారతం కత గదానువ్వు వొలకబోసింది. బారతాన్ని ఆకాలాన యాసబగవాన్లు ఆ బాసలో చెప్తే ముగ్గురు మొగలాయిలు మునం పడ్తే పంచమవేదం మనకు దక్కె. ఆమాటకొస్తే బారతమంతా బాదరాయణ సంబందమే గదా? బాదరాయనికి అయినోళ్లెవురు? కానోళ్లెవురు? తనామనా ఎంచకుండా హంస పాలను నీళ్లను ఇడమర్సి నట్టు మంచేదో చెడేదో విప్పిచెప్పె. అటుమంటోణ్ణి అనాల మహన్నబావుడని. నువ్వా అట్లనే చెప్తివిగదా? -

లేకుండా దురుమార్గానికి తలపడినోణ్ణి ఎండగట్టివి గదా? ఎందుకీ – ఈ మట్టిమింద.. ఈ మట్టిని నమ్ముకొని బతికే మణుసుల మింద ం తోనే అంతపని కొడిగట్టివి. అయినా అన్నా! అడివిలో చెట్టు కొమ్మ కొమ్మా... రెమ్మ రెమ్మా... ఆకు ఆకూ మణుసిచ్చి మమకారం కుంటాయిగానీ – అటుమంటి గుణం ఈ మణుసుల కబ్బి ావా మన ఎర్రికానీ! పోనీలే అన్నా! ఇచ్చు ఇలంబరం బొచ్చు ం. దానికేం గానీ మన అమ్మ చెప్పిందంటివే! కష్టాల్లో వున్నోడికి వాడు రే శాత్తనైన కాడికి చెయ్యి అందించకుండా బోతే అటుమంటి జల్మం ిటే!.. ఊణ్ణా వొగిటే! అని. దాన్ని అబ్బిచ్చు కుణ్ణావ్. చాల్సాలు!"

చివరగా ఒక్కమాట. నాలుగ్గాళ్ల మండపాన్ని ఆరుసార్లు చదివితే కొద్దోగొప్పో పులికంటి యాస ఈ మాత్రం అబ్బింది. కేవలం యాస మాండలికత కాదు. మాండలికతను కేవలం భాషకే పరిమితం చేయడం శుద్ధతప్పు. ఒకజాతి సమగ్ర జీవన విధానాన్ని నుడికారాలు, సామెతలు పలుబళ్ల సంపదతో చిత్రిక పట్టడమే మాండలికత. ఈ దృష్టితో చూసినపుడు పులికంటి బతుకు పోయినా బతికించడానికి నాలుగ్గాళ్ళ మండపం ఈ సాహితీ లోకంలో రొమ్మువిరిచి నిలబడుతుంది.

అందుకే అన్నా! ఎంతో రాయాలని ఉంది. అయితే మతిలో ఉన్నది మాటగా మారలేదే? – అయినా నీసప్తతిలో నిలబడి చెప్తున్నా. నిండు నూరేండ్లు ఇలానే బ్రతుకు. కాలమున్నంతకాలం నువ్వుంటావు! ●

## రాయలసీమ ఆత్మకథ - నాలుగ్గాళ్ళ మండపం

సమాజం వ్యక్తిని తయారుచేస్తుంది. వ్యక్తి సమాజాన్ని వివిధ కళారూపాల్లో ఆవిష్కరిస్తాడు. సమాజాన్ని ఆవిష్కరించే క్రమంలో అక్షరాల్ని దృశ్యాలుగా ప్రదర్శించేది సాహిత్యం. సాహిత్యం సమాజానికి అద్దంలాంటిది. ఆ అద్దం సమాజాన్ని ప్రతిబింబిస్తుంది. సామాజిక ఆర్థిక రాజకీయ కళారంగాల్ని ంబించే ఈ అక్షర ప్రపంచం పైకి కనిపించే అంశాలే కాకుండా జీవితాన్ని వ్యక్తుల అనుభవాల్నీ కలిపి మానవ హృదయ లోతుల్ని స్పర్శించడం ది. అప్పుడది ఆత్మకథ మాత్రమే కాదు, ఒక సమాజపు ఆత్మకథ, ఒక ప్రాంతపు ఆత్మకథ.

పులికంటి కృష్ణారెడ్డి నాలుగ్గాళ్ళ మండపం రాయలసీమ ఆత్మకథ. ఒక ప్రాంతం ఆత్మకథ సార్వజనీనం అవుతుంది ఆవిష్కర్త ప్రతిభా పాటవాలనిబట్టి. ం ఏదైనా మనిషి అనుభవాలు, ఆలోచనలు, కన్నీళ్ళు, చిర్నవ్వులూ ఒకటే కదా!

నాలుగ్గాళ్ళ మండపం 'ఆంధ్రప్రభ' వారపత్రికలో కృష్ణారెడ్డి గారు రాసిన 'కాలమ్'. ఈ ఏభై ఏడు కాలమ్‌లు ఈ రోజు పత్రికల్లో వస్తున్న సరదా లు, స్పేస్ ఫిల్లర్‌లూ కావు. కథల్లాగా కన్పిస్తాయి కాని కథలు కావు. వీటిని మా వెంకటసుబ్బయ్య 'మిత్రవాక్యం'లో జర్నలిస్టిక్ స్కెచ్ అనీ అనుభవ అనీ అన్నాడు. రెండోది సరిగ్గా సరిపోతుంది. 'వ్యక్తిగత ఇష్టాయిష్టాలు మాత్రమే ఒక సామాజిక దృక్పథం అవదనీ, మిత్రవాక్యంలో ఆయనకీ టైన కరుకు మాట అననే అన్నాడు. పులికంటి రాసిన ఆనాటి రాజకీయ అంశాలని దృష్టిలో పెట్టుకుని ఇట్లా అని ఉంటాడు. అయితే ఇక్కడే నుభవానికి పులికంటికి ఏనాడు కొదవ లేదనడం జీవితాన్ని ఆవిష్కరించగల నేర్పరితనమూ వున్నాయనడం ప్రశంసే కదా. పులికంటి తన దృక్పథాన్ని ిట'లో చెప్పనే చెప్పాడు. 'నా దృక్పథం ఒక్కటే మనిషిని మనిషిగా ప్రేమించడం. నాకు 'ఇజాలు' తెలియవు. 'వాదాలు' తెలియవు. 'నిబద్ధత' తెలుసుకోవాలని ప్రయత్నించలేదు. 'వాదాల' లో పదును కేవలం పెదాల వరకే పరిమితం అని నా అనుభవం నాకు నేర్పింది' అని.

నాలుగ్గాళ్ళ మండపం ఒక అసామాన్య సృష్టి. భద్రిరాజు కృష్ణమూర్తి గారు ఈ విషయాన్ని విశ్లేషించారు. ముందు మాటని కేవలం 'flattery' అనే orthy praise" కే ఉపయోగించడం జరుగుతున్న ఈ రోజుల్లో ఈ విశ్లేషణాన్ని ఒక real estimation గా చెప్పుకోవాలి. పులికంటి రచనా ం – ప్రణాళిక, రాయలసీమ మాండలికాన్ని ఉపయోగించడం వంటి అంశాల వివరణ ఇస్తుంది 'అసామాన్య సృష్టి'.

ఒక సన్నివేశం, కథకుడు ఇతర పాత్రలతో జరిపే సంభాషణ, కథకుడి అంతర్మథనం, నాలుగ్గాళ్ళ మండపం దగ్గర విదురుడు లాంటి వివేక తయిన ముత్తారెడ్డితో మాట్లాడి తన మానసిక సంఘర్షణకి సమాధానాన్ని పొందడం అనుభవ మాలికలోని వివిధ అంశాల పకడ్బందీ నిర్మాణం.

నాలుగ్గాళ్ళ మండపం తిరుపతిలో ఒక నాలుగు దారుల కూడలిలో ఉన్న ఒక పాతరాతి మండపం, అది కేంద్రస్థానం. దీనిచుట్టూ ఆ ప్రాంత అదే ప్రాంతం భాషలో చిత్రించబడింది. రాయలసీమ మాండలికం ఇక్కడ హాస్యం సృజించడానికి వాడబడింది కాదు. ఏ మాండలికమూ ఏదో ఒక ి పరిమితం కాదు. కొత్తగా వింతగా కనిపించేదంతా నవ్వడానికే అన్న దురూహ మన సినిమా వాళ్ళకి ఉండవచ్చుగాక. విలన్లకీ, నౌకర్లకీ ఓ ిలికాన్ని ప్రత్యేకం చేయవచ్చుగాక. మాండలికం ఆ ప్రాంతపు జీవితానికి స్వరాక్షర రూపం. అందులో అన్నిరసాలూ ఉంటాయి. జీవితపు అన్ని ు వుంటాయి. అందువల్ల నాలుగ్గాళ్ళ మండపం 'రాయలసీమ ఆత్మకథ'.

నాలుగ్గాళ్ళ మండపంలో రచయిత సాంసారిక జీవితానికి – అతని భార్య, సామాజిక జీవితానికి ముత్తారెడ్డన్న వ్యాఖ్యాతలు. స్వాతంత్ర్య వీరుడు ్యలవాడ నరసింహారెడ్డి, మహాదాత బుడ్డావెంగళరెడ్డి, గజదొంగ అంబోదర గిడ్డడు. పల్లి పట్టు కొండారెడ్డి వంటి ప్రసిద్ధ పాత్రలతోపాటు తల్లి, అక్క, ాచలమూ, మిద్దూరి రామిరెడ్డి వంటి పాత్రలూ ఉన్నాయి. 'తావరం', 'జాతకసెత్రం'. నాలుగ్గాళ్ళ మండపాన్ని పరిచయం చేస్తే, వర్తమాన ిక, రాజకీయ అంశాలు రచయిత ఆలోచనల లోకంలోకి మనల్ని తీసుకుపోతాయి. రచయిత 'మేగ్నటిక్ టోన్' దృశ్యాల్ని పేరుస్తూ ఉంటుంది. ం పొదుపు సుకీబవ! చదువు'కొంటా' ఉండారు. కంచే చేను మేస్తే? ఈది నాటకం, గాందీబొమ్మ వంటి వ్యంగ్య కథనాలతోపాటు 'అంబోదర ' లాంటి కదిలించే కథలూ ఉన్నాయి.

నాలుగ్గాళ్ళ మండపం' అనుభవాల మాలికలో 'ముగింపు' ఒక ప్రత్యేక అంశం. ప్రతి కథనానికి చివర ముత్తారెడ్డి వ్యాఖ్య. రచయిత సంఘర్షణకి యడంతో పాటు అతను 'రిఫైన్' అయిందాన్ని తెలిపే ఒక epigrammatic వాక్యమూ వుంటాయి. మూడు వందల పేజీల రాయలసీమ ఫ, ఆ మాండలికంలో చదవడం ఆరంభంలో కొంచెం కష్టంగా అనిపించినా ఒకసారి దాంట్లో ప్రవేశించామా బయటికిరాలేం. క్రమంగా మన భాషనే చదువుతూ ఉన్నట్టుగా 'Immerse' అవుతాం. Any great literary work rises up from its region to the universe. 'నాలుగ్గాళ్ళ పం' ఇందుకు ఒక తిరుగులేని ఉదాహరణ!

**– ఆదివారం ఆంధ్రభూమి, 12 సెప్టెంబర్ 1999, పుస్తక సమీక్ష నుండి**



ఆంధ్రభాషా విశారద శ్రీ వై.యం. రె
విశ్రాంత ప్రధానోపాధ్యాయులు

# కృష్ణార్జునులు

, పులికంటి కృష్ణారెడ్డి ఒక మధ్య తరగతి రైతుకుటుంబంలో ెద్దింటోళ్ల అబ్బోడు'. ' మీసకట్టు' ఏర్పడకముందే ఆయన్ను ద్యోగం వరించింది. అయిదు దశాబ్దాల క్రిందట కేంద్ర ద్యోగి కావడంతో ఆయన ప్రతిభ అపాయకట్టు పల్లెల్లో తిరిగింది. ఆ ఉద్యోగాన్ని ఎంత సులభంగా సాధించారో అంత ానంగా వదిలేశాడు - రంగు పిచ్చితోనో... అధికార ల ముందు చేతులు కట్టుకొని నిలబడలేకనో!

సంఘటన అమాయక పల్లె ప్రజల్లో ఒకదుమారం లేపింది. ్ కాచుకొని కూర్చున్నారు గదా? - ఉద్యోగం ఊడగొట్టు ి దుష్ప్రచారం చేశారు కూడా. కానీ పులికంటికి ఆ పరిస్థితి ిలోనూ కలగదు. ఆ సంస్థ మీద ఆయనకున్న పట్టుకు నేను ్క్షిని కదా? ఒక చిన్న ఉదాహరణ:

లికంటి మామగారు గంజి వెంకట సుబ్బారెడ్డిగారికి ర్లు సోకి వ్యాధి బాగా ముదిరింది. ఆరోజుల్లో గచ్చాకు నాటు మందులే శరణ్యం. తిరుపతికి దాదాపు పదహైదు ారాన కొటాల. ఆ ఊళ్లో ఒక కుటుంబం మణికట్టు చుట్టూ దో మందాకు ఇవ్వడం తరాలుగా జరుగుతున్న తంతు. ి మామగారికి ఆ వైద్యం చేయించాలను కొన్నాడు. అయితే ి బస్సు సౌకర్యం లేదు.

ాల తిరుపతి పాకాల రైలు మార్గానికి పక్కన్నే ఉంది. లో పొద్దు పొడుపుతో బయలు దేరే రైలు ఎక్కాము. కొటాల్లో ుబడదు కదా? అని అనుకొంటూనే ఉన్నా ! అంతలోనే రైలు ఆగింది. మేము దిగాం. డ్రైవర్ టాటా చెప్తూ ఉంటే బండి దేరింది. తిరుగు ప్రయాణమూ అంతే !

రోజుల్లో ఈ సంఘటన పల్లెల్లో ఒక వార్తగా ప్రాకింది.

ాపు నాలుగు దశాబ్దాల క్రిందటనే ఆయన రైల్వే ఉద్యోగానికి ా చేసినా ఈనాటికీ ఆ సంస్థమీద తన పట్టు సడలలేదు! ప్రతిచిన్న పనికి ఆయన్ను ఉపయోగించుకొనే వాళ్లే దీనికి

ెజగడం ఇంటిదాకా అనే మనస్తత్వం ఉద్యోగాన్ని వదులుకొని కొని తెచ్చుకొనింది. అప్పటికే ముగ్గురు బిడ్డల తండ్రి. ికి కట్టెలమ్మాడు. కాఫీ పొడివ్యాపారం చేపట్టాడు. 'మాలికో ుకో కాఫీ!' అన్న అవహేళనకు గురయ్యాడు. కాఫీపొడి లో మెలకువలు గ్రహించి! 'మాలికోనే ఏలుకో!' అని చాడు. అచ్చుకూటమి నొకటి స్థాపించి సీసపు ముక్కల తో అచ్చనగాయలాడుకొన్నాడు. 'కామధేను' పక్షపత్రిక సంపాదకత్వం వహించి అవినీతి పరుల గుండెల్లో రైళ్లు పరుగెత్తించాడు. తనకాళ్లమీద తాను నిలబడిన తరుణంలో అన్నింటికీ తిలోదకాలిచ్చి అక్షరాన్ని నమ్ముకొని సాహితీ వ్యవసాయంలో తలమునకలవుతున్న పులికంటి వ్యక్తికాదు. ఒక మహాశక్తి!

పట్టుదల..., నిరంతర పరిశ్రమ.... ఏకాగ్రత... అనుకొన్నది సాధించే వరకు విశ్రమించని కార్యదీక్ష - పులికంటికి పెట్టని సొమ్ములు. అందుకే అసాధ్యాన్ని సుసాధ్యం చేసుకోవడం నల్లేరుపై నడక. 'ఆరంభింపరు నీచమానవులు' అన్న భర్తృహరి సూక్తి పులికంటికి అక్షరాలా వర్తిస్తుంది.

పులికంటిలో నాకు బాగా నచ్చిన సుగుణం - పరోపకారం అన్నంత పెద్దమాట ఎందుకు కానీ - ఎదుటివాడి కష్టాన్ని తన కష్టంగా భావించడం. వాడు తన వాడైనా పరవాడైనా వేరొకడైనా - సహాయాన్ని అర్థిస్తే అడిగిన వ్యక్తి బద్ధకించినా ఆ పని పూర్తి అయ్యేవరకు పులికంటికి కంటిమీద రెప్ప పడదనడం అతిశయోక్తి కాదు. ఇటువంటి మనస్తత్వం కలిగిన వ్యక్తులు చాలా అరుదుగా కనిపిస్తారు.

మాది చాలా పేదకుటుంబం. తల్లిదండ్రుల రెక్కల కష్టంతో సాగుతున్న సంసారం. ఆ దశలో తండ్రి గతించాడు. నా చదువు అర్థాంతరంగా ఆగిపోయింది. అప్పుడు మా పెద్దక్క భర్త ధూపం రామకృష్ణారెడ్డి గారి సహృదయత నా చదువు కొనసాగే అవకాశాన్ని కల్పించింది. మేడిపిడి పట్టిన చేతులతో సుద్దముక్కపట్టి బడిపంతు లయ్యాను. మా బావగారింటికి అల్లుడయ్యాను!

ఇది దాదాపు ముప్పై సంవత్సరాల క్రిందటి మాట. నా భార్యకూడా టీచర్ ట్రైనింగ్ పాసై ఒక గృహిణిగా జీవితం గడుపుతూ ఉంది. నేను పనిచేస్తున్న పెరుమాళ్ల పల్లె పంచాయతీలో ఒక ఖాళీ ఉంది. కష్టాల కొలిమిలో పుటం తేలిన జీవితం గదా? - వినయ విధేయతల్ని జీవితమే నేర్పింది. దాంతో స్పందించిన పంచాయతీ ప్రెసిడెంట్ ''రెడ్డిగారూ! ఎంప్లాయ్‌మెంటు కార్డు ఈచేత్తో ఇచ్చి ఆచేత్తో మీ భార్యకు టీచర్‌గా ఆర్డర్స్ తీసుకోండి'' అంటున్నారు. అలాంటి సదవకాశాన్ని జారవిడవడానికి మనసు అంగీకరించలేదు. అయితే ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసులో సీనియారిటీ లిస్ట్‌లో ఆమె పేరు ఎక్కడో ఉంది. అప్పుడు పులికంటి చిత్తూరులో రైల్వేలో పనిచేస్తున్నాడు. ఇది కానిపని అని మనసు హెచ్చరిస్తున్నా, అవసరం నన్ను పులికంటి కృష్ణారెడ్డి ముందు నిలబెట్టింది. చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు. తల పంకిస్తూ ఆలోచించాడు. బయలుదేరి వెళ్లాడు. ఎలా ప్రయత్నిం చాడో... ఎన్ని అవస్థలు పడ్డాడో నాకైతే తెలియదు. సకాలంలో కార్డు అందింది. ఆమె ఉద్యోగంలో చేరిపోయింది. ఈ రోజు ఆమె పెరుమాళ్లపల్లె ప్రాథమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయినిగా

ందంటే అది పులికంటి చేతిచలవే! అయితే చిత్రమేమంటే
ే ఆయన ఎప్పుడో మరిచిపోయాడు. ఆ మధ్య ఎలా ఋణం
ు? అన్నట్లుగా మాట్లాడితే ఆయన తేల మొగంవేశాడు!

ర్లూ పేర్లూ వివరాలు ఎందుకు కానీ - నా ఎరుకలో
ంది బంధువులకు ఆశ్రితులకు బ్రదుకు తెరువుచూపించిన
లికంటిది. వీళ్లంతా 'కృతజ్ఞత'కు అర్థంతెలిసి బ్రదుకుతున్నారో
ువాళ్లకు తెలుసు. ఇటు ఈయనకూ తెలుసు. ఆయన దేన్నీ
కోడు. భగవంతుని మీద అచంచలమైన విశ్వాసం. ఒకవ్యక్తి
కి వస్తే భగవంతుడే తనవద్దకు పంపాడని ఆలోచించే స్వభావం.
పెండ్లిపేరంటాలంటే పెద్దగా పట్టించుకోని ఈ మనిషి ఆపదల్లో
ంటే ముందుంటాడు. ఈ సుగుణం ఆయనకు జన్మతః
ంరం. అయిదు మంది ఆడబిడ్డల తండ్రి. ప్రతిబిడ్డ పెండ్లి
ందుండి నిర్వహించాను. ఒక సంపన్నుడి ఇంట్లో శుభకార్యా
ాత్రం తీసిపోని స్థాయి ఆయన పరపతికి నిదర్శనం!

ళ్ల కుత్సితాలకు అసూయా ద్వేషాలకు అతీతుడు కాబట్టే
ంతాలు నిండుతున్నా ముప్పై ఏండ్ల యువకులతో పోటీ పడ్తూ
' ఆరోగ్యంగా ఆనందంగా తిరుగుతున్నాడు!

యన కథలూ కవిత్వాలు... సీమచిన్నోడి గ్యాపకాలు... జానపద
ిమ్మిపదాలు ఒక ఎత్తయితే చిత్తూరు జిల్లాలో అంతరించి
వీధినాటకాన్ని 'కేళిక' పేరుతో బుల్లితెరకెక్కించడం ఒక ఎత్తు!

ంధ్రరాష్ట్రంలో భారతోత్సవాల నిర్వహణ మాత్రం చిత్తూరు జిల్లా
. ఇది పదునెనిమిది రోజుల పండుగ. ప్రతియేటా పంటలు
తరువాత అంటే జూలై ఆగష్టు మాసాల్లో ఒక పౌరాణికుడు
్వలను పగటి కథగా చెప్తే రాత్రిపూట కంగుంది కుప్పం వాళ్లు
్భుతమైన ఒక దృశ్యకావ్యంగా మలిచేవాళ్లు. ఈ అద్భుతమైన
ంగు దశాబ్దాల నాటితో పోల్చితే ఇప్పుడు నామమాత్రం గానే
ందని చెప్పాలి.

' ఊరు జక్కదనలో స్వాతంత్ర్యానికి పూర్వం నుండి ఏటేటా
తోత్సవాలు జరుగుతూనే ఉన్నాయి. మా చిన్నతనంలో ఈ
ాట' చూడడానికి చినిగిన గోనెపట్ట పరిచి స్థలం రిజర్వ్
వాళ్లం. విద్యుత్తూ మైకులు లేని ఆ కాలంలో వాళ్లు ఎలుగెత్తి
ంటే పొలాల వద్ద కాపలా కాచే రైతులు కూడా విని
ిచేవాళ్లు. కంగుంది కుప్పం - కళాకారుల నటనాకౌశలం
్పినా కొంతే అవుతుంది. ఆ ప్రభావంతో రంగు బలపాలు
్లై మొగాలకు రంగుపూసుకొని పగటిపూట మేము వాళ్లను
స్తూ ఎగిరేవాళ్లం!

' అయ్య పెద్దతోపు రెడ్డి. ఆయన భుజమెక్కి పగటి కథ
వెళ్లేవాణ్ణి. మహానుభావుడు తిరువేంగడం పిళ్లె. పండిత పామర
కంగా పండు వొలిచి అరచేతిలో పెట్టినట్లుగా ఒక్కొక్క దినం
ం కథగా చెప్పేవారు. కథ శ్రద్ధగా వినాలి. ఆ రాత్రికి మా
ిక్కలో పడుకొని కథ చెప్పాలి. నేను భారతాన్ని చదువుకోలేదు.
ఆ చిన్నతనంలో ఏటేటా వినిన కారణంగా భారతం మీద
ని అవగాహన ఏర్పడింది.

ువేంగడంపిళ్లె గారికి రెండుచేతులెత్తి నమస్కరించాలి!

ంతసేపూ 'పులికంటి?'.... 'పులికంటి కృష్ణారెడ్డి' అంటూ
సంబోధిస్తూ వచ్చాను. ఇక మా దగ్గరి బంధుత్వాన్ని చెప్పకపోతే ఈ సమాజం నన్ను క్షమించదు. మేమిద్దరూ పుట్టింది ఒకే ఊళ్లో. ఆ ఊరే మరపురాని మా ఊరు జక్కదన! ఆయన పెదతండ్రి కొడుకు మా అక్కమొగుడు. ఆయన మేనత్త మా తాత భార్య. ఆయన నా కంటే నాలుగు వసంతాల ముందుగా ఈలోకాన్ని చూశాడు.

అందుకే ఆయన నాకు మామ. నేనాయకు బావమర్ది !

ఆగిపోయిన చదువు కొనసాగించడానికి నేను తిరుపతి బండ్లవీధిలో మా మామ రామకృష్ణారెడ్డి ఇల్లు చేరాను కదా! అప్పటికే మామగారు ఒక ఇంటివాడై బండ్లవీధిలోనే అత్తగారింట్లో కాపురం ఉన్నాడు.

ఒకే ఊరివాళ్లం. బంధువులం. ఒకే వీధిలో చేరాం!

అద్దో అప్పుడే పెనవేసుకొని పోయాయి మా జీవితాలు. వృత్తులు వేరైనా ప్రవృత్తి నాటకం మాత్రం ఒక్కటే! ఆ కారణంగా ఒకరి నీడ మరొకరయ్యాం.

వృత్తిరీత్యా నాకు సెలవులు ఎక్కువ. ఆ సెలవుల్లో మామగారు అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్‌గా పనిచేసిన పూడి పుత్తూరు పూతలపట్టు మామండూరు ఇలా ఎన్నో స్టేషన్లలో రైళ్లరాక పోకల్లో... కథలల్లడంలో ఎంతకమ్మగా కాలం కరిగిపోయిందో?

ఒకరిని విడిచి ఒకరు ఉండడం సాధారణంగా జరగదు. జరిగితే బంధువర్గంలో అదొక వింత. చావుకో సమారాధన కో... పెండ్లిండ్లకో.... పేరంటాలకో మామగారు ఒక్కరే వెళ్లితే 'మీ బామార్ది ఎక్కడ?' అని అడిగే వాళ్లు. నేనే వెళ్లవలసి వస్తే 'మీ మామ ఎక్కడ?' అని అడిగేవాళ్లు!

ఇది గమనించిన డా. విశ్వనాథ అరుణాచలం గారు - అప్పుడు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో గణితశాస్త్రోపాధ్యాయులు, ఇప్పుడు ద్రవిడియన్ యూనివర్శిటీ వైస్-ఛాన్సలర్ - మమ్మల్ని కృష్ణార్జునలనేవారు.

విశిష్ట వ్యక్తిత్వాల గుండె లోలోతుల నుండి విలువల్ని తాగి విలక్షణంగా వెలువడే మాటలు క్షరముకాని అక్షరాలై నిలబడతాయి!

ఈ అనుబంధం జీవితాంతం ఇలానే సాగిపోవాలని ఆకాంక్షిస్తూ —

చివరగా ఒక్కమాట!

ఆ మధ్య 'తానా' ఆహ్వానంపై మామగారు అమెరికా వెళ్ళి వచ్చారు. వస్తూ వస్తూ నాకొక బహుమతి తెచ్చారు. అది ఒక అందమైన కలం!

''బావమ్రర్దీ! విస్తారమైన జీవితానుభవం ఉంది. ఇంపైన మాండలికం మీద మంచి పట్టు ఉంది. 1958లోనే నేను రాసిన ఆదర్శం నాటికలో ఒక పాత్ర చేత మాండలికం పలికించమని పట్టుబట్టి ఆ పాత్రకు న్యాయం చేకూర్చిన ప్రతిభనీది. మంచి రచయిత కుండవలసిన లక్షణాలన్నీ నీకు ఉన్నాయి. ప్రయత్నించి నీ అనుభవాలకు అక్షర రూపమిస్తే చాలు!'' అంటూ ఎంత ప్రోత్సహించినా ఆ మాటల్ని ఆచరణలో పెట్టలేక పోయాను. ఒక జీవితంలో తిరిగి పొందలేనిది పోగొట్టుకొన్నాను.

ఆయన బహూకరించిన కలం నా రాయలేని తనాన్ని గుర్తుచేసి నట్లుంటే కండ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి! ●



కృష్ణారెడ్డిగారూ!

మీ కతలూ కాకరకాయలు కవిత్వాలు మాకు అర్థంకావు. అసలు అర్థం కావడానికి చదివే తీరికెక్కడ? తీరిక దొరికి చదివినా తలకెక్కుతాయన్న నమ్మకం లేదు. కారణం - మా ఆలోచనలు ఎప్పుడూ వ్యాపారాలచుట్టూ తిరుగుతూ ఉంటాయి.

ఆ మాటకొస్తే ఈనాడు రాజకీయాల్లో.... చదువుల్లో.... కడాన సంసారాల్లో కూడా వ్యాపారమే కదా? మీ సాహిత్యం సంగతి నాకు తెలియదనుకోండి.

ఇదంతా అట్ట పక్కన బెట్టే -

మీ పేరు చాలాకాలంగా వింటూనే ఉన్నా. అయితే మీకు దగ్గరగా వచ్చిన తర్వాత నాకు మీలో బాగా నచ్చిన గుణం ఒక్కటే! - ఎదుటోడి కష్టాలకు కన్నీళ్లకు మీరు కరిగిపోతారు. ఉన్నోడు లేనోడు అన్న వ్యత్యాసమే లేకుండా ఎవరి అవసరమైనా మీ అవసరంగా ముందుకొస్తారు.

అందుకే మొన్న నాలుగ్గాళ్లమండపం... నిన్న దళితకథలు... ఇప్పుడు సావనీర్ అన్నా ఒక్కొక్క సారి ఐదేసి వేలకు తక్కువగా ఇవ్వడానికి మనస్సు వొప్పలేదే?...

మీకు డెబ్బై ఏండ్లంటే ఎవరూ నమ్మరు. అయినా అది నిజం. నిండునూరేండ్లు ఇట్లానే మీరు ఎదుటోడి కష్టాలకు కన్నీళ్లకు కరిగిపోతూ ఉంటే నాలాంటి వాళ్ల చేయూత మీకు శ్రీరామరక్షగా పెరుగుతూ ఉంటుందే తప్ప తరగదు.

**పాలగిరి ప్రతాపరెడ్డి**

వ్యాపారవేత్త, తిరుపతి

# WORLD TELUGU FEDERATION

సంఘీభావమే బలం




UNITY IS STRENGTH

# ప్రపంచ తెలుగు సమాఖ్య

*Third Biennial Conference, New Delhi*

*December 27 - 29, 1998*

*We hereby express our appreciation to*

*Sri Pulikanti Krishna Reddy*
*(Language & Literature)*

*for active participation in the above Conference.*

*U. Visweswar Row*
Secretary-General
WORLD TELUGU FEDERATION

*V.L. Dutt*
President
WORLD TELUGU FEDERATION

# ల్లెపదాల్లో వలపు మలుపులు - పులికంటి పోకడలు!

కీ॥ శే॥ శంకరంబాడి సుందరాచారి.

డో గుండెగొంతుకలో కొట్లాడుతూంటే నండూరివారి గుండె కొపాటలు ఆవిర్భవించాయి. అది ఒక సుమూహుర్తం. మన ాహిత్యం అంతవరకు ఆంధ్రప్రదేశానికి అపరిచితము. శుద్ధ ంలో వ్రాయబద్ధ పల్లె పదాలు సయితము సంప్రదాయ కే ఏమాత్రం తీసిపోని సాహిత్యం కావచ్చు. అదే సత్యం రసికుల ల్లో ఆనాడు తలయెత్తింది.

రెడ్డి పల్లెలోని వారి భావాల్ని భాషను చక్కగా అవగాహన షు. వాళ్ళు యిట్లగాక అట్ల భావించలేరు. పలుకలేరు. అని ం. అందుకే పల్లెపదాలను అదే పద్ధతిలో వ్రాశాడు. వస్తువు సామాన్యమైన స్త్రీ పురుషుల మధ్యనున్న ప్రణయేచ్ఛ. దు. ప్రణయభావం ఎట్లా పలుకబడినా పవిత్రమైనదే అని డం ఈ కవి లక్ష్యం. వలపు ఒడలితోనే సంబంధించినది కాదు. ఆత్మ పరిపక్వత్వాన్ని చేకూర్చగలిగిన వస్తువు అనడం ఈ పరమ సత్యమనిపించక తప్పదు.

ఎవ్వతెనో ఎక్కడ ఎలా ప్రేమించాడో ఇతని పదాల్లో వెదకినా అసలు ప్రేమ పేరులేనిది. ఊరులేనిది. ఉనికి లేనిది. ఆది ము. అందీ అందకుండా ఉండే అపూర్వతత్వమూ-

*'సీరకొంగు పైకెగసెక్కీ*
*పైట కొంగు నడుపున సెక్కీ*
*ముగ్గిపిండి సిప్పొకసేతా*
*ముగ్గేస్తా ఇంకొకసేతా*
*వాకిట్లో వంకోనుంటే-''*

నిగ్గులొలికే పల్లెపడుచును ప్రప్రథమంగా చూసిన కవి - ంకొక పల్లెవలపుగాడు ఆమెను వదలి పోనూలేక వగలు డు. అప్పటికి ప్రొద్దుపొటమరించే వేళ. చుక్కలారి చంద్రుని మెల్లమెల్లగా జాలువారే వేళ. కంటపడిన పడుచు. రెక తొడిగిన పడుచు. చుక్కల ముగ్గు వేస్తూ ఉంది. మొగం ం. తొంగిచూశాడేమో అ రసికుడు!

*పక్కనైన సుక్కల్ని*
*సుక్కల్లో సెందురుణ్ణి*
*సుద్ధంగా తుడిసిపారేసీ*
*పొడసకచ్చే పొద్దేమో*
*సుక్కల్లో నిన్ను చూసి*
*సందమామా నువ్వనితలిసి-*
*సిగ్గుతోడ చస్తుండాడు*
*సూడవే సూడమ్మీ!*

అనే అపూర్వ భావసౌరభాన్ని చదువరుల మానసాకాశంలో విరజిమ్ముతున్నాడు. తదేక ధ్యానంలో తన పనిచేసుకొంటున్నా కడగంటి చూపు వానివైపు పడుతూ ఉంది. చూపులో భావాన్ని గ్రహించి అవ్యక్తంగా ఆగిపోతున్నాడు. అక్కడికి ఆమెరుపు అతనిలో చిగురెత్తింది. ఆ తొలివలపు మలుపు నుండి ఆమెను విడలేకపోతున్నాడు.

*సద్దిదుత్త నెత్తినబెట్టీ*
*చేతులు రొండిడ్ప్ పెట్టీ*
*సెకసెకా ఊసుకుంటా*
*రెట్లావు గెనిెవి మింద*
*పోట్లగిత్తల్లే నువ్వొస్తుంటే-*

- అంటూ ఆమె వెంట పడుతూనే ఉన్నాడు. పొద్దు దాటి పోతూ ఉంది. మీదికెక్కినాడు సూర్యుడు. ఎండదాహం తీవ్రమయింది. వలపుదాహం తోడైనట్లుంది.

*గెడ్డమింద సెట్టుకిందా*
*మెత్తనైన కసువుమిందా*
*అడ్డంగా పడినువ్వుంటే*
*అడ్డదారి తొక్కిందమ్మీ*
*అదుపులేని నా మణుసు*
*సెట్టు చుట్టూ తిరిగిందమ్మీ!-*

అంటూ ఆవేదన పడతాడు.

ఇంతకూ ఆపడుచు హృదయం లేనిది కాదు. పొద్దస్తమానం తన్ను విడవకుండా తిరిగే వన్నెకాని వలపు వగలను కండ్లు అవురావురుమని జుర్రుకొంటే - అలౌకికమైన ఆనందం విద్యుత్ తరంగాలై వొంటినివశం తప్పించిందేమో?- చల్లని సంజవేళ. ఆకాలం సముచిత మనుకొనిందేమో ప్రణయ భావానికి - 'నడిజొన్న చేనిలోన మంచెమిందనిల్చి' ఆమె .మణుసార నవ్విన నవ్వు వడిశెల రాయిలాగ గుండెల్లో కొట్టేటట్లు అతనిని చూచి నవ్వి వలపు పూవులను వానిపై విసిరింది. ఇంక కసువు మోసుకుంటూ ఇంటికి వెళ్ళాలి. ఆమెను విడిచి, రేత్రి పొద్దు గడిసేదెట్లా? రాని నిన్ను మరిసేదెట్లా?, అన్నది అతని హృదయావేదన!

రెప్పమూసో మూయకో కమ్మనికలలతో రాత్రుళ్ళు గడిచిపో తున్నాయి. పగలు పుట్టీ పుట్టకముందే - పడి ఆమె వెంట నడుస్తున్నాడు. ఆమె ప్రతిహాసం, భావం అతనికి ఆనందదాయకం. అర్థవంతం. పచ్చసీర పరిచినట్లే పైరు పచ్చగా ఉండేటప్పుడు ఆమెవంగి కలుపు తీస్తుంటే పచ్చని చేనిలో పచ్చని చీరకట్టి చల్లని వేళలో వాడిని ఓరగంట చూస్తూ వెచ్చదనాన్నిస్తూ అడుగులు బురదలో జొనిపి తడిమి కలుపు తీస్తూ మొల్లొతు వలపులో ముంచెత్తుతుంటే అతడు చూచి పరవశిస్తూ........

పు తియ్యనేర్చిందానా!
పు కలుపు తియ్యలేవా?

ని ఆరాటంతో అడుగుతాడు. అతని దృష్టిలో ఆమెపాట టను దాటినది. ఉందా? లేదా? - అన్న ఆమె నడుము తో పడరాని పాట్లు పడుతుంటే - అతని గుండెల్లో వలపు ో పాటయ్యింది. ఇందులో ఇంకొక విశేషం. ఇక్కడ ామెను ముగ్ధుడుగా ప్రేమిస్తున్నాడు. ఆకాశం అలరించిన మై ఆమె తనకు అందీ అందని ఆశలనే అందిస్తూ ఉంటే ప్రేమించగల నిర్మలాంతఃకరణం తనకు లేదనుకుంటాడు. వలపు సామ్రాజ్యమే ఆమె అంటాడు. తన వలపులో వుందేమో కొంటాడు. ఆమెనే ఆ కలుపును తీయమని అడుక్కొంటు ది పల్లె మాటల్లో పల్లె పాటలో కవి చదువరులకందిస్తున్న రకమైన కావ్యలక్షణ పరమార్ధము.

నికి ఆమెతోటే విశ్వమనిపిస్తూ ఉంది. తన అణువణువులో శించిన భావన. తేలిక పడతాడు. ఊహలగాల్లో తేలిపోతాడు. నికి ఆరాధ్య దేవతగా కనపడుతూ ఉంది. కనిపించినపుడు కనిపించనప్పుడు మనస్సులో ధ్యానిస్తాడు. ఆమెలేని ఒక్కక్షణం నూహ్యం. ప్రపంచంతో నిమిత్తం లేకుండా ప్రపంచం కోసరమే ష్టింపబడిన భావన వానిది. ఆమే తానుగా తానే ఆమెగా అన్ని చేసుకోవాలన్న ఉబలాటం వాడిది. "సీర మోకాళ్ళ పైన వు వొలక బోస్తుంటే.... సిగను పూలు నవ్వుతుంటే. - ఆ ల్ల పారతో కసువు చెక్కుకొంటూ ఉంది. 'తూరుపు కొండల ంగి చూస్తుండాది పొద్దు!' ప్రశాంత ప్రభాతం. ప్రపంచమే హిస్తూ ఉంది. ప్రకృతి అన్ని హంగులతో పులకరిస్తూ ఉంది. క్కుతుంటే ఆమె వయ్యారము ప్రకృతినే ఆకర్షిస్తూ ఉంది. ఓరగంట చూస్తూ ఉంది గోరింక. పైరగాలి పైపైకొచ్చి ఆమె స్తూ పరాసికాలాడుతుంటే వగలమారి గోరింక ఫక్కుమని టూ ఉంది. పాలజొన్న కంకులు రెండు వద్దచేరి ముద్దు లాడుకొంటున్నాయి. పాలపిట్టలు సుద్దుల ముద్దుల్లో న్నాయి. కడకు గూటాన కట్టిన గోమాత కూడా గుంజులాడు ఉంది. ఇంక ఈ వలపుకాని గుండెల్లో తీయని మమత గూడు ా ఏం చేస్తుంది?

*"కలిసి కసువు సెక్కుకుందాం*
*వలపు పరువు పరుసుకుందాం !!"*

ని ప్రాధేయపడుతున్నాడు. కాదు కాదు ప్రార్థిస్తున్నాడంటే ప్పుకాదేమో? మగవాడు ప్రాధేయపడినా ప్రార్థించినా అది దమని అబలల సందేహం. ఎంతగా వానిపై వలపుకొన్నా ఆమె బలయే కదా? - చూపుల్లో సందేహం తూపులై పొడుస్తుంటే హ నివృత్తికై ప్రయత్నిస్తున్నాడు.

*"అబ్బతోడు చెబుతుండాను*
*నిబ్బరంగా యినవే అమ్మీ!*
*ఏడుకుంటా కాపాడుకుంటా*
*ఎంటవుంటె నా మాటనమ్మీ !"*

- అంటాడు. ఒక జాతరనాడు ఆమె పదుగురి మధ్య మెరపు తీగలా మెరుస్తూ వర్తించిన వయ్యారాలను జ్ఞాపకానికి తెస్తున్నాడు. మొన్న ఆ .ముత్తేలమ్మ. గుడికాడ తాను కొత్తచీర సింగారించుకొని కులుకులు వొలకబోస్తూ పొంగళ్ళుపెడ్తూ నీలాలుపారే పొగలో తిరుగుతూఉంటే నింగిమీద ఒక్కచుక్క నేలమీద రాలెననుకొన్నాడు. ఆవేళ ప్రసాదాన్ని పదిమందికి పెట్టాలని తాను వంగి వంగి అరిటాకులు పరుస్తూ ఉంటే- అనకూడదు కానీ పిగిలి పొయ్యే పట్టురెక పడిన పాట్లు గమనిస్తూ .పిల్చి నన్ను ఏమార్చింది!. అని వాపోతాడు. ఈ పాటలో ఇంకోసూక్ష్మం.

*"ముత్తేలమ్మ ముందు నువ్వూ*
*ముచ్చటైన బొమ్మకు మల్లే*
*కండ్లు మూసి వొళ్ళు మర్సీ*
*ఒక్కొక్కసారి ఓరగంటితో*
*నన్నుచూసి తల్లిని చూసి*
*సేతులు రొండు జోడించి*
*మొక్కుతున్న తీరుచూసీ*
*ముక్కుమింద వేలేసుకుంటి!"*

ఈ గీట్లల్లో ప్రణయంలోని ప్రణయార్థం ఎంత చక్కగా ప్రతిఫలిస్తుందో చూడండి. వలపుగాడు మగవాడు. తొందరగా బయట పడిపోతున్నాడు. అంటే - అంతవరకూ ఆమె కనుసన్నలతోనే తన వలపును వానికి తెలిపింది కానీ కులుకులతో బయట పడలేదు. వాడు ప్రకటించిన వలపు తలపుల కన్నా - మొలకలందాం. ఆమెలోని ప్రేమ వృక్షము ఎంతగా పెరిగి పుష్పించి ఫలించిందో పై గీట్లుమనకు స్పష్టంగా తెలుపుతున్నాయి. "ఓ తల్లీ! ముత్యాలమ్మా! ఈ వలపుగాణ్ణి నన్ను వదలనీకు!" అని వేడుకుంటూ ఉంది. ఆటు దేవతవైపు చూస్తూ కూడా ఇటు వీడిని ఓరగంటనైనా చూడకుండా ఉండలేని పరిస్థితి రసికుల హృదయాల రంగలిస్తుంది. ఆమె కళ్ళు మూసి వొళ్ళు మరచి, రెండు చేతులు జోడించి ఆ తల్లికిమొక్కుతుంటే ముక్కుమీదవేలేసుకొంటాడు వలపుగాడు. .అంతటిదా ఈమె ప్రేమ!. అని ముక్తసరిగా రెండు ముక్కల్లో -

*ఎట్ల మర్సిపొయ్యేదమ్మీ*
*మర్సి ఎట్ల బతికేదమ్మీ?!*

అని తన నిస్సహాయతను వెలిబుస్తాడు.

సరసానికిప్రాణం విరసం. ప్రేమలో ఎగుడుదిగుళ్ళు ఎత్తిపొడు పులు లేకుంటే అది ప్రేమగా ప్రకాశించదు ఎండలేని నీడ సుఖమట్లు. ఆమె ఎక్కడికో పోలేదు. అయినా పోతా పోతా పోతా నంటుంది. పోరేపడ లేనంటుంది. ఇంకేం చేస్తాడు వీడు పాపం! పోతూ పోతూ ఒక్కమాట విని పొమ్మంటాడు. ఊరి ముందర వంకమీదుగా ఒక్కవారగా ఆమెను అడుగుమీదడుగేసుకుంటా నడిచిపొమ్మంటాడు. ఆలా ఆమె వెడితే అడుగుకొక్క ముద్దిడుకుంటా అక్కణ్ణే పడిగాపులు కాస్తానంటాడు. ఆమె పోయేదారిలో గుంటొకటుంది. దాని నిండుకూ దామరపూలే! ప్రతి పువ్వులో ఆమె చక్కని మొగాన్ని నిలిపేసిపోతే వాటిని పొద్దస్తమానం పూజించుకుంటానంటాడు. కడకు నీడజాడ చాలునంటాడు.

క్కడైనా ఎండపొద్దనా
కోసం నిలబడినువ్వూ
త. జాడ నిలిపిపోతే
తలోనే మేడగట్టి
డలోనే కలవరిస్తుంటా!-నంటాడు.

ఖరికి నిలువురాతిమీద ఆమెరూపు రాసిపోతే అది అతని దృష్టికి న్నే యిస్తుందంటాడు. ఇక్కడికి మన వలపుకానికి ఆమె న శరీరం కాదు. హృదయంలో హృదయంగా హత్తుకపోయిన వస్తువు. ఆమె నీడచాలు. జాడలు చాలు. ఆమె ఎదుట లేకున్నా డు చూసుకోగలడు. ప్రేమకు స్థాయి విరహము. ఆ తికిది అక్షర చిత్రము !

ల్లిపోతా నేనెల్లిపోతా! సెప్పకుండా సెందకుండా!. వెళ్ళిపోతానని మ్మి నన్నేడిపిస్తావ్? నేను ఏడిస్తే నువ్వు నవ్వుకొంటావు. ఏమైనా యం? ఏనాడో కలిసిన చూపూ ఎదనిండా మలచిన రూపూ తుడిచి పారేస్తావ్? అది నీచేత గాదని సవాలు చేస్తాడు. కాబట్టి ట్టి పోతానని .మిడ్సి మిడ్సి పడబోకమ్మీ. అని హెచ్చరిస్తాడు. వపూర్వకమైన ఆమె పైని ఆత్మవిశ్వాసం ఇక్కడ డుతుంది.

కనిపించకనే పోతుంది. ఆత్మ విశ్వాసమున్నా అతని మనస్సు లో తగులుకొని గిలగిలలాడుతుంటే-

ాడేడ ఎతికేది ఎట్టెట్ట పిలిసేది
్ళళ్ళు ఇట్టిట్ట కన్నీళ్ళు గార్సేది?

ంటూ జ్వాలా వలయిత అంతరంగంలో వేడివేడి కన్నీటి వల్లుతాడు. ఆమె అంతకు ముందు తన్ను వలపు మురిపాలతో చేసిన సన్నివేశాలను తడిమి తారాడుకొంటున్నాడు. ఋ. కాడ కపిలతోలుతూ ఉంటే కడవచంకన బెట్టి నీళ్ళసాకుతో పు పన్నీటితో కడవనింపేసి. ముని ఏళ్ళతో ముంచి మింద జల్లిన టూ నేపథ్య దృశ్యాన్ని తలపోసి అద్యంతాలు లేని ఆనందంలో తాడు. 'ఈదిలో ఇంటిలో సేనిలో కానలో యాళపాళలేక యాడ ఎచ్చెచ్చ చూపుల్ని ఎదను గుచ్చింది' అన్న తల పోతలతో తడిసి ాడు. 'ఎంతమంచి మణుసు నా అమ్మిది... ఎంతెంతచెప్పినా నిది!' అసంతృప్తి ఆరాటంతో మనసు పోరాటం చేస్తూ ఉంటే వేశాలను నిమీలిత నేత్రాలతో నెమరు వేసుకొంటాడు. ందు లేకున్నా ఆమె అతని తలపుల్లో మెరపల్లే మెరిసిపోతూ

తగా తన్ను ప్రేమించిన ఆ వన్నెకాని ఆరాటపెట్టి ఆమె మాత్రం చిందేమి? అతడు లేని అరనిముసం కూడా ఆమెకు ఆరాట అవుతుంది. అటలాడుకొంటూనే అతడామెను వీడిపోయే బ్రతుకుబాటలో ఏర్పడింది. వాళ్ళది జన్మజన్మల అనుబంధం. రణించినా మళ్ళీ ఇప్పుడు ఒకరికొకరుగా పుట్టారు. అయినా మెను వీడి మిలిట్రీ కొలువులో పడవలసి వచ్చింది. అంతా ారమా? మంచు కొండలకాడ పడ్డాడు. ఆమెకు ఆ విరహం అతి దారుణమైంది. అప్పటికామెకు తపాలాతాతయ్య దేవుడిలా కనిపిస్తాడు, తనవాని వలపుతలపులను ఎప్పటికప్పుడు అందించడానికి!- తలగుడ్డ మాసినా... మొలగుడ్డ సిరిగినా... మీసాల ఎనకాల సిరునవ్వు ఎలిగించే పేద తపాల తాతయ్య ఆమెకు తగిన మధ్యవర్తి. జీవితంలో ఆటుపోట్లను అటకెక్కించి తృప్తిని ప్రకటిస్తున్న అతడామె దృష్టిలో ఎంతమంచివాడో? - మామ రాసినజాబు మోసుకొస్తున్నాడు గదామరి? ఆ జాబును గుండెతో అందుకోవడానికి ఆమె తహతహలాడుతుంది. చదవకముందే ఆమెలో ఎన్ని సుతిమెత్తని భావాలు సుడులు తిరుగుతున్నాయో?-

*ఎన్నవంటి మణుసుఏఁవేఁవిరాసిందో?*
*కన్నెపిల్లామణుసు ఎన్నెలే అవుతుందో?*

-అని ఆరాటపడుతుంది.

*అమ్మోరిగుడిమింద అలసందపువ్వా*
*పూత యిడిగినట్టె నాగుండె యిడిగింది!*

-అని పరవశించి పోతుంది.

ఇక్కడ గమనించదగ్గ మరో విశేషం. అలసంద ఎక్కడైనా పూయవచ్చు. అయినా అది అక్కడా ఇక్కడా పూయలేదు. అమ్మోరి గుడిమీదనే పూసింది. ఇద్దరి మధ్య పవిత్రమైన ప్రేమను వ్యక్తం చేయడానికి కవి అలసందను అమ్మోరి గుడిమీద పూయించాడు. అంతేకాదు. మరొక విశేషం. అలసందరాలినా అమ్మోరిమీదనే రాలుతుంది. మిలిటిరీలో అతడు మరణించినా వీరస్వర్గమే!- ఎంత చక్కని ధ్వని!

సంకురాంతి పండగకు వస్తాడని ఎదురుచూస్తుంది, మామ సెలవు పెట్టి వస్తాడట! వస్తాసరిగపూల చీర తెస్తాడట! కాలం కలిసి వస్తూ ఉంది.

*కట్టొగాలవ కింద*
*కంది సేనీ పంట*
*కంటిగింపు గుండాది*
*కలిసి రమ్మంటాది!*

*పెద్దబాయీ కాడ*
*సద్దసేనీ మద్దె*
*మంచె బకటుండాది*
*మంచి యాళను చూసి*
*పొంచి రమ్మంటాది!*

*సరిగపూల సీరా*
*కుచ్చిళ్ళు జీరేడా*
*బొండు మల్లెల సెండు*
*సిగకు ఎలుగులు నిండ*
*మావ పక్కకు వొదిగే*
*మరెల్ల బోసాను!*

ని ఆనందంతో అతని రాకకోసం ఎదురుచూస్తూ ఉంది. నవ్వుల్ని కంట నిలిపేస్తాను. పడుచుపిల్లల గూడి గొంతెత్తి బ్బిళ్ళు తడుతూంటే ఉబ్బిపోడామామ తబ్బిబ్బులైపోడా ో పడిపోడా!' అని ఊహలకు రెక్కలొస్తే ఎగిరి వాడి మనసులో స్తూ ఉంది.

క్రాంతి వెంటనే దీపావళి. మంచుకొండల మంచెదిగి న్నాడు మామ, దీపావళినాటి దివ్వెలలో కోటి దివ్వెలుగా వెలగడానికి!

*కంటినిండా కాకరపూలు*
*మణుసులోన మత్తాబూలు*
*ఇంటినిండా కోటిదివ్వెలు*
*వయసు మింద వయ్యారాలు*
*ఎలిగించి ఏడికచూడా –*

*ాడు మామయ్య!*

*దుర్మారం పట్టుసీరా*
*దగదగా మెరుస్తూంటే*
*కన్నుల్లో కన్నులు కలిసి*
*వలపువాన కురిపిస్తుంటే*
*గుండెల్లో కోటి దివ్వెలా*
*దీపావళి కాదా మాకు!*

జ్యోతిని అందంగా వెలిగించుకొంటూ ఉంది.

వళి చెప్పి చెప్పి వచ్చింది. చెప్పకుండానే వెళ్లిపోయింది. దీపావళి అయితే ఆమెకు మాత్రం శోకావళి! – అయినా ఆశ . వలచి వలపించుకొన్న మామ ఉగాది పండుగకైనా ంటి చీర తెస్తాడని నమ్మకం. ఉగాది వచ్చింది. అన్ని నను ఊడ్చుకొనిపోయే ఉగాది ఆమె ఆశలను కూడా పోయింది!

ృచ్చుకొని పోతున్న ఆశలకు ఊపిరి పోయగలదా ఆపల్లెటూరి ండ్లుపూండ్లు ఎదురు చూసిన కండ్లతోపాటు ఆమె ఆశలు దిరిపోతుండాయ్.. మామకు దూరంగా... బ్రదుకు భారంగా డ్చుకొని పోతున్న సమయములో ఆడిపోసుకునే ఊరూ రిహాసాలు దానికితోడు! ఆ దశలో పాపం! ఆ అమ్మికి మిగిలింది !...

మకంటే ముందుగా...... మామ చేతుల్లోనే... పునిస్త్రీగా – ంచడం. ఈ దేశంలో ఆడజన్మ అంతకంటే కోరేదేముంది? లో రొదలు చేసే వేదనలను కోరికలను కవి కడు రమణీయంగా అక్షరబంధం చేయడం సహజత్వానికి నిలువుటద్దం. అన్ని ఆశలూ అడుగంటిపోయాయి. బ్రదుకాశ గూడా బదాబదలై పోయింది. ఇక మిగలింది ఒకే ఒక్క ఆశ. అది మరణాశ! – మామ చేతుల్లోనే మరణించాలన్న తుది ఆశ ఆపల్లెపడుచు గొంతులో పొంగి పొర్లుతుంది.

భగ్న ప్రేమికులైన నాగరీక నాయికలు మరణించడానికి రకరకాల మార్గాలు వెదుకుతారు. అందులో చమత్కారం ఒక ప్రత్యేకం. శ్రీనాథుని దమయంతి కూడా అగ్నితో జలంతో ఇతరమార్గాలతో ప్రాణత్యాగం చేయాలన్న సంకల్పం సడుసుతనంగా అడుసు తొక్కంది. అయితే ఎదుటివారి గుండెలను పిండుతున్నట్లు కాదు, చావాలనుకొన్నప్పుడు కూడా నాగరిక నాయికలు వయ్యారాలు పోవడం మన సాహితీయాత్రలో చేదు మాత్రలు. కానీ ఇక్కడ అసలు సిసలైన తెలుగు పల్లె పిల్ల వచ్చి పడుచుదనంలో ఉన్న ఒక ముగ్ధ. లోకం పోకడలు నాజూకులు వొంటపట్టని ఒక అమాయకురాలు అమ్మి! – తన మామ చేతుల్లో జన్మ చాలించాలని తలపోసి – కొలతకందని దూరాల్లో కొలువు చేస్తున్న మామను... పండగ పబ్బాల్లో కూడా తన ఆశలను ఎండగట్టిన మామను రమ్మని.. పచ్చి తన్ను తన చేతుల్తోనే చంపి పొమ్మని ప్రాధేయపడడం – ఆక్రందనాదంలోని ప్రణయఖేదం వేదాల వాదాల కందనిది. అది సహృద సాహిత్య రసాస్వాద సమ్మోదానికి మాత్రమే అందగల్గినది!

సద్దిముంతలో మోసాన అంత విసంకలిపి తాగించమంటుంది. అదీ కాదనుకుంటే ఎండపొద్దన ఏ చెరువులోనో ఈతాడుతూ ముంచేసి కడసారి మునిగెయ్యమంటుంది. అది కూడా అలవి కాదనుకుంటే –

*"చెరువులో ఏమార్చ చేతగాడనుకుంటె*
*పగడాల పూదండ పట్టకస్తీనంటా*
*చూపించి మెడసుట్టు చుట్టెయ్యి మామా!*
*చుట్టేసి నాకంత మట్టెయ్యి మామా!! "*

– అని అమ్మిచేత పలికించాడు కవి. అంటే ఇది భారతీయ సంప్రదాయానికి పట్టంకట్టినట్లు కాలేదా? మనిషికి తిండి పెడుతున్నది మట్టి. కడాన తనలో కలుపుకొంటున్నదీ మట్టి. అంత మట్టి వెయ్యడమంటే అది మరణించిన వారిపట్ల సానుభూతి ప్రకటించడమే! అది జాతి సంప్రదాయం. అది గుండె అంచుల్ని నింపుకొనే ఆర్ద్రత. అమ్మినోట ఈ మాట పలికించడంలో కవి సాధించిన ధ్వని సంప్రదాయ వాదుల కంటనీరు పెట్టిస్తుంది. అబాల ఎంత బేలగా ఆక్రోశిస్తున్నదో చెవులున్న గుండెలకు మాత్రమే చేరుతుంది. మరి? – అమ్మి మనసులో జీవిస్తున్న మామకు ఆమె చివరి విన్నపం వినిపించి అతడు వాస్తాడా? రాడా? – చేస్తున్నది మిలిటరీ కొలువు, కాబట్టి! ఎందుకురాడు? తప్పకుండా వస్తాడా? రాకపోతే ఏం? రక్తి చెడుతుందా? ●

*(ఆంధ్రప్రభ, ఆదివారం అనుబంధం నుండి)*

# ఇది ప్రయోజనాత్మక శతకం

## కళా ప్రపూర్ణ డా॥ దాశరథి

్రతీయ భాషల్లో - సంస్కృతంతో సహా-శతక వాఙ్మయానికి ే పైచేయి. నిజానికి కొన్ని భాషలవారికి ఈ శతక వాఙ్మయంలేనే ంస్కృతంలో కొద్ది శతకాలున్నాయి.

శతక వాఙ్మయం మనభాషలో రమారమి, యేడెనిమిది వందల ుంచీ ప్రచలితంగా వుంది. విశేషం ఏమిటంటే ఈ ఇరవదవ ో కూడా శతక రచన చాలా విస్తృతంగా జరిగింది, జరుగు "వేమన శతకం" అని కొందరనగా విన్నాను. దాన్ని "వేమన ' అనాలి. వేలకు వేలు పద్యాలు వ్రాశాడు వేమన. పైగా అన్నీ ు కావు. ఇంకా వేమన పేరిట ఆట వెలదులు అదేమకుటంతో ాభిరామ..." - వ్రాస్తునే వున్నారు.

ప్పటికి ముద్రితాముద్రితములైన శతకాలు మూడువేలకు పైగా పరిశోధగాగ్రేసరులు శ్రీనిడదవోలు వెంకటరావుగారన్నారు.

ధునికులు ఇంకను శతక రచన చేస్తూ ఉండడం నాకు ఎక్కువ న్ని కలిగిస్తున్నది.

ప్రసిద్ధ రచయిత శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారు శ్రీ వెంకటేశ్వర రిపై గల భక్తితో "దేవ! కలియుగేశ! తిరుమలేశ!" అనే మకుటం ం వ్రాసినన్నూ, శతకం లో భక్తిమాత్రమే లేదు. నేటి కుళ్ళు ుపై చెణుకులు అడుగడుగునా కనిపిస్తాయి. కారణం, ప్రజలకూ, సంఘానికీ దూరంగా ఊహాసౌధంలో కూర్చొని ువాడు కాడు. అతను పాత్రికేయుడు, పత్రికా సంపాదకుడు, వకుడు, ప్రగతి వాది, అభ్యుదయమూర్తి, నటుడు, కథకుడు, ులోని అన్ని ప్రక్రియలలో చేయి తిరిగిన వాడు. అన్నిటికన్నా -తాను అనుకున్న మాటను దాపరికం లేకుండా, ఎంతవారికీ కుండా ధైర్యంగా చెప్పగలవాడు. ఆ కారణం చేత అనేక ుకు గురి అయినవాడు.

*ఇతడు దేవుణ్ణి కూడా "స్పేర్" చేయడు.*

*"నెమలి కంటిలోన నీరు చిప్పిలుచుండ*
*కటికవాని కెట్లు కరుణ గలుగు?*
*అటవినివసియించు కటికవాడవు నీవు!*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!"*

ు నిర్దాక్షణ్యంగా అనేశాడు. తిరుమలేశుడు పర్వతాగ్రంలో ే కదా కటిక వానివలె ఉంటాడు!. కనుక దయనీయుని ుతన్ని కరగించునా?

ష్ణారెడ్డిగారికి గల సామాజిక స్పృహ ఈ శతకంలో అడుగడుగునా ుది.

*"రూకలున్న నేత లోకమునే గెల్చు*
*లోకమతని గొలుచు తోక ముడిచి;*
*రూకలున్న చాలు తోక విసరవచ్చు*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!"*

ట్టుబడిదారీ సమాజంలో డబ్బుకున్న విలువ దేనికీ లేదు. ు రూకలు కావాలి. ఓట్లకు నోట్లు కావాలి. ప్రజాస్వామ్యాన్ని తమ ఇష్టంవచ్చినట్లు తిప్పుకోదలచిన వారెందరో!

ప్రజల్ని మోసగించిడానికి వేదికమీద నుంచి చెప్పేదొకటి, వేదిక దిగి చేసేదొకటి.

*వేదికెక్కువాడె వేయారునీతులు*
*కక్కువాడె వన్నెకెక్కువాడు;*
*మేకవన్నె పులిని మించును తదుపరి*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!"*

"కలౌ వేంకటేశాయః" అన్నారు. కలియుగంలో వేంకటేశ్వరుడే దేవుడు. ఆయన స్తుతిలో వ్యాజస్తుతిని, నిందలో వ్యాజనిందను ఇమిడ్చారు రెడ్డిగారు.

సంఘంలోని అసమానతను పోగొట్టాలనీ, ఆర్థికవ్యత్యాసాలను అంత మొందించాలని, కులమతాల కుహనాలను కూల్చి వేయాలని తాపత్రయపడే యువకవి కృష్ణారెడ్డి. ఆయనది పులికన్ను. ఆయన కంటబడ్డ వస్తువుమీద ఆయన లేఖని దాడి చేయక మానదు.

*"మిట్టపైన నిలచి మిడిసి పడునొకడు*
*పల్లమందొకండు పలకవరించు*
*ఎప్పుడంతరించు ఇలను వ్యత్యాసాలు?*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!"*

ఇట్లా ఎన్నో చూపవచ్చు:-

*"బుసలు కొట్టుచుండ వసుధ వ్యత్యాసాలు*
*కనులు, చెవులు మూసి కాన లోన*
*నిత్యవైభవముల నిక్కినీల్గెదవేల?*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!"*

*వాహనమ్ముమీద వయ్యారమొప్పార*
*కొలువుదీరియుండ కొందరేమొ*
*ప్రక్కనిలిచినారు పంకాలు విసరుచు*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!*

*చెమట కూడదన్న చిత్తవృత్తిః*
*విసరుచున్నవా విబుధవరులు*
*మోయువారి చెమట మోదమ్ము కూర్చునా?*
*దేవ! కలియుగేశ! తిరుమలేశ!*

ఈ సామ్యవాద కవి తిరుమలేశునిపై శతకం వ్రాయుటమేమిటి? అని ఎవరైనా అడగవచ్చు. ఏదో ఒక వ్యాజము కావలెకదా! ఈ నాడు శక్తివంతమైన వచనం వ్రాసే వారిలో (కొద్దిమందిలో) మా పులికంటి ఒకడు అనడం సహజోక్తే గాని అతిశయోక్తి కాదు.

అట్లే కవితారచనలో కూడా నేలవిడిచి సాము చేయక, సమకాలీన పరిస్థితులను ఆకళించుకుని కలం నడిపే మొనగాడు మా పులికంటి.

ఆధునిక శతకవాఙ్మాయానికి ఈ శతకం అమూల్యమైన కానుక. పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తాను. ●

*(పులికంటి "మొక్కితే దేవుడు" శతకానికి ముందుమాట)*

# నాలుగ్గాళ్ళమండపం నాపేణాలు తోడేసింది గదా!

శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి

రా అబ్బోడా!
నీ కత?
మా సెడ్డ సిక్కొచ్చి పడిందే!
మంచోడివనీ, నీతో కుశాలకని కూసుంటే,
సు సల్లబడుతుందనీ వొస్తే, ఇదేం దిది?
గ్గాళ్ళ మండపం నాసేతిలో బెట్టేసి నువ్వు
గా జారుకుంటా ఉండావే!
దో సిత్రంగా ఉండాదే' అని, పొద్దు గూట్లోపడే దాకా
కమే సదవడం - కొంచెం
తక్కువగా కూటేళదాకా అదే యవారం
నేను, సదవలేను -
తలకాయ దూర్చినయవారమై పాయకత
డు బాలగోడుగా ఉండాది.
తలా, బతుకులా?
దిమ్మ తిరిగి బొమ్మలాట ఆడతా
ది గదా -
యాబైఏడు కతలు చెప్పినావు.
కోటైనా ఏడాదై పాయె గదా?
గుండాయే!
గ్రెక్కించినాయి - కొన్ని ఏడిపించినాయి.
అర్తం అయింది -
రాయలసీమ చిన్నోడివిగాదు
!
ల్లో మంచోడి సావు చూసినా
లో కొలుములు రగలడం గెమనించినా !

ఉండింది కలంపుల్లే కదా!
ఈ బొమ్మలేంది?
యాడుందబ్బా దీనికి బిస?

అయినా నువ్వు మొనగోడివి -
శానా ఆలోచన మిందుండావ్ !
నీకలం కతచెప్పేదేం వుండాది?
అది కత్తి!
నా సామిరంగా -
శిలిపి శిలపం, చెక్కేసి నట్లు చెక్కేసింది,
ఏందేంది?
"గుంటనిండికి నీళ్ళా? ఆ నీళ్ళమింద అంతసందు
లేకుండా పచ్చ దుప్పిటి పర్సినట్లు దామరాకులా?
ఆకుపచ్చని దుప్పిటి మింద అద్దకం అద్దినట్టుగా
తెల్లగా దామరపూలా?"
ఏం బొమ్మయ్యా అది! దాని అందం ఎట్టపోయిందబ్బా
ఇప్పుడు?
అబ్బోడా!
నువ్వు చెక్కిన బొమ్మలేకాదు. ఇసిరిన మాటల
బాణాలు కూడా మమ్మల్ని బతకనిచ్చేటిగా లేవు -
అరే!
"పామును చూసినా పత్రికను చూసినా ఎవుడికైనా
బయమేనా?"
"చిన్నింట్లో పెద్దకాపరం చెయ్యమన్నారా పెద్దోళ్ళు?"
"యామారించే దానికి, నిజమే, ఎన్నిదోవలో?"
ఓ రాయలసీమ చిన్నోడా, కాదు, పెద్దోడా!
ఎన్నని చెప్పేది?
నీ నాలుగ్గాళ్ళ మండపం, నా పాణాలు తోడేసిందిగదయ్యా!
నీ మాటల మంటలకి తోడు
మాటి మాటికీ వొచ్చి, మా మణుసుల్ని వామిలో
కాలేకుండలుగా కాల్సే, ఆ ముత్తారెడ్డి విసుర్లొ హటి!
సాలు సాల్లే అబ్బోడా!
నీ నాలుగ్గాళ్ళ మండపం కతా నువ్వూను! ●

# కల్చరల్ అంబాసిడర్

డా॥ నాగభైరవ కోటేశ్వరరావు.

ı 8 8 లో ననుకుంటాను.

ంధ్రప్రదేశ్ వైద్య ఆరోగ్య శాఖవారు హైదరాబాదులో ఫామిలీ
ంద ఒక కవిసమ్మేళనం నిర్వహించారు.

్క్ గార్డెన్స్‌లో ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియంలో ఆసభ
ుంది. ఆంధ్రదేశం నాలుగు చెరగుల నుండి 3 2 మంది
హ్వానింపబడ్డారు కవితాగానం చెయ్యడానికి!

ాటి ఆరోగ్యశాఖ కార్యదర్శి డా.పి.యల్. సంజీవరెడ్డి గారు
వహించారు. అప్పటి హెల్త్ మినిష్టరు డా.. దగ్గుబాటి
్వరరావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆ సభలో ప్రొఫెసర్
- అప్పటి తెలుగు విశ్వవిద్యాలయం వైస్ - ఛాన్సలర్
ంచారు.

ు నిండుగా ఉంది. వేడుకగా ఉంది. ఎటుజూచినా కవులే.
్లాల నుంచి వచ్చినవారు. అన్ని కవితాశాఖలకి చెందినవారు.
యసులకీ ప్రాతినిధ్యం యివ్వాలనుకుంటున్నారా అన్నట్టు
ు, యువకవులు ఉన్నారు. పద్య కవులు, గేయ కవులు, వచన
దికను అలంకరించారు. అది కవివతంసుల కవితా వసంతం.
కవితాశారద అహ్లో ఆహ్లాద మందస్మితంగా వీణెలు మీటిన
.

ు ఆడియన్స్‌తో క్రిక్కిరిసి వుంది. వేదిక మీద కేవలం కవులు,
ందు సాహితీకారులు - సాహితీ ప్రియం భావుకులు.

రంభ సభ ముగిసింది. కవిసమ్మేళనం ప్రారంభమయింది.
ి కవులు కవితాగానం చేశారు. కవులు చప్పట్ల దుప్పట్లు
్పరు.

తలో ఒక ప్రకటన - ఒక అవాంతరం, నిర్వాహకులు
ారు. రిలీఫ్‌కోసం డా.. పట్టాభి రామ్ గారిచేత 1 5 నిముషాలు
ల ప్రదర్శనం ఉంటుంది.

వులే ఇంద్ర జాలికులు గదా! ఇంకా ఇంద్రజాలం వేరే
?" అన్నారు శేషేంద్ర.

్యకర్తల తలంపు ఒక విధంగా మంచిదే-పదిమంది కవుల
విన్న తర్వాత కాస్త రిలీఫ్-

ı పట్టాభిరామ్ ఆంధ్రదేశం గర్వించదగ్గ ఇంద్ర జాలికుడు.
వారి అసిస్టెంట్స్ స్టేజీమీద అవసరమైన టేబిల్ వగైరాలు
ు.

తలో ఒకకవి లేచాడు. హుందాగా మైక్ దగ్గరకు నడిచాడు.
ా యిలా అన్నాడు.

లా మధ్యలో వేరే కార్యక్రమం ఏర్పాటు చేయడం కవులకు
ి అవమానంగా భావిస్తున్నాను. కవులు అభిమాన ధనులు.
్త చర్యకు నేను నిరసన వ్యక్తం చేస్తున్నాను."

్యకర్తలు తమ తప్పు తెలుసుకున్నారు. కవి సమ్మేళనం
ుగా జరిగింది. ఆ తర్వాత డా॥ పట్టాభిరామ్ గారి ఇంద్ర
్యక్రమం కూడా జరిగింది.

కవుల పక్షాన ఆత్మాభిమాన పతాకను ఆనాడు ఆవిష్కరించిన కవి పులికంటి కృష్ణారెడ్డి.

సంఘటన జరుగుతున్నంత సేపూ అవాక్కయిన కవులు, తర్వాత వాక్కులతో పులికంటిని అభినందించారు. అలాంటి ఆత్మాభిమాని కృష్ణారెడ్డి.

కృష్ణారెడ్డి నన్ను 'అన్నా!' అని పిలుస్తాడు. ఆంధ్రదేశపు సాహితీకారులు చాలామంది నన్ను 'అన్నా' అనే మన్నిస్తారు. నావయసు తెచ్చిన గౌరవం అది!

మేము ఎన్నో కవిసమ్మేళనాల్లో కలసి పాల్గొన్నాం! ఢిల్లీలో, హైదరాబాదులో, విజయవాడలో, గుంటూరులో, విశాఖలో, తిరుపతిలో, నెల్లూరులో, కడపలో - ఎన్ని చోట్లని చెప్పను?

శ్రోతల్ని తొలి ఊపులోనే ఆకర్షించే టెక్నిక్ తమ్ముడికి తెలుసు. మధుర గంభీరమైన తన కంఠమెత్తి -

*రాయలసీమ చిన్నోణ్ణి*
*రాళ్ళమద్దె బతికేవోణ్ణి*
*రాగాలే ఎరగకపాయనా- అను*
*రాగానికి అందేవాణ్ణి.*

అని పాడేవాడు. ఆ కవితలో పులికంటి అన్నమయ్య, వేమన్నల ఫిలాసఫీని, రామలింగారెడ్డి రాళ్ళపల్లి విమర్శ పటిమల్ని, పుట్టపర్తి గడియారం కవితా వైభవాన్ని, బళ్ళారి రాఘవ నాగయ్యల నటనా వైదుష్యాల్ని కీర్తిస్తూ 'వాళ్ళందరికీ నేను వారసుణ్ణని' రాగయుక్తంగా ఆలాపిస్తే సహృదయులైన శ్రోతలు నాగస్వరం విన్ననాగులై పోయే వాళ్ళు. ఆ పాట పులికంటి గాలిని గంధర్వం చేసింది!!

అలా ఆడియన్సును ఆకట్టుకొన్నాక తన కవిత చదివో, ఉపన్యాసం చేసో తమ్ముడు సభను అలరించేవాడు.

పులికంటి కవి. పులికంటి కథకుడు. పులికంటి గాయకుడు. పులికంటి నటుడు. పులికంటి ఆరేటర్. నాకు తెలిసిన పులికంటి సహృదయ స్నేహశీలి.

కళ కోసం కమ్మని రైల్వే ఉద్యోగాన్ని వదులుకున్నవాడు.

సాంస్కృతిక వ్యాసంగం తప్ప, లౌకిక వ్యాపారాలు తెలీనివాడు.

రాయలసీమ మాండలికాన్ని అచ్చుల రచ్చలకెక్కించ్చిన అక్షర జీవి.

కవిత్వంలో కథన శిల్పాన్ని, కథానికలో కవిత్వ శిల్పాన్ని అందంగా పొదగ్గల రహస్య శిల్పి.

అసలైన చెలిమికి అర్థం తెలిసినవాడు. రసికుడు. సహృదయుడు. నటుడు. రసనాగ్రంపై శారద నర్తించేవాడు.

మాటకారి.

మనిషితనం కోల్పోని మనీషి!

తమ్ముడికి దెబ్బయ్యా! కవికి వయసు ఉంటుందా! అయ్యా! భాస్కర నాయుడూ! ఎందుకూ రవి ఉష్ణోగ్రత కొలిచే ప్రయత్నం చేస్తున్నావు!! వయస్సు అంటని త్రిదశుడుగనే తమ్ముణ్ణి బ్రతకనీ! అతడు చిత్తూరు జిల్లా కల్చరల్ అంబాసిడర్! ●

# పులికన్నుల చల్లని జాలి....

డా॥ సోమసుందర్ అవంత్స

కురిసి కురిసి కవితలుగా మారింది. సభలలో గొంతెత్తి
ంది. కథలుగా మారింది. బడుగు జీవుల నాదారి బతుకుల
ప్ల చిత్రించింది. పేదరైతు ఆశల్ని కూల్చే వడగళ్ళను
ది. కరుణరసం అంటూ గుండెల తేమలోంచి తలెత్తి లేవాలే
న్ని మంచి పనులు చేయదు? ఎన్ని మంచి కథలు చెప్పదు?

గు భాషలో ఆధునిక కథ ఆవిర్భవించిన ముహూర్తం ఎంత
ైనదో, ఎంత శుభప్రదమైనదో? నిజానికి మనవాళ్ళనే శుభ
్తాలమీద నాకు సుతరామూ నమ్మకం లేదు. మాటవరసకి
ం కోసమే ఇలా అన్నది! అయినా మన మహాకవి ఆధునిక
వతరింపచేసిన శుభ ఘడియ నిజంగా గొప్పదే. 1910
త శతాబ్ది పొడుగునా తొంభైయేళ్ళపాటు ఎన్ని గొప్ప కథలు
! సామాన్య రచయితలను అసామాన్యులుగా నిలిపాయో?
మ్మూర్తిగా - భూమ్యాకాశాలు పట్టనంత బృహన్మూర్తిగా పెరిగి
ో? విశ్వరూప సాక్షాత్కారం ఎలా కలిగించాయో?

ైనా ప్రయత్నించి శతాబ్ది కథ ఎన్‌సైక్లోపీడియా రూపొందిస్తే
ుణ్ణు? ఎన్నివేలకు వేలు కథలు వచ్చాయో? పత్రికలకు పుష్టి
? పాఠకులకు తుష్టినిచ్చాయో? పెట్టుబడిదారీ పత్రికలను
ంగానూ, కష్టపడి రాసిన రచయితలను కుచేలురుగానూ
ర్చాయో? తెలుపుతూ, ఒక సర్వస్వం వెలయిస్తే ఎంత

ా సాగిస్తున్న కథకుల యాత్రలో పులికంటి కృష్ణారెడ్డి ఒక
ీయమూర్తి. అటు కథనీ, ఇటు కవితనీ రెండుచేతులుగా
న వాడు పులికంటి. 'భారతి' సజీవంగా సాగుతున్నంతకాలం
థలు నేనెన్ని చదివానో! మరుపుల మడతలు విప్పుతూంటే
న సన్నని ముల్లులతో గుచ్చుతూ ఉంటాయో?!

ుం ఎంత మంచిదో అంతా చెడ్డది. పిచ్చి గమనంలో సదా
ంది. అతను మొదటిసారి రేడియో కవి సమ్మేళనంలో
ాటి సన్నివేశం నాకు జ్ఞాపకముంది. మొదటిసారి చూసిన
లో పలకరించిన చెలిమి పలుకులు గుర్తున్నాయి. అవునా!
ఆ మిత్రుడు సప్తతిపూర్తి ఉత్సవానికి ముస్తాబవుతున్నాడు.
రిక లేకుండా గబగబా అడుగులు వేస్తూ సాగిన ఈ కవి
ు ఇంత చప్పున సప్తతి పూర్తి చేసుకుంటున్నాడే అని
ుంచి ఆనందమూ, వేరొక ప్రక్క నుంచి దిగులూ నన్ను
ా ఆక్రమిస్తున్నాయి!

కథలో రచించిన పులికంటి పుస్తకాలు ప్రచురించాడు. వార
ప్రత్యేక సంచికల్లో ఎన్ని మంచికథలు వచ్చాయో నాకు
తెలియదు. అయినా ఆయన కథలన్నిటిపైనా ఈ సందర్భంలో విమర్శ వ్యాసం రాయడం సాధ్యమూ కాదు. పరిశోధకులకైతే తప్పదు కాని, అస్మదాదులకు వాంఛనీయమూ కాదు. అందుకనే వాచవిగా ఐదు కథలు పరిశీలించదలిచాను. అవధరించండి.

*1. బుద్ధుడు పుట్టిన భూమిలో....*

బుద్ధుడు పుట్టిన భూమిలో ఆనాటి నుంచి ఈనాటి వరకూ కరుణా కల్హారాలే పుట్టడం లేదు. కర్కశకాఠిన్యాలే పుడుతున్నాయి. అలాంటి ఒకానొక జాలికథ ఇది. దుర్మార్గుల విధి నిషేధాల వల్ల మనుషులలో ఎన్నికులాలు, కులానికొక ఆచారాలు, అన్ని కులాలకీ చివరన అంటరాని కులమంటూ ఒకటి ఏర్పాటు కావడం, వేదాలు పుట్టిన ఈ దేశంలోనే పుట్టిన అంటురోగం. బుద్ధుని కాలంనుంచీ ఎందరో ప్రవక్తలు ఈ దురాచారానికి వ్యతిరేకంగా పోరుడుతూనే ఉన్నారు. అయినా ఈ మాయరోగం చావడమే లేదు.

ఇది ఒక దిక్కులేని రాముడికథ. పుట్టగానే తల్లిని కోల్పోయాడు. వాడికి నడక నేర్పకుండానే తండ్రీ వెళ్ళిపోయాడు. ఏ అమ్మయినా కరుణించి గుక్కెడు పాలుఇస్తే తాగాడు. ఎవరైనా పట్టెడు మెతుకులు వేస్తే తిన్నాడు. గాలికి ఎదిగాడు. ఆగమ్మకాకిలా తిరిగాడు. ఎదుగుతూ, ఎదుగుతూ సాగుతున్న తన శరీరాన్ని మోటబావి నీటిలో చూసుకున్నాడు. తన అమ్మ అందమైనదే అయిఉంటుంది. ఆవిడ అందమే తనకు వచ్చింది. అందుకే తన మొగం బాగుంది. జబ్బలూ, కాళ్ళూ బలిష్టంగా కండరాలు తిరిగి ఉన్నాయి. అవి బహుశా వాళ్ళనాన్న నుంచే వచ్చి ఉంటాయి! తానెరుగని తల్లిదండ్రుల నుంచి సంక్రమించిన గుణాలను చూసుకుని సంతసించాడు.

పుట్టి బుద్దెరిగి ఎదుగుతున్న తన్ను తాను చూసుకునేసరికి రెడ్డిగారి సేద్యగానిగా స్థిరపడ్డాడు. ఆ రెడ్డిగారికి పెద్ద మేకల మంద ఉంది. అంతకన్నా పెద్ద గొర్రెల మందా ఉంది. పెద్ద గేదెల మంద ఉంది. ఆవుల మందా ఉంది. వరసగా కరువుకొట్టుకుపోతున్న దుస్థితిలో ఆ మందల్ని బేరగాళ్ళకి ఇచ్చేశారు రెడ్డిగారు, గొర్రెలమంద అమ్మేముందు ఒక చూడు గొర్రె నామెక్కిన జొన్న కంకెలు తినింది. ఏం జబ్బు చేసిందో కడుపు ఉబ్బరించింది. అలాగే అది మూడు పిల్లల్ని పెట్టింది. రెండు పిల్లలు తల్లితోపాటే చనిపోయాయి. ఒకపిల్ల రాముడిలాగే దిక్కూ తెన్నూ లేకుండా వాడి బారినపడింది. వాడు దాన్ని ప్రేమగా పెంచాడు. బుజ్జి అని పేరుపెట్టాడు. పిలిస్తే పలికేది. మనిషిలా కనుసన్నల్లో మెలిగేది.

కథ ఆరంభమే ముత్యాలమ్మ జాతరకోసం ముస్తాబవుతున్న ఊరినీ, రెడ్డిగారి గుమ్మం ముందు పందిరి మీద పాత ఆకులు

కొత్త ఆకులు కప్పుతున్న రాముడ్నీ కథారచయిత మనకు
ుడు. తెల్లారితే ఏడాదిగా ప్రేమతో పెంచుతున్న గొర్రెపిల్లని
మ్మకి బలి ఇస్తాడు రెడ్డిగారు, ఆ మాట వినగానే వాడికి
ట్టుకుంది. కడుపులో దేవేస్తోంది. రెడ్డెమ్మ ఆదరించి అన్నం
సొక్కింది కాదు. ఆ రాత్రి రాముడికి నిద్రపట్టింది కాదు.
కొరకంచుల్లా వెలిగాయి. శాంతిలేని గుండె కొట్టుమిట్టా
ర్ధరాత్రి దాటింది. గభాలున లేచాడు రాముడు. బుజ్జి కూడా
దాని మెడకు తాడు తగిలించాడు. చీకట్లో రాముడిది
ాంటి నడక. బుజ్జిగాడిది నడకలాంటి పరుగు.. పొలిమేరలు
, కొండలు గడిచారు, అక్కడ చటుక్కున నేలమీద చతికిల
రాముడు. దానిమెడ కావలించుకున్నాడు. తెల్లారితే నిన్ను
మింగేద్దామనుకుంటున్నార్రా అందుకనే తెచ్చాను. నువ్వెటైనా
పో అన్నాడు రాముడు. తల అడ్డంగా తిప్పి 'మేమే' అంది
మేమ్మే అంటే కుదరదు. నా కళ్ళముందు నిన్ను చంపేస్తే
. ఎటో వెళ్ళిపో" అన్నాడు దానిమూత పట్టుకుని. బుజ్జి
ంచింది. జూక విరిచి జబ్బ సత్తున చూపాడు. పో అంటూ
ంతకా దెబ్బలు వేశాడు. ఆ దెబ్బలకు తాళలేక అది ఎటో
ుంది. రాముడు తిరిగి వచ్చి రెడ్డిగారి కొట్టాంలో
్నాడు. తెల్లారింది, రెడ్డి లేచాడు. గొర్రె పొట్టేలు లేదు. మిన్ను
ందపడ్డట్టు గర్జిస్తూ 'ఏమైందిరా' అన్నాడు, రాముడు
లేదు. తలవొంచుకు నిలబడ్డాడు. పొన్నుకర్ర తీసి పిచ్చెక్కిన
వెర్రికొట్టుడు ప్రారంభించాడు. రాముడి ఒళ్ళుచీలింది.
ుయమయింది. అయినా రాముడు మాట్లాడలేదు. అలాగే
్నాడు. తాను పెంచిన గొర్రెపిల్లను ముత్యాలమ్మకు బలి
డా ఆపి, రెడ్డి కోపానికి గురై యమ దెబ్బలు తిన్నాడు.
రక్తం కాళ్ళమ్మంటే నేలకు పాకింది. ఈ కథ చెప్పి చెప్పి
అన్నారు కదా "బుద్ధుడు పుట్టినదేశంలో... మనిషిని మనిషే
ేసి చంపే సమయంలో ఆస్తిపాస్తులు అంతస్తులతో పాటు
, దయాదాక్షిణ్యాది గుణాలు కూడా కలిగినోళ్ళ
ట్లుంది! అవి మాలోడి గుండెల్లో చేరి అంటు పేరుతో
యి" నోరులేని ముత్యాలమ్మ సాక్షిగా ఎవరి గుండెల్లో మైల?
ని వాళ్ళ గుండెలదే మైల!

ావళి కథలపోటీలో ప్రథమ బహుమతి నందుకున్న ఈ కథ
ికి 7-11-1986లో ప్రచురితమైంది. ఈ కథా కథనంలో
కౌశలంతోపాటు సంవిధానం సాధించాడు. చిత్తూరు జిల్లా
క భాషలోని మెత్తని నుడికారాలు తామరతంపరలుగా జాలు
ఇతని భాషలోని యాస, పదజాలం గురించి వివరిస్తూ
ుయవలసి ఉంది.

*బు కొక గంగ :*

ిషిలాగే సంఘం కూడా స్తబ్ధుగా కూర్చుని ఉంటే ఏమీ
చాలదు. లేచి కాళ్ళు సారించి బలంగా అడుగులు వేస్తేనే
, దూరాన్నైనా అదుపు చేయగలిగేది. కాళ్ళు సారించినపుడే,
కళ్ళెత్తి లోకాన్ని చూసినపుడే, చావో, రేవో తేల్చుకుందామని
తెగించినపుడే మనిషిలో చైతన్యం మోసులు వారుతుంది. చైతన్యం
కలిగితే తరగదు. పెరుగుతుంది. అయితే మనిషి గుండె తట్టి
చైతన్యాన్ని ఎగసన త్రోసే ధీరుడు కావాలి. రావాలి. అప్పుడా చైతన్యం
మనిషి నుంచి మనిషికి కెరటమెత్తుతుంది.

చిత్తూరు జిల్లా మోతుబరి రెడ్లకు న్యాయం, ధర్మం వారి పొన్ను
కర్రల్లోనే ఈడిగలు పడుతుంది. అంకయ్య పశువులు కాసే కుర్రాడు.
చిందుగ వచ్చి గాండ్రించింది. పశువులు బెదిరి నలుముఖాలా పారి
పోయాయి. వాడేమూలో నక్కేసి బ్రతికాడు. ఆవులు తిన్నంత
తిన్నాయి. కాళ్ళకొద్దీ పాడు చేశాయి. వాడు రెడ్డిగారింటికి వచ్చేసరికి
ఈ నేరం బయటపడింది. ఎలా జరిగింది? ఎందుకు జరిగింది? అని
విచారణ చేయలేదు. వచ్చీ రాగానే వాడ్ని గుంజకు కట్టి కాళ్ళా వేళ్ళా
కుళ్ళ పొడిచి కర్రతోబాదాడు. చిరుత వచ్చి ఆవులమీద పడిందని
మొరపెట్టుకున్నా వినిపించుకోలేదు. అబద్ధమంటాడు. 'చిరుత వస్తే
నువ్వు బ్రతుకుతా వర్రా' అంటాడు. అలా కొట్టి, కొట్టి రెడ్డి విసుగెత్తి
లోపలికెళ్ళాడు. అంకయ్య దెబ్బలు తిని తిని, సొమ్మసిల్లి అలాగే
పడిపోయాడు. అర్ధరాత్రి! చుక్కల కాంతి పరచుకుంటోంది.
అంకయ్యకు తెలివి వచ్చింది. లేచాడు. కట్లు విప్పుకున్నాడు. కాలికొద్దీ
నడిచాడు. అలా నడిచి నడిచి ఒక గ్రామం చేరుకున్నాడు. ఇంటికో
కబళం అడుక్కున్నాడు. "ఎందుకిలా అడుక్కుతింటావు? మిలిట్రీలో
చేరరాదా" అన్నాడు ఓ పెద్దమనిషి. వాడికోసం ఏడ్చేవాళ్లెవరూ లేరు.
అందుకే ఆ సలహా నచ్చింది. మిలిట్రీలో చేరాడు. శ్రద్ధగా పనిచేశాడు.
పెట్టింది కడుపునిండా తిన్నాడు. రివటలా తేరాడు. ఒకనాడు
హవల్దారు "ఇంక నీ పని అయిపోయింది. డబ్బూ, నీ సామాన్లూ
తీసుకుని వెళ్ళిపో" అన్నాడు. ఇన్నేళ్ల సర్వీసులో వాడికి సంఘ చైతన్యం
పొటమరించింది. జ్ఞానం అలవడింది. సొంత ఊరికి బయలుదేరాడు.
విడిచిపెట్టిపోయిన ఎన్నాళ్ళకో తిరిగి వచ్చినవాణ్ణి తెల్లబోయి చూసిన
వాళ్ళేకాని, పలకరించిన వాళ్ళు లేరు. అందర్నీ వావి వరసలతో
పలకరించి తాను అంకయ్యనని చెప్పుకున్నాడు. అందరికీ కావలసిన
వాడయ్యాడు, తాను పుట్టి పెరిగిన మాలపల్లిలో జనానికి ఎన్నో
సంగతులు విప్పి చెప్పి జ్ఞానోదయం కలిగించాడు. పోరాటంతో తప్ప,
ఈ అక్రమాలు చావవని అందరికీ పురెక్కించాడు. ఊరు ఊరంతా
ఏకమై అన్యాయంగా మీద పడినా ఏమీ చేయలేకుండా వెనుదిరిగి
జారిపోయేంతగా బలంగా పేట నిలబడింది. పేటకు సమీపంలో వున్న
పొరంబోకును ఆక్రమించుకొని బారులుదీర్చి ఇళ్లు కట్టుకోనేందుకు
అంకయ్య అందర్నీ వొప్పించాడు. సంకల్పం కలగడమే తరువాయి.
పని చకచక సాగిపోయింది. అందంగా తయారైన గుడిసెల్లో
హరిజనులు ప్రవేశించారు. గ్రామంలోని పెద్ద రెడ్లకీ, నాయుళ్లకీ ఇది
మింగుడు పడని చర్య. గ్రామం కూడ పలుక్కొనింది. మండలాధికారి
చేతులు తడిపింది. స్వయంగా వచ్చి బెదిరించాడు. మాలల్లో స్పందన
లేకపోయే సరకి ఏకంగా బుల్‌డోజర్ పెట్టి కొట్టించే ప్రయత్నం
చేశాడు. మాలపల్లి మాలపల్లిగా బుల్‌డోజర్‌ను అడ్డంగా పడుకొనే
సరికి మండలాధి కారి తోక ముడిచాడు.

గేనీళ్లకు మాలపల్లె రైతుల మోటుబావులమీద ఆధారపడింది. ఎదనే దెబ్బ కొట్టాలని గ్రామం నిర్ణయించింది. మాలపల్లెలో ౖ చంకన కడవ వేసుకొని కంట పడ్తేచాలు. రైతులు నీళ్లల్లో ుపుతున్నారు. అంకయ్య ఆలోచించాడు. అందర్నీ ాడు పార గడ్డపారలు చేతికిచ్చాడు. వారాలు తిరగకముందే ల్లె కొక చేదబావి. గంగమ్మ తల్లి కరుణించి జల జల ని! అగ్రవర్ణాల గొంతుల్లో పచ్చివెలక్కాయ పడినట్లయింది.

ంతలో బ్రహ్మాండమైన కరువు. రైతుల మోటబావులు యాయి. అగ్రవర్ణాలు తాగడానికి నీటిచుక్కలేదు. అయితే ల్లెలో చేదబావిలో మాత్రం చేదేకొద్ది నీళ్లే! ఇక తప్పదన్నట్లుగా ానికి దిగారు. నూతిలో గొట్టాలు దింపి అటువాడకు ఇటు కి పైపు లైన్లు వేస్తామన్నారు. అంత పని అవసరం లేదని య్య మెత్తగానే వాళ్ల అభ్యర్ధనను తిరస్కరించాడు. మండలాధి ాట విని గ్రామస్థులు కరువుకాలంలో తాగేనీళ్లివ్వమంటే రని కలెక్టర్ కాళ్లమీద చేటపెయ్యాల్లా పడ్డారు.

లెక్టరు తనిఖీకి వచ్చాడు. అంకయ్య మాటకు చేతకు య్యాడు. "గ్రామస్థులు చేసింది తప్పే అంకయ్యా! కాదనను అపకారికి ఉపకారం చెయ్యాలి కదా?" అంటే "తప్పకుండా అయితే ఒక కండిషన్, మేము చేది పోస్తాం. వాళ్లకు తీసుకొని ండి అన్నాడు."

గ్రవర్ణాల మొగాల్లో కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు?

దేవరా! కులానికొక్క చెంబు, చెంబుకొక్క గంగ, చెంబు దైతే గంగ ఆకులానిదైపోతున్నది. పిచ్చిగానీ! మారాజులు ంగను తాగతారా దేవరా?"

ంకయ్య దెప్పి పొడిచాడు – అంటును కడిగేస్తూ!

ప్తనీళ్లల్లో పడేసరిగి గంగమ్మ తల్లి గుండెల్లో నుంచి పరవశిస్తూ గల గలలు! అవి అలలు కావు. తర తరాలుగాతరగని చీడలా నికి అంటుకొన్న అంటును కడిగెయ్యడానికి లేచిన విమోచన తరంగాలు!" అంటూ ఈ కథను ముగించాడు పులికంటి. పావళి కథల పోటీలో ఉత్తమ కథగా బహుమతి పొంది )-1990 నాటి ఆంధ్రజ్యోతిలో ప్రచురిత మైంది.

కథకూడా ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచికలో 1991 ురితమైంది. ఇది కథకాదు. మారయ్య వెత. మాల కు గవర్నమెంటు పారం బోకు ఇస్తున్నదని, ఆఫీసుల చుట్టూ ద్యోగులు చేతులకు చమురు పట్టించి నానా తంటాలు పడి ప్పుకున్న మారయ్య, ఎద్దులు కొనుక్కునేందుకు మోతుబరి ాధవనాయుడు నుంచి అప్పుతీసుకుంటాడు. వాడి బ్రతు అప్పు తీర్చడానికే సతమతమయింది. రెక్కలు ముక్కలు ముళ్ళూ తుప్పలూ, రాళ్ళూ రప్పలూ బాగుచేసుకుని దుక్కి ోసం అకాశానికీ, భూమికీ కనుగ్రుడ్లు తిప్పుతూ కాలక్షేపం చేస్తాడు. వాడి బతుకులో ఆశల మెరుపు మెరిసింది. ఉరుము ఉరిమింది. వాన పడింది. దుక్కి దున్నాడు. ఎక్కువ ధర పెట్టి వేరుశెనగ విత్తనాలు కొన్నాడు. విత్తాడు. మొలకలు కూడా రానారంభిం చాయి. అంతే, ఎండలు లంకించు కున్నాయి. మొలిచిన మొలకలు ఎండిపోయాయి. కథ మళ్లీ మొదటికి వచ్చింది. మళ్ళీ ఆకాశానికి చూపులు. మాడు మాడుస్తున్నాయి ఎండలు. సాగి, సాగి ఒకనాడు వానపడింది. మళ్ళీ విత్తనాలు తెచ్చాడు. విత్తాడు. ఈ మాటు వానలే వానలు! గింజలు కుళ్ళిపోయాయి. ఏదో అంటురోగం వచ్చి ఒక ఎద్దు చచ్చిపోయింది. మళ్ళీ అప్పుతెచ్చుకున్నాడు. ఉన్న ఎద్దు జతకి మరో ఎద్దు కొన్నాడు. ఆరు నెలల్లో తీరుస్తానన్న అప్పు ఏడాది గడిచినా తీర్చలేకపోయాడు. మాధవ నాయుడు గుంజుతూనే ఉన్నాడు. ఎలాగైనా తీర్చకపోతే వీలులేని నిక్కచ్చి స్థితి ఏర్పడింది. ఎద్దుల్ని అమ్మేసి అప్పు తీరుద్దామంటే ఆ సొమ్ము అసలుకే సరిపోయేలా ఉంది. ఏం చేయాలో తోచలేదు. ప్రక్క ఊళ్ళో ఒక గొప్ప వ్యక్తి ఉన్నాడు. అతనిపేరు జయరామయ్య. తలచుకున్నాడంటే నందిని పందిగా మార్చేస్తాడు. బ్రహ్మని తిమ్మిగా మంత్రిస్తాడు. ఉద్దండుడు. అతని దగ్గరకు పోయాడు మారయ్య. ఇంట్లో కనిపించీ కనిపించగానే కాళ్ళు పట్టుకుని వదల్లేదు. "ఇదేవిట్రా ఇవి మాధవ నాయుడు కాళ్ళు కావురా!" అన్నాడు జయరామయ్య. అయినా వదల్లేదు. "ఏంకావాలో చెప్పు"! అన్నాడు. అలా అంటే తప్ప లేవలేదు మారయ్య. "మాధవయ్య అప్పు వడ్డీతో రెట్టింపయిందనీ, అది తను ఇచ్చుకోలేడనీ, ఎలాగైనా వడ్డి కొట్టించెయ్యాలనీ వేరుశెనగ వేస్తే మొలకలోనే చచ్చిందనీ మొత్తుకున్నాడు "సరే నేను చెబుతాలే" అన్నాడు జయరామయ్య. ఇంటికెళ్ళగానే పెళ్ళాం అప్పులు చేసి బలాదూర్ తిరుగుతున్నందుకు తిట్టింది. "ఎత్తుకొంటానే మొత్తుకోళ్ళు. అన్నట్లు ఏం కూశావే ఏబ్రాసి మొగమూ" అంటూ మండిపడ్డాడు. ఎద్దుల్ని అమ్ముకుంటే ఇక వ్యవసాయమేమిటని దెప్పుతూనే ఉంది. అన్నమాట ప్రకారం జయరామయ్య మాధవరావు ఇంటికొచ్చి కబురుచెశాడు. మారయ్య వెడుతూనే ఇద్దరికీ దణ్ణం పెట్టాడు. "అదేట్రా ఈ మాత్రం భాగ్యానికి జయరామయ్య గారిని తీసుకురావాలా? వడ్డీ తగ్గించమని నన్ను ఎప్పుడైనా అడిగావా?" అంటూ లబ్జుగా మాధవనాయుడు అనేసరికి మారయ్య ఉబ్బిపోయాడు. "చిత్తం చిత్తం!" అన్నాడు తలవంచి. తర్వాత తేలినది పర్యవసానం. వాడికున్న రెండెకరాల పొలం మాధవనాయుడికి అమ్మేసి అప్పుపోగా మిగిలిన డబ్బు తీసుకుని, తిరుపతి చేరి రిక్షా కొనుక్కొని కష్టపడితే బోలెడు మిగులుతుందని ఆశపెట్టాడు జయరామయ్య. జయరామయ్య మాట జవదాటలేదు మారయ్య. రిక్షా ట్యూబ్ పంక్చరయింది. "కొత్త ట్యూబూ, టైరూ కదా ఎలా దిగిందయ్యా మేకు" అంటూ సైకిలు షాపు దగ్గరికి వెళ్ళి అడుగుతుంటే, ఆదేసమయంలో జయరామయ్య అల్లుడికి హీరోహోండా కొంటున్నాడు. "కొత్తదో, పాతదో దిగడమే మేకు పనిరా" అంటూ చిరునవ్వులు చిందపోశాడు సైకిల్‌షాపు యజమాని ప్రసాద్. జయరామయ్య లాంటి మేకు లున్నంతకాలం సన్నకారు బ్రతుకులకి

పడక తప్పదంటూ పులికంటి కథను ముగిస్తారు. ఇంతకీ
ప్పని చివరిమాట ఏమంటే? ధనబలం గల మాధవనాయుడు,
ంలంగల జయరామయ్యలు, మాత్రం తమ అదృష్టానికీ,
కాలం కలిసి రావడానికీ ఆ కొండమీది దేవుడి అనుగ్రహమే
ంటూ పడి, పడి నమస్కారాలు చేస్తారు, మారయ్యా
ారు ఎన్ని నమస్కారాలు చేసినా చేతులు నొప్పులు పుట్టడం
లిసి వచ్చేదేమీ లేదు.

పలు ముంచిన కొమ్ములు :

ంధ్రప్రభ ఉగాది కథల పోటీల్లో ప్రథమ బహుమతి పొందగా
లో ఈ కథను ప్రత్యేక సంచిక ప్రచురించింది. ఈ కథకు
పేకూర్చి నది కొండారెడ్డి పాత్ర. వాడి గుండె కత్తుల పాతర.
గంగమ్మ జాతర మిషపై కొండారెడ్డి మాటువేసి, పాయకట్టు
ప్రజలూ గొప్ప ఉత్సవం చేసుకోవాలని వొప్పించాడు. తండ్రి
రాస్తే, ఈ కథ చెప్పిన ఉత్తమ పురుష - ఉద్యోగం
టున్న పట్టణం నుంచి బయలుదేరతాడు. అతనిరాక చూసి
ంబర పడతాడు. కొండారెడ్డిని పలకరించపోగా, "నీ పెళ్ళాం
ాసి కాదురా పెళ్ళాడింది నీ ఉద్యోగం చూసి అల్లుడూ!"
సక్కెమాడతాడు. కొండారెడ్డి నవ్వితే ఆకొన్నపులి ఆవులించి
ంది. ఒక అఖాతం తెరుచుకున్నట్టుంటుంది. ఆ ఏడు
సాగుతూండే తీరు గురించి కథకుడడుగుతాడు.
ఫ్గా!" అని ముక్తసరిగా జవాబు చెబుతాడు కొండారెడ్డి.
ాగుతుంది. ఊరూ వాడా ఏకమై సంబరం జరుపుకుంటు
వెనుకటి రోజుల్లో మాలలు, మాదిగలూ కేటాగా దూరం
ఉండేవారు. ఇప్పుడు మాత్రం అందరూ ఒకటైపోయినట్లు
హరిలా జాతర సాగుతోంది. రచయిత సత్యమే చెప్పాడు,
ఏకమైన రోజున ఒక ఆనందలహరి వెల్లివిరుస్తుంది. కానీ,
ాగనిస్తే కొండారెడ్డి వంటి వాళ్ళ పబ్బం గడవదు. అందుకే
ు ఊదుతున్న కొమ్ముల లోంచి ఉమ్ము మాలల మీద
దని కలహం పెట్టి కొండారెడ్డి జారుకున్నాడు. అంతే,
జాతర పేరుమీద కోలాహలం ప్రారంభమైంది. మాల
లో పరస్పర మారణోద్యోగం విజృంభించింది. ఎంతమంది
ాత పడ్డారో, గుంగమ్మగుడి ప్రాంగణం నెత్తుటి కొల్లేరయింది.
మాత్రం రచ్చబండ మీద ఠలాయించి కూర్చుని నిష్పూచీగా
బ్బుకొంటున్నాడు. కథకుడు వెళ్లి ఏమిటిదంతా?" అని
ాడు. "అలా జరగాల్సిందే గంగమ్మ నిర్ణయం! మాల
ు ఐకమత్యంగా ఉండి రైతుల్ని మూడు చెరువుల నీళ్ళు
న్నారు. హిహిహి" అంటూ కొండారెడ్డి తేలిపోతాడు. పోరు
ఇంతమంది చావులకు కారణమైన తనప్రజ్ఞకు తనే
తాడు. మాల మాదిగలు కలవనంత కాలం కొండారెడ్డి వంటి
బుద్ధుల జాతర్లు ఇలాగే సాగుతాయి. 1987లో ఒక
ికి ప్రతిరూపంగా పులికంటి రచించిన ఈ దళితకథ వర్తమాన
మానికి ఒక హెచ్చరిక. రిజర్వేషన్ల మిషపై వ్యాపిస్తున్న
హాలకి ఒక గుణపాఠం.

5. పాపం కుంటేలుగాడు :

1983 ఆంధ్రభూమి దీపావళి కథలపోటీలో ప్రథమ బహుమతి పొందినది (కాని దీపావళి ప్రత్యేక సంచిక ఆగష్టులో రావడమేమిటో?) తల్లీ తండ్రీ చిన్నప్పుడే చనిపోగా ఏకాకిగా మిగిలిన మునిగాడు అందరి దయాదాక్షిణ్యాలమీద బతికి బట్టకట్టాడు. కాస్త పొడుగు సాగి, తన శ్రమ తనే పడాలని నిశ్చయించుకుంటాడు. తండ్రి ఆస్తిగా అందించిన కత్తి సానపట్టి అడవికి పోయి కట్టెలు కొట్టుకుని బ్రతకనారంభిస్తాడు. ఒకనాడు కత్తి జారిపడి బొటనవేలు తెగిపోయింది. దానితో వాడి అసలు పేరు కూడా మటుమాయమయింది. కుంటేలు గాడుగానే మిగిలాడు, సంపాదించుకున్న సొమ్ములో దినాని కొకరూక దాచుకున్నాడు. దాచుకున్న డబ్బు మూటకట్టి పినపెద్ద దగ్గరకు పోయాడు. "వోలి తెచ్చాను. పెళ్ళిచేయి" అంటే "కుంటేలుగాడికి పిల్లనెవరిస్తా(రా!" అంటూ నవ్వు లంగించుకున్నాడు. ఈ సంభాషణ విన్న పినపెద్ద కూతురు చెంగి తిన్నగా వాడింటికి పోయింది. "నిన్ను పెళ్ళాడతా" అని జంకూ గొంకూ లేకుండా చెప్పింది. వాడు నమ్మలేదు. "మీ బాబు సంపెయ్యడా" అని అడిగాడు "నీ పాణానికి నా పాణం అడ్డు" అని చెప్పింది. వాడు భయపడుతూనే చెంగిమెడలో తాళి కట్టాడు. పినపెద్ద వాడ వాళ్ళందరినీ పోగుచేసి కుంటేలు గాడింటిమీద పడ్డాడు. "నా శవాన్ని తొక్కుకు పోవాల్సిందే ఆడిమీద సెయ్యి పడాలంటే" అంటూ మొగుడికి అడ్డంగా నిలిచింది. పిన పెద్ద తోకముడిచాడు. వచ్చిన వాళ్ళంతా జారుకున్నారు. కుంటేలు కళ్ళల్లో కాంతి మెరిసింది. కష్టపడుతూ, సంపాదించుకుంటూ సుఖంగా బ్రతుకుతున్నారు. చెంగి నీళ్లోసుకుంది. కొడుకును కని చనిపోయింది. ఎలాగైనా కొడుక్కుని పెంచి పెద్దవాణ్ణి చెయ్యాలనుకున్నాడు కుంటేలు. పచ్చని చెట్లు కొట్టే బ్రతుకులు పైకెక్కవంటారు ఇదేనేమో అనుకున్నాడు.

ఇక్కడే ఒక మలుపు తిరిగింది కథ. ఊరి హైస్కూలు విద్యార్థుల్లో ఎన్నికలు జరగబోతున్నాయి. ఒక రెడ్ల కుర్రాడు, ఒక మాలకుర్రాడూ పోటీ చేస్తున్నారు. ఊరిలో ఒక గోడపై తన నినాదాలు రాసుకున్నాడు హరిజన కుర్రాడు, రెడ్ల కుర్రాడు అదిచూసి పెద్ద అవమానంగా బాధపడ్డాడు. గోడ తుడిపించేసి, తన నినాదాలు రాసుకున్నాడు. హరిజన విద్యార్థి వచ్చి ఇదేం న్యాయం అన్నాడు. అదే న్యాయం అంటూ తన ముఠాతో కొట్టించాడు. వాడు ఏడుస్తూ పోయి మాలపేటలో పెద్దలకు చెప్పుకున్నాడు. అది తమ కులానికే జరిగిన అవమానంగా నిర్ణయించు కుని, పేటంతా కదిలి రెడ్లకుర్రాణ్ణి చావబాదారు. కాళ్ళూ, చేతులూ విరిగి ఆ కుర్రాళ్ళు ఆస్పత్రుల పాలయ్యారు. ఆ కక్షతో రెండ్లంతా చీకటి చాటులో హరిజనపేటకు నిప్పంటించారు. తూర్పువైపు ఇళ్ళన్నీ కాలిపోయాయి. హరిజనులంతా వెళ్ళి కలెక్టరుకు మొర పెట్టుకున్నారు. కలెక్టరు కేంపు వేసుకుని ఇళ్ళన్నీ తనిఖీ చేశాడు. ఇంటికో ఐదువేలు చొప్పున తన చేతుల మీదే పంచాడు. మారయ్య ఇల్లు పడమటన ఉండిపోయింది. ఆ ప్రక్కనున్న ఇళ్ళేమీ కాల్లేదు. తన ఇల్లు కూడా కాలిపోతే తనకూ ఐదువేలు వచ్చును కదా! తనపొలంలో నుయ్యితవ్వి ఇంజను పెట్టుకుందును

ంకుంటూ మనసులో కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు. ఆ ఏడుపు ాడికోపాడు బుద్ధి పుట్టింది. కొడుకుని ఆడుకోవడానికి ఇల్లంటించేసుకున్నాడు. మంటలు చెలరేగాయి. ాపాటు పడమటి పేటంతా పరశురామ ప్రీతి అయ్యింది. సు ఆనందంతో పొంగి పోయింది. ఆ సంతోషం పైకి తెలిస్తే దూరంగా చింతచెట్టుక్రిందకి పోయి కూర్చున్నాడు న్న ఇల్లునుచూసి కొడుక్కి భయం పుట్టింది. గట్టిగా గొంతెత్తి చింతచెట్టువైపు పరుగెత్తుకుని వస్తున్న కొడుకు మీద ప్ప తెట్టె పడింది. క్షణంలో భస్మమైపోయాడు, కుంటేలుగాడి ద్ధి కొడుకుని కడపున పెట్టుకుంది.

కథ విశిష్టమైనది. మానవత్వానికి మణిదీపమెత్తింది. నిరంతర ఏన మంది నుంచి, ఒక మనిషి బ్రతుకుపై స్పాటాలైట్ వేసి, ంద్రంగా తీసుకుని పరిశీలించిన పులికంటి కథలలో పాత్రలు కు చెందినవి. కథానాయకులు ప్రోటో టైపల్‌గా నిలిచి రిస్థితుల్లో జీవిస్తాయి. సామాజిక ప్రతినిధులుగా పొందుతున్న లను పాఠకులకు పరిచయం చేస్తాయి.

పులికంటి కృష్ణారెడ్డి సప్తతి పూర్తి సందర్భంగా ప్రచురింస్తున్న లో దళితకథలు ఒకముఖ్యమైన గ్రంథం. ఈ కథలన్నీ దళిత కృష్ట పరిస్థితులను హృద్యంగా చిత్రిస్తాయి. కొందరు నిస్తు దళిత మేధావులు ఆక్రోస్తున్నట్లు దళిత సాహిత్యాన్ని దళితేతరులు అంటు కోరాదని శాసించడం ఆత్మవంచన మాత్రమే! ఎంత ఎక్కువమంది రచయితలు దళిత సాహిత్యాన్ని బలపర్చితే, స్పదించి రచించితే, అంతవేగ వంతంగానూ దాని విజయం అంత సన్నిహితమౌతుంది.

పులికంటి కథనశైలిలో ఒక వ్యక్తిగత గుణం ఉంటుంది. ఒక అనితరసాధ్యమైన సంవిధానం ఉంది. దీనినే ఆంగ్ల సాహిత్య విమర్శకులు 'IDIOSYNCRASY' అంటారు. ఇడియోసిన్‌క్రసీ అంటే ఒక రచయిత మానసిక నిర్మాణాన్నీ దృక్పథాన్నీ, భావానుభూతులనూ వ్యక్తి నిష్టమైన విధానంలో అభివ్యక్తం చేయడం. ఇతని కథల గురించి ప్రఖ్యాత సంపాదకులు పొత్తూరి వెంకటేశ్వరరావు గారు రాస్తూ - "పులికంటి రాయలసీమ రావిశాస్త్రి" అన్నారు. పొత్తూరి వారు సాహిత్య విమర్శకులు కారని పిస్తుంది. ఎందుకంటే ప్రశంస అనుకుని అభిశంసను వ్యక్తం చేయడం వల్ల! పులికంటి ఎవరికీ అనుకర్త కాడు. అనుకరణ ప్రథమశ్రేణి కళ కాదు. ఇతని కథన కౌశలం సహజసిద్ధమైన పటుత్వంతో అనితర సాధ్యంగా సాగుతుంది. ఇరవయ్యో శతాబ్ది సాధించిన బహుముఖ సాహిత్య విజయాలలో కథ కడలివలె విశాలవంతం కావడం ఒకటి. అట్టి ప్రాభవంలో పులికంటి సాధించిన కథన విజయం అవిస్మరణీయమైనది. అందుకే వయోధిక్యత కలిగించిన ఆదికార్యంతో శ్రీ పులికంటి కృష్ణారెడ్డి ఆయురారోగ్య ఐశ్వర్యాదులతో పురోగమించాలని మనసారా శుభాశీస్సులంది స్తున్నాను! ●

*సామాజిక స్పృహతో రచనలు కావాలి అంటూ వేదికలెక్కి ఉపన్యాసాలిస్తూ తిరుపతికి వెళ్ళి 'క్యూ'లో నుల్చోకుండానే దర్శనం ఎలా చేసుకుందామా? - అని ఆతృత పడే రచయితలు కోకొల్లలు. వారికి కొండమీద బంగారు శిఖరం తప్ప తిరుపతిలోని అట్టడగు నిర్భాగ్యులు కనిపించరు.*

*వేకంటేశ్వరుని గర్భగుడిలోకి సరాసరి చొచ్చుక పోగల పులికంటి బీదవారి గుండెల్లోకి అంతవేగంగాను చొచ్చుకుపోగలరు.*

*మేఘమాల కాళిదాసు కవనంలో కమనీయంగా సందేశాన్ని మొసుకుని వెళ్లింది. కాని కృష్ణారెడ్డిగారి కలంలో కన్నీళ్ళు చిలకరించే కారుమేఘమయింది. రాయలసీమలో ఒకనాడు రత్నాలు లభించాయట! ఈనాడు నీటిబొట్టులేక బీటలు వారుతున్న ఆ సీమలోకి తన అనుభవాల కన్నీరు కురిపిస్తున్నారు శ్రీ కృష్ణారెడ్డి!*

**- మాలతీ చందరూర్**

(గూడుకోసం గువ్వలు కథాసంపుటి ముందుమాట "మేఘమాల" నుండి)

# కృషి రూపెత్తిన మనీషి 'పులికంటి'

డాక్టర్ ద్వా.నా. శాస్త్రి, అమలాపురం

ందరి జీవితాలు వడ్డించిన విస్తరులు. వాళ్ళ గురించి విశేషంగా చెప్పటానికి ఏమీ వుండదు. మరి కొందరికి విస్తరులు వుంటాయి. సరుకులు వాళ్ళే సమకూర్చుకోవాలి. వంటా వాళ్ళే చేసుకోవాలి. వడ్డనా అంతే. అటువంటి స్వయంకృషిలోనే శ్రీశ్రీ చెప్పిన జీవన సౌందర్యం' వుంది. దీనికి దృష్టాంతంగా వుండే జీవితాలు అరుదుగా వుంటాయి. ఆ అరుదైన జీవితాన్ని జీవిస్తూ జీవన ణ అనే రాపిడిలోంచి వెలువడిన అగ్నితేజం మన పులికంటి. వాళ్ళనీ వీళ్ళనీ నమ్ముకొని, వ్యక్తిత్వాన్ని అమ్ముకొని ఎలాగో పైకి ృకి పులికంటి ఒక గుణపాఠం.

క ప్రాంతం పేరు చెప్పగానే మంచిగా చెప్పుకొనే మహానుభావులు వేళ్ళమీదే వుంటారు. అటువంటి విశిష్ట వ్యక్తులలో రాయలసీమ గుర్తుకు వచ్చేవారు మన పులికంటి. 'ప్రాంతీయత' ఈనాడు సాహిత్యంలో ఒక అవసరం. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు ు సంస్కృతికి ఉపకారి అవుతుంది. అయితే దురభిమానం పనికిరాదు. పులికంటిలో మనం కనే విశిష్ట గుణం ఏమిటంటే మాభిమానం బోలెడు - ఇతర ప్రాంతాల దురభిమానం, శూన్యం. అన్ని ప్రాంతాలనూ కౌగలించుకుంటూనే తన ప్రాంతపుడమికి ందనం చేస్తాడు. జాతీయాభిమానం, మాతృభాషాభిమానం ఎంత ఔచిత్యమో ఎంత ఆవశ్యకమో ప్రాంతీయభిమానమూ అంతే. పట్ల ఆమాత్రం లేకుంటే ఎలా? అందుకే పులికంటే అంటే ఇష్టం!!

హుముఖ ప్రజ్ఞావంతుడు - అనే మాటను అలవోకగా వాడుతూఉటాం. అనాలోచితంగా వదిలేస్తూ వుంటాం. నిజానికి అటువంటి ుఖ ప్రజ్ఞావంతులు చాలా చాలా తక్కువే వుంటారు. నాటక రంగంలో - కవితా రంగంలో - జానపద సంగీతరంగంలో ... ,. నికార్సయిన ప్రతిభగల పులికంటి కృష్ణారెడ్డి అక్షరాలా బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆయన గళమెత్తితే చాలు అదొక ! అదొక రసావేశమ్! అదొక విసురు-మరొక కసురు!! ఆయన కలంవిప్పితే చాలు ఒక చరువు - మరొక విరుపు; ఒక నిశ్వాస గర్జన!!

ంచిమనిషి కాలేని వాడు మంచి రచయిత కాలేడు. మనిషిని మనిషిగా ప్రేమించడం!... నాకు యిజాలు తెలియవు. వాదాలు అనగలిగిన మంచి మనిషి పులికంటి. అందుకే మహా మంచి రచయిత కాగలిగారు.

లికంటి 'రాయలసీమ చిన్నోడు' అన్నది నిన్నటిమాట

ాయలసీమ పెద్దోడు'' అన్నది నేటిమాట! ●

*ఒక చట్రంలో యిమడని సాహితీ త్రివిక్రమమూర్తి మా పులికంటి.*

జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత

**- డా. సినారె**

(1973లో తిరుపతిలో ఒక అభినందనసభలో)

# “సామాజిక ‘దొంగగొడ్లు’ను తరమడం రచయితల తక్షణ కర్తవ్యం”

## శ్రీ జ్వాలాముఖి

ికంటి కృష్ణారెడ్డిగారు చాలాకాలం క్రితం “స్వాతి” మాస ‘దొంగగొడ్డు’ అనే కథ రాశారు దానికి కథలపోటీలో మొదటి తి కూడా వచ్చినట్లు జ్ఞాపకం. ఆ కథ నాదృష్టిని ఆకర్షించింది. అప్పటి బహిరంగసభల్లో పేర్కొంటూ చర్చించేవాణ్ణి. బహుశా 80 వ దశకంలోని మాట కావచ్చు ఆ కథ.

పేదరైతు మట్టిని నమ్ముకొని వ్యవసాయం చేస్తాడు. రెక్క ిరుచుకొని కష్టపడతాడు. ఈలోగా తండ్రి మంచం పడతాడు. వసాయం.... ఇటు తండ్రి అవసానదశ.... అందించాల్సిన తక్షణ సతమతమవుతాడు కొడుకు...!

ోగా పరిస్థితులు తెలుసుకున్న చెల్లెలూ బావగారు వస్తారు. ను పొలంపని చూసుకోమని తండ్రికి సేవలు చేయడానికి ర్త నిమగ్నమైపోతారు. చెల్లెలు ఆత్మీయతకు బావ ఆప్తతకు ిగి కృతజ్ఞతలు చెప్పుకుంటాడు.

ి కాలం వృద్ధాప్య రోగాన్ని కాటేస్తుంది. తండ్రి మంచం మీదే ాస్తాడు. కొడుకు కూతురు దుఃఖపడతారు. జరగాల్సిన ాడ జరిగిపోతుంది.

గా ఎదిగివచ్చిన పొలంలోకి “దొంగగొడ్డు” జొరబడినట్లు కథ సంబంధాల్ని” ఆశ్చర్యం గొలిపేట్లు క్రూర ఘాతుకానికి ది.

చానపడ్డ తండ్రికి సపర్యలు శ్రద్ధగా చేసిన కూతురు, అల్లుడు ు పడి పండించిన పంటనూ పొలాన్ని అన్నకు దక్కకుండా రాయించుకుంటారు. పండిన పొలంలోకి “దొంగగొడ్డు” నట్లు అన్న పొలంలోకి ప్రవేశించలేని వారసురాలుగా చెల్లెలు ైతు భూమిని సొంతం చేసుకుంటుంది. చెల్లెలు భర్త చట్టబద్ధమైన మంచాన పడివున్న మామాగారితో కాగితాలు, దస్తావేజులు ేస్తారు. ఇన్నాళ్ళు రెక్కడొక్కలు ఒక్కటి చేసి పొలాన్ని రలతో మట్టిని తడుపుతూ వారసుడైన ‘రైతు’ కొడుకు ికపోతారు. “పంటభూమి” రైతుకు దక్కకుండా కుట్రచేసిన ావగార్లకు శాశ్వతంగా దక్కుతుంది.

నవసంబంధాల్ని ఆస్తిగత సంబంధాలుగా చూపడంలో కృష్ణారెడ్డిగారు చాల సహజంగా చూపారు. మనుషుల ంలు, రక్త సంబంధాలు “ఆస్తి అంశం” వచ్చే సరికి ఎలా ‘కుట్ర’ గా మారుతాయో, ఎంత నిర్దాక్షిణ్యంగా “అయినవారి”. గొంతు నొక్కుతారో చాలా అద్భుతంగా చూపారు కథకులు!

కాని ఇక్కడ ఒక సమస్య తలెత్తుతుంది. తండ్రి పొలానికి కొడుకు మాత్రమే హక్కు దారు కాదు. కూతురు కూడా అంతే హక్కుదారు. తల్లిదండ్రుల ఆస్తికి కొడుకులు, కూతుళ్ళు సమాన హక్కు దారులు. ఈ ప్రస్తావన రాలేదు. దీన్ని రచయిత ప్రస్తావించినట్లు గుర్తు లేదు. బహుశా ఈ హక్కుల అంశంలోకి రచయిత వెళ్ళ లేదు.

ఆస్తిపాస్థుల విషయంలో “మధ్యతరగతి” రైతులు ఎంత సహజంగా అమానుష కుట్రలు చేసి తమ విషయంలో జాగ్రత్త పడతారో అన్న విషయానికే ఈ కథను కేంద్రీకరించారు. హక్కుదారైన తండ్రి కూతురు ఎలా దొంగగొడ్డు అవుతుందో అనేది శేషప్రశ్న?

బహుశా పులికంటి కృష్ణారెడ్డిగారు దృష్టినటుసారించలేదు. అలాంటి కథలు నిత్యజీవితంలో చాలా జరుగుతున్నాయి. కూతుళ్ళ హక్కుల్ని కాలరాచే అన్నలకు ఇది జవాబు కూడా!

ఏది ఏమైనా ఈ “దొంగగొడ్డు” కథ సహజ నుడికారంతో ఇతివృత్తవికాసంతో బాగా ముందుకు సాగి చదువరుల్ని వెంటనే ఆకట్టుకుంటుంది.

నన్ను కూడా “దొంగగొడ్డు” కథ ఆకట్టుకుంది. ఈ విషయాన్ని చాలా సాహిత్య సభల్లో ప్రస్తావించాను. చర్చించాను. ఓ మారు బహుశా తిరుపతి రైల్వే స్టేషనులోనే పులికంటి వారు కలిస్తే ఈ కథను ప్రస్తావించినట్లు గుర్తు.

“పులికంటి” వారు కాబట్టి “దొంగగొడ్డు” ను కౌటుంబకం గాకన్న సామాజికంగా చూసి, భూకామందుల పిడికిట్లో వున్న “భూమి” ని జమైన రైతులకు దక్కేట్లు రచనలు చేయాలి. వ్యవసాయవిప్లవానికి తోడ్పడాలి.

ఈనాడు మానవ సంబంధాలు పూర్తిగా విచ్ఛిన్నం అవుతున్నాయి. “చదువు” ఉద్ధరిస్తుందనుకుంటే అది “మధ్యతరగతి” ని దళారిగా మార్చివేస్తుంది. కులము గలవారు, గోత్రము గలవారు పసిడిగెలలోని బానిసకొడుకులవుతున్నారు. (వేమన) మేధావులు రచయితలు ఈనాడు సంపన్నుల గుమస్తాలకింద కుంచించి వేయబడ్డారు- “కంప్యూటరు” మనిషిని “క్యాలిక్యులేటరు” గా మార్చివేసింది.

క సంక్షోభం ఇంకా పెరుగుతుంది. మానవ సంబంధాలు ·జనాలకే అంతిమంగా ప్రాముఖ్యతనిస్తాయి.

ంందర్భంలో బాధ్యత గల రచయితలు, కుటుంబ జీవితంలో ధ్యాలు వున్నా ఎన్ని స్వప్రయోజనాలు తొందర పెట్టినా మానవ ల్ని సామాజిక బాధ్యతలుగా మలచాలి. ఇది యుగకర్తవ్యం. స్వార్ధపరులు కుల, మత, ప్రాంత, లింగ, వివక్షలకు కను ఇచ్చి వాటి యధార్థానికి మించి చర్చించి ఏకం కావాల్సిన కుటుంబాన్ని, సంఘటిత పర్చాలి. సమాజాన్ని కృత్రిమ వాదాలకు బలిచేసి, ఆటు సామ్రాజ్యవాదప్రయోజనాలకు ఇటు పతనమవుతున్న భూస్వామ్య సంస్కృతికి ప్రాణం పోయడం మానాలి. చెయి తిరిగిన రచయితగానే గాక భాధ్యత గల రచయితగా కూడా ఈ సామాజిక సంక్షోభకాలంలో పులికంటివారు "సామాజిక దొంగగొడ్ల"ను తరమడానికి తమ రచనల ద్వారా దోహదపడతారనే ఆశిస్తున్నాను!! ●

*ఇందులో చోటుచేసుకొన్న సందేహాలకు పులికంటి వివరణ :*

హైందవ సంప్రదాయంలో తరతరాలుగా ఆస్తిహక్కు కొడుకులకు, వాళ్ల కొడుకులకే కానీ, కూతుర్లకు చట్టరీత్యా హక్కులేదు. ఈ హక్కు కల్పించాలన్న తలంపు స్వర్గీయ ఎన్.టి. రామారావుకు కలగడం. 1983లో జీవో పుట్టించడం, 1986 నుండి కూతుర్లకు కూడా ఆస్తి హక్కు చట్టబద్ధం కావడం అమలులోకి వచ్చింది. దొంగ రోడ్డు కథ 1981 నవంబరు స్వాతిలో అచ్చయింది. ఆకారణంగా కూతురు తండ్రి ఆస్తికి హక్కుదారుకాదు - అని తెలిసే కూతుర్ని దొంగ గొడ్డును చేయవలసి వచ్చింది.

విప్లవవాదిగా జ్వాలాముఖిగారు తండ్రి పొలానికి కొడుకుమాత్రమే హక్కుదారుడు కాదు. కూతురు గూడా అంతే హక్కుదారు! అని భావించడం ఆయన విప్లవ వాదానికి నిదర్శనం కానీ విప్లవానికి చట్టానికి చుక్కెదురు. చట్టంచేతిలో చిగురుకొన్న హక్కు విప్లవ జ్వాలలకు ఆహుతి కావడం ఈ దేశంలో ఎప్పుడో? ఆరో దశకంలో జ్వాలాముఖి, ఏడో దశకంలో నేను ఇది ఊహించలేని పరిణామం ●

-సంపాదకుడు

నేను చాలా కాలంగా పులికంటి కథలు చదివాను. కవితలు చదివాను. విన్నాను. కలిసి చాలా సభల్లో చదివాము. విన్నాము. పులికంటి దళితకథలు చదువుతున్నప్పుడు ఈయన దళితుడా? దళితేతరుడా? అని నేను అనుకోలేదు. ఈ కథలు దళితుడు వ్రాశాడా? దళితేతరుడు వ్రాశాడా? అనీ చూడలేదు. మంచిమిత్రుడు మంచి కథలు వ్రాస్తున్నాడని సంతోషించాను.

శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారు నాకు బాగా తెలిసిన మిత్రుడే అయినా, సంఘంలో ఆయన దళితుడు కాడని తెలిసినా, కథల్లో ఆయన దళితుడుగానే అక్కడక్కడా కనిపించి నేను ఆశ్చర్యపోయానా! దళితేతరుడు దళితుడుగా కనిపించడం అబ్బురమే! -

రాయలసీమ దౌర్భాగ్యం మీద ఆయనకెంత ఆరాటం ఉందో, దళిత జీవిత దౌర్భాగ్యం మీదా అంత ఆరాటం ఉంది. పేదరికం మీద ఎంత వేదన ఉందో దళితుల దరిద్రత మీద కూడా అంత వేదన ఉంది.

-ఆచార్య కొలకలూరి ఇనాక్

(పులికంటి దళిత కథలు ముందుమాట "ఒకదళితుడుగా" నుండి)

# సభాభినందన

కీ॥ శే॥ కె. సభా
వ్యవస్థాపకులు : శారదాపీఠము, చిత్తూరు.

ˈకుడు కవియైతే
ఆ రచనా విన్నాణం వేరు.
ర్మికుడు కవియైతే
ఆ కవిత్వ పటుత్వం వేరు.
ˈకుడే కార్మికుడై అతడొక కవియై విరాజిల్లినపుడు
ఆ సాహిత్యం లోని చైతన్యం విద్యుచ్ఛక్తివలె ప్రవహిస్తుంది.
ికంటి సారస్వతంలో పలుకు పలుకునా
ఈ సత్యం సాక్షాత్కరిస్తుంది.
ితంలో క్షణక్షణాన ఈ యధార్థం గోచరిస్తుంది.

- రచయిత

కొందరు మిత్రులు అన్నారు. అంటున్నారు. కవి సృష్టించిన హిత్యాన్ని చూడాలిగాని వ్యక్తిత్వంతో సమాజానికి నిమిత్తంలేదని. బహు ద్ధివంది అన్నారు. అంటున్నారు. కవిత్వం కవి జీవితానికి తిబింబమని.

అభిప్రాయభేదాలు నాడూనేడూసహజం. కాలగర్భంలో కవి క్తిగత జీవితం మరుగైసాహిత్యం నిలిచిపోతుందనీ, అందుచేత వ్యక్తిగత ితానికి విలువ నివ్వకుండా సాహిత్య విలువలనే గమనించాలని ందరి అభిప్రాయం.

ఇక్కడ మనకు త్రికరణశుద్ధి అన్న ప్రధానాంశం గుర్తుకు వస్తుంది.

చెబుతున్న విషయం వినాలి కాని చెప్పే వారెవరైతేనేం అని ంచవచ్చు. ఆ చెప్పేవారి విలువనుబట్టియే ఆ విషయానికి ప్రాధాన్యత ంటుందన్న సత్యాన్ని కాదనలేము.

కవి హృదయం కావ్యంలో ఉంటుంది. కావ్యం కవి హృదయానికి ్ణం.

చిత్రకారుని స్వరూపం అతని చిత్రంలో ఎక్కడో లీలగా గోచరిస్తూనే ంటుంది.

వీటినంతా ఆలోచించడానికి మనకు తగిన వ్యవధి కూడా ఉండాలి.

ఒక విషయం చెప్పడానికొక అథారిటీ ఉండి తీరాలి.

ఈ సాధికారం ఉంటే అప్పుడే యిబ్బంది లేదు.

యుగప్రవక్తలకలాంటి సాధికారం ఉండినది. ఈ అధికారం ుభవంతో వస్తుంది. ఈ అనుభవం అనుభూతులకు సంబంధించినది. సాధనకు సన్నిహితమైనది. బాధలకు ఆలవాలమైనది.

కవి ఋషి కావాలన్నారు. అది చాలునా?

చాలదనే కవీశ్వరుడని అన్నారు. ఈశ్వరుడనే శబ్దం యిక్కడ గమనించదగినది.

ఇట్లా ఆలోచించగా నాకు తోచినదొక సత్యం. అదేమిటంటే కవిత్వాని కంటే వ్యక్తిత్వం ముఖ్యమని.

ఉత్తమవ్యక్తి సృష్టించే కవిత్వమే నిజమైన కవిత్వమని.

ఈ నావిశ్వాసాన్ని అందరూ అంగీరరించరని నాకు తెలుసు.

కవిత్వం హృదయానికీ, ఆత్మకూ సంబంధించినది. మనస్సుకు అతీతమైంది.

పరిపూర్ణమైన వ్యక్తిత్వం ఉన్నవాడి కవిత్వం కూడా పరిపూర్ణంగా ఉంటుంది.

పోతన జీవితానికి సాహిత్యానికీ ఉన్న సంబంధం అదే.

వేమన ప్రజాకవి అనుభూతులకూ పద్యాలకూ ఉన్న సంబంధమూ అదే.

శైవ సాహిత్య స్రష్టలలో ఈ కోవకు చెందినవారు కోకొల్లలు.

నేటి సమాజంలో ఎందరో కవులు రచయితలూ ఉన్నారు.

పావలా ఖరీదు సిగరెట్టును కాల్చుతూ బిచ్చగాడి పాటను వ్రాస్తారు.

పాతిక రూపాయల మధువును ఆస్వాదిస్తూ కార్మికుని శ్రమను వర్ణిస్తూ గేయాన్ని వ్రాస్తారు.

వీటినేదో అలవాట్లక్రింద కొట్టివెయ్యడం సులభం.

కవి నిరంకుశుడని గడుసుగా తప్పుకోవడమూ సహజమే.

కానీ హాలాహలాన్ని కంఠంలో దాచుకొని అమృతాన్ని పంచిన శివుడు,

విషాన్ని త్రాగి సిద్ధాంతంకోసం నిలిచిన సోక్రటీసు,

అపూరూపలావణ్యవతియైన అర్థాంగిని, రాజ్యాన్ని పరిత్యజించి లోకంకోసం తపించిన బుద్ధుడు,

పిస్తోలుగుండుకు గుండెల్ని అప్పగించిన మన గాంధీజీ-,

శిలువపై కెక్కిన ఏసు-వీరంతా కనులకు సాక్షాత్కరిస్తూ ఉంటారు.

వాల్మీకి

వ్యాసుడు

బాణుడు

ధూర్జటి

అన్నమాచార్యులు

వేంగమాంబ

మొల్ల

పోతన

తిక్కన

ందరో మహామహులున్నారు గదా! ఆ ఆశ్రమాలు, ంలాలు, కాషాయంబరాలు అవన్నీ విస్మరించరానివే.

దృక్పథం సరియైనదనే నా నమ్మకం.

సమాజం చాల చైతన్యవంతమైనది.

కమంగా అన్యాయంగా ధనార్జనచేస్తూ ప్రజలను పీడించే లను విస్మరించినట్లే, విమర్శించినట్లే, విసర్జించినట్లే–

నీతికీ, దురలవాట్లకు, అసూయద్వేషాలకూ లోనైన కవుల, ల కవిత్వానికీ రచనలకూ విలువ లేకుండా పోతుందనే సత్యం ప్పుడే గుర్తించబడుతున్నది.

క కవిత్వం. వ్యక్తిత్వం లేదా వ్యక్తిత్వం–కవిత్వం పరస్పరం డానికి వీలుకానిస్థితి యేర్పడుతుంది.

విని గురించి చర్చించాలనుకున్నా ఆ కవి జీవితాన్ని స్పృశించక అంచేత జీవితంలో కూడా కవి ఋషిగా, దేవుడుగా రూపొందక

తం కూడా అంత మహత్తరమైనది కాకపోతే అతని సాహిత్యం కానేరదు. అతడు కవీశ్వరుడు కాలేడు.

ప్రధానమైన ఈ సమస్యను కవులు, రచయితలు చర్చించడం ఉండకపోవడం ఆశ్చర్యమే. ఐనా ఆత్మవిమర్శ వంటి ఈ చర్చ లువను చేకూర్చగలదని నా విశ్వాసం.

ంచిక మన కృష్ణ సన్మాన సంచిక. కృష్ణారెడ్డి వ్యక్తిగత జీవితాన్ని కుండా అతని సాహిత్యాన్ని గురించి చెప్పలేను. ఎవరైనా ఇది నతగా, భావించినా నాకు అభ్యంతరం లేదు.

న్ని దున్ని పండించి, ఆ వడ్లు దంచి ఆ బియ్యాన్ని స్వయంగా ), పళ్లెంలో పెట్టుకొని ఆరగించే రైతు పరమశివుడు.

వ్రాసుకొని, దానిని తానే కంపోజ్ చేసుకొని, తానే గెటప్ ఆ స్టోనుమీద బిగించి ప్రూపుతీసి తానే దిద్దుకొని, తానే చెన్ను గించి అచ్చువేసి పేజీలుకుట్టి బైండుచేసి చదువుకొనే రచయిత డు.

కృష్ణుడు పేరుతో కృష్ణుడై వ్యవసాయంలో శివుడై సాహిత్యంలో కన్పిస్తాడు.

ఆ మసిబట్టలతో మెషిన్ ముందు నిలబడి ఉండే పులికంటిని చూడడం నాకెంతోయిష్టం.

అడుసుమడిలో కన్పించే రైతు–.

ఈ ప్రెస్సులో కన్పించే రచయిత ఈ యిద్దరి అనుభూతులూ అనుభవాలూ బాధలూ ఆవేదనలూ ఆశలూ ఆశయాలూ ఇవన్నీ కృష్ణలో ఉండటంవలన ఇతని రచనలు సాధికారాలు.

అనుభవాలతో సృష్టించే రచనలు సూర్యచంద్రులు ఉన్నంతవరకూ నిలబడితే అవి ప్రవక్తల వచనాలు.

నాకెంతో స్పష్టంగా తెలుసు.

ఈ ప్రజాస్వామిక యుగంలో ఈ సామ్యవాద వ్యవస్థలో ఒక పనికి మాలిన పాటకు వెయ్యిరూపాయల ప్రతిఫలం ఉంది.

వెయ్యి మంచి పాటలకు ఒక్క రూపాయి ప్రతిఫలం లేదు.

అందుకని కవులు రచయితలు దిగజారవలెనా?

పోతన అన్నారు గదా! నిజదార సుతోదర పోషణార్థమై సాహిత్యాన్ని అమ్ముకోరాదని.

సాహిత్యాన్ని నమ్ముకోవచ్చు కాని అమ్ముకోవచ్చునా?

నాగలి మేడిపట్టిన పోతనవలె కృష్ణ కంపోజింగ్ స్టిక్ పట్టుకొన్నాడు.

పత్రిక పెడుతున్నాను పేరు చెప్పండి అన్నాడు.

"ఏడుకొండలు"

లేదా,

"కామధేనువు"

ఏదో నచ్చింది చూడమన్నాను. అప్పుడు అన్నాను.

ఈ ఎడారి ప్రయాణమెందుకని? ఎక్స్‌పరిమెంట్ చేసే సాహసం కొందరికే ఉంది. ఏ సుందరాచారి గారి వంటి మొండి ఘటాలకే చెల్లుతుంది కానీ ఉద్యోగం లేకుండా కవిత్వం మీద బ్రతగ్గలమా! అందులో ఊరికో దానకర్ణుడున్న మన జిల్లాలో.

కానీ ఒక రహస్యముంది. అదేమిటంటే భగవంతుని నమ్ముకోవడం.

సత్యాన్వేషణమే సాహిత్య పరమావధియై సర్వేశ్వరుని సాక్షాత్కారమే ప్రతిఫలాపేక్షయై విశ్వకల్యాణమే కవిత్వధ్యేయమైనపుడు కవికందమూలాలో ఆకులలములతో కౌపీనంతో మంచినీళ్ళతో కుటీరంలో నివసించగలడు. ఈ మాత్రం వసతి ఖచ్చితంగా ఉంటుంది.

ఇది తెలిసే–

"నేను బ్రతగ్గలనన్నా" అన్నాడు కృష్ణారెడ్డి. మంచిదే. బాధల్ని కౌగిలించుకొనే గుండెలుండాలి. బాధలందరికీ రావు గదా! ఎవరి మీదనైతే భగవంతుని అనుగ్రహముంటుందో వారికే ఆబాధలను అనుభవించే హక్కూ తాహత్తూ ఉంటుంది.

వెమటోడ్చే కార్మికుడు టాల్‌స్టాయ్ వారసుడు. ఇతని ధోరణి కు నచ్చింది. అందుకింకొక కారణం వుంది.

దరంటారు గదా . కథ. ఒకటే సాహిత్యమని.

కాకొందరు కాదు . నాటకమే. సాహిత్యమని.

కొందరు పద్యమనీ, కాదు కాదు గద్యమనీ, ఇదేదీకాదు , అదేదీకాదు వచనపద్యమనీ, పాటనీ, పదమనీ, ఎన్నో- హులున్నవి.

ఒక నిర్దిష్టమైన అభిప్రాయముంది.

బెల్లం కావాలని చెరకునే పండిస్తే ప్రజలేం కావాలి? అన్నీ సమాజానికి నవధాన్యాలతో పాటు దిక్కులేనన్ని లెక్కలేనన్ని న్యాలను ఉత్పత్తి చెయ్యాలి. ఇందులో జొన్నలే ఆహారమంటే

ాత్యమూ అంతే. కృషీవలుడెన్నో ధాన్యాలను కూరలను పండ్లను దుంపలను పూలను ఉత్పత్తి చేసినట్లే రచయిత లసాహిత్యం నుండి ప్రౌఢకవిత్వ పటుత్వ సంపదలతో న్ని ధరించాలి.

పదికథలు, మరేవో నాలుగు గేయాలు చాలదు. నవలలు, రూపకాలు, కథలు, గాథలు, గేయాలు, పాటలు, పద్యాలు, లు, హరికథలు, రూపకాలు, వచనాలు, వచనపద్యాలు, హులు, కావ్యాలు ఈ సాహిత్యంలో ఎన్ని ప్రక్రియలున్నవో సృష్టించి తీరాలి. అతడే రచయిత.

ాత్య సౌధానికి అన్నీ కావాలి. పునాది నుండీ అన్నీ అవసరమే. చాలునంటే యెట్లా? దూలాలున్నవంటే ఏం లాభం? ఏదో యతో ఊగిసలాడేవారు సమగ్రమైన సాహిత్య స్వరూపాన్ని సుకోలేరు. అన్యథాభావించరాదు కానీ ఆ వాదం చేసేవారు ం యొక్క స్వరూపాన్ని నిర్ణయించిన వారితీరే.

విషయంలో నాతో ఏకీభవించి అందుకోసం కృషిచేస్తున్న విధానం నాకు నచ్చింది.

అన్ని ప్రక్రియలతో సాహిత్య వ్యవసాయాన్ని ప్రారంభించి డూ కొన్ని పరిశోధక వ్యాసాలను కూడా ప్రచురించాడీయన. సంతోషదాయకమైన అంశం.

అసలు విషయం ఈ చిరంజీవికి సన్మానం చేస్తున్నారు.

జిల్లాకు సంబంధించినంతవరకూ నాకొక్క చిక్కు ఉన్నది.

యం వచ్చినపుడు చెబుదామనుకున్నాను.

నా వెనుకటి రచయితలను గురించి ప్రశంసిస్తాను కానీ ఈ ప్రశంస వారి యెదుట మాత్రం జరగదు. అందుకే భార్గవి తండ్రిని సన్మానించినట్లు ఒకరిద్దరు ప్రయత్నించి పశ్చాత్తాప పడ్డారు. కానీ అవసరం వచ్చినపుడు నా మండలం రచయితలను నక్షత్రమండలంగా ప్రదర్శిస్తాను. నిజంగానే ఉజ్జ్వల తారలు గదా! కాదనగలరామరి!

మౌనంలో ఉన్న మహాశక్తి తపస్సు. అర్థవంతమైన వాక్కు అదనులోనే వెలువడుతుంది.

ఈ కృష్ణుడు మంచి నటుడు. శారదాపీఠం గత పుష్కర కాలంలో ఎందరినో సన్మానించినది. కానీ కొందరికే బిరుదులిచ్చింది. మనరామ విలాసభ మూలవిరాట్టు, కళావేత్త శ్రీ ఆర్.బి. రామకృష్ణంరాజుగారి ఆధ్వర్యంలో సన్మానం, . నటశేఖర. బిరుద ప్రదానం జరిగింది. ఆ మధుర ఘట్టంలో వారి ఏకపాత్రాభినయం వేలాది ప్రజల ప్రశంసలను అందుకొన్నది.

ఇంత చిన్నవాడిలో ఇన్ని ప్రతిభలున్నవా? అనవచ్చు.

అసలు కవిత్వం, కళ, నాట్యం, శిల్పం, చిత్రలేఖనం, ఇత్యాది విషయాలలో వయోభేదములెక్కడున్నవి?

ఇంకో విచిత్రం గమనార్హం. ఇతడు మంచి గాయకుడు.

ఏడు కొండలవాలు నీడలలో రచయితగా, కవిగా, గాయకుడుగా, నటుడుగా, ఉత్తమ వ్యక్తిగా కృష్ణారెడ్డి దినదిన ప్రవర్ధమానుడౌతున్నాడు.

ఇదెంతో సహజమైన విషయం. ఆశ్చర్యమేమున్నది? తిరుపతి మహాత్ములకు, మహా భక్తులకు, మహాకవులకు, మహానటులకు, మహాపండితులకు నిలయం కదా!

ఈ వ్యాసంలో పేర్కొన్న మహత్తరమైన లక్షణాల వాంతి కిరణాలు పులికంటిలో స్పష్టంగా సాక్షాత్కరిస్తున్నవి.

సన్మానం అంటే యిష్టంలేదంటారు కొందరు. ఎందుకబ్బా యివి అంటారు మరికొందరు.

అందరికీ నిచ్చెన అవసరమే. ఈ సన్మాన ం నింగికెగబ్రాకే నిచ్చెన.

అటు రైతాంగానికి ఇటు కార్మిక జగత్తుకు సయోధ్య కుదరవలసిన ఈ సంధియుగంలో కృష్ణసాహిత్యం శ్రీ కృష్ణుని ఉవాచను ఉద్బోధించాలని నా ఆకాంక్ష.

పులికంటి కవితతో ఆంధ్రజగత్తు పులకరించుగాక!

ఈశ్వరో జయంతి ! ●

# రెండు దశాబ్దాల పరిచయం

శ్రీ మధురాంతకం రాజారాం

ులికంటి కృష్ణారెడ్డిగారితో నాకున్న పరిచయం రెండు దశాబ్దాల బహుశా 1953లో ననుకుంటాను. ఈ రచయిత రచించిన లో అతడు మెరికలాంటి పాత్ర ఒకటి ధరించాడు. ఆ ుడు తిరుపతి వాస్తవ్యుడని అప్పుడే తెలిసింది.

మూలు సగటు నటుడినైతే కాస్తా ముప్పుతిప్పలు పెట్టగలిగిన పాత్రను శ్రీకృష్ణారెడ్డి అదొక హేలావిశేషంగా నటించి గారు. ఈ నటుడికి గొప్ప భవిష్యత్తు వుండగలదనుకోవడానికి తమే పునాది రాయి వేసింది.

ున ఈబళ్ళు రెండూ విడిపోయాయి.

ుగైదేళ్ళ తరువాతి సంగతి. ఆ శుభోదయం నాకింకా బాగా ుంది. ఈనాటికి మల్లే జీవితం అప్పటికింకా నానా సమస్యలతో ై పోలేదు. మీదు మిక్కిలి గ్రామీణ జీవితం ప్రశాంతికి ట్టగా వుండేది. పల్లెకు తూర్పువైపున, గుట్టదాపున, వెదురు డలో కూర్చొని ఏచదువులోనో, వ్రాతలోనో నిమగ్నుడినై వుండగా ఎవరో వచ్చారన్నా పిలుపు వచ్చింది. ఓలేటి కృష్ణతో కలిసి వచ్చిన ్ణారెడ్డి. అప్పుడాయన రైల్వేలో ఉద్యోగం చేస్తున్నారు. స్థానిక ద్యోగుల పాలిటికి క్షేత్రరాజం గుంతకల్లు. అక్కడి రైల్వే ల కళాసమితివారు ప్రతి వార్షికోత్సవంలోనూ ఒక రచయితను ంచడం పరిపాటి. అందుకీసారి నన్నెన్నుకున్నారన్నది కృష్ణారెడ్డి ర్త.

ంతకల్లు సన్మానం ద్వారా ఓ రహస్యం తెలుసుకో గలిగాను.

్వానికి అప్పటికి నేను వ్రాయడం ప్రారంభించి అయిదారేళ్ళ ండలేదు. కథలద్వారా ఎంతమంది పాఠకుల గిర్తింపుకు ు వుంటానని నా మట్టుకు నాకే సందేహంగా వుంది. ఎంతగా ్యతా శంక వేధిస్తున్నా సభకు మాత్రం వెళ్ళక తప్పలేదు. తీరా ాల్గొనేటప్పటికి నామనసులోని జంకుగొంకులమోతాదు ట్టే తోచింది. ఎట్టయెదుట సభలో కూర్చున్న వాళ్ళందరూ ులు కావడమేఅందుకు కారణం. దూరప్రాంతం నుంచీ పడం వల్లనైతేనేమి వాళ్ళు యితడెవరో సన్మానార్హుడై వుంటాడనే ట్టున్నారు. ఇంతలో పులికంటి కృష్ణారెడ్డిగారు పరిచయ ప్రారంభించి, ప్రసంగం ముగించేసరికి నా సంకోచం నిశ్శేషంగా యమైపోయింది!

బూ! మీ ప్రసంగం నా పైన పేపర్‌వెయిట్‌లా పనిచేసిందు" ని ుకున్నాను.

ందర్భములో నేను మాట్లాడింది కథాసాహిత్యాన్ని గురించి. ంగారంలాంటిదెతే అందులో కావలసినంతమట్టుకే తీసుకొని పొందికగా, అందంగా తయారుచేసుకునే నగలాంటిది కథానిక. స్థూలంగా కథాశరీరాన్ని పూహించుకోవాలి. ప్రారంభం, పొడిగింపు. ముగింపు నిర్ధారించుకోవాలి. ఏ ప్రయోజనం కోసమైతే కథ వ్రాయబడుతూవుందో, తదభిముఖంగా కథలోని సంఘటనలన్నీ దారితీయాలి. ఆద్యంతమూ ఉత్కంఠను పోషించాలి. పద్యకవితను అర్థం చేసుకోడానికి భాషలో అధికారం ఉండాలి. కథను ఎవరైనా చదువు కోవచ్చు. అత్యధిక సంఖ్యాకులైన పాఠకుల్ని అలరించే ఏకైకసాహిత్య ప్రక్రియ కథానిక.. ఇలా కొనసాగి వుండడానికి వీలున్న కథాసాహిత్య ప్రాశస్త్య వివరణలో కృష్ణారెడ్డిగారిని ఉత్తేజపరచిన విషయమేదో నాకైతే తెలియదు. అంతవరకూ తన రచనాసక్తిని కేవలం 'పద్యం' పైన మాత్రమే వెచ్చిస్తూండిన ఈ కవికిశోరుడు 'కథ' ను సైతం ఒకసారి కదిపిచూడందే నిద్ర పోనన్నాడు! అన్నాడా, అన్నమాటను నెగ్గించుకునే పట్టుదల కృష్ణారెడ్డి సొత్తు! అనతి కాలంలోనే అతడి కథలు పత్రికల్లో కనిపించ సాగాయి.

ప్రెస్సుకు అనుబంధంగా ఒక పత్రిక నడపాలన్న కోరిక కృష్ణారెడ్డి గారిలో చిరకాలం నుంచీ గూడుకట్టుకునివుంది. స్థానిక పత్రికల నిర్వహణ కత్తిపైనసాము. పుబ్బలోపుట్టి మఖలోపోయేవే ఎక్కువ. ఐనా ఉత్తమాశయాలే శ్రీరామరక్షగా కృష్ణారెడ్డిగారు పత్రికాస్థాపనకు పూనుకున్నారు. 'ప్రతి వృత్తిదారుడూ నీతియొక్క అంచుల్ని దాటడానికే ప్రయత్నిస్తున్న వర్తమాన సమాజంలో నిజాయితీ నెలకొల్పవలసిన బాధ్యత పత్రికాధిపతులదే' నన్నారు ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన డాక్టరు డి. జగన్నాథరెడ్డిగారు. ప్రారంభోపన్యాసంలో శ్రీ.వి.వి.యల్. నరసింహారావుగారు 'పాలూ నీరూ వేరే చేసే రాజ హంసలా పత్రిక ప్రజల్లో సదసద్వివేకం కలిగించాలి'. అన్నారు. పెద్దల సదాశయాలకు దర్పణంగా 'కామధేను' పత్రిక ప్రారంభమైంది.

గడచిన యిరవైయేళ్ళలో కృష్ణారెడ్డిగారు నటుడిగా సాధించిన సిద్ధిని గురించి ప్రత్యేకంగా చెప్పవలసివుంది. ఎన్నో సాంఘిక, చారిత్రక, పౌరాణిక నాటకాలను ఈయన స్వోపజ్ఞతో రక్తికట్టించగలిగాడు. హరిశ్చంద్రుడు, కర్ణుడు, దుర్యోధనుడు మొదలైన ఏకపాత్రాభినయా లతో ప్రేక్షకులను ఆనందడోలికలలో వుర్రూతలూగించగలిగిన మేటి నటనా ధురీణుల్లో ఈయన ఒకడు. మదరాసు ఆంధ్ర మహాసభలో జరిగిన 'అమరత్యాగి' ప్రదర్శన ఈయన నటనాజీవితంలో మైలురాయి. నిర్దుష్టమైన ఉచ్ఛారణ, శ్రావ్యమైన కంఠధ్వని, సముచితమైన హావభావాలు వీటికన్నిటికీ ప్రాణభూతమైన రసావేశం. ఈ లక్షణాల సమన్వయంతో మెరుగులు దిద్దుకున్న కృష్ణారెడ్డి నటనను గురించి తిరుపతి రసజ్ఞులకు చెప్పబూనడం చర్విత చర్వణం. అది వారికి సువిదితం.

ుడైన రచయిత నాటకాలు, నాటికలు వ్రాయడానికి పూను ్సహజ పరిణామం. దృశ్యనాటికలతో బాటుగా కృష్ణారెడ్డి రేడియో శ్యరూపకాలు సైతం రచించారు.

ుణయోపాయనాలుగా ఈయన ఒక సంపుటంగా వేయదగినన్ని రచించి వుంటారు. రసగుళికల్లాంటి శృంగార గీతాల సము మరొకటి. అదంతా అముద్రితం.

ష్ణారెడ్డిగారి కథలు ఆంధ్రసచిత్ర వారపత్రిక, ఆంధ్రప్రభ ిక, మాసపత్రికల్లో ప్రచురింపబడ్డాయి. కొన్ని కథల్లో ుమ పల్లెపట్టుల నిసర్గసౌందర్యాలు గుబాళిస్తాయి. మరికొన్నిం ూనవస్వభావంలోని వై చిత్రి కానవస్తుంది. అన్నింటిలోనూ ే రాయలసీమ నుడికారాన్ని గమనించవచ్చు. ఎటొచ్చీ కథలు ప్రతికల్లోనే వుండి పోవడంవల్ల కాలక్రమాన వీటిని సాహిత్య ి విస్మరించే ప్రమాదం వుంది. గూడుకోసం గువ్వలు, గూడులేని , నచ్చిన భాగం, రాగరంజితం, తీయలేని కలుపు, భామా లోకం నవ్వింది మొదలైన వాటిని ఒక సంపుటంగా అచ్చు కథలన్నీ ఒక్క బిగిలో చదివి ఒక అభిప్రాయం ఏర్పరచుకునే ి పాఠకులకు లభ్యమౌతుంది.

ఇంతవరకూ వ్రాసినమీదట సంహావలోకనం చేసి చూచుకుంటే, కృష్ణారెడ్డిగారి ప్రతిభా వ్యుత్పత్తులను లోకం పూర్తిగా వినియోగం చేసుకోలేదేమో అనిపించింది. తమిళనాడులో నవాబ్ రాజమాణిక్యం పిళ్ళలా తెలుగునాట నాటకళను పునరుజ్జీవింప జేయగలవారు లేకపోవడం దురదృష్టం. అందుకు తగిన సాధన సంపత్తితో ఒక డ్రామా ట్రూపును బటల్దేరదీస్తే దేశమంతా జైత్రయాత్ర సల్పుకరాగలిగిన సమర్థుడే పులికంటి కృష్ణారెడ్డి. ఏనాటికైనా ఈకల నిజమవుతుందన్న నమ్మకం నాకీనాటికి వుంది.

కవి, కథకుడు, నటుడు, గాయకుడు అయిన పులికంటి కృష్ణారెడ్డిగారికి జరిగే సన్మానం ప్రాంతీయ కళాకారులకందరికీ ఆనందదాయకం. ఈ సత్సంకల్పాన్ని కార్యరూపంలో పెడుతున్న పూజ్యశ్రీ శంకరంబాడి సుందరాచార్యులవారు అభినందనీయులు.

క్షేత్రరాజంగా చెలువారే తిరుపతిపురంలో శేషగిరితటాన కాపురంచేసే కాలశక్తి, శ్రీ శ్రీనివాసమూర్తి కరుణాకటాక్ష విశేషంవల్ల కృష్ణారెడ్డిగారికి ఆయువు, ఆరోగ్యం, ఐశ్వర్యం కలగాలనీ, ఆయన కీర్తి వెన్నెలలా దిశదిశలా పరివ్యాప్తం కావాలని ఆశిస్తున్నాను.

# కొండ అద్దమందు

ుకాలీన ఆంధ్ర సాహిత్య ప్రపంచంలో పులికంటి కృష్ణారెడ్డిగారి పేరు విననివారుండరు.

ాహిత్యంలోని అనేకానేక ప్రక్రియల్లో ఏ ఒకటి రెండింటిలోనో కృషిచేసి వన్నెకెక్కడం సాధారణమైన విషయం అయితే ఏ ప్రక్రియనైనా చేపట్టి విజిగీషతో సాధించి, ఆ విధంగా నేల నాలుగు చెరగులా పేరు తెచ్చుకోవడం కృష్ణారెడ్డి విశిష్టత.

ు క్రమాన్నిబట్టి చూసినప్పుడు మున్ముందుగా చెప్పవలసినది, కృష్ణారెడ్డి మహా నటుడు. అనేక నాటకాలను నాటికలను దిగ్విజయంగా ి ఉత్తమ నటుడుగా ఆయన ఎన్నో చోట్ల ఎన్నో బహుమతులు అందుకున్నారు. ఆయన నటించిన ఏకపాత్రాభినయాలు రసిక జనులకేనాటికీ నివి. ఈనాటికీ ఆయన నటుడుగా దూరదర్శన్ కార్యక్రమాల్లో పాల్గొంటూనే వున్నారు.

ష్ణారెడ్డిగారు రచయితగా పత్రికా రంగంలో కాలు మోపింది, కథారచనతోనేనని చెప్పాలి. నాటి నుండి ఆయన నిరంతరంగా కొనసాగిస్తున్న ్సాయం ఆంధ్ర మహాజనులకు సువిదితమే. కథల పోటీలలో దాదాపుగా తెలుగు పత్రికలన్నింటిలోను బహుమతులందుకున్న ఏకైక కృష్ణారెడ్డిగారేనని నానమ్మకం. గూడుకోసం గువ్వలు, అరచేతిలో గీత. భీ (భా) మాకలాపం. సబ్బు, దొంగగొడ్డు ఎలుకల బోను ువి కృష్ణారెడ్డిగారి కథల్లో గణనీయమైనవి.

లా రచయితగా కృష్ణారెడ్డిగారికి కీర్తి తెచ్చిపెట్టిన రచన . యువ. లో వెలువడిన 'అగ్గిపుల్ల' దీనికి గూడా చక్రపాణి అవార్డు లభించింది.

ువుగా, అలవోకగా పాటలు, కవితలు అల్లగల వారిలో కృష్ణారెడ్డిగారి స్థానం ప్రముఖమైంది. అమ్మి పాటలు, రేడియోకోసం వ్రాసిన ులు ఆయనకు గొప్ప గేయకర్తగా నిరూపిస్తాయి.

ుట్టు కృష్ణారెడ్డి గారు పత్రికా సంపాదకులు గూడా, ఆయన నేతృత్వం క్రింద వెలువడిన . కామధేను. పక్షపత్రిక పత్రికా ప్రపంచంలో ఒక ుడిని తీర్చిదిద్దినదని చెప్పవచ్చు.

మధేను'కు సంపాదకత్వం, వహించిన నాటి నుంచి కృష్ణారెడ్డిగారి కలం నుంచి కవితా ఖండికలు నిరంతరంగా జాలువారి తూనే ఆయన కవితలు ప్రసిద్ధ తెలుగు పత్రికలన్నింటిలోను ప్రచురితమయ్యాయి. ఆకాశవాణి కవి సమ్మేళనాల్లో పాల్గొని, గంభీరంగా రసార్ద్రంగా, ుంగా ఆయన పాడి వినిపించిన కవితలు రసికుల వీనుల్లో వినిపిస్తూనే వుంటాయి.

ంవత్సరం ఢిల్లీలో జరుగుతున్న జాతీయ కవి సమ్మేళనంలో పాల్గొనడానికి తెలుగు రాష్ట్రం నుంచి కృష్ణారెడ్డిగారు ఎన్నిక కావడం మనకు ుం. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా ఈయన మరింతకాలం మరిన్ని ఉత్తమ రచనలు చేయాలని నేను మనసారా ఆశిస్తున్నాను.

*సరిగ్గా ఒక్క పురస్కారం తరువాత పులికంటి ఢిల్లీలో జీతీయ కవి సమ్మేళనంలో పాల్గొన్న సందర్భంలో మధురాంతకం అభినందన* ●

# సాప్తపదీనము

## శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి

సీమలో బ్రతుకు రాపిడి నూర్చిన తళ్కురత్నమై
సీమలో బడుగురాలకు చేతన మిచ్చు గంటమై
సీమ జానపద రాగ రసమ్ములు చిందు కంఠమై
ఏభూతి సాహితి గమించిన లోతులకు నతుల్ సుధీ!

నవయౌవనోన్మేష నటపాత్రధారణా
కృతి దర్పణము ముఖరేఖ నిలుప
నడిప్రొద్దు సడలని గడుసరి నడసొంపు
రసవత్కథా సుధా గ్రంధి తెలుప
నిజ కవితాసతీ నిత్య పరీరంభ
పాటవ మ్మలవును ప్రస్ఫుటింప
నానావిధాఖ్యాన గానామృతానూన
వేదికల్ ప్రౌఢిమ విశదపఱుప

జీవమున్న కవన సవనరీతి
ులికంటి! పెక్కుపోకడల గంటి
యస్పటన్న వాస్తవ మొకండె
ృమ్ము కాని విన్యాస మంటి!

కన్నీట తడిపి నీ కల
మెన్నెన్ని కతలు నుడివెనొ యెన్న దరమ్మే?
ఎన్నాళ్లకయిన ఫలితము
పన్నీటిని చల్లుగాత పగిలిన యెదలన్!

చట్టిని బెట్ట కల్ల! యిక నా పొయ్యే యగుండొక్క యా
ంటల్ తడిగుడ్డ చుట్టి యుడుపన్ గ్రుక్కెండు నీరు హుళ
హా! కండ్లను వారు నశ్రులె గదే కీలల్ వాప దీటంచు హ్రా
' రీతి పులీ! వెలార్చితిని పేదల్ నోచు నిర్భాగ్యతర్!

కఱవున్ రక్కసి సీమనేలు నెడ మార్గమ్మొండు లేకున్న, నో
నరసింహం డిరు కోడె దూడల నటన్ నాల్వేల కమ్మించి సం
బరమందెన్; మఱి గొడ్ల కొటికునకున్ మాంసార్థమై పంపుచో
పరితాపమ్మున బ్రమంది పొందెను మతిభ్రంశమ్ము నీదౌ కథన్!

ంతుము మేము నిన్ గృతుల సంఖ్యాకమ్ముగా చేయుటన్,
జూసి సెబాసనం దగి మహా సత్కారముల్ పొందుటన్,
సేయు సమర్చన మ్ముడుగరల్ ప్రాచుర్యముల్ సత్కవీ!
ంతురు గాదె! పేదలు భవద్వ్యక్తిత్వ సౌహార్దముల్!

వేంకటపతి పులికంటికి
సంకట విరహిత వయస్సు సమధికశతమున్
వంకలగు నెలమిని, నిరా
టంకముగా నిడుత వాణి రవణిల్లంగన్!

# శ్రీ పులికంటి కవిత్వ తత్త్వం

శ్రీ యస్. మునిసుందరం

నకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్, ుద్ధారావమే కవిత్వమంటాడు చెలం. ఈ సామరస్యం ప్పుడు? కచ్చితంగా ఎవ్వరూ చెప్పలేరు. ఈ యుద్ధం నిరంతరం నే ఉంటుంది. కవిత్వ జీవనది ప్రవహిస్తూనే వుంటుంది.

ిత్వంగాని, మరొకటి గాని మానవమనుగడకు, సంక్షేమానికి తమైనవే. అన్నింటికీ కేంద్ర బిందువు మానవుడే. వాల్మీకి ంణం రచించినా శ్రీశ్రీ ఖడ్గసృష్టి చేసినా మానవజాతి అభ్యున్నతికే ుగడ కలకాలం నిలిచి వుండాలనీ.

ానవమనుగడకు అతిముఖ్యమైన ప్రాథమిక అవసరం అన్నం. వున్న చోటే ఈగలు ముసిరినట్టు సమస్యలు కూడా ంట్టుతాయి. సమస్యల చీకిపొదలో విరిసిన పారిజాతం మనిషి. ాసం, అన్నం చుట్టూమూగిన సమస్యలతో ఆదిమ మానవుడే ధునిక మానవుడు కూడా పోరాటం సాగిస్తున్నాడు. ఈ ికి ఆది లేనట్టే అంతం కూడా లేదు. కవిత్వ స్థితి కూడా ఇంతే. ుక తీరని దాహం".

ు ఘనీభవించి మేఘమవుతుంది. చల్లని గాలి తాకిడికి ంచిన మేఘం కరిగివానైనప్పుడు పుడమి తల్లిని ితంచేస్తుంది. కవిత్వమూ అంతే. అనుభవాలు అనుభూతులై స్తాయి. ఘనీభవించిన అనుభూతులు స్పందన అనే చల్లగాలి త్వవర్షమై వర్షిస్తాయి. ఈ అనుభూతులు మానవ మనుగడకీ, ికీ, హితానికీ. చక్కెర ఫ్యాక్టరీలో చెరుకుగడలు వేస్తారు. చక్కెరగోనె సంచిలో నింపుకుంటాడు. చెరుకుగడ చక్కెర ి మధ్య యెంత తతంగం? అనుభవాలను మేధ స్వీకరించి అందజేస్తుంది. అనుభవాలను గుండె అనుభూతించి, తో ఎదుటిగుండెలో గుచ్చుకునేలా కవిత్వరూపాన్ని యిచ్చి ి అందజేస్తుంది. ఒక గుండె మరోగుండెను గాయపరిచే ు కవిత్వం. అందుకే అన్నారు. కవిత హృదయసంబంధి అని.

త్వమనే యీ చక్కెర తయారీలో గురుతర బాధ్యత వహించేది భావజాలం. అతడు మనుగడ సాగిస్తున్న సమాజం, కాలం, అనుస్యూతంగా వస్తున్న భావధార, వీటన్నిటిపై ఆధారపడి . వీటి వెంటే నడవాలన్న కట్టడి అంటూ ఏది వుండదు. వీటికి ానో, వీటికి మించిమరో మహోన్నత భావజాలావిష్కరణకూడా . ఇవి మానవుని ఆలోచనకు, అన్వేషణకు దోహదం చేస్తాయి. క్రితం ఆలోచించినట్టు వర్తమాన మానవుడు ఆలోచిస్తాడను భ్రమ మాత్రమే. కాలం, చరిత్ర, సమాజం, మానవుడి స్థితి ఆశ్చర్యం కలిగించనట్లే భావజాలంలో మార్పూ సహజమే. ామశీల. ఏదిస్థిరంగా వుండదు. మానవ మూల్యాలూ అంతే. ామ దశలేమహోన్నత నాగరికతలను సృష్టిస్తాయి. మానవ ు నాల్గుదిక్కులకూ చాటుతాయి.

మనిషి ఏర్పరచుకున్న భావజాలం స్థిరమా? అస్థిరమా? అన్న ప్రశ్న ఉదయించవచ్చు. స్థిర అస్థిర శబ్దాలు సాపేక్షాలు. పరిణామం సృష్టిమూల స్వభావం. అయితే రష్యాపతనానంతరం కమ్యూనిజానికి నూకలు చెల్లినట్లేనా? అని గట్టిగా చెప్పగలమా? కమ్యూనిజానికి వూపిరి అయిన మార్క్సిజం మానవాభ్యుదయానికి ఏకైక సిద్ధాంతం అనే నమ్మకం వున్నజనం యింకా ఎంతోమంది. ఏ భావజాలమూ యీ విశాల విశ్వంలో ఏదో ఒకమూల జీవించే వుంటుంది.

మనిషి తాను నమ్మిన భావజాలానికి కట్టుబడి (నిబద్ధుడై) ఉండాలా లేదా అన్నది మరో ప్రశ్న. మనసా వాచా కర్మణా నిబద్ధత లేని మనిషి భావజాలం ఎదుటి మనిషిని తీవ్రంగా గాయపరచదు. ప్రభావితం చేయచాలదు. ఏ సమాజంలో, ఏ కాలంలో, ఏ చారిత్రక దశలో మనిషి ఏభావజాలాన్ని స్వీకరిస్తాడో లేదా ఏర్పరచుకుంటాడో ఆ భావజాలానికి వ్యక్తి నిబద్ధుడై వుండాలి. అట్లా వుండడం శ్రేయస్కరం. భావజాలంలో వచ్చే మార్పును ఎవరూ కాదనలేరు. అయితే నిబద్ధత అవసరం.

భావకవిత్వానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటమే అభ్యుదయ కవిత్వం. ప్రపంచయుద్ధం, పారిశ్రామిక విప్లవాలు మానవ చైతన్యంలోనే సరికొత్తమలుపు తెచ్చాయి. మానవజీవశాస్త్ర పరిశోధనలు, మానవజీవన వికాసంపై పడిన కొత్త వెలుగులు మానవుడి ఆలోచనా విధానాన్నే మార్చివేశాయి. భావకవిత్వధోరణి నూతన మానవుడికి ఎబ్బెట్టుగా అనిపించింది. వాడు తిరుగుబాటు బావుటా ఎగురవేశాడు. సామాన్యుని మాన్యుని చేసి అభివృద్ధి పథం పై సర్వమానవాళి అభ్యుదయానికై మార్చింగ్ సాంగ్ పాడాడు. ఇది ఒకదేశానికి, సమాజానికి పరిమితం కాలేదు. ప్రపంచం ఒకటై పెట్టిన పొలికేక. ఈ భావజాలం ప్రతిగుండెలోనూ ధ్వనించింది. ప్రతిధ్వనించింది.

కూడెందుకు లేదు? గుడ్డెందుకు లేదు? గూడెందుకు లేదు? ఇవి కొందరికే ఎందుకున్నాయి? శ్రమ విలువెంత? స్వేదానికి తగిన ప్రతిఫలం లభిస్తుందా? మనశ్రమ, స్వేదఫలితం మనకు పూర్తిగా దక్కుతుందా? ఎందుకు దక్కడం లేదు? కారణాలు వెదికే మనిషికి అంతకు ముందున్న భావజాలం సంతృప్తినివ్వలేదు. కొత్త ఆలోచనలు చేశాడు. రహస్యం కనుక్కున్నాడు. తరతరాలుగ కరుడు గట్టిన దోపిడిపై విప్లవ శంఖం పూరించాడు. తెలుగు ప్రజ, తెలుగు సాహిత్యం ఇందుకు భిన్నంగా నడవలేదు. ఈ మహోద్యమంలో వాళ్లూ భాగస్వాములే!

భావజాలంలో మార్పు వచ్చినట్లే భావాభివ్యక్తిలోనూ మార్పు వచ్చింది. నూతన భావజాల వాహిక పద్యం కాలేదన్న భావన గేయకవితకు, వచన కవితకు బాటలు వేసింది. కథ స్థానంలో కథానిక, నాటకాన్ని నాటిక తమవునికిని చాటుకున్నాయి. నవల అనే ఒక కొత్త ప్రక్రియ రంగ ప్రవేశం చేసింది. ఛందస్సులు, అలంకారాలు, రససిద్ధాం తాలు ఆటకెక్కాయి. స్వేచ్ఛావాయువులు సర్వత్రా సంచరించాయి. మానవుడు దేవుడయ్యాడు. సామాన్యుడు మాన్యుడయ్యాడు. శ్రమ విలువపెరిగింది. శ్రమకు గౌరవం లభించింది. శ్రామిక వర్గ, భావజాలం ఉప్పెనలా ప్రపంచ సాహిత్యాలపై విరుచుక పడింది. దిగిరాను దిగిరాను

ి భువికి అన్న వారందరూ తమ అస్తిత్వ రక్షణకు భూమికి
ు. కవిత్వం గజదంత గోపురాంతర్గత అసూర్యంపశ్య కాదని
ుంది. ప్రజల భాషలో ప్రజాభ్యుదయం కోసం, ప్రజల మధ్య
ైతన్యం అని గుర్తించబడింది.

దంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే ముప్పయ్ సంవత్సరా
విత క్షేత్రంలో పంటలు పండిస్తున్న శ్రీ పులికంటి కృష్ణారెడ్డి
రామర్శ సులభసాధ్యం కాదు. "అన్ని యిజాలు సామాన్యుడిని
ుపయోగించుకుంటున్నాయి". కులాలు, మతాలు,
లు/తల్లి భారతి కంటినీటికి/ కాల్వత్రవ్వకసాయిలుండగ/
ుఖ్యమో? కులం ముఖ్యమో? గూళ్లు ముఖ్యమో? గుడ్డలు
ా? "గమ్యం చేరడానికి శ్రమిస్తున్నది నలుగురు / గమ్యం
విశ్రమిస్తున్నది ఎందరో? ఒక్కొక్క వ్యక్తి ఆ రైలు ఇంజనులో
కెడు బొగ్గువేసేదెప్పుడు? గమ్యం చేరడానికి సమిష్టి కృషి
వప్పుడు?"

ుడ్డుతో ముడిపడ్డ తలకాయలాట ముందు గడ్డి పరకకు
గచ్చకాయలాట లెందుకు? లేనివాడికి ఉగాది యెందుకు?'

ుదవికి ప్రక్షణం చేస్తున్న ప్రజానీకం'

ోతి గూడ రాముడితో నీతొకొరకు నిలబడితే/ ఆ కోతికి
ు మనిషి/ జాతి నీతి నిలపడేమి? వల్లమాలినంత సేవ నల్లకాకి
/ తెల్లగుడ్డ కట్టి గూడ తెలుసుకోవెందుకురా!"

ట్టుచావు చస్తేనే చరితార్థం మనిషిజన్మ'

ఁరిమొక్క నాటేవాడికంటే, వరిమొక్కనాటేవాడే నాకాప్తుడు'.

ట్టే దిక్కురైతయితే పెట్టువాడు దేవుడని పిచ్చోళ్ళు
ంటే/ గుండెను గిచ్చినట్టుంది'.

ట్టి మనిషి కడుపుకొట్టదు/ అది వల్లకాట్లో మట్టయినా సరే'

ుతుగా బతకడంకంటే/ కాషాయం ధరించి/ స్వాములుగా
ాయిగా బతకొచ్చు'.

ుధి దీపం కింద చదువుకొన్నవాడు/ ఆనాడు ఏకంగా
కాన్ని తిప్పితే/ వీధిరౌడీ చేతిలో నేడు/ రాచరిక రంగులు
ొంటూ ఉంది/ ఇది హైబ్రీడ్ మట్టి/ మనిషి ఏ బ్రీడ్‌కు
ుడో'.

ుగి, నేలా, నీరు, వెలుతురు, వెన్నెలపై హక్కు లేదు/ మరి
పై హక్కెందుకు? అది కొందరికే గుత్తెందుకు?'

ుమ స్వేదం శక్తి ముందు ఏదీ నిలవమను'

దురు చేతనావేణువు/ మనిషి వెదురు కావాలి'.

ుండెల్లో గూడు కట్టుకున్న స్వార్థాన్ని/ పరిహితార్థానికి
ుంగా మలిచి/ త్యాగం కన్నీటి ముత్యాలతో అభిషేకించు/
ోకం నీ గుప్పెట్లో/ నువ్వు లోకం గుండెల్లో'.

ుకటీ ఒకటి ఒక్కటైతేనే/ నీవూ నేను ఒకటైతేనే/ మనమతం
జీవితం'.

ుశ/ పట్టువదలని విక్రమార్కుడు'.

ుుగాలు మారినా, జగాలు మారినా, మారనిదొక్కటే-
ం'

'అందంగా, అతి సూక్ష్మంగా ఆవరించిన అంధ నిశ్వాసాల్లో కొత్త చివుళ్ళు'.

'పెరగాల్సింది మెదడు కాదు హృదయం'.

చినుకులందామా? చిటపటలందామా? చిచ్చుబుడ్లందామా?

గుండెబండలను చీల్చుకుని పైకుబికిన కవితాగంగ అందాము. ఇజాల జోలి లేదు. సిద్ధాంతాల రాద్ధాంతాలు లేవు. అసంబద్ధాలు, అస్పష్టతలు లేవు. గుండె చీల్చుకుని వచ్చిన భావధారమరో గుండెను గుచ్చాలి. గాయపరచాలి. ఆర్ద్రంగా ఆలింగనం చేసుకోవాలి. కృష్ణారెడ్డి కవిత్వం నడచిన బాటయిదే. ఆయన హృదయవాది. హృదయభాష మాట్లాడుతారు.

'బోడెద్దుబరువు సాహిత్యాన్ని అచ్చుగుద్ది/ అందరికీ పంచిపెట్టే సాహితీ ప్రబుద్ధులకంటే/ ఒక్కమంచిమాట పలికి ఆ మాటకు కట్టుబడిన వాడే నాకాప్తుడు.'

అవును. మంచిలేకనే కదా మనకీఇబ్బందులు. కట్టుబడిలేకనే కదా యీ అస్తవ్యస్త సామాజిక వ్యవస్థ. కృష్ణారెడ్డి నిబద్ధుడు కాదని ఎవరనగలరు? ఆయన మంచికి, మనిషికి, మనిషి గుండెలోని ఆర్ద్రతకు నిబద్ధుడు. మంచికవికి ఇంతకంటే గొప్ప నిబద్ధత ఏముంది?

శ్రీ పులికంటి మూలాలు గ్రామీణ జీవనవ్యవస్థలో వున్నాయి. రైతంటే మహాప్రేమ. రైతు జీవనం అంటే వల్లమాలిన ప్రీతి. ఆయన అటు తిరిగ ఇటు తిరిగ శబ్ద చిత్రాలకోసం ఉపమలకోసం తన పల్లెకెళ్లిపోతాడు. ఆయన మట్టిమనిషి. మట్టిని నమ్ముకున్న రైతుబిడ్డ. బాల్యమంతా మట్టిలోనే గడిచిపోయింది. అందుకే ఆయన కవితల్లో మట్టివాసనలు గుబాళిస్తాయి. 'నాగేటి చాలు' 'చెమట చిరునామా' కవితలు మంచి ఉదాహరణ.

అభ్యుదయ కవిత్వోద్యమ ప్రభావం లేదని యెట్లా అనగలం? ఆయన వర్తమానంలో జీవిస్తున్న కవి. వర్తమానంతో పోరాటం సాగిస్తున్న కవి. ఆయన ప్రతి కవిత సామాజిక స్పృహకు నిలువుటద్దం.

కొండ/ గుండె/ గుండె కొండయింది/ కొండ గుండెయింది.

కొండలు గుండెలయిన నాడే యీవ్యవస్థ మారుతుందన్న విశ్వాసం కవిలో ఆయన కవితలు నేటి అస్తవ్యస్త సామాజిక వ్యవస్థకు ప్రతిబింబాలు.

సామాజిక స్పృహ దండిగా వున్న హృదయవాది. కవిత్వభాష ఏనాడయినా హృదయభాషేనన్న సత్యం మరచిపోకూడదు.

అక్కడక్కడా చెప్పేవిధానంలో పలచన తప్పదు. శ్రీ పులికంటి వస్తుత కథా రచయిత. అది ఆయన స్వభావం. ఎక్కడో అనుభూతి గాఢత పాలు తగ్గినట్లనిపిస్తుంది. సాంద్రత కవిత్వ అభివ్యక్తికి ం.

గుళ్ళు, దేవుళ్ళు, శృంగారం, సినిమాలు, ఓటు, కవిత్వం వర్తమానకవి పులికంటి కృష్ణారెడ్డి కవిగా ఆధునిక కవితా క్షేత్రంలో తనదంటూ వొక కొండ్ర ప్రత్యేకించుకోగలరనడంలో సందేహం లేదు. ఆయన కవితా యాత్రకలకాలం సాగాలని ఆశిద్దాం.

"స్వాతికార్తెలో ముత్తెపు చిప్పలో పడినచినుకులు ముత్యాలు/ చిత్తకార్తెలో చినుకులు నాకన్నీళ్లులా వ్యర్థాలు" కావని, ఆయన కన్నీళ్ళు ఆణిముత్యాలేనని ఆయన బాటలో ఆశల చలువపందిళ్ళు వేద్దాం. కవితాక్షితలు చల్లుదాం! ●

# రాయలసీమ పెద్దోడు

'అంపశయ్య' శ్రీ నవీన్

లుగ్గాళ్ళ మండపం' చదివేంత వరకు నాకు పులికంటి కృష్ణారెడ్డి ో పెద్దగా పరిచయం లేదు. ఆయన రచించిన కొన్ని కథలు ాగానే రాశాడు". అనుకోవడం తప్ప రచయితగా ఆయన్ను ఒక సమగ్ర అవగాహన నాకు లేదు - కానీ నాలుగ్గాళ్ళ ం చదివాక పులికంటి కృష్ణారెడ్డి రచనల మీద నా అభిప్రాయాన్ని ేలసి వచ్చింది. రచయితగా ఆయన విశ్వరూపాన్ని నేనాయన ళ్ళ మండపంలో చూడగల్గాను. రాయలసీమకే పరిమితమైన ికంలో రచించిన నాలుగ్గాళ్ళ మండపాన్ని చదవడం ఆ కంతో పరిచయం లేని నాకు మొదట్లో చాలా కష్టమే అయింది. చదువుతున్న కొద్దీ ఆ రచన నాకు నచ్చడం మొదలెట్టింది. విడవకుండా ఆ పుస్తకాన్ని చదవడం కొనసాగించాను. ాళ్ళకు ఎంతో కష్టమైన మాండలికంలో రచించిన ఈ రచనలోని నత సార్వకాలీనత నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. మానవుడనేవాడు న్నా, ఏ భాష మాట్లాడినా ఏ వేషం వేసుకున్నా అతని తులు మాత్రం ఒకటేనని "నాలుగ్గాళ్ళ మండపం" మరోసారి ేసింది.

కంటి కృష్ణారెడ్డి బహుముఖ ప్రజ్ఞాశాలి అనడంలో నాకెలాంటి లేదు. ఆయన చేపట్టని సాహితీ ప్రక్రియంటూ లేదు. ఏ ను చేపట్టినా దాన్నాయన సుసంపన్నం చెయ్యకుండా లేదు. ఆయన ఒక వందకు పైగా కథలు రాశాడు. నవల ఎంకిపాటల వరవడిలో జానపదబాణీలో 'అమ్మిపాటలు' ఛందోబద్ధమైన కవితలతోపాటు వచన కవితలూ రాశాడు. టికలు రాయడమే కాకుండా నాటకాల్లో నటించాడు. ు భావాల్ని ప్రజల్లో ప్రచారం చెయ్యడానికి ఎన్నో బుర్రకథల్ని కామధేను అనే పత్రికను ఎడిట్ చేసి జర్నలిస్టుగా తన నిరూపించుకున్నాడు. అలాగే సాహిత్య విమర్శ నా వ్యాసాలు వీటన్నింటితో పాటు ఆయన గొప్ప వక్త అన్నపేరుకూడా న్నాడు. ఇలా అనేక సాహిత్య సాంస్కృతిక రంగాల్లో గత ్యళ్ళుగా అహర్నిశలూ కృషిచేస్తూ తన భావిజనుల జీవితాల్ని ంరచడానికి ప్రయత్నిస్తున్న పులికంటి కృష్ణారెడ్డి నిజంగా ఆయన తన రచనల్లో తాను పుట్టి పెరిగిన రాయలసీమ గుండె ం వినిపించగల్గుతున్నాడు.

పులికంటి కృష్ణారెడ్డి ఎన్నో గొప్ప కథలు రచించాడు. ఆ కథల్లో సమాజంలోని అట్టడుగు వర్గాలవారి బాధల్నీ, గాథల్నీ, కలల్నీ, కన్నీళ్ళనూ హృద్యంగ చిత్రించాడు. పేదరైతుల ఆక్రందనలు, దళితుల దయనీయ జీవితాలు, పతితుల, భ్రష్టుల వేదనలు ఆయన కథల్లో మనల్ని కదిలిస్తాయి. మానవ జీవితంలోని సంక్లిష్టతకూ, వైచిత్రికీ వైరుధ్యాలకూ ఆయన కథలు అద్దం పట్టాయి. ఈ కథల కన్నింటికీ కేంద్రం రాయలసీమ ప్రాంతమే. రా.వి. శాస్త్రిలాంటి వాళ్ళు ఉత్త రాంధ్రనూ, వట్టికోట అళ్వారుస్వామి, దాశరథిరంగాచార్య లాంటి వాళ్ళు తెలంగాణా తమ రచనలకు కేంద్రాలుగా ఎంచుకున్నట్టు పులికంటి కృష్ణారెడ్డి రాయలసీమను తన రచనలకు కేంద్రాన్ని చేసుకున్నాడు. రాయలసీమ మాండలికంలోని సొగసునంతా ఆయన తన రచనల్లో నిక్షిప్తం చేశాడు. రాయలసీమ చిత్రపటాన్ని ఏనాటికీ చెరిగిపోనంత బలంగా తెలుగు సాహిత్యంతో ఆవిష్కరించాడు.

నా దృష్టిలో పులికంటి కృష్ణారెడ్డి ఇతర రచనలన్నీ ఒక ఎత్తైతే ఆయన ఇటీవలనే ప్రచురించిన నాలుగ్గాళ్ళ మండపం ఒక్కటే ఒక ఎత్తవుతుంది. ఈ "నాలుగాళ్ళ మండపం"లో కృష్ణారెడ్డి రాయలసీమ పేదరైతుల గుండెల్ని ఆవిష్కరించాడు. ఆయన అనుభవాన్నంతా అక్షరాలుగా మార్చి ఈ రచన చేశాడు. అందుకే రాయలసీమ మాండలికంలో పెద్దగా పరిచయంలేని నాలాంటి ఎంతోమంది పాఠకుల హృదయాల్లో ఈ రచన కరవుసీమ కన్నీటి వీణగా పలికింది. "బాశాలి", "అబ్బోడా", "మణిసి", "పడాసకం", "గాచ్చారం", "ముదిగారం" "సంచకారం" లాంటి రాయలసీమ పలుకుబడులు నాలుగ్గాళ్ళ మండపంలో ఎంతో అందంగా, అద్భుతంగా ధ్వనిస్తాయి. అందుకే నాలుగ్గాళ్ళ మండపంలో కథల్ని ఎవరైనా రాయలసీమవాళ్ళు చదువుతూ ఉంటే వింటే ఎంత అద్భుతంగా ఉంటుందో అనిపించింది. ఇలాంటి పూర్తిస్థాయి మాండలికంలో రచించిన రచనల్ని శ్రవ్య రచనలడనం ఎంతో సబబుగా ఉంటుంది.

పులికంటి కృష్ణారెడ్డి ఇంకా ఇలాంటి ఎన్నో సజీవ రచనల్ని చేస్తూ తెలుగు సాహితీ ప్రపంచాన్ని సుసంపన్నం చెయ్యాలని అకాంక్షిస్తూ, వారి 'సప్తతి' సందర్భంగా వారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. ●

# జీవిత కళాకారుడు

## శ్రీ ఆడెపు లక్ష్మీపతి

ది 1996 సెప్టెంబర్ అనుకుంటా - సాహిత్యనేత్రం త్రైమాసిక ్రథమ వార్షికోత్సవ సభకు హజరయ్యి కడప నుండి తిరుగు ్మవుతున్నప్పుడు, రాయలసీమ ఎక్స్‌ప్రెస్ రిజర్వేషన్ బోగీలో ్ మాకు (నేను, ప్రసిద్ధ కవులు కె.శివారెడ్డి, జ్యాలాముఖి) సాగనంపడానికొచ్చిన శశిశ్రీగారు కిటికీ అవతల నుండి ఓ ్షె పరిచయం చేశారు - అంత పొట్టీ, పొడుగుకాని అర్వై ఆరోగ్యవంతమైన పర్సనాలిటీ, జీవితానుభవ పరిణతి ్బట్టతల, పెద్ద ప్రేము కళ్ళొద్దాల వెనకనుండి ప్రసరించే ... ఆ సాయంకాలపు మసక వెలుతురులో ఆయనను ్రైటర్ పులికంటి కృష్ణారెడ్డిగారని గుర్తుపట్టి ఆనందాశ్చర్యాలతో ్సం చేయి సాచాను. ఆయన సతీసమేతంగా తిరుపతి నుండి ్ట. ఒకేఒక్కనిమిషం వ్యవధిలో అవీ ఇవీ క్లుప్తంగా మాట్లాడి, ్తి పొందిన కథలు చదివాక తన అభిప్రాయం వివరంగా మాట యిచ్చి విడిపోయారు.

్షం రోజులు గడిచాక ఆయన్నుంచి నాకు సుదీర్ఘమైన లేఖ ్చింది. కొత్తతరం రచయితల కథనరీతులు ఎత్తుకుంటున్న ్తవులు, వాళ్ళ శైలీపరమైన లోపాలు, ప్రయోగశీలత ాల-దాని పరిమితులు... వగైరాల గురించి తన అభిప్రాయం ాటంగా రాస్తూ, 'తిర్యగ్రేఖ' లోనివస్తువు, ఎత్తుగడ, శైలి ్వున్నాయి. నీపేరు నిలబెట్టేకథ ఇది అని కితాబు ఇచ్చారు. ు చెప్పుకుంటూ నేను ప్రత్యుత్తరం రాశాను. అలా మాయిద్దరి ్తరప్రత్యుత్తరాలు పరంపర ప్రారంభమై కొనసాగుతూ వస్తున్నది

్రో సందర్భం 1997 జనవరిలో కాబోలు - హైదరాబాదులో ్అకాడమీ ప్రాంగణంలో నిర్వహించబడ్డ తెలుగు కథకులగోష్ఠి ్షాపులో కృష్ణారెడ్డిగారు కలిశారు. అది నాలుగు రోజుల నేను మొదటిరోజు మాత్రమే అక్కడ వుండి అర్జంటు పనిమీద తిరిగి వచ్చాను. తత్కారణంగా ఆయనతో ఎక్కువసేపు ్లేక పోయాను. అదే సంవత్సరం అక్టోబర్‌లో నా కథల సంపుటి ్ దృశ్యాలు" వెలువడ్డమూ, ఆయనకు కాపీ పంపించడమూ ఆ పుస్తకం పట్ల తన ప్రతిస్పందనకు డిసెంబరు నెలలో రాశారు-.. 'చాలా కాలం తర్వాత ఒక మంచి కథల పుస్తకం ్తృప్తి కలిగింది నాకు....' అంటూనే నాకథన పద్ధతిలోని కొన్ని గురించి ఆక్షింతలూ వేశారు. అయన సద్విమర్శను ్గిగా స్వీకరించాన్నేను. 1998 నవంబర్ నెలలో 'నూతలపాటి ్త్కారం' అందుకునేందుకు నేను కుటుంబ సమేతంగా ్వెళ్ళినపుడు సాహితీ ప్రముఖులు మధురాంతకం రాజారామ్, ్వి వెంకటసుబ్బయ్య, నరేంద్ర, వి.ఆర్.రాసాని, ఎస్. మునిసుందరం, వి. ప్రతిమ తదితరులతో ఆత్మీయ, సౌహార్ధపూరిత వాతావరణంలో ఉల్లాసంగా గడపడం ఒక ఎత్తు అయితే కృష్ణారెడ్డిగారితో ఆ రెండు రోజులు సన్నిహితంగా మెలగడం - ఆయన వాత్సల్యభరితమైన ఆతిధ్యం స్వీకరించడం మరో ఎత్తు అని నా అభిప్రాయం. ఆయన ఉన్నత వ్యక్తిత్వం, స్నేహశీల-నిష్కపట మనస్తత్వం, ఆయనలోని బహుముఖీన కళాకారుడు నన్నెంతగానో ఆకట్టుకున్నాడు. వచనం, కవిత్వం, పల్లెసాహిత్యం, జానపదకళా రూపాలు, నవల, నాటకం, పాట, మాండలికత.. ఇలా అనేక విషయాల మీద మంచి అవగాహనాపటుత్వంతో మాట్లాడుతారు. ఆయనతో సంభాషిస్తూంటే ఒక విజ్ఞాన సర్వస్వాన్ని రెఫర్ చేస్తున్న అనుభూతి కల్గింది నాకు. ఈతరం సాహితీకారులు నిజంగా ఆయన్నుంచి ఎంతో నేర్చుకోవాల్సింది ఉంది. నాదృష్టిలో కృష్ణారెడ్డిగారు గురుకథకులు.

మొదట్లో నేనాయనను గురుకథకులు అని సంబోధిస్తే ఆయన - 'లోకమంతా నన్ను లఘుకథకుడిగా గుర్తిస్తే నువ్వు గురుకథకుడు అంటావేమిటి' అని ఆక్షేపించినప్పుడు 'కొత్త రచయితలు, ఆమాటకొస్తే నాలాంటివాళ్ళు సైతం, గురువుగా భావించాల్సిన ఉత్తమశ్రేణి కథాశిల్పి మీరు' అని సోదాహరణంగా వివరించి, శ్రమించి వొప్పించి, ఆయనను మెప్పించాను.

కృష్ణారెడ్డిగారిది ఒరిజినల్ రచనా సంవిధానం, ఆయన కఠోర పరిశ్రమతో పట్టుదలతో ఆ సంవిధానాన్ని అలవర్చుకున్నారు. కథలు రాయడం ఎలాగో నేర్చుకోగోరే విద్యార్థుల కొరకుద్దేశించిన పాఠ్యాంశంలో ఈ సంవిధానాన్ని పరిశీలించే అధ్యాయమొకటి విధిగా ఉండాలని నా అభిప్రాయం. ఈ సంవిధానంలోని మూడు ప్రధాన లక్షణాలు ఇవి:- 1. తాను జీవిస్తూన్న (మధ్యతరగతి జీవన) పరిస్థితులను తనకు బాగా పరిచయమున్న (గ్రామీణ) పరిసరాలను మాత్రమే రచయిత కథ వాతావరణ సెట్టింగ్‌గా వాడుకోవడం. 2. మాండలికత చిత్రించడంలో భాగంగానే మాండలిక భాషను పాఠకునికి బోరు కొట్టని రీతిలో ఉపయోగించగల నేర్పు. 3. భాష వాడకంలో అత్యంత సంయమనం - అనగా వీరి కథనంలో అనవసరమైన వాక్యాలు, కృత్రిమాడంబర పదాలు దాదాపు కనపడవు. ఈయనకు కథాశిల్పం చాలా బాగా తెలుసు. అతి మామూలు విషయాన్ని తాత్త్విక కోణంలోంచి వీక్షించి, దానికి మానవీయ సెంటిమెంట్లు జోడించి, ప్లాట్ చట్రంలోంచి పొంగి పొర్లనీయకుండా ఒద్దికగా కథనం సాగించి, తేలుకొండిలా గుచ్చుకునే ముగింపుతో మంచికథ మలచడంలో దిట్ట కృష్ణారెడ్డిగారు. 'గూడుకోసం గువ్వలు', 'ముత్తడు గొప్పోడు, కోటిగాడు స్వతంత్రుడు, బంగారుసంకెళ్ళు, గొడ్లు, పరమ గురువు, కొమ్ములు, సబ్బు', 'మోసులు ఎండిపోతున్నాయి'. మొదలైన కథలు ఈ కౌశలానికి నిదర్శనాలు. ఈ నిరంతర సేద్యగాడు సాహితీక్షేత్రంలో

న దాదాపు 150 కథల్లో 14 కథలు వివిధ పోటీల్లో ప్రథమ
కులు పొందాయంటే ఈ అఛీవ్‌మెంట్ అనితరసాధ్యమే!

ల్లో, నవలల్లో మాండలిక భాష వాడకం గురించి మొదట్లో
గ సాహితీ వేత్తలకూ, పండితులకూ ఆక్షేపణలుండేవి. ఇప్పుడు
పరిస్థితులు లేవు. తెలుగునాట ఒక నిర్దిష్ట ప్రాంతపు
వహారాలనూ, అక్కడి నిసర్గ జీవనసౌందర్యాన్నీ సమగ్రంగా
ంచడానికి ఆ ప్రాంతపు మాండలిక భాష మాత్రమే ఒక
వాహిక అనే వాదం బలం పుంజుకుంది. ఈ వాదాన్ని భుజాని
వాళ్ళల్లో కృష్ణారెడ్డిగారు అగ్రగణ్యులు. ఈ వాదం పట్ల
న్న అచంచల విశ్వాసానికి నాలుగ్గాళ్ళ మండపం ఒక
నక. ఇక్కడ నాలుగ్గాళ్ళ మండపాన్ని గురించి రెండు మాటలు
.

ఠకుల ఆసక్తి చెడకుండా ఒక పత్రికలో రెగ్యులర్ కాలమ్
చడం చాలా కష్టమైన పని. అదే వారం వారం అయితే
ం. నిజానికి అలాంటి అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన ఘనత
లికంటి కృష్ణారెడ్డి గారికే దక్కుతుంది.

క ప్రాంతపు జనజీవితంలోని అర్తినీ, ఆవేదననీ, వాళ్ళ
రు తీరుతెన్నులనూ సరళంగా, సూటిగా పాఠకులకు చేర
కి ఆ ప్రాంతపు మాండలికం చక్కటి వాహికగా ఉపయోగ
ది. ఈ సత్యం ఎరిగిన చాలామంది గతంలో వివిధ పత్రికలలో
శారు కానీ ఎవరూ పూర్తిగా విజయం సాధించలేక పోయారు.
బు అయినంత మాత్రాన ఫీచర్‌ను కథలు, కబుర్లతో నింపాలని
ంచి, సహజత్వానికి దూరమై విఫలమైనవారు కొందరు.
న అధ్యయనం, పరిశీలన లేనందువల్ల సృజనాత్మక కొరవడి
నికే ఆగిపోయిన వారు మరికొందరు. ఇలా మాండలిక
బ చాలామంది కనిపిస్తారు.

ండలికత అనగా కేవలం భాషకే పరిమితమైనదని భావించడం
. మామూలు పాఠకులు అలా భావించడంలో వాళ్ళ
న పరిధులు, పరిమితులు అర్థం చేసుకోవచ్చు. కానీ
లు, కాలమిస్టులు, మాండలిక ఫీచరిస్టులు కూడా అలానే
ం వాళ్ళ అవగాహన లోపాన్ని సూచిస్తుంది. ఒక జాతియొక్క
జీవన విధానాన్ని చిత్రీకరించడమే 'మాండలికత' అనే
లో మాండలిక రచనలను పరిశీలించాల్సిన అవసరం ఉంది.
భాష ఒక భాగం అయితే మాండలిక భాషా లోలత్వమే
కత కాజాలదు.

ంలో కొన్ని దిన, వార పత్రికల్లో కొందరు రచయితలు,
సులు తెలంగాణా, కోస్తాంధ్రా మాండలిక భాషల్లో
చిన ఫీచర్లు వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. తెలుగు
తో సహజీవనం చేస్తున్న మైనారిటీవర్గాల జీవన రేఖల్ని
ఫీచర్లూ, కరువు ప్రాంతాల్లోని సేద్యగాళ్ళ దీనస్థితిని
చిన ఫీచర్లూ వచ్చాయి. అయితే ఏ కోణంలోంచి చూసినా,
కన్నా కృష్ణారెడ్డిగారి 'నాలుగ్గాళ్ళ మండపం' ఒక మెట్టు
ిలబడుతుంది. సాపేక్షికంగా పరిపూర్ణత నింపుకున్న ఏకైక
మాండలిక ఫీచర్ల సంపుటిగా ఈగ్రంథం తెలుగు సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్నాక్రమిస్తుంది. ఇందులో 'నాలుగ్గాళ్ళ మండపం' అనే పేరు ఎలా వచ్చిందో దాని ప్రాముఖ్యతను తెలిపే మొదటి వ్యాసం. తావరం. తో ఈ పుస్తకం ప్రారంభం కావడం చాలా ఔచిత్యవంతంగా ఉంది. ఇందులో ఉన్న వ్యాసాలన్నీ రాయలసీమ ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులకు అద్దం పడతాయి. వివిధ వర్గాల ప్రజలు-వారి అభిప్రాయాలతో, వాళ్ళ ఆలోచనా విధానంతో రచయిత చర్చించి, తర్కించి, చివరకు ముత్తారెడ్డితో మాట్లాడిన తర్వాత కొత్త అవగాహన ఏర్పడడయో, సంశయ నివృత్తి గావించుకోవడమో చేసి రిలీఫ్ పొందగలగడం కాదు కానీ - సమస్యనుసామాజిక పరంచేసి కొట్టే దెబ్బతో ఎవ్వరైనా భుజాలు తడుముకోవాల్సిందే! రచయిత ఒక విధంగా ది ఫాలిబిల్ నెరేటర్‌గా వ్యవహరించారు. రాయలసీమ సమస్యలు, నీటి ఎద్దడి, రైతుల ఇక్కట్లు, పనులు లేకపోవడం, వలసలు పోవడం వగైరాల్ని చిత్రించడం, వీటి వెనుక కారణాల్ని అన్వేషించడమూ ఈ పుస్తకం నిండా కనబడుతుంది. రైతుల ఆత్మహత్యల వెనకాలి ఆర్థికకారణాలనూ, ప్రభుత్వ నిర్వాకాన్నీ ఎండగడుతూ రాసిన 'దినం చచ్చేవాడికోసం ఏడ్చేవాడెవడు' అన్న వ్యాసంలో ప్రభుత్వం అప్పులు వాయిదా వేయడం ఆత్మహత్యల్ని వాయిదావేయడమేనని చెప్పడం ఒక విషాదకర వ్యంగ్యం. జూదాన్ని తలపింపజేసే అక్కడి సేద్యం, చాలా సందర్భాల్లో వృథా ప్రయాసగ మిగిలే రైతు శ్రమ - హృదయ విదారకంగా చిత్రించిన 'ఎంత దయో ఏల్నోళ్ళకు' పాఠకుణ్ణి ఆవేదనకు గురి చేస్తుంది, ఆలోచింప జేస్తుంది. 'ఎర్రి ఎయ్యి రకాలు' సీమ ప్రజల మనస్తత్వాలను చక్కగా కాసి వడపోసింది. 'కర్ణుడితో బారతం' ఒక కథగానే ఉంది. రాయలసీమలో బతుకంటే అని వివరించిన విధానంలోని చక్కటి వ్యంగ్యం ఆ కట్టుకునేలా వుంది. ఎలక్షన్లు వచ్చిన ప్రతిసారీ పల్లెలతో పల్లెలు కొలుములై రగులుతుంటాయి అని వివరించడంతో పాటు వివిధ రాజకీయ పార్టీల మీద రచయిత చేసిన వ్యాఖ్యానాలు, విమర్శల గురించి ఎవరూ తప్పు పట్టాల్సిన అవసరం లేదు. ఆంధ్రదేశంలో మిగతా ప్రాంతాల వారి కంటే రాయలసీమలోనే రాజకీయ చైతన్యం ఎక్కువ - అయితే ఆయా పార్టీల గురించి సామాన్యుల అవగాహన, విమర్శ ఈ వ్యాసాలలో చోటు చేసుకున్నాయని గమనించాలి తప్ప అవి రచయిత తరపు వ్యక్తిగత విమర్శగా భావించకూడదు. అందుకే తమిళనాడు రాజకీయాలను విమర్శించినా, (పు-41) జపాన్ వాడి గొప్పదనాన్ని పొగిడినా (పు-42) అతికినట్టు గానే కనిపిస్తుంది.

ఎర్రగడ్డలు అమ్ముకునే తల్లిదండ్రుల గురించి, సంతలో వ్యాపారం గురించి తెలియజేసిన వ్యాసంలోని రచయిత నిజాయితీ ఎంతగానో ఆకట్టుకుంది. ఈ వ్యాసం ఒక కొత్త ప్రపంచాన్ని పాఠకులకు పరిచయం చేస్తుంది. విశ్వహిందూ పరిషత్‌ను విమర్శించడం నిర్హేతుకంగా అనిపించదు.

మొత్తంమీద ఈ వ్యాసాల ద్వారా చిత్తూరు జిల్లా మాండలికం ప్రాణం పోసుకుందనే చెప్పాలి. ఆ ప్రాంతీయుల ఉచ్చారణ, నుడికారం వీటిల్లో అద్భుతంగా ప్రదర్శితమయ్యాయి.

పుస్తకంలో వాడిన భాష, జాతీయాలు కొన్ని సార్లు లయ ఒక ప్రవాహంలాగా సాగిపోతూంటాయి. ఇతర ప్రాంతీయ ండలికాలు కొరకుడు పడవనేది పాక్షిక సత్యం మాత్రమే. తీగా ప్రయత్నిస్తే వీటిల్లోని మాధుర్యం ఎవరైనా ఆస్వాదించ కారు. మన భాషకాని ఆంగ్లం అర్థమవుతుంది కానీ మన షకు సంబంధించిన మాండలికాలు అర్థం కావనే హిపోక్రేట్ల తీ శంకించాల్సిందే. నిజానికి వారు వీటిమీద ఆసక్తి వడం వల్లనే వాటిని అర్థం చేసుకునే ప్రయత్నం చేయడం మాండలికం అయినా చదువుతూంటే ఎంత హాయిగా దో! భాష యొక్క రూపవైవిధ్యం, గొప్పతనం! అప్పుడే కదా ! ఆ జిల్లా పదబంధాలు, సామెతలు ఈ వ్యాసాల్లో రాంటే కొత్తగా, విచిత్రంగా, కొండొకచో ఆశ్చర్యంగా తోస్తూ పష్టి మరల్చనీయవు. మాండలికభాషలు పరిశోధించేవాళ్ళు కాడెమీ పండితులు రాసిన గ్రంథాలు చదవక్కర్లేదు - చిత్తూరు ండలికత మీద సమగ్ర పరిశీలన కొరకు ఈ పుస్తకం చదివితే దో తరగని గనిలా సమగ్ర సమాచారం అందిస్తుంది.

యనను అనుసరిస్తూ చాలామంది రాయలసీమ రచయితలు క భాషను నిర్భీతిగా వాడుతున్నారు. పత్రికలూ, ఇతర రంగాలూ అన్ని రకాల మాండలికాలను ఇప్పుడు స్తున్నాయి. ఒకప్పుడు చులకన చేయబడ్డ తెలంగాణా యాస రొమ్ము విరచుకుని నిలబడి ఉంది.

డు పదుల వయస్సు రాకమునుపే వరించిన రైల్వే ఉద్యోగాన్ని వదులుకుని నాటకరంగం మీది పిచ్చిలో వీధుల్లో పడడం మస్సాహసమే! తాను ఎండమావుల వెంట పరుగెడుతున్నాడన్న తెలుసుకునేటప్పటికి ఆలస్యమైంది. ఐనా అదరక, బెదరక బ్బందుల్నీ, క్లిష్ట పరిస్థితుల్నీ ఎదుర్కొంటూ అక్షరాన్ని ని జీవితంలో నిలదొక్కుకున్నారు. తిరుపతిలో మిత్రులు న్నాను - ఎంతయినా మనిషి మనస్సు చంచలమైంది కదా! గారు ఏదో ప్రలోభాలకు లోనయ్యి ఒకానొక రాయకీయపార్టీ కొంగు పట్టుకుని కొద్దికాలం తిరిగాడట! కానీ అనతికాలంలోనే వంచనకు గురయ్యి ఆ పార్టీతో తెగతెంపులు చేసుకున్నాడట. ఇక్కడ వంచనకు గురయ్యాడు అనడం కంటె అక్కడి కూలాల కుళ్ళునీ, రాజకీయాల దుర్గంధాన్నీ ఈయనలోని కళాకారుడు భరించలేక పోయాడు అనడం సబబు.

మిత్రులద్వారావిని, ఈయన ఉత్తరాల్లోవ్యక్తం చేసే అభిప్రాయాలుచదివి ఈయన వ్యక్తిత్వం గురించి ఒక మేరకు అంచనాకు రాగలిగాను కాబట్టే 'గంగాధరం కుటుంబసాహితీ ట్రస్టువారు ఆహ్వానించినందుక్కాదు మిత్రమా!' - సత్కారం నీకు జరుగుతున్నది. అందువల్లె ఈసభకు వచ్చాను. అని ఆనాడు నాతో అన్నప్పుడు నేనాశ్చర్యపోలేదు. ఒకే పట్టణంలో ఉంటున్నా ఈయన కొందరు సాహితీ బాంధవులకు, కొన్ని సంస్థలకు చాలా దూరంగా మెలిగారంటే ఈయన నిక్కచ్చి, రాజీపడని స్వభావమే కారణం. వర్తమాన సాహితీ సమాజంలోని రుగ్మత ఏమిటంటే ఒక స్థాయి రచయితలు/ కవులు పెద్దవాళ్ళకు, పీఠాధిపతులకు విశమైన చంచాగిరీ చేస్తారు, వాళ్ళు రాసే చెత్తనంతా ఆకాశానికెత్తేస్తారు - ఏదైనా అవార్డుకోసం తన పేరు సిఫార్సు చెయ్యకపోతాడా అన్న ఆశతో! ఈ ధోరణికి కృష్ణారెడ్డిగారు పూర్తి విరుద్ధం. ఈయన తన స్వంత ఇష్టానిష్టాల, ఆలోచనల వెలుగులోనే సూటిగా ముందుకు నడిచే మనిషి. ఏదశలోనూ సర్కారీ అవార్డుల కొరకు వెంపర్లాడలేదు, కథా సాహితీక్షేత్రంలో తన ప్రత్యేక స్థానాన్ని సుస్థిరం చేసుకోవడం పైనే దృష్టి కేంద్రీకరించిన సాదాసీదా వ్యక్తి.

ఇజాల ప్రసక్తి లేకుండా నిజాలు చెప్పడమే పనిగా, రచననే వృత్తిగా, అక్షరాన్నే జీవితావలంబనగా స్వీకరించిన బహుకొద్దిమందిలో కృష్ణారెడ్డిగారు ఒకరు. తాను నిర్దేశించుకున్న మార్గంలో స్వేచ్ఛగా ప్రయాణిస్తున్న ఈ జీవిత కళాకారునికి ఏడు పదుల వయోభారం పెద్ద అడ్డంకి కాకపోవచ్చు. రాయలసీమ సిన్నోడు నిండు నూరేళ్ళు అక్షరసేద్యం చేస్తూనే ఉండాలని నా కోరిక. సప్తతిలో ఆయన ఆరోగ్యం పరిశీలిస్తే నా కోరిక ఫలిస్తుందనే నమ్మిక! ●

పులికంటి రాయలసీమ మాండలికంతో బడుగు జీవిని కేంద్ర బిందువుగా ఎంచుకొని లోగడ ఎన్నో కథలు రాసారు. బుర్ర కతలు గానం చేశారు. కవితలు అల్లారు. నాటకాలు ఆడారు, ఆడించారు. రాజకీయాలలో వేలుపెట్టారు. అయితే అందులో కూరకొని పోకపోవటం ఆయన అదృష్టం. సాహిత్యం ఆయన తపస్సు. వ్యసనం అంటే నిష్ఫలమైన ప్రయత్నం అనే అర్థం ఒకటుంది కనక ఆమాట వాడటం లేదు. నిజానికి సాహిత్య రంగానికి అంతగా అంకితమై పోవడమంటే అది అలవాటుకు మించిన ఆకర్షణ. కాకపోతే ప్రభుత్వంలో ఉద్యోగం మానుకొని సాహిత్యమే లోకమని ఎవరైనా అనుకుంటారా? ఇతర ప్రక్రియలలో ఇదివరకే ప్రసిద్ధుడనిపించుకున్న పులికంటిని నాలుగ్గాళ్లమండపం పత్రికా రంగంలో కాలమిస్ట్‌గా నిలిచింది.

తిరుపతి చరిత్రలో నాలుగ్గాళ్ల మండపం నిలిచినంత కాలం పులికంటి కృష్ణారెడ్డి గారి పుస్తకం నాలుగ్గాళ్ళ మండపం నిలుస్తుందని నా నమ్మకం. మాండలిక భాషా సాహిత్యంలో ఈ పుస్తకానికి సమున్నత స్థానం లభిస్తుంది.

- పొత్తూరి వెంకటేశ్వరరావు

(నాలుగ్గాళ్ల మండపం ముందుమాట "రాయలసీమ రావిశాస్త్రి" నుండి)

# పులుల ప్రపంచం

డా॥ రామకృష్ణ మిరియాల

ప్రాణం చవక
మాంసం ప్రియం
వ్యాఘ్రజీవనమూల్యం తెలుసా?
గ్ని జ్వాలామయకవిత్వ సంకేతాల
సారం తెలుసా?

నువ్వసలు శార్దూలవిక్రీడిత వేగ లీలాలయాన్విత సందేశం
అది గర్జిస్తే హడలిపోతావే
తే ఓడిపోతావే
ంతో హత్యచేయడానికేంలే
ఖద్యుతుల కేసి చూడగలవా నువ్వు?

రిగా ఉన్నా ఎన్నడూ జీవజాలద్వేషిగా
నుకే నువ్వు దాన్ని ముద్దుచేస్తూ బంధించావు
నది రక్షించినట్లు నువ్వు రక్షించగలవా?

లంలో వ్యవహారంలో
సహకారంలో
ఘ్రానివా గోమాయువువా
నిలబడి నీ తరఫున నువ్వే వాదించుకో
ు కోసం కంగారు పడకు.

కి తానే అపకారం చేసే
చేసే కండూతి
లో ఎవరికుందో
డుగు వార్ధక్యాన్నడుగు
డుగు కాలాన్నడుగు

క్రౌర్య చర్మాన్ని వదిలించుకుని సౌందర్యమూర్తిగా
బ్యూటీపార్లర్‌లో ముస్తాబైనట్లు
కూచున్న కాళికాదేవి మీద
నువ్వు అఘాయిత్యం చేయాలనుకున్నావా
నీదే జాతో పురాణాలు తిరగేయి.
ఉగ్రచర్యలన్నీ ఉత్తినే ఎందుకు చేస్తావులే
ఇంద్రియాలది పైచేయి అయి
నిన్ను మొట్టికాయ కొడుతున్నప్పుడే
చౌర్యం చేస్తావు వ్యభిచారం చేస్తావు
హత్యలు చేస్తావు విక్రయాలు చేస్తావు
విక్రయాల కోసం విధ్వంసాలు చేస్తావు.

ఉగ్ర చర్యలెదురు తిరిగినపుడేంచేస్తావు?
నీకు నువ్వుగా బాంబు తగిలించుకుంటావు
నీకు నువ్వుగా యమలోకం నిర్మించుకుంటావు
సాగినన్నాళ్ళే కదా శవాల వ్యాపారం.
కానీ జాగ్రత్త జాగ్రత్త
పులివే కదా అని తోళ్ళు తీయకు గోళ్ళు తీయకు
అవి కాగితపు పులులు కాదు
అవి కథలలోని పులులు కాదు
ఇపుడు జరుగుతున్న కాలంలోని పెద్ద పులులు కాదు
నువ్వెక్కడక్కడ దాక్కున్నా వెదికి వచ్చి
నీ రక్తాన్ని త్రాగి ఉమ్మేస్తాయి
వాటి ప్రపంచమే వస్తే
నీకు జూలోనూ కాస్త జాగా ఉండేదేమో.?

( హైదరాబాదులో పులిపిల్ల తోలు కోసం దాన్ని చంపిన వార్త విని....)

*కవిమిత్రుడు పులికంటి కృష్ణారెడ్డికి*

*అతని సప్తతి పూర్తి సందర్భంలో ఆయుర్వృద్ధికోసం*

*శార్దూల నఖభూషణంగా ఈ కవిత.*

# పులికంటిని సన్మానించేదెట్లా?

'సాహిత్య బ్రహ్మ' డా. వి.వి.ఎల్. నరసింహారావు
రిటైర్డ్ డైరెక్టర్, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ
ప్రస్తుత భాషా నిపుణుడు, అమెరికన్ సాఫ్ట్‌వేర్ కంపెనీ, హైదరాబాద్.

తికేళ్ళ క్రిందట మాట. చిత్తూరులో నాటికల పోటీలు ంన్నాయి. నన్నూ ఒక న్యాయమూర్తిగా వరించి కూర్చోబెట్టారు. వైవిధ్యంకోసం కాబోలు ఏకపాత్రాభినయాలు తారసిల్లాయి. భ దుర్యోధనుడు! మయసభ అంటే అది మయసభ కాదు. ాలిన రెండు కొయ్య కుర్చీలు, చిల్లులు పడ్డ ఒక బొమ్మల ! వీటిని చూచుకుంటూ గుక్క తిప్పకుండా మక్కపాటి త్సం గారి కొండవీటి చేదాళ్ళవంటి దీర్ఘ సమాసాలు పలకాలి. ుం, గుండెబలం-వీటికి తోడు ఊపిరితిత్తులబలం - ఇన్ని ని, మయసభలో దుర్యోధనుడు ప్రవేశించడు.

ుతాచేసి పకడ్బందీగా స్వగతం దొర్లిస్తున్నా, ఎక్కడ కాలు శామో, ఏద్రౌపది పకాలున నవ్వుతుందో అన్న భయం తప్పదు.

ు ఆనాటి దుర్యోధనుడు వీటిఅన్నింటికీ అతీతంగా అందరి ి చూరగొన్నాడు. రంగస్థలం మీదమెరుపుమెరిసినట్లయింది. ు సంబాళించుకోలేక పోయాను. గ్రీన్ రూమువైపు గబగబా ు. వేషలో కంటే, విడిగా మనిషిగా వినయంతో నవ్వుతూ స్తుంటే నా కాయన మరింత ఆకర్షకంగా కనిపించాడు.

త్రులు పరిచయం చేశారు "మన పులికంటి కృష్ణారెడ్డిగారండీ" ుతే! ఈ అనుభూతి నా ఒక్కడిదేకాదు. ఆయనతో ఏ కొంచెం ం ఏర్పడ్డవాళ్ళయినా వారందరూ పొందే అనుభూతి ఇదే.

ాయనకు మిత్రకోటి అసంఖ్యాకం. నాటినటుడు నేడు గొప్ప . గొప్పకార్యకర్త. పత్రికా సంపాదకుడు. కామధేనువును పిండి ఆకలి తీర్చాడు. మాండలికంలో వ్రాసిన గేయాలు, ఆయన ులు తెలుగు పత్రికలకు మకుటాయమానాలై తెలుగు కి ఆత్మబలం చేకూర్చాయి.

ు శతాబ్దం క్రిందటి విషయాలు జ్ఞప్తికి వస్తాయి. నడివయస్సులో ు చూస్తూ లోకాన్ని పరామర్శించిన ఒక కళాకారుడు ఒక కథా ఒక మిత్రమణి-పులికంటి గుండెలో నుండి తొంగి చూచిన

! సప్తతి నిండిన పులికంటి అనుభవం పండిన మహా రచయిత. జానపద కవి కోకిల'.

డు మూడు దశాబ్దుల క్రిందట సంగతి.

పత్రికలో ఆయన కథ చదివాను. ఒకవేదికమీద ఆయన కథ వదవగా విన్నాను: మరో కథ- నా అధ్యక్షత క్రింద జరిగిన కవిసమ్మేళనంలో ఆయనే చదవగా విన్నాను. ఎంత దేశీయమైన భావన! ఎంతలోతైన ఆలోచన! ఎంత కమ్మని తెలుగు పలుకుబడి! ఎంత విచిత్రమైన రచనాశిల్పం! 'అరచేతిలో గీత' ఉంటే గాని ఈ రచన సాధ్యంకాదనిపించింది.

కథ చెప్పేతీరులో, పలుకుబళ్ళ తీర్పులో వాక్య విన్యాసంలో ఇది 'పులికంటి బాణీ' అని చెప్పడానికి వీలైన బాణీ ఒకటి ఆయన అలవర్చుకున్నాడు. ఆలోచనను పురికొల్పే అగాథమైన భావాన్ని అవలీలగా ఒక గేయచరణం దొర్లించినట్లు దొర్లించటం ఆయనకే చెల్లు. అందువల్లనే పులికంటి కథానిక ఎంత పరువం కలిగి ఉంటుందో పులకంటి గేయం కూడా అంత పరువం, పరిమళం కలిగి ఉంటుంది. ఆయున పట్టువని పలికితే నండూరివారి ఎంకి సిగ్గుపడేలా వ్రాయగలడు. అమాయకపు బ్రతుకులోతుల్ని పెకలించి గుండెలలోని కమ్మదనాన్ని కరువుదీర అందించగల భావుకుడు. 'తపాలా తాతయ్య' మనస్సులో చొరబడి మమతల తోడితీసి అందించిన మనస్వి మా పులికంటి.

అన్ని గుణాలూ కలిసి ఒక వ్యక్తిలో ప్రత్యక్షం కావటం అపురూపం. నటించేవాడికి గొంతు పెగలదు. గొంతుపెగిల్చి కమ్మగా పాడే వాడికి నటన పూజ్యం. కథలల్లేవాడికి గేయం సాగదు. గేయం వ్రాసేవాడికి కథ నడవదు.

ఇక పద్యం వ్రాసే వాడి సంగతి చెప్పక్కర్లేదు. ఇక ఏచారిత్రక స్థలం గూర్చి వ్యాసం వ్రాయటానికి పూనుకున్న వాడు బొమలు ముడివేసి వ్రాసేతీరు సగటు మనిషికి చస్తే బోధపడదు. మరి 'పులికంటి' వ్రాశాడు. పుట్టిన మండలంలోని పుణ్య ప్రదేశాలు, చారిత్రక ప్రదేశాలు తనివితీరా దర్శించి తన్మయత్వంతో కావ్యాలు వ్రాసినట్లు వ్రాశాడు వ్యాసాలు. 'చంద్రగిరిదుర్గం' మొదలైన వ్యాసాలు చదువుతుంటే ఆంధ్రప్రభ వారపత్రికలో ముద్రితం) దేశ చరిత్రంతా ఇట్లా కమ్మగా చెప్పుకుపోతే సామాన్య పాఠకుడికెంత సుగమంగా ఉంటుందో? అని ఆశపడ్డాను.

'ఆకాశవాణి' దూరదర్శనులకు సలహాదారుగా ఆయన చేసిన సేవలు చిరస్మరణీయాలు.

అటు నటన - ఇటు గానం, అటు కథా రచన ఇటు గేయరచన, అటు చారిత్రక వ్యాసం ఇటు స్థలపురాణ వ్యాసం - ఇన్నింటిలో ప్రావీణ్యం గడించిన మా 'పులికంటి' - జీవితాన్ని ఒక కల మాదిరిగా చూడక - కేవలం ఒక కళ మాదిరిగా చూడడం ముఖ్యంగా గుర్తించదగిన విషయం. అందువల్లనే కాబోలు అస్వతంత్రమైన ప్రభుత్వోద్యోగాన్ని

మంచుకొండ గుండె నుండి
మంచినీటి అంచు వరకు
సుజలాం సుఫలాం అంటాం
మలయజ శీతలమంటాం
నైసర్గిక స్వరూపాన
సౌభాగ్యమె మాదంటాం!!

ాడవగేయం మానవత్వమే భరతమాతకు అంజలి అనే భావంతో
ేయం. అందుచేతనే కవి "మనిషిలోని దేవుని గని ఆ దేవుని
ుని గళములెత్తి పాడమంటాడు...."

ుతా మమతలు కలిపి చద్దిమూటగా కట్టి
ుదమారగ పదిమందికి ముచ్చటగా పంచుతాం-
పడంలో సహజీవన సిద్ధాంతం అవసరమని కీర్తించాడు.

ల్గవగేయం కవికున్న భక్తికి, గతవైభవ కీర్తనాసక్తికి ఉదాహరణం.
ుం దేహాన్ని దేశంగా భావించి పాడినగేయం. కొన్ని భావాలు
ూపాలు. కొన్ని దేహానికి మనసుకు సంబంధించిన విభావాలు.
ం, కరుణావాసం, భావనల మధుకోశం ఇలాంటివే.
ాతకు సంబంధించిన అన్నిగేయాలలోను .మానవత్వాన్ని.
ుడం కవి ప్రత్యేకత. మాననీయమైన మానవత్వం పట్ల కవికి
ద్ధతకు ఈ గేయాలు తార్కాణాలు!

్తి గేయాలలో రెండో రకం గేయాలు దైవభక్తి గేయాలు. ఈ
చేరిన గేయాలు రెండు మూడు కంటె ఎక్కువ లేవు.

*శ్రీ పదపురివాసా! ఓ వెంకటేశా*
*వడ్డికాసులవాడా వైభోగవాసా!*
*దేవదేవ! చాటరా! యిక్కనైన చాటరా*

ుదటిది శ్రీ వెంకటేశ్వరునికి సంబంధించిన గేయం. అన్నీ ఉన్న
ందు సగటు మనిషి పడే మానసిక అవస్థలను అద్దంపట్టించే
ఇది. సామాన్యుని పిలుపు ఆలకించకపోవడం, అన్నీ వున్నా
కొండల్లో ఆవాసమెందుకనడం, ఏవేవో అడగాలని అనుకొన్నా
నమస్కారాలతో నిలిచిపోవడం లాంటి వర్ణనలు మనస్తత్వ
ంకలవి కావడం గమనించవచ్చు. రెండవ గేయంలో మతకలహా
ంగెత్తిన ఆవేదన కనిపిస్తుంది.

*పరహితుడైన నీకు రూపాలు తీర్చిరెవరు*
*తం మత్తులో యిలను ముంచి తేల్చినారురా*
*నసు లేదు మమతలేదు మానవత్వమసలు లేదు*
*దారిని మరలించి రహదారిని చూపరా.*

ేయాల తరువాత పరిశీలించదగ్గ గేయాలు ప్రకృతి గేయాలు.
టికీ కవులకు ప్రకృతి వరప్రదాయిని. ప్రకృతి భావాల కల్పవల్లి.
ల రసవల్లి. ఈ వరుసలో చందమామ గేయం, మేఘమాలికా
చెట్టుగేయం కోయిలమ్మ పాటలు వస్తాయి. ప్రశ్నావళి
సాగిన పాట చందమామ గేయం. మేఘమాలికా గేయాలు
ాడా అభ్యర్థన పూర్వకాలు. గాలి కనుకూలంగా తిరుగాడే
వేషాలు మార్చే మేఘం, దేశాలు తిరిగే మేఘం కోపతాపాన
కొంపలు కూల్చే మేఘం కవికి వింత అయితే మరో గేయంలో వర్షం
లేని కారణంగా తపించే ప్రకృతిని కళ్ళకు కట్టించారు. ఈ కవితలో
.ఉత్తమ భావుకత్వం. కనిపిస్తుంది.

ఝరులలో జవరాలు
జలకన్య నాట్యమ్ము
గిరులపై వనలక్ష్మి
వాహ్యాళు లేమాయె
సెలయేటి పాటలో
చెలరేగు గలగలలు
నీలాల ఫించాన
నిగనిగలు కరువాయె
అందాల అపడవ
అలల తేలెడి పడవ
సైకత స్థలినెటుల
చిన్నవోయెను చూడు
కడలి ప్రియుగుండెలో
కరిగి పరవశించు కన్య
ఇసుక మేల్ముసుగు వేసి
విలపించెను విరహమ్మున!

"'ఏటి కడుపున దాగి తోట నిదురోయింది. అని ఎంకి పాటల్లో కనిపిస్తే 'ఇసుకమేల్ముసుగేసి నది విలపించడం' పులికంటి గేయంలో ఉద్వేగభరితంగా దర్శనమిచ్చే దృశ్యం!"

ఇటీవలి కాలంలో చెట్టు కవితలు చాలా వచ్చాయి. ప్రాచీన సాహిత్యంలో అన్యాపదేశ కృతులలో, సుభాషితాలలో వృక్ష సంబంధి పదాలున్నాయి. కాని వాటిని అనుభూతికి ఆలయంగా జ్ఞాపకాల తపోనిలయంగా భావించడం సరికొత్త అంశం.

*'ఎగిరేటి గువ్వకూ నడిచేటి అవ్వకూ*
*తారతమ్యము వీడి తల్లి వౌడివయ్యావు'*

అనడంలో సమదర్శనత్వం ఒక భాగమయితే నేటి ఆధునిక జీవితంలో అత్యవసరమయిన వాతావరణ కాలుష్య నివారణి అయిన వృక్షాన్ని .పూచేటి పువ్వులు వీచేటి గాలులు మా బ్రతుకు బాటలో మధురమౌ వరములు. అనడం అనుభవజ్ఞానం.

'కోకిలమ్మ పాటను. గతంలో వినిపించిన భావుకోత్తములున్నారు. "నేను పాడుతున్నాననుకోకండి. బాధావ్యథిత మానసగీతిక ఇది!" అని కోయిలమ్మ చెప్పినట్లుగా ఇక్బాల్ వ్రాశాడు. అన్నీ బాగుంటేనే కోయిలలు కూడా పాడతాయి కాని సమాజ జీవితం అస్తవ్యస్తంగా ఉంటే కోకిల కూడా పాడడం మానేసిందనే భావంతో కవి . అలిగితివా! నలిగితివా! అడుగుతుంటి చెప్పమ్మా. అని ఆవేదన వెళ్ళపోసుకోవడం ప్రత్యేకత.

ఇక మూడవరకం గేయాలు ప్రగతి గేయాలు ఆధునిక జీవితం స్తబ్ధమయింది కాదు. పరిణామక్రమంలో మారుతూ ఉంటుంది. అంతర్జాతీయ, జాతీయ స్థాయిలో మార్పులు సంఘర్షణాత్మక సమాజ

ు ప్రగతివైపు నడిపిస్తాయి. కవి కలలుకనేవాడు మాత్రం కాదు. నిజం కావాలని పరితపించే వాడు. అందుచేతనే కవి యాలు, యువత ప్రగతికి సంబంధించిన గేయాలు, రైతు , బాల గేయాలు వ్రాశారు. నినాదాలతో, విప్లవ వాదాలతో ్ని ప్రోత్సహించే కవుల కంటె భిన్నంగా పరిశ్రమ ఒకటే ప్రగతి ి ఉపదేశించిన కవి కృష్ణారెడ్డి.

నినాదాలు నీ బ్రదుకున
వింతమార్పు సమకూర్చదు
ు నీది సుత్తె నీది
ఫలితమ్మికను నీది!

ంచు ఇదే ధోరణిలో యువకులను ప్రబోధం చేసిన గేయం.

ువకులార! యువతులార! ఓ భారత పౌరులార!
్ధమ్ములు వదలి లెండి ప్రగతిని సాధించ రండి!
ఏడు దిగుడు చదును చేయవలసినంత ఉందిరా
లెమ్మును సాధించిగ సాధనమే దారిరా

జవాన్ జై కిసాన్' నినాదం ఈ నాటిదే కాదు. నిజంగా ాడు రైతు. అతనిని అనుసరించి జీవించే వారు ఇతరులు తిరువళ్ళువర్. కాని రైతు కడగండ్లు పట్టించుకొనేవారు లేరు. తనే రెడ్డిగారు 'ఓ గ్రామవాసీ'! స్వదేశీ ప్రవాసీ! అని ంచాడు.

నాల్గవరకం గేయాలు పరిశిష్టగేయాలు. ఈ కోవలో వలపు , వైరాగ్య గేయాలు, పైన చెప్పిన మూడు వర్గాలలోను చేరనివి .

కవి ఎప్పుడో ఒకప్పుడు ప్రేమ కవితలు వ్రాసివుండవచ్చు ్య ఛాయలో ప్రణయ భావనలతో వ్రాసిన ప్రేమ కవితల్లో ఎవరి తి వారిదే. రెడ్డిగారి గేయసంపుటిలో ఇలాంటివి చాలా . ఈ గేయాల నేపథ్యం పాటగా రూపొందింది. పదాలను పలికిస్తుంది. గంభీరంగా నడకలు వేస్తుంది. గుంభనగా ది. అనిర్వచనీయమయిన వేదన అందరికి పంచి పెడుతుంది. గేయాలలోని కొన్ని పాదాలను మాత్రం ఉదాహరిస్తాను.

ండెలో గువ్వనై
గలేనా
లి మువ్వనై
కలేనా లయలు పలుకలేనా!
పల్లవి నేనైతే చరణము నీవౌదు
చరణము నీవైతే చిరుగజ్జియను నేను
లికి అలకు కల సంబంధం
న సాగర సంగీతం
ఒకటి ఒకటి రెండైతే
అది గణిత శాస్త్రం
ఒకటీ ఒకటీ ఒకటైతే
అదే ప్రేమ సూత్రం.

అన్ని గేయాలలోకి తలమానిక మయిన గేయం .ఎంత మత్తుకనులు నీవి.

ఎంత మత్తుకనులు నీవి
ఎంత మందమతిని నేను
కనులలోన కాపురాల
గోపురాలుకట్ట నైతి
ఎంత సొగసునగవు నీది
వెన్నెలకే వెలుగైనది
చిరునగవుల చిలుక తేరు
వజీరునైన కాక పోతి

పలవు గీతాల తరువాత వేదనా గేయాలు సహృదయుల్ని కలచి వేస్తాయి. వీటిలో వైరాగ్యభావం, ఆధ్యాత్మిక అనుభూతి, మానసిక విశ్లేషణలు చోటు చేసుకొన్నాయి.

ఉత్తమాటల ఊసులెందుకు?
ఉపయోగపడనీ చేతలెందుకు?
పన్నీటికి నిలయము పయనించు మేఘము
కన్నీటికి తావరము కనిపించని హృదయము
మాయరా! మాయరా
ఇది మాయ చీకటి కోనరా
పరువు కొరకు పదవి కొరకు
పరుల నిలువున ముంచు కొరకు
కులమతమ్ముల మాటులో నిను
చాటు చేసిన మాయరా!
నాగేటి చాళ్ళల్లో
నాట్యమ్ము లాడరా
కర్మయోగులఘర్మ
జలములో తానమ్ము లాడరా!
పిచ్చివాడురా! మనిషి
పిచ్చివాడురా!
తనకు తానే వొడ్డుకున్నా
ఉచ్చులో పడి తగులుకొన్నా
పోతదీ! పగిలిపోతదీ
ఈ మట్టికుండా చెప్పకుండా చెందకుండా
ఎప్పుడో ఏ వేళనో...

భావప్రాధాన్యమైన ఇటువంటి గేయాలే కాకుండా పులికంటి అమ్మి పదాలు బోయి భీమన్నగారన్నట్లు ఆయనను జానపదగేయ స్రష్టగా నిలబెడతాయి. ఈ పదాలు అతని పెదాల మలుపుల్లో సొంపులు శ్రోతలకొక మధురానుభూతి. నండూరి సుబ్బారావు సృష్టించిన

ల శైలి ఆనాటి కవితా ధోరణికి పూర్తిగా భిన్నమైనది. అయినా నామోదం పొందింది. ఎంకి కోస్తా జిల్లాల గ్రామీణ జీవనశైలికి ఏడుతూ ఉండగా పులికంటి సృష్టించిన . అమ్మి, రాయలసీమ ల ముగ్ధభావరామణీయకతకు మచ్చుతునకగా మెచ్చు నిలిచింది. అమ్మిపదాల సృష్టి పులికంటి భావపుష్టికి తార్కాణం. నునకు గేయసాహితీ లోకంలో ఒక విశిష్టమైన స్థానం యి.

రగా కృష్ణారెడ్డి గారి గేయాల వరుసకు సంబంధించిన కొన్ని చూద్దాం. కృష్ణారెడ్డిగారు వ్రాసిన చాలా గేయాలలో పల్లవి న్నింటికి లేదు. పల్లవిగా చెప్పబడేవి కొన్ని చోట్ల ఏకపాదం, రెండు పాదాలు, కొన్ని చోట్ల మూడు పాదాలు, కొన్ని మాత్రం పాదాలు.

వి నిర్మాణం పరిశీలిస్తే చాలావరకు సంబోధనాంతాలు. వి అంత్యప్రాసయుక్తంగా ఉంటాయి.

*దపురి వాసా ఓ వెంకటేశా*

*కాసులవాడా! వైభోగవాసా*

లోని వాక్యవిన్యాసం, దృఢ అభిప్రాయంతో నిలిస్తే ఆ అంశాన్ని వివరించేలా సాగినవి కొన్ని.

లేవురా నేను లేనురా

అవనిలోన అమ్మలేని మనిషి అసలు లేడురా

ఇంద్రుడైన చంద్రుడైన

ఇమ్మహిలో ఎవరైనా

ఏనాడో ఒకనాడు

అమ్మ చేతి పిల్లలురా

అనురాగపు ముల్లెలురా

పల్లవిలోని అంశాలకు చరణాలలోని అంశాలకు దూరాన్వయమున్నా భావం అంతర్గతంగా ఏకం కావడం మరో రకం.

*జాతి వొకటిరా! మన జాతి వొకటిరా*

*చెట్టెవరిదో గాలెవరిదో యోచనేలరా*

*శమెవరిదో అగ్గిఎవరిదో శంకయేలరా*

*శవమేదైనా కానీ కాల్చు శక్తి వొకటిరా*

కృష్ణారెడ్డి గేయాలు చదువుతుంటే కృష్ణశాస్త్రి, బసవరాజు, నండూరి మొదలయిన వారు గుర్తుకు వస్తారు. ఇది అనుకరణ కాదు గాని గేయ కవుల మార్గాన్ని గౌరవించడమన్నమాట. కృష్ణారెడ్డి గారి గేయాలపై పరిశోధన సాగితే మరికొన్ని విశేషాలు సహృదయులకు తెలిసే అవకాశముంది. అది జరగాలనే నా ఆకాంక్ష! ●

# చందన అభినందనం...

శ్రీ వి.పి. చందనరావు

కవిత్వం విప్పినా కథ చెప్పినా
తనదైన అరుదైన శైలి
శ్రీ పులికంటి!

రాయలసీమ మాండలికాల్ని రమ్యంగా
సకల జన సమ్మోహితంగా గొంతెత్తిన
రాయలసీమ సిన్నోడు
శ్రీ పులికంటి !

ఉత్తరాలకూ మెత్తని
ప్రత్యుత్తర పలకరింపుల పూలు పంపే
స్నేహశీలి
శ్రీ పులికంటి !

ఒక కవిగా పులికంటి
ఒక విశిష్ఠ కథకునిగా పులికంటి
ఒక చిత్రంలో ఇమడని
బహుముఖ ప్రజ్ఞాశాలి
పుట్టింటికి పుట్టెడు పేరు తెచ్చిన
శ్రీ పులికంటి !

ఊరు తిరుపతి
తీరు సాహితీ పరపతి
నేడు జరుగుతున్నది జీవన 'సప్తతి'
శుభ తరుణాన

మాన్యమిత్రులు
శ్రీ పులికంటి కృష్ణారెడ్డి గారికి
నిత్య హరిత శుభానందభరిత
శతవసంతాలని ఆకాంక్షిస్తూ
చందన శుభాభినందనం.!

# పులికంటి మాండలిక కవితా కలకంఠి

(మండపంలో నాలుగ్గాళ్ళు పెనవేసుకొని చేతి కలమైనప్పుడు)

## వేంపల్లి అబ్దుల్ ఖాదర్

ూనం మీద నిలబడి ఆధునిక సాహిత్య ప్రక్రియలను
rn Literary Trends) భావితరాల అలోచనల దారుల్లో
ఃడం – నవ్యతకూ నాణ్యతకు, పరిణతికి పరిణామ శీలతకు,
రసజ్ఞతకు ఒక కొత్త మలుపుగ భావిస్తోంది నేటి మేధావి
క్షరాలయాల్లోనే కాకుండా సర్వతా వివిధ స్థాయిలలో కూడా
ం లోతైన అధ్యనం జరుగుతుండడమే ఇందుకు నిదర్శనం.
దు పరిణామశీలమైన సాహిత్యపు వన్నె, చిన్నెల్ని, వింత
్ని భావిభావకుల మస్తిష్కపు తల్లివేరుకి అందించడం తమ
 కూడా భావిస్తోంది.

ఁం?

భవితను అభ్యుదయ పునాది దిశగా నడిపించాలన్న
ే! ఈ దిశానిర్దేశపు పునాది మీద ఆధునికత, సృజనాత్మకత
గ విరుస్తోంది.

ుప్పుడూ అబద్ధం చెప్పదు.

కవిత్వపు లోతుల్లో 'ఆధునిక పద్యం' చేసిన హడావిడి,
ితను రగిలించి 'వచన కవిత్వం' అందిపుచ్చుకుంటున్న
తేజం, జీవిత పార్శ్వాలన్నింటిని సమగ్రంగ తాకుతున్న
' సంఘటనా సామర్థ్యంతో అనుభూతి చిత్రణకంటే అనుభవ
ి పెద్దపీట వేసిన 'గల్పిక', సాకల్యంగ సామాజిక జీవన
ల్ని తడిమిన 'ఆత్మకథ' చారిత్రక సామాజిక రాజకీయ
ిక వైజ్ఞానిక కళా భాషా విషయాల్ని విశ్లేషిస్తున్న 'వ్యాసము',
ారతో అర్థగౌరవమూ సాహిత్య పరిపుష్టితో గాన జలపాతాల్ని
న్న 'గేయకవిత', సున్నితమైన హాస్యము సుకుమారమైన
ర లాస్యమూ ఎత్తుగడల మధ్య వ్యంగ్యంలో వెక్కిరింతను
ముకున్న 'పేరడి', చమక్కున మెరుపులా మెరిసి గుండె
 కొట్టే 'హైకూ' భావశబలత, పాదరసంలా పారే సంభాషణా
తో కంఠనరాల్ని మీటే 'నాటకము', వస్తువు, భాష, పాత్ర
ంభాషణ, వాస్తవికత, కథన శిల్పం వంటి విశిష్ట లక్షణాలతో
 జీవితంలోని కళాత్మక విలువల్ని సమగ్రంగ ఆవిష్కరించే
వీటినన్నింటిని కాదని ఏ నిర్వచనానికి అందని విలక్షణ
ప్రక్రియే పులికంటి వారి నాలుగ్గాళ్ళ మండపం! ఐతే పై
ప్రక్రియలన్నింటిలోని లక్షణాలన్ని ప్రత్యక్షంగానో పరోక్షం
ందులో ప్రతిబింబిస్తున్నాయ్. అందుకే ఇది భద్రిరాజువారి
'అసామాన్యసృష్టి' అయ్యింది. అంతేగాని ఇది కథా సమాహార
ల ఆలింగనమోగాదు.

ంకంటే –

బాహ్య దృష్టికి వ్యక్తి వేరు. సమాజం వేరు. వ్యక్తికీ – సమాజానికీ ఉన్న సంబంధం మాత్రం ఆ రెండింటికీ తల్లివేరు. ఎవరి అనుభవాలు వాళ్ళు ఏకరువు పెడితే ఓపిగ్గా కూర్చొని ఎవరు వింటారు? ఎవరు చదువుతారు? దానికి కావ్య గౌరవం వద్దా? సామాజిక స్పృహతో ముడివేయడం వద్దా? మార్మికతలేని ధ్వని సౌందర్యం వద్దా? ఒక ఊపూ తూగూ లయా వద్దా? ఉండవలసిన ఉద్విగ్నత లేకపోతే అది గుండెల్ని కదిలించే కమనీయ రచన ఎలా అవుతుంది?

నీ చెవల్లో చెట్లు మొలచినాయా? అనటం వేరు – 'ఈ సీమలో చెట్లు మొలిచే చినుకింకా రాల్లేదే? నీ చెవల్లో మాత్రం ఎట్టా మొలిచినాయిరా? అనటం వేరు! 'ఆడపిల్లల్ని చూచి సైట్లు కొట్టే రోడ్డు రోమియోలు' అని చెప్పొచ్చు కాని కృష్ణారెడ్డి అలా చెప్పరు.

'పొట్ట కఱ్ఱ కొచ్చిన జొన్న చేనిమీద సీతాకోక చిలుకలు పణ్ణెట్టు మంచి పాయం మిందుండే ఆడ పిలకాయలు అట్టా యిట్టా తిరగతా ఉండేది చూస్తా వుంటే ఎన్ను చుట్టూ గువ్వలు తిరిగినట్టుండాది!' అని మాత్రమే అంటాడు. నడిచే దృశ్య శకలాన్ని కళ్ళెదుట నిలబెడతాడు.

ఇక్కడ కృష్ణారెడ్డి అనుభవం కృష్ణారెడ్డిది గాదు. సమాజానిది. ఆ సమాజంలోని అందరి అనుభవాల్లోకి పరకాయ ప్రవేశంచేసి మమేకమయ్యేది. కానీ ఎవరూ దాన్ని కృష్ణారెడ్డి అనుభవమో జ్ఞాపకమో అనుకోరు. నిజానికి ఎవరికి వాళ్ళే ఇది తనదే అనుకొని తాదాప్యం చెందుతారు. ఇక్కడ అనుభవమన్నది వ్యక్తి గతమా? కాదు యూనివర్సల్! మరి ఆ తపన, ఆరాటం, అలజడి, అంతర్మధనం అతనిది కానపుడు – అతనే సమాజమవుతాడు. సమాజమే అతనవుతాడు. ఇది కేవలం ఒక వ్యక్తి అనుభవమే అయినా సమాజ శ్రేయాన్ని ఆకాంక్షించేది కాబట్టి దాన్ని విధిగా వింటారు. ఎంతో ఆసక్తిగా చదువుతారు.

శ్రమజీవుల ఆరాటానికి నాలుగ్గాళ్లమండపం ఒక కూడలే కాదు, శ్రమ శక్తికి నిఖార్సయిన నిదర్శనం! లోతు తెలీని కన్నీటి బ్రతుకులకొక సంకేతం. రచనా గమనానికొక ఆయువు పట్టు. అందువలనే ఆ స్థలానికొక ప్రాముఖ్యం వచ్చింది గానీ, నిజానికి స్థల ప్రాముఖ్యం ఏమీలేదు.

ఏ వ్యక్తి జీవితంలోనైనా బాల్యానుభూతులు, అనుభవాలూ గొప్ప ప్రభావాన్ని చూపుతాయి. ఎందుకంటే అవి మరచిపోలేనివి కనుక! మళ్ళీ మళ్ళీ తిరిగి రానివి గనుక! ఆమాటకొస్తే నూరేళ్ళ నిండు జీవితాన్ని శాసించేది బాల్యం. కాలానికి భాష్యం చెప్పేది బాల్యం. ఎంత మొనగాడైనా భూతకాలాన్ని నెమరేసుకోలేనివాడు వర్తమానంతో రాజీపడలేడు. ఆ వర్తమానాన్ని ఎక్కుపెట్టలేనివాడు భవిష్యత్తును

ుకోడానికి పనికిరాడు. ఈ చారిత్ర్యక సత్యాన్ని విస్మరించడానికి
ాటువుల్లోని నీతి, సామెతల్లోని అనుభూతి, మనకు అందదు.
ి వివేకానికి, హెచ్చరికకు అనుభవ సారానికీ మనం
ంకాలేము. కాబట్టి జీవిత విలువల నేపథ్యం అస్పృశ్యం కాదు.
ి అది గతమేదో చేజారిపోయిందన్న వగచడం కానేకాదు.

ఏ రచన అయినా కావచ్చు. ఎవరికోసం రాస్తున్నామో
ండి రావాల్సిన స్పందన వస్తేచాలు. అదే మంచి రచన.
కు సంతృప్తినిచ్చే రచన కూడా! ఆ బ్రతుకు మూలల్లోని
లను ఒడిసి పట్టుకునే ప్రయత్నంలో పులికంటి ఖచ్చితంగ
. ఇది పులికంటి మాటగాదు. సర్వత్రా వినిపిస్తున్న మాట!

## నాలుగ్గాళ్ళమండపం : మాండలికత

ండలికంలో భాష ఒక భాగం మాత్రమే! భాషే మాండలికం
వస్తువుకు సొగసులు కూర్చేది మాండలికం. పరిమళాలు
ాండలికం. వస్తు గాఢత లేని మాండలికం ఎంత పొంకంగా
ాణం లేని గాజు బొమ్మే! ముల్లు గుచ్చు కుంటుందని
రేకును జడను దాల్చుకున్నామా! కంపు కొట్టే బురదలో
ి కలువ పువ్వును కాదంటున్నామా! ఎక్కడో ఒకటి రెండు
కొరుకుడు పడకపోయినంత మాత్రానా వచ్చే కొరతేమీలేదు.
కానికి గుండె గూడు పట్లను తడిమే శక్తి ఉంది. గొప్ప
ఉంది. గుండెను అరచేతిలో పెట్టుకుని పలకరించేది
కం. అభిమానం, అనురాగం, అప్యాయత, ఆత్మీయత,
ం కలగలిసిన పంచామృతం మాండలికం. పాత్రోచిత
పరిమళం మాండలికం!

ని పిసికి, మట్టిని నమ్ముకుని, మట్టి వాసనలు పీల్చుకునే
ి బ్రతుకుల స్థితిగతులను, మానసిక సంఘర్షణలను,
వైఫల్యాలతో ముడిబెట్టి తులలేని జీవనవేదాన్ని అరటి పండు
లిచినంత సలీసుగ -వింగడించడమన్నది అంత తేలికైన
. ఈ పనిని కృష్ణారెడ్డి చాలా నిజాయితిగా చేశాడు. దాని
క్కుచెదరని ఆత్మ విశ్వాసముంది. కాబట్టే అది రీడర్స్ బేసిక్
ప్పన తాకింది. తాకి జీవనాడిని పట్టుకుంది.

## సామాజిక స్పృహ

గ్గాళ్ళ మండపం ఒక నిరర్థక అక్షర సముదాయంకాదు.
త గుబాళించే విశిష్ట రచన. రాయలసీమ పలుకుబడిని
వ అక్షరాలుగా చెక్కిన గుండె సొద. ఒక అనుపమాన
సనం. నిబద్ధతల మధ్య నలిగే లక్షణాల జోలికి పోకుండా
ను పక్కనబెట్టి ప్రతిభను గౌరవించే వాళ్ళెవరూ కాదనలేని
ాడా! కాదంటే.... **'Spontenions over flow of
ıs'** అన్న సాహితీ శిల్పానికి అర్థంలేదు. కృష్ణారెడ్డి
లన్నీ జీవితం నుండి పుట్టుకొచ్చేవే. ఊహలతో ఆడుకునేవి
ఈ యదార్థం జీవితాన్ని నిఖార్సుగా చదివినోళ్ళకు మాత్రమే
ది. 'కొవ్వెక్కి నోళ్ళు కొవ్వొత్తులు ఆర్పుకుంటాఉంటే -
లోకింత తిరిపం సమురుకు నోచుకోకుండా తిప్పలు పడే
డ్తానే ఉండారు', అని అనగలిగి ఉండరు.

"నడ్సేది పొయ్యే యాడన్నా అదురుష్టమా? అంటే - కాదా మరి?
తిని తిని ఒళ్ళంతా కొవ్వెక్కినోళ్ళు తెల్లారేకాడికి వాకింగ్ పేరుతో
రోడ్లమీద నడస్తా వుంటారుకదా! అటువంటి కర్మ మనకీ పొద్దుటికీ
పట్టలేదంటే అది మన అదురుష్టం కాదంటారా".

రచనలో ఇంత అనుభవ పరిణతి ఉంది కాబట్టే అది అందరి
కళ్ళకూ ఆనింది. అనుభూతిని పంచింది. కల్పనా శిల్పాన్ని తడిమే
వాడు, ఊహల పల్లకిలో ఊరేగేవాడు - సృజనాత్మకతని మరచి
జీవితాన్ని యదార్థంగ అక్షరాల్లోకి కలబోయలేడు ఎందుకంటారా!

"అన్నా! ఆడికి తీసుకుని పొయ్‌రి. నాపేరు మార్సేసిరి.
ఊరుకూడా మార్సేసిరి. దానిగ్గూడా బాదపళ్ళా. కడాన అబ్బను కూడా
మార్సేసిరి. పొయ్ ఓటేసిరాబోరా అన్రి.ఏసేసివస్తే పదిరూపాయలనోటు
జేబిలో పెట్టి పాకెట్టొకటి చేతికిస్తారా?"

ఈ విలక్షణానుభవం ఆకాశం నుండి ఊడిపడిందా? కాదు వ్యవస్థ
నైజాన్ని కళ్ళముందు నిలిపేది! కుళ్ళిపోతున్న వ్యవస్థకు, కూలిపోతున్న
విలువలకు ఈ వ్యాఖ్య ఒక చెంప పెట్టు. ఈ మురికి విలువల మధ్య
ఊపిరాడక తను జీవితంలో చేసిన గొప్పతప్పు - ఓటు వేయడమే
నంటాడు కృష్ణారెడ్డి. ఈ అసంతృప్తి పనికిమాలిన సమీకరణల మధ్య
దగాపడుతున్న సగటు ఓటరుది.

## పదబంధాలు : వాక్చిత్రాలు : సామెతలు

కొందరికి ఉన్న అందమంతా కళ్ళలో ఉంటుంది. కొందరికి
నవ్వులో, మరికొందరికి నడకలో - ఇలా ఇంకా ఇంకా ....

రచనలో పద బంధాలన్నవి పాయసంలో నెయ్యిలాగో ద్రాక్ష
పండులాగో, జీడిమామిడి దబ్బలాగో, తగులుతాయి. అప్పుడు
పాయసానికి ఎక్కడలేని రుచీవస్తుంది. కలువ వలన కొలనుకా, కొలను
వలన కలువకా? దేనివలన దేనికి అందం వస్తుందో నాలుగ్గాళ్ళ
మండపం నిండా పదబంధాల పదనిసలు ఎక్కడపడితే అక్కడ
పలకరిస్తూనే ఉంటాయి.

కొర్రు మాదిర్తో - పలా పలా నీళ్ళురాలే - దింపుడుగళ్ళం ఆశ
- నరనరము సినగతా ఉండాది - మల్లగుల్లాలు - ఇంగవగట్టిన
గుడ్డ అట్టహాసం రెట్టమదంగ- గెడ్డివామికాడ కుక్కల కత - ఎద్దల
గొట్టి ముద్దలు తినే కొంపలు-నిన్న పుట్టి ఈ పొద్దు కండ్లు తెరిసినట్లు
- కండ్లలో కనకాంబరాలు పూసినట్లు - అయిన కాడికి మద్దేనంగ
పీటికి తోడుబోయినవే వాక్చిత్రాలు కూడా!

జంబాలుగాడి జంబం జబల్‌పూర్‌దాకా పాయ - మొగిలి పువ్వతో
నువ్వట్టంటే, మొద్దుపారకతో నేనిట్టంటి -

బలుసాకుతిని రొన్నాళ్ళు ... కలబంద గడ్డలు తిని రొన్నాళ్ళు ...
నల్లరేగడి మట్టిలో పెరుగు కలుపుకుతిని రొన్నాళ్ళు - పొయ్యిలో
ఉప్పుపోసి శాట అడ్డం పెట్టినట్టు - పువ్వుల్లో బుట్టి వువ్వుల్లో
పెరిగినోళ్ళు - కురస్తా ఉండే మేగం కల్లా మెరస్తాఉంటే కండ్లతో
చూచినట్టు - ఎలుగు యిప్పితే ఎదుటోడి మొగం మొగ్గ తొడిగిన
రెమ్మ అవుతుంది -

ఇలా ... ఇలా ముత్తైదు కుంకుమకు మల్లెపువ్వు తోడయినట్లు,
తేటనీళ్ళలో చేపపిల్లల్లె చెమక్కుమనే వాక్చిత్రాలు!

రతకు, వివేకానికి, అనుభవ సారానికి సామెతలు మనిషి
ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. గ్రంథస్తంకాని ఎన్నో
సీమ పలుకుబళ్ళకీరచన పుట్టినిల్లు. సందర్భశుద్ధితో
న్ని బలోపేతం చేయడానికి సామెతలకున్న బలం
ంకాదు. ఈ రచనలో అడుగడుగునా ఇవి చదువరిని
కళ్ళతో పలకరిస్తాయి.

పులోలేంది కావలించుకుంటే వస్తిందా?

ంలో పొద్దు, మొగుడాల్ని చెరిస్తింది-

కాలు తిట్టేనోరు ఊరికే ఉండవు -

గను మెతుకులేదు మీసాలకు సంపెంగనూనె -

చచ్చేవాడికి ఏడ్చేవాడెవుడు?

ంత రాగంతీసి తుమ్మదీల పాట పాడినట్లు -

బిడ్డకు ఎలక్కాయి చూపించే యవ్వారం -

భారం మొత్తుకోళ్ళు బతుకులు -

లి కంట్లో నీళ్ళుగారితే యాటగానికేమన్నా ముద్దా? -

రం చాలకుండా గెరడసేవకుపోతే ఇంట్లో మొగణ్ణి గండు
స్తుకొని పోయిందంట !

తినమంటే - దీనికి తూటెందుకుందని అడిగినట్టు -

రంగ బిడ్డ పుట్నాడు .... గడ్డపారెత్తుకోండి చెవులుకుడదాం-

రేని మొగోడా పాగులెందుకొస్తివి అంటే అందుగ్గాదు
ట్ట -

లంగ ఇలా సామెతలు పండించిన రచనలు అరుదుగా
ు!

## సమకాలీనత : రాజకీయ ప్రసక్తి

యిత ఆలోచనా సరళిమీద ప్రభావం చూపే సమకాలీనత,
ప్రతిబింబించడం చాలా సహజం. రచయితా మనిషేకదా!
ప్రేరణకు అతీతుడు కాదుకదా! మరి బరువులకు,
లకు, మానవతా విలువలకు, వైఫల్యాలకు అతడు విషయ
ఖుడు కానపుడు, అతని చుట్టూ జరిగే ప్రతికదలికా
వాన్ని ఎందుకు సంతరించుకోగూడదు! ఎబ్బెట్టుగా ఉన్న
న్ని ఎబ్బెట్టుగా ఉందని చెప్పడం ఎబ్బెట్టా! ప్రస్తావనలో
ా ఉండొచ్చేమోగానీ, రచయిత ఇష్టా ఇష్టాల ప్రసక్తి గాని,
క్షపాతానికి గాని ఇందులో ఆస్కారంలేదు. ఒక వేళ అలా
యితే ఆ రచనలో బ్యాలెన్సు దెబ్బతిన్నట్టే లెక్క. అందుకు
ష్యత వహించాల్సింది రచయితే. సాధారణంగ ఏ రచయితా
పడానికి ఇష్టపడడు. కృష్ణారెడ్డిలాంటి రచయిత మరీను!

గాంధీ కల్లు మానండోయ్ బాబూ! కండ్లు తెరవండోయ్!
ఈ పొద్దు కళ్ళంగుళ్ళు, సారాయంగళ్ళు పెట్టే సర్కారోడు
ఉండాడు. అపద్దం చెప్పద్దంటే? అసెంబ్లీలో కాదు. అది
ట్లో కాదు. అపద్దం చెప్పకుండాపోతే అడుగు కదిలేటిగాలే.
డదంటావా? అడ్డం పెట్టకోకుండా పోతే ఏ పనీ
అయ్యేటిగాలే. ఇట్టా మాదిరి ఆయన ఏంది వద్దన్నాడో దాన్నే అడ్డం
పెట్టుకొని ఈ జనం బతికిపోతా వుండారు...".

ఈ రచనలో రాజకీయ నాయకుడి స్వభావ చిత్రణ చాలా
అద్భుతంగా చిత్రించబడింది. అది ఏ పార్టీ అయినా వాళ్ళ
వ్యహారశైలిని ఎండగట్టడమన్నది రచయిత నిశిత పరిశీలనకు,
నిష్పాక్షికతకు నిదర్శనం. ఈ రచనా కాలం నాటికి పాలనలో ఏ పార్టీ
ఉందో ఆ పార్టీ ప్రస్తావనలు ఎక్కువ చోటుచేసుకోవడం సహజమే.
అంతమాత్రంచేత అది పాక్షిక దృక్పథమెలా అవుతుంది?

"తెలుగుదేశంవాళ్ళు అయిద్రాబాద్‌లో హీరోలైతే డిల్లీలో విలన్లు.
కాంగ్రేసోళ్ళు డిల్లీలో హీరోలైతే హైదరాబాద్‌లో విలన్లు. ఇట్టా మాదిరి
ఏశాలు మార్చేదానికి ఈ దినాటకం ఆడేవాళ్ళు శాతయితిందా?"

ఏ పాత్రకు ఎంత న్యాయంచేయాలో రచయితకు బాగా
తెలిసుండాలి. రచయిత సమర్థత అక్కడే తెలిసేది. న్యాయ నిర్ణేత
అయిన రచయితే ఆ బ్యాలెన్సును పట్టుకోగలడు. రచయిత ఈ
రచనలో ఆ సంయమనం ఎక్కడా పోగొట్టుకోలేదు.

## మానవ సంబంధాలు

చిత్త ప్రవృత్తుల్లాగే చిత్రాల్లోకెల్లా మహా విచిత్రమైనవి మాన
సంబంధాలు!

"కడుపులో పుట్నె కొడుక్కులేదు. కట్టుకున్న పెండ్లానికి లేదు.
ఈ అభిమానం అనేది కొనుక్కుంటే వచ్చేదికాదు. కోరితే దొరికేదికాదు.
ఇది జలమ జలమాల అనుబంధమేమో..."

కృష్ణారెడ్డి స్నేహానికి చెప్పిన అర్థమూ నిర్వచనమూ ఇది!

ఇంకా -

"కష్టంలో ఉండేవాడికి - వాడు పగోడైనా సరే చాతనైన కాడికి
చెయ్యి అందించకుండాపోతే ఈ జల్మం ఉణ్ణా ఒగిటే. ఊడినా
ఒగిటే".

ఇదీ తనకు తల్లి నేర్పించిన మానవతా మంత్రం!

మనసు పెట్టి చేసే పనిలో బువ్వదొరుకుతుందన్న ఆత్మ
విశ్వాసానికి, చెమటని నమ్ముకున్నోడికి చేటులేదన్న ధృఢ సంకల్పానికి
- లోకాన్ని చదివిన ఆ దొడ్డ ఇల్లాలు నిజమైన ప్రతినిధి.

'నువ్వు కాపోడు. నువ్వు కమ్మోడు. అని కొట్టుకుంటా ఉండారు.
ఒకప్పుడు పల్లెల్లో అయితే కమ్మోడు, కాపోడు, కమ్మరోడు,
కుమ్మరోడు, కూలోడు - అనే భేదమే ఉండేదికాదు. కులాన్నెగరదన్ని
అందరూ ఏదో ఒక వరస పెట్టుకొని పిల్చుకుంటా ఉండ్రి...'

ఒకప్పుడు పల్లె ఆత్మీయతానురాగాలకు ముల్లె. అప్పుడు ఒకరి
గోడు అందరిగోడే. ఇప్పుడు ఎవరి బాధ వాళ్ళదే. ఇది కృత్రిమ
నాగరికత తెచ్చిన చేటా? ఏమో! మానవ సంబంధాలు తెగిపోవడంతో
పల్లీయుల్లో కక్షలూ కార్పణ్యాలకు విత్తనం పడింది.

నాడు కులవృత్తులలో పల్లెటూళ్ళు ఎంత కళకళలాడేవి? అవే కదా
ప్రాణాధారాలు? అలంకారాలు! నేడు పెర్రిపోకడల సంకర ప్రభావం
నోటి ముందు కూటిని లాగేసింది. కుల వృత్తుల శైథిల్యం మీద
కృత్రిమ నాగరికత భద్రపీఠం వేసుకుంది. జీవన భృతికి గతిలేక

తు ఎండిపోయింది. ఈ పరిణామానికి కుమ్మరి పుల్లన్న, చేసుకునే దానికంటే టౌన్‌లో గొరిగేది నేర్చుకునేది మేలని న రైతు వెంకటరెడ్డి నిలువుటద్దాలు.

ుచితపు పరిధినుండి మనసునిష్కపటమైతే మానవీయత స్తుంది. ఈ ఫణితి పాటిస్తే-కులం, మతం పేర్లతో జరిగే హోమాలకు ఆస్కారముంటుందా? జీవిత మూల్యాలను సంబంధాలతో ఎంత ఒడుపుగ ముడిపెట్టాడో రచయిత!

## సునిసిత హాస్యం

పడుతున్న మనిషిలో జడత్వాన్ని తరిమేసి జీవత్వాన్ని నింపేది ువ్వుల పువ్వులు పూయకపోతే నిస్సార జీవితాలకు నిండు ు రావు. ఆ పున్నమి వెలుగుల పకపకలకు బాశాలి నకలు!

ంగడుగా నేనొకదాన్ని ఉన్నానంటూ పలకరించే బాశాలి ం మనల్ని నవ్విస్తుంది-కవ్విస్తుంది. అపర లౌక్యంతో ల్ని చేస్తుంది. ఆమె మాటెంత కరకో మనసంత వెన్నపూస. ాట కారి. గడుసరి కూడా! ఇంకెంతో లోకజ్ఞత గల సగటు మొగుడు ఎదుటపడితే సాధిస్తుంది గానీ, చెప్పిన వేళకి ాకపోతే మాత్రం ఎదురు చూపులు వేలాడదీసుకుని గడపకు ,పోయి ఉంటుంది. ఇక ఎదురు తెన్నులే తెన్నులు. డవాళ్ళు అంతే. మొగుడు ఎదుట ఉంటే వెళ్ళిపోయేంత పెడతారు. మళ్ళీ మొగుడు కంటపడేంతవరకు కాలుగాలిన ిరుగుతారు. ఎందరో ఇల్లాండ్ర విలక్షణ మనస్తత్వానికీ పాత్ర క.

ు ప్రయోజకుడుగా ఎలా తీర్చిదిద్దాలో తనదైనశైలిలో తండ్రి ుడ్డి చమత్కారానికి రచయిత వ్యాఖ్యానం –

అయ్య ముందు మడక. నేను ఎనక మడక. ఎనిక మడకైతే ్టేది సలీసు. అదే ముండ మడకైతే కొండ్ర ఏసేదానికి కొంత ం ఉండాల. ఆయన ఎనక మడక కాడికొచ్చి నన్ను పాయ్ ుడక పట్టుకోరా అంటాడు. కొండ్రెయ్‌రా అంటాడు. నే – నిలపరా మడక అంటాడు. నిలపగానే తిరిగి చూడ్రా ు. తిరిగి చూస్తే దాని రాత ఆడికే తెల్లారుంటుంది. అదర్తా ుసిన పనిగదా? సాలు ఎద్దుచ్చులు పోసినట్టుండేది".

సొగసంతా ఆ చివరి వాక్యంలో లేదూ!

ుతే! అవి సాదాసీదా ఉపమానాలైనా ఒక గొప్ప స్ఫూర్తితో విభ్రమం కలిగిస్తాయి. పామరుడు సైతం విని ఆనందించే ంటాయి.

మీద విసురు చూడండి –

ుగారి గురక కానబాయిలో కప్పలు అరిసినట్టుంటుంది'– ాల్ని ఏరుకోవడంలో కృష్ణారెడ్డి నేర్పు ఎంతో సునిసిత ు.

. కొట్టి దెబ్బతిన్న సైకిల్ ముందరి చక్రం – మరగతా ఉంటే ుంచెత్తిన అప్పళం మాదిర ముప్పైయ్ ఆరొంపులు తిరక్క ుటుంది'.

గడిఎక్కిన బాశాలి గడచుదనం ముందు ఏదైనా బలాదూరే – 'పన్నెండు గెంటల కాడ ఆ గెడారం ముండ్లకు ఉండే బుద్ధి కొంపలో ఈ మొగోడి కుంటే? పోనీలే! వ్రతం సెణ్ణా సుకం దక్కిందను కోవచ్చు'–

దీని కంటే మించిన సరసం – సర్రియలిజం, వ్యంగత-మార్మికత ఏం కావాలి? 'మీటిన విచ్చు గుబ్బ చను మిట్టల'.... అన్న పెద్దన రసజ్ఞతను కూడా మించిపోయిందే!

## సృజనాత్మకత - వర్ణనలు

చద్దన్నం కంటే ఊరగాయ ఎక్కువ అవకూడదు. రచనలో వర్ణనలు ఎక్కువైతే వాస్తవికత తక్కువైపోతుంది. సహజత్వాన్ని ఊపిరిపోసుకు బతికే వర్ణనలైతే – అవి రచనకు ఎంతో సొగసును తెస్తాయి. పైరగాల్లా పలకరిస్తాయి. నిజానికి సృజనాత్మకతలేని రచన పరిమళంలేని పువ్వులాంటిదే!

'రైతంటే మట్టిని బువ్వగా మార్చే మహాత్తుడు గదా! కష్టం అంటే కండ్ల చూళ్ళేడు. కుడుం చేతికిస్తే సాలు. పండగంటాడు.'

'ఒక చిన్నది లేత తమలపాకుల మాదిర్తో నవనవలాడ్తా ఉండాది. రంగు! పచ్చి పసుపుకొమ్ము. నీలాలా? అవ్వి నల్లనేరేళ్ళు. ఆ పిల్లది వాటి పొటాకి వాట్ని యిడ్సిపెట్టేసి ఉండాది. అవ్వి ఈ ఫంతా పాయలు పాయలుగా యాలడతా ఉండాయి'–

ఎంత స్ట్రాంగ్ ట్రాన్సపరెంట్ ఫీలింగో –

ఇక ప్రకృతి వర్ణనల మీదికి మళ్ళితే –

"గెంజి నీళ్ళ బాయిలో నీళ్ళు గలగలా నవ్వతాయి. మామిడి మాకుల వంకలో యిసిక పలకరిస్తింది. ముగ్గురాళ్ళ వంకలో ముగ్గురాళ్ళు గుండెకాయ మీద ముగ్గులేస్తాయి. ఆ అడివిలో చెట్టు చెట్టూ కొమ్మ కొమ్మా రెమ్మ రెమ్మా ఆకు ఆకూ మణుసు యిచ్చి మాట్లాడుతాయి. ఆ చెట్లమీద పాల పిట్లు కూని రాగాలు తీస్తాయి.

చక్కని భావ వ్యక్తీరణకు తోడు ఎంత చిక్కని అలంకారశోభో. దామరాకులు... ఆకుపచ్చ దుప్పటి మీద అద్దకం అద్దినట్టుగా తెల్లంగా దామరపూలు.

మట్టి కుండలుగా మార్తావుంటే వాళ్ళ గుండెకాయల్లో పూసిన పూలు కండ్లలో రాల్తా ఉంటాయి.

## సంభాషణా చతురిమ

రచనకు .పాత్రోచిత భాష. ఎంతో సొగసును తెస్తుంది. నుడి కారపు రుచిని చూపిస్తుంది.

నాలుగ్గాళ్ళ మండపంలో తామర తంపరగా ఇబ్బడి ముబ్బడిగా సొంపైన సంభాషణలు గుండెవాకిట నిలచి తలుపు కొడతాయి.

ఈ మట్టి కుండల మీది విసుర్లు గుండెగూడుపట్లను కదిలిస్తాయి.

'ఎంతరా అబ్బోడా!'

'తే పదిరూపాయలు'

'ఇది మట్టి కడవరా అబ్బోడా'

'కాదు, కాదు బంగార్ది గదా! అందుకే అంత రేటు'

ఎడాసకం పట్టా ఉండావా?'

వ్వానేనా?. లేకుండాబోతే ఏందయ్యా నువ్వనేది? మట్టి
ంగాకుండా బంగారు కుండలో వెండికుండలో అమ్మ
గా ఉంటే ఈ ఎర్రని ఎండలో యిద్దో ఈ ప్లాట్‌ఫారం మింద
పడుండేదానికి నాకేమన్నా గాచ్చారం అనుకుణ్ణావా?'

మొగుడు పెళ్ళాల మధ్య నడిచే ఆ సరాగాలు భలే రంజుగా
ఏ మజ్జిగలో అల్లం ముక్కలా!

త్తుకుణ్ణా అక్కెండక పోతావుంటే గూడా సల్లంగ గుక్కెడు,
ళ్ళ గొంతులో పడవు.'

ఏసుగదా! మల్లా ఎందుకింత రామాయణమంతా'

ద్ది గెడ్డి తిని'

తినే గొడ్లు మేలు గదా! ఒక దెబ్బ మింద పడ్తే చెప్పినట్టు
ు. ఈ మణుసుల కత అట్టాగాకుండాపాయనే?'

ప్పటికీ నేను గొడ్డుకంటే గూడా అన్నాయమనానువ్వనేది?'

ఏు! రామ! అంతమాటంటే... అందులో మీ మగ జాతిని!
నపడతాయా?'

ాడు నిద్దర పోయ్యేటప్పుడా?'

ే యిట్టా ముడ్డికి కాటికి పెట్నెట్టుమాట్లాడమంటే ఏం
ేదమ్మా? ఫ్రిజ్ లేకుండాబోతే పీడొకటి పొయ్యింది. ఒక కొత్త
ి తెచ్చి కొంపలో కొట్టే?'

కుండ పగిలిపోతిందే'

ికి నిలిపే నీవగలు .... ఎప్పుడూ ఏదో ఒక రంపు. అని కొత్త
ఏందనో లేకుండాబోతే ఒక బేవార్సముండ మిందనో....!'

ఇల్లో ఇంత కంటే పదునేం కావాలి!

## పాత్ర స్వభావ చిత్రణ

ి మాణిక్యం వారి కాంతాన్ని ఆంధ్రప్రదేశంలో ఎరగని
రు. 'పొత్తూరు' వారన్నట్టు తెలుగు సాహిత్యంలో ఒక భావ
ృట్టించిన పాత్ర యిది.

ంం ఎంత తాక్యం తెలిసిన ఇల్లాలో, ఎంత విజ్ఞానురాలో, ఎంత
, ఎంత గడుచు పిండమో-పులికంటి వారి 'బాశాలి' కూడా
టకారే. చమత్కారే. గాజుకోడే. అంతేగాని గయ్యాళి మాత్రం
ఏత్తైదు కుంకుమను మనసారా కోరుకునే మనసున్న ఇల్లాలు.
ఆడిపోసుకోవడం వెనుక ఆమె అంతుచిక్కని అంతరంగ

స్వభావ వైవిధ్యాలను బట్టి ఆయా పాత్రలకు, ఆయా పాత్రలను అనితర సాధ్యంగా తీర్చిదిద్దటంలో ఆయా రచయితలకు ఒక గుర్తింపు రావడం కద్దు. ఇక సందేహమెందుకు? ఆ 'కోనసీమ' బాశాలికి ఎందులోనూ తీసిపోదు ఈ 'రాయలసీమ' బాశాలి!

ఇదే వరసలో బాశాలికి సమాంతరంగ నడిచిన సజీవమైన పాత్ర ఇంకొకటుంది. ఆ పాత్రే ముత్తా రెడ్డన్న. ముత్తారెడ్డన్నను చదివినప్పుడు ఆయన ప్రత్యక్షమయ్యే వాటం చూస్తే - షేక్సిపియర్ నాటకాల్లో .కోరస్. దర్శనం గుర్తుకొస్తుంటుంది! సమస్యా పూరణకో, సన్నివేశ బలానికో కథా గమనానికో హఠాత్తుగ రంగ ప్రవేశంచేసి కంటిన్యుటిని బ్రేక్ కాకుండా చేస్తుంటుంది. అలాగే - గాలొచ్చి మబ్బుల్ని విడగొట్టేసినట్టు, అద్దం మీద ఎగిరిన పెసరగింజ పత్తాలేకుండా పోయినట్టు - రచయిత వ్యక్తిగతమైన సంశయాన్ని సార్వజనీనం చేసేస్తుంటాడు. ఆ అపర లౌక్యానికి అందరూ నోళ్ళు వెళ్ళ బెట్టాల్సిందే! లౌక్యానికి లౌక్యం నేర్పిన పాత్ర సృష్టి అది!

అసలు నాలుగ్గాళ్ళ మండపం ముఖ చిత్ర రచనే ఒక విలక్షణంగా ఉంది! భావస్ఫోరకంగా కూడా!

సకల జీవుల కర్మలకూ సాక్షి కర్మసాక్షి. ఆడ, మగ సృష్టి కారణ నిమిత్త మాత్రులు. వ్యాపించిన నాలుగు కిరణాలూ మండపానికి ఉన్న నాలుగు కాళ్ళు. అదే నాలుగ్గాళ్ళ మండపం!

'అడిసన్' మహాశయుని 'స్పెక్టేటర్', స్టీల్ సృష్టించిన టాట్లరు వ్యాసాలు, పానుగంటి వారి 'సాక్షి', అనంతపురం భావుకుల 'వదరుబోతు', గురజాడ 'గిరీశం'. -ఈ సారూప్యతను గుర్తుచేసుకోవడం కాదుగానీ, గొప్ప సామాజిక అవగాహనతో సమకాలీన విలువల్ని వసుధైక దృష్టితో ముడి విప్పడమన్న ప్రయోగం-నాలుగ్గాళ్ళ మండపంలో ఒక్క పులికంటికే సాధ్య మయింది. ఏ సాహిత్య ప్రక్రియను పట్టుకున్నా దాన్ని, సాకల్యంగ పండించగల సమర్థుడు పులికంటి! పుట్టుమచ్చలాంటి ఒక ప్రాక్టికల్ రచయిత పులికంటి! 'వల్లంపాటి' వారు ఆకాంక్షించినట్టు - ఉన్నత ప్రమాణాలను అందుకోవాలనే జిజ్ఞాసి పులికంటి!

నాలుగ్గాళ్ళ మండపం - నిర్దిష్ట ప్రమాణాలందుకున్న విశిష్ట రచన! ఆంధ్ర సాహిత్య చరిత్రలో తనదైన 'ఐడెంటిటిని' సంపాదించుకున్న విలక్షణ ప్రయోగం! ఈ ప్రక్రియను అనితర సాధ్యంగ మలచిన అక్షరగాండీవి పులికంటి జీవితం ధన్యం! ●

# నిన్ను చూడ కడుపు నిండు నాకు!

కీ.శే. విద్వాన్ కె. జయరాం

దొడ్డోడవయ్య్య కృష్ణా
రెడ్డీ! సరిరారు గడుసరీ! నీ కెవరున్;
రెడ్డికులానికి బంగరు
కడ్డీవై గొప్ప పేరుగంటివి భళిరా!

ఃతేనేమి? తెల్లన నీకీర్తి
డియంటెమనసువెన్న
ము నీదు జన్మహక్కనిపించు
త్రి పాట చదివిచూడ!

పరవశమ్మునిడు .తపాలుతాతయ్యా. పాట
వినగ వినగ మరల వినగదగును
నీవు పాడుతుంటె నిలచి విన్నది గుండె
రెప్పపాటు సేపు. తప్పుగాదు;

) బ్రతుకు నటనమే స్టేజి పై
ాటలందు, నాట్యకళకె
ప్రజాలు నటకుడోయీ నువ్వు!
ర్ల దేవుడేలు నిన్ను!

కనులమూయబోరు గజ్జెకట్టావంటె;
పాడబూనుకుంటె పలుకబోరు;
కతలు చదువుతుంటె మతిరాదు విడువంగ;
ఎచట దాచుకొంటివింత విద్య!

కలిసిఉంటె నిన్నెవ్వడు
ేడు; మఱిచి మనగలేడు;
'కికుండ నీవు నానేస్తమా?
ాడ కడుపునిండు నాకు!

గొంతు విప్పితేను కోకిల సిగ్గొందు;
కలముబట్ట, జగము కలతనొందు;
వేషమేస్తె చాలు వెఱ్ఱెత్తి జనమాడు,
నీకు నీవెసాటి నేస్తకాడ–

యుపనులు నువ్వుగింజంతైన
గ కీర్తి కూడబెట్టు;

నిన్నుజూచి క్షణము నీరాయెనొక .జడ్జి.
నీమొగాన నున్నదేమొగాని?

ప్రెస్సు బెట్టి మంచి పేపరు నడపుతు
కవి, నటకుడు, మధుర గాయకుడుగ
పేరు బొందినావు పెద్దోడవై; కీర్తి
నేడు పండెనౌర! నిండు సభను !

కచ్చితంబుమాటకాడ; నిక్కచ్చిరా
దుడ్డుకాడ; చాల దూరదృష్టి
కల్గినట్టి నీటుకాడు మాపులికంటి
నాణెమెరిగినోడు, నల్లనోడు !

కన్నుతగులుపుల్ల కనిపెట్టగలవాడు,
కార్యమందు కన్నుగల్లవాడు;
విజయమందుదాక విశ్రమించనినాడు
కోడెవయసుకాడు, కొంటెగాడు –

వ్రాయగలను కొన్ని .వాల్యూము. లైనాను
చదువ నోపినోళ్ళు సరసనుంటె;
అతని పలుకు, చూపు, హాసము, నడకయు
ఒప్పజెప్ప కావ్యమొక్కటొకటె;

మాటరీతిలోన నాటకీయతకద్దు
పలుకులోన కవన ఫణితి కద్దు
శబ్దమందుకద్దు సంగీత మాధురి
కద్దు! కద్దు! లేనిదెద్ది నీకు?

సంతసాన నీకు సన్మాన మొనరించి
ప్రేమ కీర్తిదెచ్చి రామిరెడ్డి;
దిశదిశాంతరాల తేటగా నీకీర్తి
చాటినారు కవులు సంతసాన–

మంచిజేయు .బూబునాంచారి. మాతల్లి
మేలుగూర్చుత! అలిమేలుమంగతల్లి
అభయమిచ్చుగాక ఆ వేంకటేశుడు
నేస్తగాడ నీకు నిండుమదిని!

# ఆత్మీయతా స్పర్శ!

## శ్రీ రాధేయ

ులికంటీ!

రాధేయ వందనాలు స్వీకరించండి.

' గురించి విన్నాను, తెల్సుకున్నాను.

డెబ్బై వసంతాలా! ఇది నమ్మలేని నిజం కదా!

ు గాక నమ్మను... అయినా నాపిచ్చిగానీ నా నమ్మకమెవరి ? ఈ కాలమాగదు. ఎవర్నీ లెక్కచెయ్యదు. తనపని తాను టూ పోతుంది. అయినా ఈ జీవితానికింత వేగమెందుకో?

వక్తా ఎప్పుడూ కాలానికంటే ముందుంటారు. అన్నారు కదా? తో మొదలయ్యే ప్రతి సూర్యోదయమూ మన జీవితం డైరీలో షనే కదా!

కరంబాడికి ఆత్మీయుడివి. ఈ సీమ జానపదుల మమకారాల్లో రాయలసీమ చిన్నోడివి. నీకు వయసుపైబడిందని నేనెలా ? ఎంచేతనంటే ఆ మాటల్లో మాధుర్యం తగ్గిందా? లేదు. ఆ త్యం చెక్కు చెదిరిందా?.... లేదు కదా! ఈ డెబ్బై ఏళ్ళ నీ జీవితం ్రైన కావ్యంలాంటిదనిపిస్తోంది నాకు. అందులోని వాక్యాలన్నీ పేజీలన్నీ విశ్లేషణలే! నీది అందమైన విజయం. సాహితీసేద్యంలో లేని హాలికుడివి నీవు. అందుకే నీ కృషిలోనే నీ అదృష్టం ద్దకుంది. అదేమిటోగానీ, ఎప్పుడైనా తిరుపతి వస్తే చాలు. నిన్ను పోతే, నీతో ఒక గంటైనా గడపకపోతే తీరని వెలితిగా ఉంటుంది పరిసరాల్లో ఎక్కడ ఏ సాహిత్యసభ జరిగినా, కవి సమ్మేళనం ఈ .రాధేయ. గుర్తొస్తాడు నీకు. నేనంటే నీ కెందుకన్నా ము? ప్రొద్దుటూరులో కల్సినా, కడపలో కల్సుకొన్నా, ూర్‌లో కల్సినా, అనంతపురంలో కల్సుకొన్నా, ఎప్పుడు డ కల్సుకున్నా నన్ను చూస్తే చాలు. ఆప్యాయంగా నీ స్తాలు చాస్తావు. అక్కున జేర్చుకుంటావు.

యలసీమ కవిత్వం గురించి చర్చకు వచ్చినప్పుడల్లా ఈ ు గుర్తుంచుకుంటావు. ఎంత ఔదార్యం నీది? నీతో మాట్లాడు త సేపూ నాకు పచ్చటి వరిచేలలో కాలువగట్లమీద ృట్లుంటుంది. నా హృదయం మీద మంచుపూల బిందువులు ినట్లుంటుంది.

నవ్వు! అందరికీ సుపరిచితమైన నవ్వు.

పల్కరింత! అందర్నీ వశపర్చుకునే పులకింత.

ూటల ఒరవడిలో వెన్నముద్దలు దొర్లినట్లుంటుంది.

దాల సవ్వడిలో శబ్దతరంగాలై వెదురుగొట్టంలోకి దూకినట్లుం

విత్తా ప్రవంతి, వీణ మెట్లమీద అడుగులు వేస్తూ ముందుకు ంటుంది.

జానపద అభిభాషణ కొడవలితో వంగిన రాయలసీమ ు తన నడుము చుట్టూ బిగించిన పైటకొంగులా ఉంటుంది.

్త్రోచిత సంభాషణ జలార్ద్రమైన మేఘాలు రాల్చిన ముత్యాల ఉంటుంది.

నీవు దగ్గరుంటే చాలు! ఒంటరితనం పారిపోయి దాక్కుంటుంది. అన్నా! ఈనాడు, ఈ సాహితీ ప్రపంచమంతా కాలుష్యమే!

కులాల పేర, మతాల పేర, ఎవరికుంపట్లు వారు రగిలించు కొంటున్నారు. ఎవరి సొంతగొడవలు వారివి. అదేమి చిత్రమో గానీ నీ దగ్గరి కొచ్చేసరికి అందరూ నీకు అనుకూల మిత్రులే. నీకు ప్రతిపక్షమనేది లేదు కదా! అజాతశత్రువంటే నీవే కదా!

ఎందుకంటే నిజాలు నిర్భయంగా చెప్పడానికి ఏ ఇజాలు అక్కర్లేదనేవాడివి నువ్వు! నీకు శత్రువు లెవరన్నా, ఈ అవినీతిలోకం తప్ప! అసూయాపరుల నోకం తప్ప! ఈ సీమలో సహజమైన ఆవేశం గానీ, ఆందోళన గానీ నీ ముఖంలో నేనెప్పుడూ చూడలేదు.

ఎప్పుడూ అదే నవ్వు! అదే మెచ్చుకోలుతనం.

అనుబంధాన్ని, ఆత్మీయతల్నీ వదిలేసి అవకాశాలవెంట పరుగులు తీసే ఈ లోకంలో నీది యాంత్రిక జీవనం కానేకాదు. నీది కళాత్మక వ్యవహారం. బంగారం లాంటి రైల్వే ఉద్యోగాన్నొదులుకొని ఆరుగాలాలు కష్టించే సాహితీ సేద్యాన్నే నమ్ముకున్నావు. అయినా నీలో చెక్కుచెదరని ధైర్యం. మొక్కవోని విశ్వాసం. నీ ధైర్యమే నీకు స్థోమత అయింది. నీ విశ్వాసమే నిన్ను వెన్ను తట్టి నడిపింది. ఇది ఎందరికి దక్కుతుందంటావ్? నీలాంటి అరుదైన వ్యక్తులకు తప్ప! ఏ విధమైన వంచనా రహస్యాలు తెలీని మంచితనం నీది. అక్కున జేర్చుకోవడమే తప్ప ఆవలికి నెట్టేయడం నీకు తెలియనే తెలియదు. సాహిత్యాన్ని సంక్లిష్టం చేసి ఇబ్బందిపెట్టే వాళ్లకంటే నీవెంతో నయం.

ప్రేమకన్నా తీయని అభివ్యక్తి, ఓదార్పు కన్నా వెచ్చటి సానుభూతి ఈ రెంటికీమించి ఈ లోకంలో ఇంకేమున్నాయి? వెన్నలాంటి హృదయం. వెన్నెల వంటి మనసు. తేనెలూరే పలుకు ఇవన్నీ నీకే సొంతం! కవి సమ్మేళనాలైతేనేం. కథాసదస్సులైతేనేం. ఆకాశవాణి ప్రోగ్రాము లైతేనేం..? ఇలా ఎన్నెన్నో సదస్సుల నిర్వహణ కోసం కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరుగుతావు. నీశ్రమ వృధా కాలేదు. అందుకే! దగ్గరయ్యేకొద్దీ దూరం జరుగుతున్న ఈ లోకంలో ఆకట్టుకునే ప్రేమకంటే గొప్ప అదృష్టమేముంది చెప్పు!

నీ కీర్తికిరీటంలో .కోహినూర్ వజ్రం నాలుగాళ్ళ మండపం.. నీ మాటైనా, పాటైనా పూలరెక్కలమీద వెన్నెల సంతకమే గదా! నీ సాహిత్యంలో రాతిపూలు సైతం పరిమళిస్తాయి, గులకరాళ్ళలో సైతం గుండెల్ని చుట్టేసే గానం నీది. నీ జీవిత సార్థక్యానికి అపూర్వసృష్టి పులికంటి సాహితీ సత్కృతి. నీ సాహితీ ప్రస్థానానికే అరుదైన సంస్కారం ఈ పురస్కారం.

ఈ సత్కారం పొందినవాళ్ళెంత అదృష్టవంతులో కదా! గడచిన జీవితంలో నీవు దాటిన మజిలీలు, చవిచూసిన అనుభవాలు, సాధించిన విజయాల సింహావలోకనమే ఈ సప్తతి! నీ అనుభవాల పాఠశాలలో మేమంతా విద్యార్థులమే! ఏడు పదుల సాహితీ ఋషివి. అరుదైన వ్యక్తివి. ఆప్తుడైన అన్నవు. నీముందు నేనెంతవాణ్ణి! అయితేనేం నాపట్ల నీప్రేమాభిమానాలకు తడిసిముద్దవుతున్న అర్భకుణ్ణి నేను!

నిన్నభినందించే అర్హత నాకుందో లేదో తెలియదుగానీ, నీ ఆనందంలో పాలు పంచుకునే అర్హత మాత్రం ఉందని నా నమ్మకం!!

# పులికంటిని కథల్లోని కమనీయత

శ్రీ ఏ.ఏ. రమణ

షలోను, భావంలోను తెలుగు కథను పల్లెపట్టుకు పరుగు బస్తీ బతుకులోని సుస్తీకి కొత్తమందు కనిపెట్టి పంపిన సాహితీ '' జానపద కథాశిల్పి శ్రీపులికంటి కృష్ణారెడ్డి. ఈనాడు ్ున కథలు వ్రాసే కొద్దిమందిలో ఒకడు అనడం సహజోక్తే కాని ్క్తి కాదు. కవితా రచనలో కూడ అతను నేల విడిచిసాము సమకాలీన పరిస్థితుల్ని ఆకళింపు చేసుకొని కలం నడిపే కు. మేధా గత సిద్ధాంతానికి దేనికో తలవొగ్గి వ్రాసేరకం రచయిత ాసి కోసం రాసేవాడు అంతకన్నా కాడు. అతని చూపులు నుండి ప్రసరిస్తాయి. తలలో నుంచి మాత్రం కాదు. అతనిలో ఉంది. అందుకే జానపదుడైనాడు. అతని అంతస్సత్వం అతని అనితరమైన శక్తిని చేకూర్చుతోంది. వజ్రానికి ఎన్నో వక్షాలు. ుతనిలో ఎన్నో ప్రతిభలు. తెలుగు పలుకుబడిని భావుకతను పట్టిన అగస్త్యుడు. రాయలసీమలో ఒకనాడు రతనాలు ాయట. ఈనాడు నీటి బొట్టులేక ఎండి బీటలు వారుతున్న ోకి తన అనుభవాల కన్నీరు కురిపిస్తున్నాడు. ఎందుకు? భూములకి ఎండిన బ్రతుకులకి అదో ఆనందం.. అదో ృప్తి. అతని కథల్లో ''తెలుగు బతుకులు తెలుగు దస్తుల్లో'' కనిపిస్తుంది. అతను మానవతామూర్తి. అంతకన్నా ఒక్క మాటలో టే ''తెలుగు వచ్చిన తెలుగువాడు'' నిజంగా చెప్పాలంటే వచ్చిన రాయలసీమ చిన్నోడు''.

ులికంటి కథలు, చక్కగా కవిత్వం, మరీ చక్కగా బుర్రకథలూ, క్కగా జానపద కవితలు రాయటమే కాదు రేడియోలో, ''తన కథల్ని'' తానే చదువుతారు. తన కవితల్ని తానే గానం శ్రీ పులికంటి మాత్రమే కాదు చాలామంది ఇవన్నీ చేస్తున్నారు. దుకు చేస్తున్నారు. ఇంకా ఎన్నెన్నో చేస్తున్నారు. ఎవరి కోసం ు? ఇందుకోసం చేస్తున్నారు, ఈ విధంగా చేస్తున్నారు. వీరందరి ్తున్నారు - అని ఏ ఒక్కరైనా చెప్పగలిగితే అతనే నిజమైన కవి, కళాకారుడు! అలా సమాజం చేత గుర్తింపబడినప్పుడు. అతని ుస్సు ఫలించినట్లే.. శ్రీ కృష్ణారెడ్డి కవిగా, కథకునిగా, నటుడిగా ే గుర్తింపడినవారు. పండితుల చేత ఆమోదింపబడినవారు. ోను ఏదో ఒకనీతి ఉండాలన్నది నీతి అయితే, నీతిని నీతి క నీతిని నమ్మే నీతి కోసం, నీతిని నమ్మే నీతిపరుల కోసం, ిన తనవారి కోసం, చెప్పే నీతి చెప్పక, చేసే నీతిని చెప్పక, ే నీతిని చెప్పి, చెప్పిన నీతిని మళ్ళీ మళ్ళీ కథ కోసం, కథలోని చెప్పక, నీతి కథలు రాసేవారు శ్రీ కృష్ణారెడ్డి.

దరూ అనుకొంటారు రచయితలంటే దైవాంశ సంభూతులని, ్ సంస్కారం కలవారనీ! దైవాంశం లేదు. ఏమీ లేదు. అవసరం ు చేస్తుంది. ఆలోచనలోనే భావం పుడుతుంది. భావానికి అందమైన భాష పేరే కవిత్వం ప్రార్థన ఏకాగ్రతకు సాధనమైతే కళారాధనలోనే ఏకాగ్రత ఇమిడి వుంది. ఇక కళాకారులకు ప్రార్థన లెందుకు? ఆ సాకుతో అమూల్యమైన కాలాన్ని వృధాచేసే అధికారం కళాకారునికి లేదు. గీసిన బొమ్మ, చేసిన పని ఆత్మానందాన్ని కలిగించవచ్చు. విప్లవాన్నిరేకెత్తించవచ్చు. అదే విధంగా ఒకరి రచన, మరొకరి నటన... అవిలోక కళ్యాణం కోసం! మరిలోక కళ్యాణాన్ని వదిలిపెట్టి చేస్తున్న పని అవతల పెట్టి ముక్కులు మూసుకొని కూర్చోవటం ఆత్మవంచన. కళాకారులే కాదు మడక పిడిపట్టి దున్నే వాడైనా కత్తి చేతబట్టి కట్టెలు కొట్టేవాడైనా అంతే! పనిలో లీనమవడమే ఏకాగ్రత.

పనినివదిలి అదే పనిగా కాలయాపన చేయటం వృధా. అది ఆత్మవంచన.

అనవలసింది అనడం, అన్నది చేయడమే ఆరాధన అయితే ఆ ఆరాధన శ్రీ కృష్ణారెడ్డి అనుభవించి ఆవిష్కరించిన ''కర్మయోగ సిద్ధాంతం''. కళారాధకుడు కన్నీటిలోనైనా కష్టంలోనైనా కళాకారుడిగా తన కర్తవ్యాన్ని మరువకూడదు. అట్లా చేసినవాడు ఒక్కొక్క మెట్టుగా అధిగమించి తన ఆశయ సౌధాన్ని చేరుకోగలడు. కన్నీటి కలల్ని పండించుకోగలడు. చదివే రోజుల్లో, చదివిఏదో సాధించాలన్న తలంపు ముందు నాలుగు నాలుగు ఎనిమిది మైళ్ళు నడిచినా బాధ తెలిసేది కాదు. కాలే కడుపుకోసం చేసే పనైనా, చదువుకోసం నడిచే నడకైనా ''ఇష్టమై'' చేసినప్పుడు కష్టమనిపించదు. బండ లెత్తవలసి వచ్చినా, కొండలు పిండి కొట్టవలసి వచ్చినా సునాయాసంగానే ఉంటుంది. ఆనాడు చదివి ఏదో సాధించాలని ఎనిమిది మైళ్ళు నడిచారు. ఈనాడు నడుస్తున్నారు ఎనిమిది మైళ్ళు కాదు ఎనిమిది వందల మైళ్ళు జీవితంలో ఏదో సాధించాలనే తపనతో.

''ఇలా ఎన్ని వెట్టి చాకిరీలు, తలుచుకుంటే మనసు సిగ్గుతో కుంచించుకుపోతోంది. ఎందుకు నేనింత పతనమైపోయాను? ఏమైంది నా వ్యక్తిత్వం''. ఇది కృష్ణారెడ్డి ఆత్మపరిశీలన. హృదయం భగ్గుమంది. అందుకే కామధేనువులాంటి రైల్వే ఉద్యోగాన్ని కాలదన్నాడు. బంగారం లాంటి బ్రతుకులో బండలు వేసుకున్నాడు. ఆ బండలు మోయలేక చతికిలబడినాడు. సమాజంచేత సూటి పోటి మాటలు వాడిగా, వేడిగా తిన్నాడు. బంధువర్గం కస్సుబుస్సులాడింది. అయినా ఏనాటి ''కర్మ'' ఫలితమో కాని ఈనాడు అందరివాడిగా ఆదరింపబడుతున్నారు. ఆయిన వారిని, తన వారిని, తనని నమ్మినవారిని, నమ్మకంగా, చేతనయిన విధంగా చేరదీయగల విశాల హృదయాన్ని పెంచుకున్నారు శ్రీ పులికంటి. ''దరిద్రుణ్ణి దూరంగా ఉంచడం లోక సహజం. లోకంలోని దరిద్ర నారాయణ సంఘానికి వెరచి ఆ నారాయణుడే ఏడుకొండల కవతల చేరాడు'' - ''ప్రేమ అనేది గురువులేని విద్య. రాస్తున్న నవలలు, తీస్తున్న

ు, ప్రేమ పాఠాలు నేర్పడమే పనిగా పెట్టుకున్నాయి". శ్రీ సమాజంలోని అసమానతల్ని ఎత్తి చూపడంలోనూ, సమాజపు వడపోయడంలోనూ అందెవేసిన చేయి. "సాహితీ సేవ, సమాజ ంటూ కథలు, నవలలు పుంఖాను పుంఖాలుగా. రాసి పడేసే. సటీర పరిశ్రమ'ల నిర్వాహకులకి, ప్రముఖులకి శ్రీ కృష్ణారెడ్డి ౖన చురక.

ుమె ప్రేమిస్తే నాకేం, ప్రేమించక పోతే నాకేం. నేను ప్రేమిస్తు అది నా తృప్తి. భక్తిగా పూజించిన దేవుడు మాట్లాడు తున్నాడా? ాలిస్తున్నాడా? లేదే! అయినా పూజిస్తున్నారు. కానుకలర్పిస్తు ుడుపులు చెల్లిస్తున్నారు – అదే నమ్మకం. అదే ఆత్మ సంతృప్తి" క్కనైన ఊహ. భావన... మనిషిలో ఏ స్వార్థములేనివాడి దృష్టిలో అమృతము – అద్వితీయము. దేవుడుని ప్రేమిస్తాడు. చక్కనైన ప్రేమిస్తాడు. చిక్కనైన చిక్కుల్ని ప్రేమిస్తాడు. ఎవర్నుండీ ఏమి ు... అదే విశ్వప్రేమ.

ుమెను నాహృదయంలో పదిలపరచుకొంటాను చక్కని ుకలు రాసుకొంటాను. కమ్మగా పాడుకొంటాను. అది నాకు ". అర్థరహితంగా, ఆలోచనారహితంగా ప్రేమకీ, మోహానికి, , కర్మానికి అర్థం తెలియని యువతకి అందుకోగలిగితే కృష్ణారెడ్డి ్వం. సమాజానికి ఎంతో అభినందనీయతత్త్వం – స్త్రీతత్త్వం".

ను సమాజపు కట్టుబాట్లు త్రెంచుకొని తనకీ ఓ కట్టుబాటు చేసింది, లేకపోతే ఈ లోకం నవ్వుతుందా? నలుగురి నోళ్ళలో ేటట్లు చేస్తుందా! ఛీ అడవాళ్ళంతా ఇంతే! నవ్వుతారు, ు, ఆపైన కవ్విస్తారు. కమ్మగా అంతకంటే నమ్మకంగా ారు చిలుకపలుకులు. తీరా దగ్గిరిచేరితే దవడపళ్ళు తారు. ఆడదాని చిరునవ్వులంటే సామాన్యమా! సామ్రాజ్యాలు ినది వాటితోనే, కోటలు మొదలు కొంపలు వరకు నిలువునా వాటి కొరకే!"

ృష్ణారెడ్డికి జీవితం ఎన్నెన్నో నేర్పింది. తెల్లనివన్నీ పాలని నమ్మి ్ల నీళ్ళు తాగారు. పరిగెత్తబోయి బొక్కబోర్లా పడ్డారు. టి కృష్ణారెడ్డి కథలు" ఎన్నెన్నో నగ్న సత్యాల్ని నగ్నంగా పాఠకుల ఆవిష్కరిస్తుంది. తప్పు చేసినా ఒప్పు చేసినా నలుగురిలో ుగా చెప్పగలిగేవాడే ధీరుడు. "చేసిన తప్పు ఒప్పుకున్నోడు తాడు. పొరపాటయిందని చెప్పినా తెల్సుకోలేనివాడు గొఱ్ఱె.. బ్బ గొఱ్ఱె...వాడి తాత గొఱ్ఱె..." కొందరి జీవితాలు మోడువారి ు. ఈ సమతా సాధనకు కవులు, రచయితలు, రాజకీయ లు ఎవరి తిప్పలు వారు పడుతున్నారు. అయినా ఒకరు మరొకరు తగ్గరు. వాగులు వంకల మీద వంతెనలు కట్టి వంకర ను నేరుగా తీర్చిదిద్ది, కాలుకదలకుండా కార్లో ప్రయాణం అని కాంక్షించి లక్షలకు లక్షలు వెచ్చించే ప్రభుత్వం "బీదవాడి ని పల్లాన్ని మాత్రం పూడ్చలేకపోతున్నది". సమతా సాధనకు కృషి చేస్తున్నారట! రాజకీయ నాయకులు, ప్రభుత్వం, ులోని కుర్చీలు కాని ప్రగతి శూన్యం. కారణం ఏమిటి అని కృష్ణారెడ్డి కథ చెప్పే సమాధానం.

"నోరులేని జంతువులు ఆహారం కోసం ఇతర జంతువుల్ని చంపుతాయి కాని స్వజాతిని మాత్రం తాకవు.. కాని మనిషి మనస్సుండి కూడా సాటి మనిషినెత్తి మీద చెయ్యి పెడుతున్నాడు". ఇది కృష్ణారెడ్డి పరిశీలనే కాదు పరివేదన కూడా! రైలు ఒక సంసారం, రెండు రైలు పట్టాలు ఆలుమగలు. రైల్వే స్టేషన్లు ఆలుమగల మధ్య జగడాలు. రైలు గమ్యస్థానం చేరుతుంది. ఆలుమగలనబడే పట్టాలమీద సంసార మనే రైలు, జగడాలనే స్టేషన్లలో ఆగుతూ, గమ్యస్థానం చేరుతుంది. అయినా ఆలుమగల కొట్లాటలు "అరిక కూడు ఉడికే దాక" అంటారు. ఆరిక కూడు కథలో. జీవితంలో ఎన్నెన్నో అనుభవాలు చవిచూశారు శ్రీ కృష్ణారెడ్డి. ఎన్నెన్నో మజిలీలలో ఎన్నెన్నో అనుభూతులకి లోనయ్యారు. వేటికీ ఉప్పొంగనూ లేదు వేటికీ కృంగిపోనూలేదు. కామెర్ల కంటి వానికి ప్రపంచం అంతా పచ్చగా గోచరించినట్లు పిరికివానికి లోకమంతా అనుమానాస్పదంగా కన్పిస్తుంది.

వృద్ధాప్యంలో వున్న తల్లిదండ్రుల్ని కూడుపెట్టి అభిమానంగా చూసే తనయులు ఎందరు? ఎందరు తమ బాధ్యతల్ని బాధ్యతలుగా నిర్వర్తిస్తున్నారు. "వేళ్ళమీద లెక్కించవచ్చు" 'మంచయినా, చెడయినా' అందరూ తనలానే వుంటారనుకునే తత్త్వం శ్రీ కృష్ణారెడ్డిది. అయ్యుండాలి. అందుకే తనలానే అందరూ వృద్ధాప్యంలో తల్లిదండ్రుల్ని ఆదుకుంటారని విశ్వసనీయంగా నమ్మారు. "కట్టపై నాటిన చెట్లు నీటి పట్టుతో బాగా ఎదిగి శాఖోపశాఖలై వృద్ధాప్యంలో తల్లిదండ్రులకి కూడు పెట్టే తనయుల్లా పెంచిన మానవులకి చల్లని నీడనిస్తున్నాయి.... అనంత విశ్వాన్ని జ్ఞప్తికి తెస్తూ వుంది ఆ మర్రిచెట్టు. అన్ని జీవులకు ఆయువుపట్టు. ఆ జీవరాసులపై ఆ మర్రి చెట్టుకున్న మమత మానవాళిలో ఉంటే?

"అనుకోవడం ఆచరణ ఏకమై అనుకున్నట్లుగా జరిగిపోతుంటే ప్రగతి కామియైన మానవుని పరిస్థితి ఎలా వుంటుంది...?" అసలు మానవుడు ఆత్మాభిమానము, సిగ్గు, బిడియము ఆదిగా గల మానవత్వానికి మెరుగులు దిద్దగల సుగుణాలని వదిలి సాటి మానవుని ముందు. దేహి. అని ఎందుకు చేయి చాపుతాడు. ఇవన్నీ కృష్ణారెడ్డిలోనే కాదు ప్రతి మనిషిలోను అభిమానం గల ప్రతి మనిషిలోనూ తలెత్తే ప్రశ్నలు.

"చెప్పడానికేముంది అని చాలామంది అంటుంటారు... చెప్పగలగాలే కాని చెత్త చెదారాన్ని కూడా చెలామణి చెయ్యవచ్చు..." చెప్పగలను కదా అని కథలు చెప్పే కథకులు కాదు పులికంటి. ప్రతి కథేకాదు ప్రతిపదం ఆలోచింపచేస్తుంది... అటువంటి సాహిత్యమే ఉత్తమ సాహిత్యం.

"ఈ ప్రపంచంలో ఒక తరం మనుషులున్నారు. వారికి నాగరికత, సంస్కృతి, అన్న పదాలకి అర్థం తెలియదు. ప్రగతి అన్నమాట వారి చెవిన పడివుండదు. అయితే "ఆకలి" అంటే "అయ్యో" అనగల ఔదార్యం మాత్రం వాళ్ళకుంటుంది. పంచభక్ష్య పరమాన్నాలు "టేబిలు" మీద వడ్డించలేకపోయినా, కుండ అడుగైనా గీకి నాలుగు దోసిళ్ళ కూటి నీళ్లలో కలిపి, రవ్వంత సానుభూతి ఊరగాయగా చేతికందించి తాగమంటారు ఆప్యాయంగా" అందరూ మనషులే. అందరూ బ్రతకాలి. ఆనందం అందరి సొమ్ము కావాలి. ఇది పల్లీయుల కాంక్ష పులికంటి ఆకాంక్ష... చెబుతున్న పాఠాల్ని బెడచెవిని పెట్టేవాడు

ర్ధి. బట్ట మడత పడకుండా పొట్ట గడవాలి అని వెఱ్ఱివెర్రి
సే ఈ కాలపు సోమరి మూకకు ఓ వృద్ధనారీ నీవు ఆదర్శ
ాలవు. ఈ భారతావని శోభాయమానంగా వెలుగొందాలంటే
కర్మయోగులే అవసరం! రాతల్లి రా! ఆదర్శాన్ని ఆదర్శంగా
వరూ వినరు. దాన్ని హృదయానికి హత్తుకునేలా చెప్పగలిగితే
ఠ్యం ఆలోచనామృతం అవుతుంది. కృష్ణారెడ్డి సాహిత్యం ఆ కోవకి
ంది అంటే అతిశయోక్తి కాదేమో!

ివితంలో ఓ చిన్న సంఘటన చాలు పతనానికైనా ప్రగతికైనా...
లు అనుకూలిస్తే కోర్కెలు కొనసాగుతాయి లేదా అడవి
ుంటాయి. ఈనాడు ప్రజాప్రభుత్వంలో ఎన్నికలకు ఎర
తున్నది "బలి" అయిపోతున్నది సామాన్య జనమే! దున్నపోతు
ాలి. అన్నదమ్ములై పుడితే వేరుపడితీరాలి..." కృష్ణారెడ్డి ప్రతి
ిత్యసత్యమే!

ఉప్పు తిన్న ఇంటికే వాసాలెంచేది ఈతరం"

ాతాత మీ ముత్తాతకు పదిరూపాయలు బాకీ ఇచ్చాడట...వడ్డీ
కలిపితే అంతకు మూడింతలయ్యింది..." అక్కడ పెట్టి
... అనేది ఈ తరం... అయినదానికి కానిదానికి అభిమానాలు
ుంటూ అంతస్థులు సృష్టించుకుంటూ ఆత్మవంచన
ంటూ బ్రతికే పట్టణాలకు తొత్తును... అరమరికలు లేకుండా
ుునితో ప్రసంగించటం కష్టమనిపించింది....

"మరపురాని మాఊరు" లో పల్లెలకు పల్లీయులకు పట్టం గట్టారు శ్రీ పులికంటి అన్నది వాస్తవం కాదు... పట్టం గట్టడమూ కాదు పట్టి లాగడమూ కాదు... అన్యాయానికి న్యాయం, అధర్మానికి ధర్మం చేకూరాలన్నదే కృష్ణారెడ్డి తత్త్వం. చెట్టంత ఎత్తువాడైనా చిన్నారి చిఱుతడైనా శ్రీ కృష్ణారెడ్డికి ఆప్తులే. "సోదరా ఈ కథ రాశాను బాగుందా! ఈ కవిత చదువుతాను వింటావా!" అని రాసినప్రతి కథను, కవితను చుట్టూవున్న మిత్రులకి చక్కగా చదివి, గానంచేసి వినిపించుతారు. అయ్యో బాగాలేదా! మార్చమంటావా సరే... అంటూ ఎదుటివారు చేసిన విమర్శని ఒక్కక్షణం ఆలోచించి అరమరికలు లేకుండా కథలో, కవితలో మార్పులు, చేర్పులు చేయగల హృదయం పులికంటిది.

"అయ్యా! నీవమటుకు నువ్వెంత రాస్తున్నావు, వేదికమీద అవకాశాలు దొరికితే ఎంత చక్కగా ఉపన్యాసాలు దంచేస్తున్నావు...? రాతలకు, చేతలకు సామ్యం వుంటే - మాలాంటి తలరాతలకు చోటుంటుందా?" పులికంటి కృష్ణారెడ్డి కథలోని కథానాయకుడి ప్రశ్నేకాదు ఈనాడు అనేకమందికి శ్రీ కృష్ణారెడ్డి వేసే ప్రశ్న ఇది. అందరికీ చిరునవ్వే సమాధానం.

"ఒక్కమాటలో చెప్పాలంటే" తనకు రావలసిన ధర్మం మరొక్కడు అడ్డందూరి తన్నుకుపోతే ఆ అధర్మంమీద ధర్మంయుద్ధం కొనసాగించడమే శ్రీ పులికంటి కృష్ణారెడ్డి కథలు!

(ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం నుండి)

*పల్లెపదములలోనఁ బరవళ్ళు త్రొక్కుచు*
*వలపు తేనెలు పొంగి పొరలు చుండు*
*కథలలోఁ బ్రకృతియు కల్పనా శిల్పమ్ము*
*పాత్రుల నైజమ్ము ప్రతిఫలించు*
*గానమ్ములో నొక్క గంభీర ధోరణి*
*గంటల మ్రోయించు కర్ణములను*
*పాత్రోచితాహార్య వైభవమొప్పార*
*భాసించు నటనా ప్రభావ గరిమ*

*కళలు నాలుగు నీలోనఁ గలిసి యాడ*
*కనుల విందుగ నాంధ్రలోకమ్ము కాంచి*
*కనక కంకణ హస్తుని గానొనర్చు*
*కాలమరదెంచు కృష్ణ! గానొనర్చు*
*కాలమరదెంచు కృష్ణ! దీర్ఘాయురస్తు!*

*శ్రీమాన్ శంకరంబాడి సుందరాచారి*
(కాంచీపురం నుండి రాసిన ఒక ఉత్తరంలో)

# రాయలసీమ రవ్వ పులికంటి

డాక్టర్ కరిమద్దెల నరసింహారెడ్డి
రీడర్ : లెక్చరర్స్ కాలని, నెల్లూరు-524 003

క్షామము దాపురించి పలుసారులు చచ్చెను జంతు సంతతుల్
వేమరు చచ్చినారు ప్రజ వేనకు వేలు చరిత్ర మాటునన్
క్షామము లెన్ని వచ్చిన రసజ్ఞత యించుక చావలేదు జ్ఞా
నామృత వృష్టికిన్ కొఱత నందని రాయలసీమ లోపలన్! -నండూరి రామకృష్ణమాచార్య

మహనీయులకు మాతృభూమి, పుణ్యపురుషులకు పుట్టినచోటు
త్యాగధనులకు తల్లినేల, అభిమాన ధనులకు అమ్మబడి, పౌరుషవంతు
లకు పాఠశాల అయిన రాయలసీమ కవులకు కాణాచి. రాయలసీమ
సాహిత్య రంగంలో 'రాయల్' సీమ సారస్వత రంగంలో నిస్సీమ రాయల సీమ.

రాయలసీమ యాసబాసకు పట్టముకట్టిన మహనీయుడు,
మాననీయుడు పులికంటి కృష్ణారెడ్డి. ఆధునిక కాలంలో జానపదకవి
త్వానికి రూపురేఖలు దిద్దిన పెద్దకవి పులికంటి. పులికంటి కలానికి అడ్డులేదు. అదుపులేదు.
పులికంటి గళానికి విసుగు లేదు. విశ్రాంతి లేదు.
పులికంటి కలానికి లోయలలోతులు తెలుసు. జలపాతాలు తెలుసు.
పులికంటి గళానికి అందాల హద్దులు వెలుసు. సౌందర్యాల సరిహద్దులు తెలుసు.
జానపద కవిత్వసృష్టిలో పులికంటిది పెద్దపీట. జానపద కవిత్వాన్ని
ఉత్పత్తిచేసి తన స్థానాన్ని చిరస్థాయి చేసుకొన్న పులికంటి వర్ధనీయుడు, వందనీయుడు.

నండూరి సుబ్బారావు "ఎంకిపాటలు" వ్రాసి తెలుగువారి గుండెలను
దోచుకుంటే పులికంటి కృష్ణారెడ్డి "అమ్మిపాటలు" వ్రాసి తెలుగువారిని
నిలువుదోపిడి చేశాడు. పులికంటి "అమ్మి" ప్రబంధ సుందరులను
మించిపోయింది. పులికంటి కవి, కథకుడు, వక్త. అన్నిటిని మించి
మంచివ్యక్తి. పులికంటి చక్కగా వ్రాయగలడు. రామచక్కగా
మాటలాడగలడు. మాటలు ఆడగలడు.

లికంటి రచించిన విజయనగర వైభోగం అనే గేయ ఖండిక మాధుర్య రసపూర్ణ కుండిక. ఆ గేయంలో భావం, భాష పోటీపడి
ు. విజయనగరం కథ ఆగేయంలో అందాలను ఆరబోసుకుంది. అందులోని ప్రతిపదం రసాస్పదం. పులికంటి పదాలకు రంగు, రుచి, శుచి, వాసి, వాసన ఉంటుంది. ఎక్కడున్నా పులికంటి పదాలను అట్టే గుర్తు పట్టవచ్చు.

లికంటి కథలమీద, భాషమీద వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరిగినాయి, జరుగుతున్నాయి. త్రవ్వేకొద్ది విశేషాలూరే చెలమ కవిత. పులికంటి కథలు వ్రాశాడు. కథానికలు వ్రాశాడు. ఖండికలు వ్రాశాడు. గేయాలు వ్రాశాడు. ఏదివ్రాసినా పొల్లు, పొట్టులేదు. ంలో వీరంగం త్రొక్కిన పులికంటి అంతరంగం రంగును గుర్తించడం సాధ్యంకాదు.

శేఖర జానపద కవికోకిల, జానపదబ్రహ్మ, పండితమిత్ర రాయలసీమ సిన్నోడు మొ. బిరుదులు సనదులు పులికంటిని వెదుక్కుంటూ . ఎన్నో సాహిత్య సాంస్కృతిక సంస్థలు పులికంటిని సముచితంగా సమున్నతంగా సముదాత్త స్థాయిలో సత్కరించాయి.

యలసీమకు వన్నె వాసి, పేరు ప్రతిష్ఠ, సంపాదించి పెట్టిన వారిలో పులికంటికి ఉచితాసనం వేయక తప్పదు.

కపటములేని వర్తనము కర్కశభావములేని చేతలున్
నెపమీసుమంతలేని కృప నేరము లెంచగనేని మైత్రియున్
అపజయమెందులేని కృషి అడ్డములేని పరాక్రమోద్ధృతుల్
చపలము లేని వృత్తి సహజమ్ములు రాయలసీమ వారికిన్.

# పులికంటి కృష్ణారెడ్డి కథలు - స్త్రీ వ్యక్తిత్వం

డా॥ మూలె విజయలక్ష్మి

తెలుగు అధ్యయన శాఖ, రీడర్, పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి

యలసీమ కథకుల్లో పులికంటి కృష్ణారెడ్డిగారికి విశిష్ట స్థాన మేడిపిడి పట్టాల్సిన రెడ్డిగారు కలం పట్టి కథల పండించి, ిత్యపాతరలో కుమ్మరించారు. పట్టణంలో ఉన్న మట్టిమనిషి ఈయన కథలు పట్టణ పరిమళాల్ని, మట్టివాసనను తుంటాయి. రాయలసీమ అందునా చిత్తూరు మాండలికాన్ని, ాన్ని శైలికి అందంగా దట్టించారు. అట్టడుగు వర్గాల నుంచి ుక్కిన వారి వరకు వాస్తవ జీవితమూలాలను ముట్టడించారు. స్యలకూ స్పందించారు. కథావస్తువుగా స్వీకరించి, మనసు ుటట్టు, మేధ మేల్కొనేటట్టు కథలు మలిచారు.

ుగులో స్త్రీవాద సాహిత్యం ఊపందుకొని, పితృస్వామ్య సమాజ ను ప్రశ్నించకముందే పులికంటిగారు ఆడవాళ్ళవ్యథల్ని, కథల్ని కథల రూపంలో కళ్ళముందుంచారు. కుటుంబం ంలో సాగుతున్న అన్యాయం, అణచివేత, వివక్షత, శ్రమ, దోపిడీలు, ప్రేమ, అర్ద్రత, జాలి, పరదావెనుక మగవాని కుట్రల యథార్థాన్ని దగాపడిన స్త్రీల ఒంటరి పోరాటాలను, ళుల దైన్యాన్ని, వ్యక్తిత్వంలో సామాజిక వ్యవస్థలోటుపాట్లను ున స్త్రీ చైతన్యాన్ని ప్రదర్శించారు. నలభై ఏళ్ళుగాసాగిన వీరి ంతిలో కాలం, సామాజిక నేపథ్యం దృష్టిలో ఉంచుకొని, త్రల స్వభావం, చలనశీలత, చైతన్యం, విలువలు ఆధారంగా న గమన పరిణామాన్ని పట్టుకోవచ్చు.

ేంద్రంగా గాని, ప్రధానపాత్రగా గాని నడిచిన కథల్లో ఒక ంశం బిందువుగా అల్లిన కథలు ఒక వర్గంగా పరిశీలనకు ంన్నాయి. వివాహ విషయంలో స్వంత నిర్ణయంతో కులాంతర కు ముందుకొచ్చిన దృష్టాంతాలతో 'కడుపుసొద' 'రాగరం థలు రూపుదిద్దుకున్నాయి. సమాజంలో కులాంతర వివాహ ్త్సాహం లేకపోవడం, ఊరొదిలి పారిపోకుండా నిలదొక్కు కూడాఈ కథల ద్వారా అవగతమవుతుంది. ప్రేమ పెళ్లి ుగవాని వంచన, కుట్రకుతంత్రాలకు స్త్రీ బలయినా, తన తాను నిలబడి, సంతానాన్ని సాకి సంతరించడానికి శాయ ృషి చేసిన ఉదంతాలు 'లోకంనవ్వింది., 'దేవుడు', 'కుక్క ల్లో ప్రతిబింబిస్తాయి.

చన చేర్చినవాడే వంచనచేసి, నిందను నెత్తిన మోపి ాలాలను గడపదాటించాడు. బిడ్డ ఆలనాపాలనకు రెక్కల ఆధారపడింది. ఒక సంఘటనలో 'అబ్బఅమ్మకు పుట్టిన అదుపాజ్ఞలుండి ఏడుస్తాయి'. అన్న సమాజం మాటలు ంద్రెవరని నిలదీసేటట్లు చేశాయి. పసిమనసు కష్టపెట్టలేక ంది అమ్మ మనసు. ఫలితం తల్లిని అనుమానించి, పారిపోయి ్డు కావడం 'లోకంనవ్వింది' కథాంశం.

ంట్లో ప్రేమానురాగాలు, గొప్పింట్లో స్వార్థం ముప్పిరిగొని ని నిరూపించే కథ 'కుక్కఆశ'. పేదింటి పిల్ల కాంతమ్మ ఆధారంగా నిలబడతానంటే నమ్మి, గొప్పింటిపిల్ల ఆరాధిస్తున్నానంటే పొంగి, అడుగు ముందుకేసి, మోసపోయారు. కాంతమ్మ ఊరొదిలి బిడ్డనుకని సాకుతుంది. గొప్పింటిపిల్ల పసిగుడ్డును కుప్పతొట్టికి అప్పజెప్పింది. విశ్వాసం గల కుక్క ఆయింటి పనిమనిషి కాంతమ్మ గుడిశెకు పసికందును చేర్చింది.

మగడు అంటగట్టిన అపవాదుతో గర్భవతిగా పుట్టిల్లు చేరింది. బతుకుదెరువుకు పాలవ్యాపారం చేపట్టింది. ఆమె కడుపాత్రం ఉన్నదేకాని, లోకం పోకడ తెలిసింది కాదు. ఏడో తరగతి పరీక్షల్లో తల్లిదండ్రులు అడ్డదారులు తొక్కి తన బిడ్డలాంటి ప్రతిభగల వారికి అన్యాయం చేస్తున్నారన్న వాస్తవాన్ని జీర్ణించుకోలేక మూగదేవుడితో మొరపెట్టుకుంది.

ఈ మూడు కథల్లో స్త్రీ పురుషుని వంచనకు బలిపశువయిందన్నది కఠోరసత్యం. అయితే ఏస్త్రీ కూడా నీరుగారిపోయి, నీటిపాలు కాలేదు. రెక్కలకష్టంపై నిలబడింది కానీ తనకు జరిగిన అన్యాయాన్ని నిలదీయ లేదు. ఎదురాడలేదు. కిమ్మనకుండా సంతాన బాధ్యతనెత్తిన వేసుకొని, తన సుఖాన్ని త్యాగం చేసి, ఒంటరిగా జీవన పోరాటానికి సిద్ధమయింది. కుళ్ళు, కుతంత్రం, కల్మషం నిండిన సమాజంతో పోటీ పడలేకపోయింది. అవివాహితగా తల్లిగావాల్సివచ్చిన స్త్రీ ఊరుగాని ఊరు చేరింది. ఈ పరిస్థితులకు జంకక నిలబడిన వీరందరూ పేదవర్గానికి చెందిన వారే. ఉన్నత వర్గస్త్రీ స్వార్థపరురాలయింది. దీని వెనుక తనరెక్కల నమ్మికోలేని అశక్తత, అధైర్యాన్ని నూరిపోసి ఆత్మవిశ్వాసం ప్రోది చేయలేని కుంటుంబ వాతావరణం కారణం కాదనగలమా!

ఈ కథల్లో స్త్రీలకడగండ్లకు, కష్టాలకు, కన్నీళ్ళకు, అన్యాయం చేసిన మగవాణ్ణి కానీ మకిలంటిన మనుషులను గానీ నిలదీయ లేని చైతన్య రాహిత్యానికి కారణమేమిటి? బిడ్డలకు జరిగిన అన్యాయానికి కారణం ఆమెనా! అతడా విధియా సామాజిక వ్యవస్థా! - ఇవి నయవంచనకు బలైన స్త్రీలపట్ల సానుభూతిలో స్పందించి కృష్ణారెడ్డి గారు సమాజానికి సంధించిన ప్రశ్నలు!..

పితృస్వామ్య సమాజంలో నైతిక విలువల పేరుతో సాగుతున్న కుటిల నీతిని, ద్వంద్వనీతిని మగవాని చేతిలో ఆటబొమ్మగా మారిన ఆడవారి జీవితాలకు అద్దంపట్టిన కథలు కర్త-కర్మ-క్రియ; ఊహ కందని లోతులు.

కడుపు పండటం కోసం పరపురుషుణ్ణి ఆశ్రయించింది మహిడీ లక్ష్మమ్మ. సంగతెరిగిన భర్త ఆస్తిపాస్తులు దక్కకుండా చేసి మనోవ్యాధితో కన్నుమూశాడు. పూలమ్మిన చోట కట్టెలమ్మవలసివచ్చినా ఆమె కుంగలేదు. గంపనెత్తికెత్తుకొని జీవనభృతి వెతుక్కొనింది.

ఊహకందని లోతులు లో బొటాబొటి జీతగాడు సంపాదన కోసం అందమైన భార్యను అంగట్లో కూర్చోమంటాడు. వ్యాపారం

ువ్వులు, ఆరు కాయలుగా సాగుతున్నా డబ్బుకక్కుర్తితో బొమ్మగా మారమన్నాడు. ఆత్మాభిమానం చంపుకోలేక త్యకు పాల్పడింది. ఈ రెండు కథల్లో మూలాంశం ువల ప్రాధాన్యం. ఒకకథలో భర్త నైతిక విలువలకు డితే, మరోకథలో భర్త నీళ్లొదిలాడు. అయితే ఎటు తిరిగి లువల వలలో పడి దుష్ఫలితం పొందింది స్త్రీలే. మగవానికి లేని, ఆడవాళ్ళకు మాత్రమే అంటగట్టే పాతివ్రత్యం, నైతిక లోని సామాజిక అన్యాయం నిజంగానే స్త్రీకి .ఊహకందని

టుంబం ముసుగులో యధేచ్ఛగా సాగుతున్న లైంగిక దోపిడీ, పిడీని ప్రత్యక్షీకరించిన కథ. 'ఈ మట్టి మనసుయింతే' ఆమె లు. ఇద్దరు పిల్లలు. కుటుంబానికి మూలాధారం యాచన. అందరి సంపాదన యావత్తు అతడు చేజిక్కించుకొని, ల్లల తిండి సంగతి కూడా పట్టించుకోకుండా, తప్పతాగివచ్చి ప్చుకున్నాడు. ఆమెకు సంపాదన ఉన్నా, అంధత్వం వల్ల వలసి వచ్చింది. అది అలుసుగా అతడాడుతున్న ఆటలను ుంగా భరించాల్సి వచ్చింది. కళ్ళుండీ 'అంధత్వం' లో రిన మనసుల్లో తమరెక్కల కష్టఫలితమే కుటుంబపోషణకు ా బతుకులీడుస్తున్న స్త్రీలు, దాన్ని కూడా చేజిక్కించుకొని, చేస్తూ, భార్యంటే అందుబాటులో అనుభవించడానికుండే ని మరబొమ్మని భావించే మగరాయుళ్ళు వేనవేల కుటుం న్పిస్తారు. అటువంటి స్త్రీలస్థితికి ఈ కథ ప్రతినిధి!

కున్న మచ్చలు కప్పిపుచ్చుకోవడానికి ఆదర్శం పేరుతో లిని పెళ్ళాడాడు ఒక శ్రీమంతుడు. ఆ విషయం ఆమెకు యకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసి పంజరంలో రామ చేశాడు. ఇంతా చేసినా సంతానం కలిగినప్పుడు బిడ్డ దాల ముచ్చట్లలో మీఒంటిమీదున్న మచ్చలు వాడికి రాలేదు అన్న ఆమె మాటలతో దిమ్మ తిరిగిపోయాడు. భార్యగా ను పసిగట్టినా సర్దుకుపోయింది. సంతాన విషయంలో డింది, అసలు విషయం వెళ్ళ గక్కింది. స్త్రీ పురుషుని ందర్యం కంటే అంతఃసౌందర్యానికి ప్రాధాన్యమిస్తుందన్న కి ప్రతీక ఈ కథ.

ని కనీసకోర్కెలతో, కుటుంబశ్రమతో నలిగిపోతూ, ఆడ ంతమంది ఉన్నా మగనలుసుకోసం ఆరాటపడే మధ్యతరగతి జీవిత వాస్తవికతను చిత్రించినకథ 'గోడమీద బల్లి'ల చూడటానికి నలుగురు ఆడపిల్లలతో నానాయాతన పడి ుప్పతిప్పలు పడినా అక్కడికి వస్తానన్న భర్త రానేరాలేదు. 'అయ్యో! పొద్దస్తమానం ఆఫీసులో అల్లాడిపోల్లాడి వస్తే – ఫీ యివ్వడానికి కూడా యింట్లో దిక్కూదరీ లేదే' అని నొచ్చుకొని ఆదరాబదరా ఇల్లు చేరింది. పనులు ది. అప్పుడు తీరిగ్గా కిళ్ళీ నములుతూ సిగరెట్టు పొగ వచ్చాడు. కాసేపు మౌన యుద్ధం తర్వాత కుటుంబ ణ పాటించడం వల్ల ఇంక్రిమెంట్లు వచ్చిన పైఅధికారి ఇచ్చిన ు రాకపోవటానికి కారణమన్నాడు. తామూ ఆపని చేస్తే ట్లు వస్తాయనే ఆశ ఉన్నా మగపురుగుకోసం తాపత్రయ ది. పిల్లల ఆలనాపాలనా, మగని సేవలకు పరిమితమై జీవితంలో మగవానిశ్రమకు తప్ప తనశ్రమకు, కష్టానికి

తానే గుర్తింపు ఇచ్చుకోలేని అజ్ఞానం. దానికి తోడు వంశాంకురం కావాలనుకొనే మూఢత్వం ముప్పిరి గొన్న ఇల్లాలు ఈమె.

ఈ కథల్లోని స్త్రీ పాత్రలన్నీ పితృస్వామ్య సమాజంలో కుటుంబ విలువల పరిధిలో ఒదిగిపోయినవే. కుటుంబం, భర్త, వంశోద్ధారకుడు వంటి సెంటిమెంట్లతో కమిట్‌మెంట్ కలిగినారు.

సమాజంలో చిన్నచూపుకు గురవుతూ,మోడువారిన జీవితాలను వెళ్ళదీసే మరోవర్గం వితంతువులు. ఒంటరి జీవితంలోని మానసిక క్షోభ. అభద్రత, చిగురించడానికి అంగీకరించని సమాజ ధోరణి, సంపాదించేమగవాడు పోయాక సంతానపోషణా బాధ్యతలు వంటి వితంతువుల సమస్యలు తీయలేని కలుపు, అంటరానివాడు, శివుడు బతికే ఉన్నాడు కథల్లో పులికంటి వారు కళ్ళకు కట్టించారు.

వితంతు వివాహమంటే 'యాడైనావుందా యీ విడ్డూరం! ఆహా.! ఇంక వానలు కురవమంటే కురుస్తాయా!' అని అమ్మలక్కలు వాపోయే వాతావరణంలో ముండమోపిమాత్రం మనిషికాదా! ఆమెకు మాత్రం హృదయం లేదా! పాపం! నెలలు తిరగకముందే భర్తను పోగొట్టుకొన్న అదృష్ట హీనురాలు. అలామోడువారి పోవలసిందేనా? అని విశాలహృదయంతో కామాక్షిని వివాహమాడడానికి ముందు కొచ్చాడు మూర్తి. ముసలయ్య, యువజనసంఘం ముందుండి జరిపించారు పెళ్ళి. మూర్తితండ్రి కామాక్షి తండ్రిని అప్పుల వలలో ఇరికించి ఆమెకు అయిష్టంగా జరిగిన పెళ్ళిగా చిత్రించ యత్నిం చాడు. ఆమె అలా చెప్తే తండ్రికి రక్ష. ముసలయ్యకు శిక్ష. సంకట స్థితిలో ఆత్మహత్యకు పాల్పడింది. సంప్రదాయసంకెళ్ళు తెంచుకొని ముందుకొచ్చినా వితంతు వివాహం విచ్ఛిన్నం చేయటానికి ఆజంట బతుకు బుగ్గిపాలు కావటానికి సామాజిక వాస్తవపరిస్థితులు ఎలా ఎదురుగాలి వీస్తున్నాయో, ఎంత నికృష్టంగా ఉన్నాయో స్పష్టం చేశారు రచయిత.

'అంటరానివాడు.కథలో హఠాత్తుగా జరిగిన సంఘటనలో భర్తను కోల్పోయినా, కుటుంబం జరుగుబాటుకు లోటులేక పోయినా, సమాజంలో అభద్రత ఒకవైపు, అదుపులో లేని మనసు ఆమెను ఆలోచింపచేస్తాయి. అదే మగవాడికైతే ఏ సమస్య ఉత్పన్నం కాదు. ఏమిలోకమో, మగవాడి కొకన్యాయం! ఆడదానికొక న్యాయం. అందుకే వివాహితుడని తెలిసినా అందివచ్చిన చల్లని చేయి అందు కొనింది. అయితే సాటిస్త్రీగా ఆమెకు జరిగే అన్యాయం గురించి ప్రశ్నించింది. తానొకకన్ను, నువ్వొక కన్ను, ఏకంటికి బాధ కలిగినా ఆ బాధ నాది అని హామి ఇచ్చాక తాళి కట్టించుకొనింది. ఆమె జీవితం సాఫీగా సాగుతున్న సమయంలో అతని స్వగ్రామంలో పొరంబోకు నేలతగరాదులో మారణకాండ సృష్టించాడు. అది తెలిసింది ఆమెకు. పోలీసులనుండి రక్షణ కోసం ఏక్షణంలోనైనా అతడు రావచ్చు. రక్షణ ఇవ్వాలా వద్దా అని తర్జన భర్జనలు పడే సమయంలో ఊరికి ఉపకారి అయిన తనభర్తే అంటరానివాడని, ఈ సమాజానికి మంచి చేసే హరిజనుడు అంటరాని వాడు కాదని నిర్ణయించింది. ఒంటరి జీవితంలోని క్షోభను అనుభవించిందైనా, తనకు రక్షణ కల్పించిన వాడైనా, భర్త సామాజిక విద్రోహానికి పాల్పడినాడని తెల్సినప్పుడు క్షమించలేకపోయింది. వ్యక్తి సుఖం, స్వార్థం కంటే సమాజ శ్రేయస్సు ముఖ్యమని భావించిన అభ్యుదయవీచిక ఈ కథానాయిక!

ఆర్థిక ఒడిదుడుకులలో ఉన్న నల్గురు బిడ్డలు కల్గిన వితంతువును ఆర్గురు బిడ్డల తండ్రి శివుడు ఆదుకున్నాడు, దగ్గర

అడకత్తెరలో పోక స్థితి. శివుడు పరమశివుని ఆదర్శంగా సం 'శివుడు బతికే ఉన్నాడు' కథాంశం.

రెండు కథల్లో వితంతువులు అటు ఆమగవాని పరంగా ఇటు సమాజంలో తాళికి ఉన్న గౌరవం, స్థానం, రక్షణ తెలిసి, ంచుకున్నారు. మానసికబంధానికి నిబద్ధులై .నిలబడే. స్థాయి లేదు. అంటరాని వాడులో ఆమెకిచ్చిన సమాధానాన్ని బట్టి ుం లేదా రక్షణ యివ్వడం భర్తగా చేసేన్యాయమనీ, ఆ సమకూర్చగల మగవాడు ఎంతమందినైనా పెళ్ళాడవచ్చనే క్తమవుతోందే గాని మానసిక విలువలకు ప్రాధాన్యం ఇవ్వటం స్పష్టం. సమాజంలో ఆర్థిక సమస్య లేదా అభద్రతా భావం వులను పట్టి పల్లారుస్తున్నాయి. ఇది అలుసుగా వారిని కత్తెలుగానో, కులటలు గానో మార్చటానికి యత్నించే లో సముచిత స్థానం కల్పించటానికి రచయిత తపన పడినా ుభార్యాత్వానికి దారి తీస్తుంది.

ాజంలో చిన్నచూపుకు గురవుతున్న మరోవర్గం వేశ్యలు. వీరిలోనూ ఉత్తమ, ఉదాత్త గుణాలు, మానవీయ విలువలు తంగా ఉన్నాయని 'కవిత-కన్య' 'అక్షరలక్షలు' కథల్లో గారు నిరూపించారు.

ివిత-కన్య'లో శ్రీమంతుడి కూతురు పెళ్ళికి అద్భుతంగా ాలు రాయడానికి సమకూర్చిన హంగుల్లో 'సుందరాంగీ' ుగువ, మధువు అలవాటు లేని కవి తనపని పూర్తి చేసుకొని, ృతలు, బాధలు ఆమెకు చెప్పుకొన్నాడు. కవి దీన స్థితికి ివిన ఆమె ఆనాటి సంపాదనను అతనిచేతిలో పెట్టింది. స్తున్న అతనితో వడుపుకూడని అసహ్యపడుతున్నారా! ొస్తే రేపా పెద్దమనిషి మీ ఆశీర్వాదాన్ని అందుకొని ఘనంగా చబోతున్నాడే, ఆడబ్బు ఎలా సంపాదించాడో తెలుసా? అని ంది. చివరకు పెళ్ళయి ఆ పెద్దమనిషి కవిగారికిచ్చింది .వట్టి

్థిక బాధలు తాళలేని కవి మిత్రుని సలహాపై స్థానిక ఎమ్మెల్యే ోజుకు పంచరత్నాలు అల్లడానికి సిద్ధపడి స్పందనకోసం ఆనందాన్ని పంచే .ఆమె. ఇల్లు చేరాడు. విషయం ొన్న ఆమె ఓట్లలో అధికారం చేజిక్కించుకొని ప్రజల పాట్లు ాయకులా కవితావస్తువులని .అక్షరలక్షలు. చేసే మాటలతో కల్గించింది.

ధనవంతుల అక్రమార్జన పట్ల, ప్రజా సంక్షేమం కంటే నాయకులకున్న అధికార వాంఛ వంటి సామాజిక పట్ల స్వచ్ఛమైన అవగాహన కల్గి ఉన్నారు. ఎదుటి వార్ని ను సానుభూతితో అర్థం చేసుకొని ఔదార్యం, ఔన్నత్యం కల్గిన ు!

సమస్యలకు సానుభుతితో స్పందించిన పులికంటిగారు స్త్రీలలో కన్పించే స్వార్థం, లౌక్యం, బతకనేర్చిన తనం ు. తమ ఉన్నతిని మగవాడు ఆధారంగా సాధించుకొని తెప్ప తగలేసి కృతజ్ఞతను కన్పరచిన పాత్రలు 'చెట్టంత .కాలేక కడుపుకు గంపెడు మల్లెలు. లో తారసపడతాయి.

ురాగాన్ని పంచుకొని, పైకెదగడానికి ఆసరాగా నిల్చిన అతన్ని రొకరి పక్కన చేరింది ఆమె. ఆబాధను దిగమింగుకోలేక అతడు కుమిలిపోతుంటే ఆమె ద్వారా పరిచయమయిన స్త్రీలత తీగపైకి ప్రాకడానికి ఆసరాగా నిల్చిన చెట్టును ఆదర్శంగా గ్రహించమని ఓదార్చటం కథాంశం.

కాలేకడుపుకు గంపెడు మల్లెలు లో పొట్టకూటికి కొంగు పరిచే ఆమెను అభ్యుదయభావాలుగల రచయిత ఆదుకొని, అందల మెక్కించాడు. సంపాదనే పరమార్థంగా చేయరాని పనులు చేస్తుంటే తప్పని హెచ్చరించిన అతన్ని తప్పుకోమనింది. అతని స్థానంలో మీరా కరు ... అలాంటి ఒక మూర్తి రచయిత ప్రస్తావన తీసుకురాగా పడక మీదికి పిడికెడు మల్లెలు తీసుకురాలేదు అరసికుడని ఈసడించింది.

ఈ కథల్లో స్త్రీలు ఉన్నత స్థానానికి చేరుకోవడానికి మగవాణ్ణి పావుగా వాడుకున్నారు. అయితే చెట్టంత మనిషిలో ఆ చెట్టు పై ప్రేమతో కాదు బావా ఆ లత చెట్టును దాటి పైకి ప్రాకింది. ఆధారం కోసం మరోచెట్టును ఆశ్రయిస్తుంది. ఈ మాటల్లో స్త్రీ స్వంతంత్రంగా నిలబడలేని పరిస్థితులను, మగవాని ఆసరా లేకుండా పైకెదగనీయని సమాజ దుస్థితికి అద్దం పట్టున్నాయి.

అలాగే 'కాలేకడుపుకు గంపెడు మల్లెలు'లో తనదారిని తప్పుపట్టిన అతనితో 'నన్ను హింసించిన ఈ సమాజంపై కసి తీర్చుకుంటున్నాను. అంటుంది. కూటికి గతిలేనిరోజు ఆమె పడిన మానసిక వేదన, సంఘర్షణ కోటికి పడగెత్తాలనే దురాశకు, తప్పు దారులు తొక్కడానికి పురికొల్పాయన్నది నగ్నసత్యం.

డబ్బు, పదవి చుట్టూ ఉన్న సామాజిక విలువలు, గౌరవం, ప్రతిష్ఠ గ్రహించారు కనుకనే మగవాణ్ణి పావుగా వాడుకొని, లౌక్యంగా ముందడుగు వేసి, మగవాణ్ణి పక్కకు నెట్టారు.

స్త్రీవాద, దళిత వాద ఉద్యమాలు ఊపందుకుంటున్న దశలో వెలువడిన పులికంటి రచనల్లో వ్యక్తిత్వం, తిరుగుబాటు, ప్రశ్నించే తత్త్వంతో చైతన్యవంతంగా మహిళలు .తలకొరివి., .సబ్బు., 'చిగుళ్ళు', కథల్లో పిడికెళ్ళెత్తారు.

ఉద్యోగ రీత్యా పరాయి ఊర్లో ఉన్న భర్తరాకపోకలు చుట్టపు చూపయ్యాయి. అదను చూసి మామ కాటేస్తాడు. వాస్తవాన్ని చెప్పినా భర్తనమ్మడు. ద్విపాత్రాభినయం చేయలేనంటూ, ఎదురు తిరిగి విడాకులు తీసుకొనింది. మరో గ్రామంలో పిల్లలకు చదువు చెప్తూ, సాంఘిక సేవాకార్యక్రమాల్లో పాల్గొని, తలలో నాలుకయింది.

తండ్రి కొడుక్కి రెండో పెళ్ళి చేశాడు. కాని పద్ధతి మార్చు కోలేదు. పసిగట్టిన కొడుకు తండ్రికి ఎప్పుడో పెట్టాల్సిన కొరివి ఇప్పుడే పెట్టి పశ్చాత్తాపంతో తిరిగి వచ్చాడు ఆమె దగ్గరకు. మీరు యిప్పుడు తండ్రికి తలకొరివి పెట్టే నేను ఎప్పుడో పెట్టేశాను దేనికి - మీ పురుషాహంకారానికి అని దెబ్బ కొట్టుంది. ఇది స్త్రీ వ్యక్తిత్వానికి విలువనివ్వని పురుష అహంభావులందరికీ భళ్ళున తగిలే చర్నాకోల!

ఈమె పురుషాంహకారాన్ని దెబ్బ కొడితే, అగ్రవర్ణాల అహంభావాన్ని అడ్డంగా నరికింది 'సబ్బు' కథలో యువతి. అగ్రకులస్థుడైన రమణ హరిజన యువతిని ప్రేమించి పెళ్ళాడ నిర్ణయించుకున్నాడు. అయితే ఒక సంఘటన రమణలోని వర్గభేదాన్ని స్పష్టం చేస్తుంది. ఊళ్ళోని యువకులు రమణ సబ్బుతో స్నానం చేస్తే, వాడ యువకులు ఆ నురగతో తృప్తిపడి, పుట్టమట్టితో స్నానం చేస్తారు. ఇది గమనించిన వరాలు రమణ నిర్ణయాన్ని విని ఈ సబ్బులు

ద మురికిని కడుగుతాయి. తరతరాలుగా మీమనస్సుల్లో ున మురికిని కడగటానికి వేరే సబ్బులు తయారయ్యే వరకు క వేళ ఆగినా ఆవేశంతో కూడుకొన్న మీ కోరిక ముందు, ఎన్ని అనర్థాలకు దారితీస్తుందో? ఆ పరిస్థితిని ఎదుర్కొని ల శక్తి నాకుంది గానీ - నీకే లేదు అని తిరస్కరిస్తుంది. ంధ్యలు లేకపోయినా సంఘంలో వర్ణ, వర్గ విభేదాల పట్ల న అవగాహన, రాబోయే పరిణామాలను అంచనా వేయగల జ్ఞానం, అగ్రవర్ణాల సంకుచితత్వాన్ని ప్రశ్నించగల గుండె ప్రేమను ప్రతిఘటించగల మానసిక స్థైర్యం కలిగిన దళిత యువతులందరికీ ఆదర్శం.

మసీమల్లో అగ్రవర్ణాలకు దళితులకు జరుగుతున్న ు వస్తువుగా పులికంటిగారు సృజించిన కథ 'చిగుళ్లు'. ల పెద్ద అత్యాచారానికి బలయింది దళితయువతి. ఎదుర్కో తండ్రి అప్పు చెల్లుబాటుతో సర్దుబాటయ్యాడు. ఎలక్షన్లలో ఓట్లు వేయించలేదని అప్పుతిరగబెట్టాడు పెద్దమనిషి. ఈ లికి చిలికి గాలివానయ్యింది. ఫలితం బాంబులతో అగ్రవర్ణాల దళితుల ఎదురుదాడి మారణహోమం జరగబోయే ంలో గ్రామకక్షల్లో భర్తను పోగొట్టుకొని పుట్టిల్లు చేరిన కూతురు స్త్రీ జనాన్ని సమీకరించుకొని వచ్చి ఇరువర్గాలు ంచుకొనేట్లు చేసింది. కులం మత్తులో కళ్ళు మూసుకుపోయి ండకు సిద్ధమయిన గ్రామస్థులు కళ్ళు తెరిపించిన సాంఘిక ఈ స్త్రీలలో ప్రజ్వలించింది. గ్రామ సీమల్లో కక్షలు, లతో ఒడిగట్టుతున్న మారణహోమాలు, రక్తపాతాలు అరికట్టడానికి మొలకెత్తిన 'చిగుళ్ళు' గా పల్లె పడుచులు పల్లవించారు.

పులికంటిగారి మరికొన్ని కథలు కూడా ఈ వర్గాల్లో ఇమడడానికి వీలున్నందువల్ల ప్రస్తావించలేదు. సమీక్షిస్తే - తల్లిదండ్రులకు అభిప్రాయానికి తలవంచే దశనుండి వివాహ విషయంలో స్వంత నిర్ణయాన్ని గైకొనింది. పురుషుని వంచనకు, స్వార్థానికి బలయినా, స్వంతకాళ్ళపై నిలబడింది. నైతిక విలువల ఉచ్చులో నష్టపోయింది. మధ్యతరగతి మహిళగా కుటుంబంలో చాకిరీకి, పిల్లల పెంపకానికి, భర్త ఆధిపత్యానికి తలవంచింది. వ్యక్తిత్వంతో పురుషాహంకారాన్ని ఎదిరించి, కుటుంబ పరిధి దాటింది. వితంతువుగా అభద్రతను, ఆర్థిక ఒడిదుడుకులను ఎదుర్కొనింది. పురుషుని ఆసరాను అందుకొనింది. పదుగురిలో పలుచన కాకుండా. తన స్థానాన్ని పటిష్టపరచుకోవడానికి ప్రయత్నించింది. దళితస్త్రీగా, వేశ్యగా ఉదాత్త గుణాలను, మాననీయ విలువలను సహృదయతను ప్రదర్శించింది. ఉన్నత-వర్గ స్త్రీగా స్వార్థం, పట్టణవాసిగా లౌక్యం ఒంటపట్టించు కొనింది. అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని నిరసించింది. సామాజిక వ్యవస్థలోని అంతరాలను ప్రశ్నించింది. సామాజిక శ్రేయస్సును ఆకాంక్షించింది.

రచయితగా కృష్ణారెడ్డిగారు సమాజంలో స్త్రీస్థితిగతులను .పులికంటి.తో దర్శించారు. తరతరాలుగా అణగారిన, పీడిత వర్గాలకు అండగా నిబద్ధతతో కలం కదిలించారు. సామాజిక వాస్తవ పరిస్థితులను, యథార్థ, వ్యథాభరిత జీవన దృశ్యాలను చిత్రీకరించడంలో కృతకృత్యులయ్యారు. మానవతావాదిగా పది కాలాలపాటు పదిలంగా నిలిచే సృజనాత్మక శక్తిగా నిరూపించు కున్నారు. ●


*S. Srinivasa Rao*
(*Sri. Sri.*)

Telephone : 73733
11, CANAL BANK ROAD,
MADRAS-28


Date 28. 6. 1973

శుభాకాంక్షలు

కథారచయితగా, గాయకుడుగా,
నటుడుగా, కవిగా ప్రసిద్ధి పొందిన
శ్రీ పులికంటి కృష్ణారెడ్డి గారి సన్మానం
జరుగుతున్న సందర్భంలో వారికి
[illegible] ప్రతిష్ఠ
లభించాలని హృదయపూర్వకంగా
ఆకాంక్షిస్తున్నా.

శ్రీశ్రీ

# బహుముఖ ప్రజ్ఞాశాలి పులికంటి

శ్రీ వై.సి.పి. వెంకటరెడ్డి

సిద్ధ తెలుగు కథా రచయితల కథల్ని సంకలనంగా ప్రచురించాలనుకొన్నాం. హిందీలో అనువదించి
''

నుంచి దీక్షా ప్రకాశన్‌వారు హిందీలో రాసిన ఉత్తరం సారాంశమిది.

ుగు రచయితల్ని, వారి కథల్ని హిందీ పాఠకులకు పరిచయం చేసే సదవకాసం కలిగిందుకు ఎగిరి లన్న ఆనందం కలిగింది.

ందమయితే కలిగింది కానీ ఐదో తరగతి అర్థాంతరంగా ఆపేసి చదువుకు సమాధి కట్టిన నాకు తెలుగు యితలెవరో ఎలా తెలుస్తుంది? ఎవరో చెబితే మధురాంతకం రాజారాంగారికి రాశాను. వారు రాసిన ో పులికంటి గారి పేరు ఉంది. పేరు చూసి లోగడ ఎప్పుడో నటరత్నాలు శీర్షికలో చదివిన కృష్ణారెడ్డిగారు వచ్చారు.

ు, నటుడు అన్న విషయమైతే తెలిసింది. కానీ ఉత్తరం ఏ అడ్రసుకు రాయాలి?

ులికంటి - తిరుపతి అంటేచాలు, ఆయనకు చేరుతుంది అన్నారు ఒక సలహాదారు. అనుమానంగానే అనుమాన మెందుకంటే? అంత పెద్ద పట్టణంలో ఇంటినెంబరు, వీధి పేరు లేకుంటే ఉత్తరం ందా? అని.

త్తరం చేరనూ చేరింది, ప్రత్యుత్తరంతో బాటు మూడు పుస్తకాలు రానూ వచ్చాయి. ఇలా జరిగింది ొదటి పరిచయం. రచనా రంగంలో అడుగు పెట్టారు. వారి మాటల్లో చెప్పాలంటే, అచ్చిరాన్ని న్నారు.

961లో ఆంధ్రపత్రికలో ప్రచురితమైన గూడుకోసం గువ్వలు వారి మొదటి కథ. 150 కథలు రాసిన ్గారు 14 కథలకు ప్రథమ బహుమతులను అందుకొన్నారు. 1971 నుండి ఆరేడు సంవత్సరాలు ు అనే పక్షపత్రికను నడిపారు. ఆగ్గిపుల్ల అన్న ఆయన నవలకు చక్రపాణి అవార్డు లభించింది.

ుటుంబ సంక్షేమం, వాతావరణ కాలుష్యం, పొదుపు ఇత్యాది సమస్యలపై బుర్రకథలు రచించి దాదాపు ్రదర్శనలిచ్చారు. ఆకాశవాణి బి-హై టాప్‌గ్రేడ్ ఆర్టిస్టుగా వివిధ ప్రక్రియల్లో 200 కార్యక్రమాలు దించారు. 6 సంగీత రూపకాలు రచించారు. రిపబ్లిక్ రోజున ఢిల్లీలో వీరు పాడిన పాడిందే పాట ుం 14 భారతీయ భాషల్లోకి అనువాదం కావడం పులికంటిగారి అనుపమ ప్రజ్ఞకు అద్దం పట్టింది.

992 నుంచి 1995 వరకు ఆకాశవాణి దూరదర్శన్‌లకు అడ్వయిజర్ ఎమిరిటస్ గాను, 1994 97 వరకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం బోర్డాఫ్ స్టడీస్‌లోని పెర్ఫామెన్సు ఆర్ట్స్ విభాగంలో గాను, 1988 నుంచి 91 వరకు కడప ఆకాశవాణి జానపద సంగీతానికి ఆడిషన్ కమిటీ మెంబరుగాను, చయితల సంఘం ఉపాధ్యక్షుని గాను వ్యవహరించారు.

ంధ్రప్రభ దినపత్రికలో 57 వారాలపాటు ధారావాహికంగా వెలువడిన నాలుగ్గాళ్ళ మండపం, శీర్షిక మాండలిక భాషలో సాగింది.

ను హిందీలో అనువదించిన 19 మంది తెలుగు రచయితల కథలు, తెలుగుకీ శ్రేష్ఠ కహానియా ుతో సంకలనంగా ప్రచురితమయ్యాయి. వాటిలో పులికంటిగారి 'దొంగగొడ్డు' చోటుచేసుకుంది.

దో ఒక రంగంలో రాటుదేలి రాణించడం సహజం. అలాగాక కథా రచయితగా, నటుడుగా, జానపద రుడుగా కవిగా, నాటిక రచయితగా, బుర్రకథ రచయితగా రాణించడం సామాన్యమైన విషయంకాదు. ే బహుముఖ ప్రజ్ఞాశాలి అన్నాను. ●



ప. గోదావరి జిల్లా భీమవరంలో రామరాజ
భూషణ పరిషత్ సన్మానితుడుగా....



ఉత్తరమెరికా మినరల్ వెల్స్‌లో
డా. బి. సుబ్రమణ్యంరెడ్డి యింటిలో
శ్రీమతి సుభాషిణి చేతి వంటకం సీమ సంకటి,
పుట్టగొడుగుల కూర చవిచూస్తూ...



కర్నూలు జిల్లా రచయితల
సభలో ప్రముఖ సాహితీ
విర్శకులు శ్రీ జి.వి.
సుబ్రమణ్యం (జి.వి.ఎస్)
చేతుల మీదుగ సన్మానాన్ని
స్వీకరిస్తూ.....








ప. గోదావరి జిల్లా భీమవరంలో
రామరాజ భూషణ పరిషత్తులో
నిర్వహించిన సన్మాన సభలో
ప్రసంగిస్తూ....



1985లో జాతీయ కవి
సమ్మేళనంలో పాల్గొన్న
సందర్భంగా ఆచార్య జి.యన్.
రెడ్డి, శ్రీ బాలశౌరి రెడ్డి ఆదిగా
గల పురప్రముఖుల నుండి
సన్మానము స్వీకరిస్తూ....



కృష్ణాజిల్లా నందిగామ
కాకాని వెంకటరత్నం
కళాశాలలో పాలకవర్గం నుండి
సన్మానం అందుకుంటూ....







ప్రముఖ న్యాయవ్యాధి
స్వాతంత్ర సమర యోధుడు -
కీ.శే. పైడి లక్ష్మయ్య గారి వర్ధంతి
సభలో వారి కుమారుడు
శ్రీ పి.ఎల్. సంజీవరెడ్డి చేతుల
మీదుగ సన్మానం స్వీకరిస్తూ.....




ప్రొద్దుటూరులో శ్రీ పూటుకూరు
వీరయ్యగారి శతాయుః
శాంతిహోమ మహోత్సవంలో
సత్కారాన్ని స్వీకరిస్తూ.....




అనపర్తి జి. బి. ఆర్. డిగ్రీ
కళాశాలలో "వెయ్యేళ్ళ తెలుగు
సాహిత్యం - సామాజిక
ప్రయోజనంపై ఏర్పాటు చేసిన
సభలో ప్రసంగిస్తూ..."



విజయవాడ ఆకాశవాణి
స్వర్ణోత్సవ సందర్భంగా
విశిష్ట సేవలందించినందులకు
మాజీ మంత్రి పర్వతనేని
ఉపేంద్ర నుండి సత్కారాన్ని
అందుకుంటూ....



నెల్లూరు కళాసుధ
దశమ వార్షికోత్సవంలో కార్యదర్శి
వైద్యుల శ్రీనివాసరావు నుండి
నటుడుగా సన్మానము
అందుకుంటూ...



ఆళ్ళగడ్డ లలితకళా సమితి
ఏర్పాటుచేసిన సభలో
సన్మానితుడుగా...



ఆకాశవాణి - కడప వారు
నిర్వహించిన దీపావళి
కవిసమ్మేళనంలో కవితా గానం
చేస్తూ....



భాకరాపేట - నారాయణ
రెసిడెన్షియల్ స్కూల్
నిర్వహించిన ఉగాది
కవి సమ్మేళనంలో
సన్మానితుడుగా...



గుంటూరు
వికాస్ విద్యాసంస్థలు మహానటులు
దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు
గ్రహీతలు డా॥ అక్కినేని
ముఖ్య అతిథిగా నిర్వహించిన
వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తూ...



కడప ఆకాశవాణి నిర్వహించిన
కవి సమ్మేళనంలో ప్రయోక్తగా.




సూర్యారావు పేట సాహితీ
మిత్రమండలి నిర్వహించిన
కవిసమ్మేళనానికి అధ్యక్షత
వహిస్తూ....



చిత్తూరు జిల్లా గ్యారం పల్లి
గురుకుల పాఠశాలలో
విద్యార్థులను ఆశీర్వదిస్తూ...



1992 సంవత్సరంలో

లక్షద్వీప్‌లో రచయితలు,

కళాకారులతో కలిసి, మెలిసి...




శ్రీ, వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

తెలుగు అధ్యయన శాఖ ఏర్పాటు

చేసిన కవి సమ్మేళనంలో కులపతి

ఆచార్య కొలకలూరి ఇనాక్ నుండి

సన్మానము గ్రహిస్తూ...



ఢిల్లీలో కళాప్రపూర్ణ

డా॥ దాశరథి అధ్యక్షతన

ఆంధ్రభవన్‌లో జరిగిన

కవిసమ్మేళనంలో

ఉత్పల సత్యనారాయణ

ఎం.ఎస్. రెడ్డి, నాగభైరవ,

ఎస్. రాజన్న, దేవీప్రియల

సరసన కవిగా....



తానా ఆహ్వానంపై అమెరికా వెళ్లినపుడు డా॥ కట్టమంచి ఉత్తమ రెడ్డి ఏర్పాటుచేసిన వనభోజనంలో వారి శ్రీమతితో కలిసి -




సరస్వతీ పుత్ర పద్మశ్రీ మహాకవి డా. పుట్టపర్తి నారాయణా చార్య ద్వితీయ వర్ధంతి సందర్భంగా పండిత పరిషత్తు బద్వేలులో నిర్వహించిన సభకు అధ్యక్షుడుగా...



చికాగోలో మిసిసిపి సరస్సు తీరాన...





డా. నీలం సంజీవరెడ్డిగారు భారత రాష్ట్రపతిగా ప్రప్రథమంగా తిరుపతికి విచ్చేసినపుడు విమానాశ్రయంలో స్వాగతిస్తూ....



ప్రముఖ వాగ్గేయ కారుడు శ్రీ బాలాంత్ర పురజనీకాంత రావు చేతులమీదుగా సన్మానం గ్రహిస్తూ...



కాకినాడలో ప్రముఖ సినీ నటుడు రావుగోపాలరావు సన్మాన సభలో ప్రసంగిస్తూ...





1978లో శ్రీమతి
ఇందిరా గాంధీ ఎన్నికల సభలో
ప్రసంగిస్తూ...



చిత్తూరు జిల్లా
బొమ్మ సముద్రంలో నిర్వహించిన
కవి సమ్మేళనంలో
ప్రముఖ న్యాయవాది
ఆర్.ఎస్. నరసింహరాజు నుండి
సన్మానం గ్రహిస్తూ...



ఆదోని ప్రభుత్వ కళాశాల
వార్షికోత్సవంలో ముఖ్య అతిథిగా
పాల్గొన్న అనంతరం అధ్యాపకులు
విద్యార్థులతో కలిసి....



ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖ పట్నం,
సుబ్బరామిరెడ్డి కళాపీఠం నిర్వహించిన
ఏకాదశ కవిరుద్రుల కవి సమ్మేళనంలో
పాల్గొని కులపతి
ఆచార్య కోనేరు రామకృష్ణా రావు నుండి
సన్మానం అందుకొంటూ...



కర్నూలు జిల్లా
బ్రాహ్మణ కొట్టుకూరు
ఉన్నత పాఠశాల నిర్వహించిన
శ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారి
జన్మదిన సందర్భంగా
ప్రసంగిస్తూ...



కడప ఆకాశవాణి
కవి సమ్మేళనంలో కవితాగానానికి
ఆహ్వానితుడుగా...





1973లో
శ్రీమాన్ శంకరం బాడి సుందరాచారి
నిర్వహించిన సన్మాన సభలో
డా. సి. నారాయణ రెడ్డి గారి నుండి
సన్మానం అందుకొంటూ...



చిత్తూరు జిల్లా కలెక్టర్
శ్రీ యం.యస్. రాజాజీ
తిరుపతిలో నిర్వహించిన
పారిశ్రామిక ప్రదర్శనలో
ఏర్పాటుచేసిన కవి సమ్మేళనంలో,
శంకరంబాడి, డా. దాశరథి,
బోయి భీమన్న మొదలగు కవుల
సరసన కవితాగానంచేసూ...



తెనాలిలో
మన విజ్ఞాన పరిషత్ వారిచే
జ్ఞాపిక అందుకొంటూ...



ఏలూరు ఎఫా
తృతీయ వార్షికోత్సవంలో
సినీ నటుడు మరళీ మోహన్
ముఖ్య అతిథిగా పాల్గొన్న
సందర్భంలో సన్మానితుడుగా.



ంగీత నాటక అకాడమీ కడపలో
ఏర్పాటుచేసిన మూడు రోజుల
నాటక సదస్సులో
కూర్మా వేణుగోపాల రావు గారి
ండి సన్మానం అందుకొంటూ...



కుప్పం ఉన్నత పాఠశాల
వార్షికోత్సవంలో ముఖ్య అతిథిగా
పాల్గొని ప్రధానోపాధ్యాయులు
శ్రీ పుల్లయ్యశర్మ సమక్షంలో
విద్యార్థులనుండి
జ్ఞాపిక అందుకొంటూ.





అనంతపురం లలిత కళా
పరిషత్తులో ప్రసంగిస్తూ...



చిత్తూరులో గ్రంథాలయ సంస్థ
నిర్వహించిన కవిసమ్మేళనంలో
శ్రీముంగర శంకరరాజు,
సి. వేణుతో కలసి
కవితాగానం చేస్తూ...



ఆత్మీయ మిత్రుడు నటుడు
ప్రయోక్త పి. రాధాకృష్ణమూర్తి
ఏర్పాటు చేసిన సన్మానసభలో....





అమర త్యాగి నాటికలో మహా
మంత్రి తిమ్మరుసుగా....



పఠాన్‌రుస్తుం
ఏకపాత్రాభినయ ప్రదర్శనలో....



బెంగుళూరు తెలుగు విజ్ఞాన సమితి ప్రముఖ సినీ నటి శారదకు మూడవ పర్యాయం ఊర్వశి అవార్డు వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని సన్మానించిన సభలో దుర్యోధనుడుగా ఏకపాత్రాభి నయనానంతరం.



చిత్తూరులో శారదాపీఠం (నిర్వాహకులు కె. సభా) నవమ వార్షికోత్సవ సందర్భంలో సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు ఆర్. బి. రామకృష్ణారావు చేతుల మీదుగా నటశేఖర బిరుదుతో సన్మానించిన సందర్భం....

మా ఊరు నాటక ప్రదర్శనలో ఒక సన్నివేశంలో





భీమాస్ హోటల్ ప్రారంభోత్సవంలో మాడభూషి అనంతశయనం అయ్యంగారి కోరికపై మయసభ దుర్యోధన ఏకపాత్రాభినయం పదర్శించి పి. యస్. గురవారెడ్డి చేతుల మీదుగా సన్మానాన్ని అందుకొంటూ....

# ఇదిమాత్రం దయచేసి చదవకండి!....

హితీ అమృతభాండాన్ని మథించేకొద్దీ అమృతకలశాలే కానీ హాలా హలం చిందదు. ఎందరో సాహితీ ఆంధ్రావని సమ్మోదం పొందే సాహితీ సుధాభాండాలు అందించారు. తమ కర్తవ్యం నిర్వర్తించినందుకు ారు. ఆ తృప్తి సంతృప్తి కాకపోవచ్చు కూడా!

ొందరు పద్యకావ్యాలు హృద్యంచేశారు. గద్యాన్ని అనవద్యంచేశారు. గేయాలతో కడగండ్ల గాయాలు ు. పాటల పూలతోటలు పెంచారు. నాటికల వనవాటికల దృశ్యమానం చేశారు. నాటకాలతో ాటలు తీర్చారు. కథలలో జీవన వ్యథలు ఎత్తిచూపించారు. నవలల్లో జీవితాలను వలవేసి పట్టారు. ో వాక్యవిన్యాసాలు పోయారు. పదాలతో వేదనానదాలు ప్రవహింపచేశారు. శ్రవ్యరూపకాలకు నవ్యతలు ్చారు. రేడియోలో తెలుగువాడి వేడిని వినిపించారు. దూరదర్శన్‌లో వ్యక్తిత్వాలకు రూపు కట్టించారు. ాలలో జూలు విదిల్చారు!

ఎందరో మహానుభావులు! అందరికీ వందనాలు!

అయితే దాదాపు అందరూ - తాము ఎన్నుకొన్న సాహితీ ప్రక్రియమార్గంలో పురోగమించారేకానీ సారవంతమైన ్రపంటలకు అందివస్తుందని ప్రయత్నించలేకపోయారు.!

కానీ కొందరు సాహితీ సృజనశీలురు మాత్రం ప్రయత్నించి అన్ని సాహితీ ప్రక్రియలను అలవోకగా నిర్వహించి ి అందించారు. బహుముఖ ప్రజ్ఞాశాలురుగా నిరూపించుకొన్నారు.

ఇది అరుదైన అంశాలలో మరీ అరుదైన అంశం.

ఈ వంశం పలికించిన సప్తస్వరాల వినూత్నరాగమే పులికంటి!

రంగుటద్దాల్లో ఈ మాటలు అతిశయోక్తులుగా తోచవచ్చు. కానీ మనసు కండ్లతో చూస్తే స్వభావోక్తులుగా ిరిపిస్తాయి!

ఈ మాట అనడానికి కూడా కారణం లేకపోలేదు.

"ఆ మధ్య మాటలమధ్యలో ఒకమిత్రుడు పులికంటి ప్రసక్తివస్తే - 'ఆ! ఏం రాస్తాడులే!' 'అన్నట్టుగా ిరిచాడు'. ఆయన రచనలు నువ్వేమి చదివావు?" అన్న ఎదురు ప్రశ్నకు పెదాలు తడుపుకొన్నాడు. ఇలా నే అభిప్రాయాలు ఏర్పరచుకొనే మహానుభావులూ ఉండవచ్చు!

అందుకే సప్తతి వరకు ఆయన సాధించి కొనసాగిస్తున్న వివిధ సాహితీ ప్రక్రియలలో ఒక కథ, కవిత, నాటిక, బుర్రకథ, సంగీత రూపకం, పద్యం, భావగీతం, అమ్మిపదం, మచ్చుకొకటిగా మీ చేతుల్లో ున్నాం.

చదవండి. లోతుగా ఆలోచించండి. సాహితీ ప్రస్థానంలో పులికంటి స్థానమేమిటో మీకుమీరుగా ంచుకొండి!

- డా. మన్నవ భాస్కరనాయుడు.

# మోసులు ఎండిపోతున్నాయ్...

ాధరం బావిగట్టున నిలబడ్డాడు.

కడుపులో విత్తును మొలకెత్తించడంలో కాయలు గాచిన తులు ఇప్పుడు నెత్తిమీదికొచ్చాయి. ముదురు మొగంలో కండ్లల్లో అగ్గి కురుస్తూ ఉంది. బక్కపలచని ఆకారంతో తా వేళాకోళమాడుతున్నదేమో అన్నట్లు మనిషి వెనక్కూ కూ ఊగిపోతున్నాడు. ఊగుతూనే బావిలోకి తొంగి చూస్తాడు. ిట్టూరుస్తాడు. నిట్టూరుస్తూ తల పైకెత్తి పొలంవైపు చూస్తాడు. త్తి నవనవలాడుతున్న చెరకుతోట. గాలి తాకిడికి ఉల్లాసంగా ఉంది. చూడగానే గుండెల్లో ఎక్కడో నిరాశ ములుకై ంది. 'ఇంకనేనేం చేసేదిరా దేవుడో?' అంటూ ఏడుస్తాడు.

డుపులకు రాళ్ళు కరగనట్లే .... ఏడుపులకు మేఘం '.

సీమలో అది ఏడుమట్ల బావి. ఎప్పుడో తాతముత్తాతల పుడమితల్లిని గడ్డ పారలతో తవ్వి తవ్వి ఎదురు తిరిగిన నాట్లుపెట్టి చీల్చిచెండాడి పాతాళగంగను పైకి తెచ్చే భగీరథ ంలో రూపులు దిద్దుకొన్నబావి. తనకు బుద్ధితెలిసిన డి ఆ బావి రెండుమూడేండ్లు వర్షాలు పడినా పడకున్నా దు.

గంగాధరం! నీకేమిరా? నీ పేరు బలంమీదనే నీకు డా అమరినట్లుండాది. మా బావులన్నీ అడుగంటి పొయ్‌నా లోమాత్రం నీళ్ళు తగ్గను తగ్గలేదు. అదురుష్టమంటే ్రా!" అని వీళ్ళూ వాళ్ళూ అంటూ ఉంటే అతడి గుండె ాయంత అయ్యేది.

కి చినుకు నేల రాలి మూడు నాలుగేండ్లు అయింది. ఎండిపోయాయి. వంకలూ, వాగులూ యిసుకతేలి ు. చెట్టూ చేమలు రెక్కలు తెగిన పక్షుల్లా విలవిల న్నాయి. మేఘాలు కానరాని దేశాలకు వలసపోతే ఆకాశం నట్లుంది. అయినా తన బావి మోసం చేయదని నమ్మి ఎకరాలు చెరకు నాటడానికి ఏర్పాట్లు చేసుకొంటున్నాడు.

డు ఎదురింటి ఏకాంబరం... 'గంగా! దేనికైనా మంచిది ఆలోచించుకోరా" అన్నాడు.

ఎవుర్రా మిమ్మల్ని వక్కాకుపెట్టి పిల్చింది. పాయాన్నాంతా పాలేజేసి ఉపాయాన్ని పట్టుకోని ఊగులాడే యదవ న్నారా నన్ను? నేనేందిరా ఆలోచించుకుండేది" అన్నట్లుగా పు విసిరాడు గంగాధరం.

ావుల్లో నిర్లక్ష్యం తొంగిచూస్తూ ఉంది.

గా! నీది ఏడుమట్లబాయి. మేము కాదనలా. ఎప్పుడూ ట్లా. నిజమే. అయితే పైగుడ్డ తడ్సే చినుకులు పడి ుందో నువ్వే చెప్పు. తాగే నీళ్ళకే తనకలాడ్తాఉండాం. ఇంక మూడెకరాల తోటకు తడిపడేదంటే మాట్లా? దేనికైనా మంచిది. బాగా ఆలోచించుకొని దిగు. కాదంటావా నీ యబ్బతోడు."

ఎదిరింటాయన మనసులో మాటకు ముసుగేయలేక పోయాడు. సమయాసందర్భాల్లో సాటి రైతుకు ఆమాత్రం కలగచేసుకొని చెప్పడం సహజమే. అయితే ఆ మాటలు గంగాధరం చెవికెక్కలేదు. తన ప్రయత్నంలో తానుంటే...

"నీపట్టే నీదికానీ బతుకంటే పట్టిడుపులు లేకపోతే ఎట్లా మామా? బాయిలో నీళ్ళు ఒకయిడుగోలుకుంటే ఇంగొక్క యిడుగోలుకు అడుగంటిపోతా ఉండాయి. చెరుకంటే ఈ చేత్తోనాటి ఆచేత్తో కోసుకుండే పంటకాకపాయ. ఏడాది పొడగనా తడి పడాల్సిందే గదా? ఇప్పిటికే అమ్మి పెండ్లికి చేసిన అప్పు తీరకుండా అల్లాడ్తా ఉండాం. ఇంక కయ్య అరువు చేసుకుండేదానికనీ... చెరుకు యిత్తనానికనీ... ఎరువులకనీ!......" అంటు ఇల్లాలు ఏకరువు పెడ్తూ ఉంటే ఆమె కండ్లు నిండుకున్నాయి.

అది గమనించిన గంగాధరం "చాల్సాలు. నిలుపే నీ దండకం. మొగోడు ఒక్కడుగు ముందుకు ఎయ్యాలంటే కొంపలో ఆడది ఏడడుగులు ఎనిక్కిలాగతాఉంటే యింకఎట్నే ఈ కొంప రతికెక్కేది? ఇప్పుడు మంచీ చెడ్డా వక్కాకుపెట్టి అడిగిన నా కొడుకు ఎవుడే నిన్ను" అంటూ ఇల్లాలి మీద విరుచుకుపడ్డాడు.

ఆడదిఅంటే అబలఅన్న అభిప్రాయం నరనరాల్లో జీర్ణించుకుపోయిన ఆ ఇల్లాలికాసాధింపులకు సమాధానం దొరకలేదు.

బావిలో నీటిమట్టం దినదినానికి తీసికట్టుగానే ఉంది.

అయినా గంగాధరం అధైర్యపడలేదు.

ఒక్కపూటంతా కరెంటు మోటార్ వెయ్యకుండా నిలిపితే ఒక్కమట్టుకు అటోయిటోగా నీళ్ళూరుతున్నాయి. అది గమనించిన గంగాధరం గుండెల్లో ఆశలు మోసులెత్తాయి.

ఆ నీళ్ళు తోడి తడవకు కొంత నేల తడిపాడు. తడిసిన నేల పదనుమీద ఉండగానే మడకలు కట్టి దున్ని దుక్కిచేస్తున్నాడు. ఇక్కడ దుక్కి దున్నుతూ ఉంటే అక్కడ బావిలో నీళ్ళూరు తున్నాయి. అలా ఊరిన నీళ్ళతో తడపగలిగినంత నేల తడుపుతున్నాడు. అది దుక్కి అయ్యేలోపల బావిలో ఊరగలిగినన్ని నీళ్ళు ఊరుతూనే ఉన్నాయి. ఇలా కొంతకొంతగా నేలను తడిపి దున్నుతూ వారాలు తిరగకముందే మూడు ఎకరాలు దుక్కిచేశాడు.

"ఇడుపు యిడుపుకూ ఈ మాత్రం నీళ్ళూరితే చాలు. ఆమిందట దేవుడ్తో అయినా పోట్లాడుకోవచ్చులే'. అని ధైర్యం తెచ్చుకున్నాడు గంగాధరం.

ఆ ధైర్యంతోనే అప్పో సప్పో చేశాడు. విత్తనం చెరకు కొన్నాడు. ఎరువులు కొన్నాడు. ఆ ఎరువును దుక్కిమీద పలచగా చల్లించాడు. తిరుగుచాలు తోలించాడు.

మాదిరి మెత్తంగా తీరింది దుక్కి.

ౖడు బోదెలు తోలి చెరకు నాటించాడు.

జునుండి యిల్లూవాకిలీ బావిగట్టే అయింది గంగాధరానికి. ట్టు మీద కూర్చుంటాడు. కండ్లల్లో ఆశలపూలు పూస్తుంటే ట్లే చూస్తుంటాడు. ఒక్కవిడుపుకు ఊరగలిగినన్ని నీళ్ళు లు. ఎగిరిగంతేసి మోటార్ వేస్తాడు. పారచేతపట్టుకుంటాడు. ునంత మేరకు తడివేస్తాడు. మళ్ళీ వచ్చి బావిగట్టున ంటాడు. బావి తట్టేచూస్తూ. అంతకుమించి తనకేమీ ట్టుగా!... తన పంచప్రాణాలు ఆ తోటే అయినట్టుగా!!

న చెరకు మొలకెత్తింది. మొలకెత్తిన చెరకు మోసులు వేసింది. ం వేసిన తోట గణుపెక్కి నవనవలాడుతూ గంగాధరం ్నల ఊహలకు ప్రాణం పోస్తూఉంది.

గిన ఆనందంతో రెప్పలిప్పకొని గంగాధరం గర్వంగా తోట స్తూ నిలబడతాడు.

ం''... యదవన్నర యదవలు. గెడ్డివామికాడ కుక్కలు. నన్నే ొక్కులు తొక్కించాలనుకున్నారు? నేనెటువంటోణ్ణి. ంటే ఉడుంపట్టేగదా? నిగిడి నిగిడి నీతులు చెప్పిన యిలు యిప్పుడు వచ్చి చూస్తే గదా తెల్సేది!!'' అని గంగా లోపల పొంగిపోతున్నాడు. కానీ పైకి పొక్కడంలేదు.

స్తూ చూస్తూ ఉండగానే చెరకు నాలుగైదు గణుపులు వేసింది. సొగసులు పోతున్నాయి. ఆకుపచ్చ రంగులో అంత గు కలిపి మూడెకరాల పొలంమీద కుప్పపోసి ఆ కుప్పను ట్టినట్టు చెరకు తోట నీలాలు పారుతూ కనులపండువుగా

డు ఆ దారిలో వస్తూపోతున్న వాళ్ళ కండ్లన్నీ ఆ తోటమీదే.

ాధరం అది గమనించాడు.

యాళకు ఎట్లుంటుందో ఏం పాడో? ఏ దిష్టికన్నయినా నా ందద పడ్తే....''

మానం ప్రాణసంకటం. గంగాధరం మనసు విలవిల . ప్రాణానికి ప్రాణంగా కాపాడుకొంటున్న తోట. సాగని ే బొట్లు బొట్లుగా చెమటను కలిపితే ఆ మాత్రం కంటికి ునిపిస్తున్నతోట. అమ్మో! ఏ పాపిష్టి కండ్లల్లో అయినా పడ్తే...?

ర్వాత గంగాధరం ఒక్క క్షణం ఆలస్యం చేయలేదు. ని తీసుకొన్నాడు. గుడ్డపేలికతో శుభ్రంగా తుడిచాడు. ఆ ా సున్నంపూత పూశాడు. ఆరిన తరువాత దాని మీద కుండా మసిబొట్లు పెట్టాడు. చెరకుతోటలో ఒక పొడవైన ంజను నాటి దిష్టి కుండను దానిమీద బోర్లించాడు.

నా చెరకుతోటకు దిష్టి కొట్టనే కొట్టింది.

డూ అడుగంటని బావి అడుగంటింది.

ంత ఆశను మూటగట్టుకొన్నగుండె ముక్కలైంది.

అందుకే ఆ బావిగట్టున నిలబడి అడుగంటిన బావిని చూస్తూ ''ఇంక నేనేం చేసేదిరా దేవుడో?'' అని నెత్తిమీద చేతులు పెట్టుకొని 'బోరో'మని ఏడుస్తున్నాడు.

ఆ ఏడుపును నిర్దాక్షిణ్యంగా కాకులూగద్దలు తన్నుకొని పోతున్నాయి.

బావిలో చుక్కనీళ్ళు రాలేదు.

చుక్కలు చుక్కలుగా కన్నీళ్ళు కార్చినా చుక్కనీళ్ళూరని బావిని.... మిసమిసలాడుతూ మింటిని చూస్తున్న తోటను మార్చి మార్చి చూస్తాడు. నిట్టూరుస్తాడు. .ఇంకనేనేమి చేసేదిరా దేవుడో?. అని గుండెలు బాదుకుంటాడు.

అప్పుడు గంగాధరం మనస్సులో ఒక వ్యక్తి మెదిలాడు. అతడికి వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది. బావిగట్టుమీద నుండి ఎగిరి కిందికి దూకాడు. నడక పరుగ్గా ఊరిముందర చింతచెట్టు కిందికి చేరాడు.

ఆ చింతచెట్టుకింద రెక్కలు ముడుచుకొని వొదిగిన కోడిపెట్టలా మూడు అంకణాల పూరిల్లు. ఆ కోడిపెట్ట రెక్కలకింద వొదిగిన పిల్లల్లా ఆ పూరింట్లో పిల్లలు. ఆ పిల్లలందరినీ కలిపితే వెరసి ఆ ఊరిబడిలో పిల్లలు. ఆ బడి పిల్లలకు అయిదు తరగతులకూ కలిసి ఒకే ఒక ఉపాధ్యాయుడు!

ఆ ఉపాధ్యాయుడికి తల్లిదండ్రి పెట్టిన పేరు వెంకటాచలం.

ప్రభుత్వం పెట్టిన పేరు సింగిల్ టీచర్!

అతనిది నిండునదిలాంటి గుండె. ఎదుటి మనిషి కష్టం తనకష్టంగా భావించే మనస్తత్వం. అందుకే పిల్లలకు చదువు చెప్పడం ఒక ఎత్తయితే ఊరి సమస్యలను తలకెత్తుకోవడం యింకొక ఎత్తుగా ప్రవర్తిస్తున్నాడు. ఎవరికి ఏ కష్టం కలిగినా 'అయ్యోరుండాడులే!' అన్న నమ్మకం పైరగాలి పాటగా గుండెగుండెను పరవశింపచేస్తూ ఉంది.

గంగాధరం చింత చెట్టుకిందికి చేరేటప్పటికి వెంకటాచలం ఒకటో తరగతి పిల్లలకు 'కల', 'వల' పదాలు నేర్పుతున్నాడు. గస పోసుకుంటూ బడిముందు నిలబడిన గంగాధరాన్ని గమనించాడు. చెబుతున్న పాఠాన్ని నిలిపి కుర్చీలోనుంచి లేచాడు. గబగబా గంగాధరం వద్దకు నడిచి, అతడి భుజంమీద చెయ్యేస్తూ .ఏం జరిగింది గంగాధరం?. అంటూ ఆతురతగా అడిగాడు.

గంగాధరం నోరు విప్పాలంటే గస. అంగుటికి అంటుకుపోయిన నాలుక. చెప్పాలన్న తాపత్రయం... చెప్పలేని నిస్సహాయతల మధ్య నలుగుతూ ఉనికినే పోగొట్టుకొన్న గొంతు!

వెంకటాచలం గ్రహించాడు.

''ఒరే గోపీ! కొంచెం నీళ్ళు తీసుకురారా!'' అన్నాడు.

''కుండలో నీళ్ళు ఖాళీ సార్!'' అంటూ బదులు.

భావిలో నీళ్ళులేవు. కుండలో నీళ్ళు లేవు. గంగాధరం గుండె మాత్రం కరిగినమేఘమైంది? కన్నీళ్ళ జొన్నగింజలు పలపల నేలరాలాయి.

ిటాచలం మనస్సు చివుక్కుమనింది.

ాడు గంగాధరం. కష్టాలు మనుషులకే వచ్చేది. ఆ కష్టాలను
ఎదుర్కోవాలే కాని యిలా దిగజారిపోతే ప్రయోజనం?
కష్టాలు తీరుతాయా? ఏం జరిగిందో చెప్పు. ఏమి చేయాలో
ాం."

ు ఆలోచించి మాత్రం యింక ఏం చెయ్యబోతాం
ా!.... నా బాయి ఎండిపొయనే."

ాడూ అడుగంటని బావి ఎండిపోయిందా."

ను! అయ్యోరా అవును!." అని చెప్పడానికి నోరాడక తనలో
కుములుతున్న గంగాధరాన్ని ఒక్క క్షణం రెప్పార్చకుండా

చూపుల్లో దీనత్వం... ఆ కండ్లలో కరుడుగట్టిన దీనాకృతి
ట నిలబడినట్లుంది. చిగురిస్తున్న బ్రతుకును చిచ్చు
ాడు నాలుగు సానుభూతి మాటలు పుండుమింద పూతలా
ుని వెంకటాచలానికి బాగాతెలుసు.

ే యింత బెంబేలు పడిపోతే ఎలా గంగాధరం?"
ున.

క ఏం చెయ్యమంటావ్ చెప్పు అయ్యోరా! ఒక్క దినమా?
ాలా? అయిదారు నెలలే. బాయికాడనే కాపరం పెట్టినే?
ప్పగా కాపాడుకుంటినే. 'ఉణ్ణిందీపాయ, ఉంచుకుణ్ణిందీ
న్నెట్టుగా బతుకు బయిశాట్ల పాలాయనే. అంతో యింతో
ణ్ణిందీ.... అడాయిడా చెయ్‌బొదులుగా తెచ్చుకుణ్ణిందీ...
ాయనే. బూడిదలో పోసిన పన్నీరైపాయనే. అయ్యోరా!
, రెండు మూడు నెలలు బాయి మోసం చెయ్యకుంటా
చేతికందినపైరు నోటికందునే? ఇప్పుడు నన్నేం చెయ్య
చెప్పు అయ్యోరా చెప్పు?"

న్నుకొస్తున్న ఏడుపును బిగపట్టుకోలేక పైగుడ్డ మడిచి నోట్లో
ని కుమికుమిలి ఏడుస్తున్నాడు గంగాధరం.

ాచలం గుండె కరిగి కనుకొనల్లో తొంగిచూసింది. అయినా
ంచుకున్నాడు గంగాధరం! నువ్వేమీ దిగురు పడద్దు. నీ
ేతికందుతుంది. నా మాట నమ్ము అన్నాడు, ఎంతో ధీమాగా.

ప్వ చెప్పేది మరీ యిచ్చిత్రంగా ఉండాదే? ఇంకకూడా నీ
మ్మమంటావా? బాయిలో నీళ్ళే లేకుండాబోతే యింక
చేతికొస్తింది? పలకమీద అచ్చిరాలు రాసి తుడపేసినంత
ా చెప్తావుండావే?" అన్నట్టుగా అయోమయంగా
ాడు గంగాధరం.

ివ్వాలన్న ఉబలాటం కెరటమై పెదాలను తాకితే వెంకటా

ాధరం! ప్రభుత్వం ఈ సీమ పరిస్థితిని గమనించి .ఇన్‌వెల్
కాన్ని ప్రవేశపెట్టింది. అంటే నీళ్ళు యింకిపోయిన బావుల్లో
ావులు వేయిస్తారు. అర్వై అడుగుల లోతు వరకు
ే వేస్తారు. అంతకు పైబడితే ఎంతో కొంత డబ్బు కట్టవలసి
వస్తుంది. నీదికి నీరు బావికదా? అర్వై అడుగుల లోపుగానే నీళ్ళు
పడతాయి. నీ పంట నీచేతి కందుతుంది. నువ్వేమీ దిగులుపడవద్దు."

"ఇదంతా అయ్యేపనేనంటావా అయ్యోరా!."

"ఎందుకు కాదు?."

అంత బాధలో కూడా వేదాంతిలా నవ్వాడు గంగాధరం.

"ఆ నవ్వులో నీ బాధ ... నీ సందేహం అర్థమవుతున్నాయి గంగాధరం. అరటి మొక్కకు నీళ్ళు పెడ్తే పక్క పక్కనే మోసులు వేస్తాయి. సందేహాన్ని సాగదీస్తూ కూర్చుంటే సవాలక్ష అవుతాయి. అది మంచిపద్ధతి కాదు. ఇప్పటి నీ పరిస్థితిని ఎవ్వరైనా అర్థంచేసుకుంటారు. అవసరమైన విధంగా ఆదుకుంటారు కూడా!"

"అయ్యోరా! నెమిలికంట్లో నీళ్ళు గార్తే వేటగాడికేమైనా ముద్దా? అందురూ నీ మాదిరి మంచోళ్ళే ఉంటారనుకుంటే అది నీ పిచ్చి. నా అనుబోగంలో చెప్తా ఉండా యిను. వాడు రైతు బిడ్డయినాసరే. పొయ్ ఆ కుర్చీ మింద కూసుణ్ణాడంటే వాడు ఎక్కణ్ణుంచి వచ్చిందీ మర్చిపోతాడు. రౌతై రైతు మిందనే సవారిచేస్తాడు.. తెల్లోడి ప్రెబుత్వంలో బతుకులు అట్ట తెల్లారిపోతే, ఇంక మనోళ్ళకత ఎట్టుండాదంటే? – మోసుల్లోనే చీడగొట్టేస్తా ఉండాది."

"నీ మాట నేను కాదనడంలేదు. అయితే అందరూ అలానే ఉంటారని ఆలోచించడం కూడా తప్పేగదా? కాబట్టి నువ్వు వెళ్ళి విలేజ్ అసిస్టెంటును కలువు. అతడి సహాయంతో రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ని చూడు. వీళ్ళిద్దరూ తలుచుకుంటే మండలాధికారి పని ఏముంది? సంతకం పెట్టేవరకే కదా! అప్పుడా కాగితాలను కలెక్టర్ ఆఫీసుకు కదిలిస్తే ఆ తర్వాత జరగవలసిన పనులు వాటంతటవే జరిగిపోతాయి. నీ బావిలో గొట్టంబావి పడుతుంది. నీ పంట నీచేతికందుతుంది. నువ్వేమి దిగులు పడద్దు. వెళ్ళు." అంటూ వెంకటాచలం గంగాధరం భుజం తట్టి వదిలాడు.

ఆ ఊపు మీద బయలుదేరాడు గంగాధరం. కాలికి బలపం కట్టుకొని తిరిగాడు. వల విసిరినట్టుగా విలేజ్ అసిస్టెంటును పట్టుకొన్నాడు. పట్టుబట్టి యింటికి పిలుచుకొనివచ్చాడు. కూతకొచ్చిన కోడిపుంజును కోశాడు. ఇల్లాలు కోడిమాంసంతో విందుభోజనం తయారుచేస్తుంటే గంగాధరం మనిషిని పంపించి మందు తెప్పించాడు. కొసిరి కొసిరి తాగించాడు.

విలేజ్ అసిస్టెంటు యింటల్లుడి హోదాలో విందుభోజనం ఆరగించాడు. నడవలో నులకమంచం మీద నడుం వాల్చాడు. .గుర్ గుర్.మన్న శబ్దంతో గంగాధరం యింటిని గంటసేపు పైగా పావనం చేసిన తర్వాత బద్ధకంగా లేచాడు. చల్లబడిన ముఖాన్ని వేడి నీళ్ళతో కడుక్కున్నాడు. ఆ యింటి యిల్లాలు ఎంతో వినయంగా అందించిన లోటా కాఫీ నంజి నంజి తాగాడు.

అంత పని జరిగితే కానీ జేబులో కలానికి చలనం రాలేదు.

విలేజ్ అసిస్టెంట్ చేతికి కలం రాగానే తన బావిలో గొట్టంబావి పడినంత సంబరపడ్డాడు గంగాధరం.

దరఖాస్తు ఫారంలో రాతకోతలు పూర్తిఅయ్యాయి.

ి రూపాయల్లో మందుకు, విందుకు పోగా మిగిలింది విలేజ్
ు జేబులో చేరి చెమటలోనుంచి పుట్టిన తడిని తుడుచు

ు చాలా మంచివాడు. 'నా పని నేను చేశాను. ఇంక నీతల
ువ్వు పడుకో!' అని గంగాధరాన్ని విడిచిపెట్టలేదు. వెంట
్నాడు. రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ని దర్శించాడు. అప్పో సప్పో చేసి
కు తగిన ముడుపులు చెల్లించిన తర్వాతే దర్శనం దొరికింది.
ేరవలసినది వాళ్ళకు చేరాకనే, దరఖాస్తు ఫారం మండల
యానికి చేరింది.

ంతా జరిగేటప్పటికి రెండు వారాలు పట్టింది. గంగాధరం
వీళ్ళందరి చుట్టూ తిరుగుతున్నాడే కాని రెండు వారాలు
ూయన్న సంగతే గమనించలేదు. అప్పటికే చెరకుతోట
వాడు పుట్టింది. అయినా గంగాధరం అధైర్యపడలేదు.
ాధికారి తన పరిస్థితిని గమనిస్తాడనీ, జిల్లా అధికారులు
ీసుకుంటారని... ఎకాఎకిన బయలుదేరి వస్తారనీ...
యిన బావిలో గొట్టంబాయి వేయిస్తాడనీ తన పంట
ుతుందనీ పగటి కలలు కంటూనే ఉన్నాడు.

ిలో ఎన్జీవోలు మెరుపు సమ్మె ప్రకటించారు.

ాధరం గతి అగాథంలో దిక్కుతోచని స్థితిలో! కాలూ చెయ్యి
. నడుములు విరిగాయి. నెత్తిన చేతులు పెట్టుకొని బావి
ప్పగా కూలబడ్డాడు.

్పన మాట యినకుండా చెవులకు చెప్పులడిగే వాళ్ళ గెతంతా
గంగాధరం."

ాళ్ళసందున తలపెట్టి తనలో తాను కుమిలిపోతున్న
ం ఒక్కసారి తల పైకెత్తాడు.

రుగా ఎదిరింటి ఏకాంబరం. అదొక విధంగా చూస్తూ
విధంగా నవ్వుతున్నాడు. పుండుమీద కారం చల్లినట్లయింది.
గ్గుమని మండినట్లయింది. ఒక్క ఊపులో పైకిలేచాడు.

ఏకాంబరం! ఈ మణుసులుండారే? ఉత్త పనికిమాలిన
ా! బతకతా ఉంటే చూడలేరు. చెడిపోతే చేరదీరు. నా
నేను చస్తా ఉండా. నడిమిద్దె నిన్నెవర్రా పిల్చింది." అన్నట్లుగా
ు చూశాడు. గిరుక్కున వెనక్కు తిరిగి పరుగందుకున్నాడు.

ికి కచ్చితంగా పిచ్చి పట్టేది మాత్రం కాయం" అని
ం విరగబడి నవ్వుతున్నాడు.

ాధరం ఆ పరుగుమీదనే మండల కార్యాలయంలో అడుగు
లోకంలో దైన్యాన్నంతా ముఖానికి వేలాడకట్టుకొని.

ండల కార్యాలయం నిండు ముత్తైదు తాళి తెంచేసి తెల్లకోక
్టుగా బోసిగాఉంది. ఆ పరిస్థితికి పరితపిస్తున్నట్లుగా
ధికారి ఒక కుర్చీలో కూలబడ్డాడు దిక్కుతోచకుండా. ఏదో
ప్రపంచంలో అడుగుపెట్టినట్లు దిక్కులు చూస్తూ
ద అడుగ్గా గంగాధరం ఆ గదిలో పిల్లితో పోటీపడ్డాడు.

చేతికి పనిలేదని ఒకరు.... చేసిన శ్రమఫలితం చేతికి అందకుండా పోతున్నదనే బాధలో యింకొకరు. ఆ దిక్కులేని కార్యాలయంలో కలుసుకోవడం ఒక అపూర్వసంఘటన. దాదాపు ఏడుస్తున్నట్లుగా గంగాధరం వినిపించిన తన దీన పరిస్థితిని సిగరెట్టు మీద సిగరెట్టును ఒకపట్టు పట్టిస్తూ ఓపిగ్గా వినడం మరీ ఆశ్చర్యం. ఆ తర్వాత కాలుతున్న సిగరెట్టును వదిలిపెట్టి అన్నాడాయన.

"అష్టకష్టాలుపడి అయిదునెలలు కంటికి రెప్పలా కాపాడావా? ఎప్పుడూ ఎండిపోని బావి ఎండిపోయిందా? మూడెకరాల చెరకుతోట మోసుల్లో వాడు పుట్టిందా? అయ్యయ్యో! రైతన్నకు రారాని కష్టం వచ్చి పడిందే. ఆ తోటను చూస్తుంటే నీకు కాదు ఆ మాట వింటూ ఉంటే నాకే నిజంగా కడుపు తరుక్కొనిపోతూ ఉంది? అయినా నన్నేంచెయ్యమంటావ్ చెప్పు? నాపని ఎంతవరకు రెకమెండ్ చేసి కలెక్టర్ ఆఫీసుకు పంపేవరకే కదా? ఆ ఫైలే నీ చేతికిచ్చేస్తా. ఏం ప్రయోజనం? చూస్తున్నావ్ గదా? యిక్కడ ఈ ఆఫీసు ఎలా పాడుగొట్టుకుంటూ ఉందో అక్కడ కలెక్టర్ ఆఫీస్‌కూడా అలాగే ఏడుస్తూ ఉంటుంది" అంటూ ఏడుస్తూ రైకముడి విప్పినంతపని చేశాడు మండలాధికారి.

"అదీ నిజమే గదా?" అనుకుంటూ ఆ ఆఫీసులో నిలబడిన గంగాధరానికి దిక్కుతోచలేదు. అందుకే తల వంచాడు. వంచిన తలెత్తకుండా నడుస్తున్నాడు. నడుస్తున్న దారి కనిపించడంలేదు. ఈ పొద్దో రేపో పడుకుంటే పైకి లేవలేని దాపటెద్దు దైన్యంగా కనిపిస్తూ ఉంది. ఇరుసు విరిగి చింతమాని కింతపడి చెదలు పడుతున్న రెండెద్దుల బండి కనిపిస్తూ ఉంది. చాలీ చాలని నీళ్ళను నమ్ముకొని చెరుకెందుకేస్తావే అని హెచ్చరించిన యిల్లాలు కనిపిస్తూఉంది.

అన్నిటినీ పక్కకు పెట్టి గంగాధరం నేరుగా చింతమాని కిందికే నడిచాడు. వెంకటాచలం ముందు తలవంచాడు తిరిగి తిరిగి అరిగిపోయిన పాదాల పలకలమీద మొలకెత్తిన బాధల అక్షరాల్ని చదువుకోమన్నట్లుగా కాసేపు నిశ్శబ్దం కమ్ముకొనింది. వెంకటాచలం గుండె నీరయింది.

"గంగాధరం! నీ బాధ నాకు తెలుసు. అయినా ఏం చేస్తాం చెప్పు? నువ్వు చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశావు. చేస్తున్నావు. కలిసి రానపుడు ఎవరు మాత్రం ఏం చేస్తారు? అయినా ఈ సమ్మె ఎంతకాలమని కొనసాగుతుంది? యంత్రాంగం లేకుండా ప్రభుత్వం నడవదు. జీతాలు అందకపోతే ఉద్యోగులకు పూట గడవదు. సంప్రదింపులు జరుగుతున్నాయి. ఏదో ఒక విధంగా వొడంబడిక కుదురుతుంది. సమ్మె త్వరలో ముగుస్తుంది. నీ ప్రయత్నం తప్పకుండా నెరవేరుతుంది" అని వెంకటాచలం ధైర్యం చెబుతాడు.

వింటున్నంతసేపూ మనసు బాగానే ఉంటుంది. కొంత కుదుటపడుతుంది కూడా. కానీ మోసులు ఎండిపోతున్న చెరకుతోట కండ్లముందు మెదిల్తే గుండెమైదానంలో నైరాశ్యం ముండ్ల జెముడు నాల్కలు చాస్తుంది. అయినా ఏం చేస్తాడు?

నిద్రలేచీ లేవడంతో కండ్లు నులుముకుంటూ వెళ్ళేది. మోసుల్లో మొదలుపెట్టి కొంచెం కొంచెంగా ఎండిపోతున్న చెరకు తోటను చూడలేక గిరక్కున వెనక్కు తిరిగేది. వంచిన తలెత్తకుండా చింతమాని కిందికి వెళ్ళేది. "ఈ పొద్దో రేపో తేలిపోయేటట్టుగా ఉంది గంగాధరం.

టాచలం అంటే చెవులు వాలేసుకొని యింటి ముఖం పట్టేది
ం" దినచర్య అయింది.

చేతిలో అయినా దినపత్రిక కనిపిస్తే చాలు. గంగాధరం
గ్గరికి పరుగులమీద పోతాడు. "అయ్యా! అయ్యా! సమ్మె
ందయ్యా?" అని అడుగుతాడు.

్వడిప్పుడే అదేమీ తేలేటట్టుగా లేదే?" అని అంటే ఆ మాట
ుసం కరిగించిపోసినట్లు!

ానిస్పృహలు తన జీవితానికి తారాస్థాయి సంగీతమైతే
ానికి కాలం నిలిచిపోయినట్లనిపిస్తుంది. కానీ కాలం ఒక
ులం. దినాలు గడిచాయి. వారాలు గడిచాయి. నెల
చెరకుతోటలో మోసులు ఎండిపోతున్నాయి. సమ్మె ఒక
వచ్చే మార్గమే కనిపించలేదు. గంగాధరం సజీవంగా
ుతున్న ఆశలకు సమాధి కట్టాడు. తిండీ తిప్పలు మాని
ముసుగుదన్ని పడుకున్నాడు.

్రానికి యిద్దరుచస్తే ఏడవలేక ముగ్గురు చచ్చినట్టుండాదే
ం. ఇట్టవుతుందని ముందుగా నీకేమన్నా వాసనగొట్టిందా?
ందంతా చేస్తివిగదా? చెయ్యి జారి పోతే ఎవురు మాత్రం
రు? పోనీ, ఎల్లకాలం యిట్లానే ఉండబోతిందా? వానలు
ండాబోతాయా? ఈ పంటపోతేపోయింది. ఇంకొక పంట
ందకుండాపోతిందా? తిండీ నీళ్ళు లేకుండా నువ్విట్టా
దన్ని పొణుకుంటే మొదిటికే మోసమైపోతే మల్లా నాగతేం
దేవుడో?" అంటూ యిల్లాలు నెత్తీ నోరూ మొత్తుకున్నా
 చీమ కుట్టినట్లనిపించలేదు.

ఎర్రికి నేనేడపాయ్ తెచ్చేది మొందు. ఇంక ఆ అయ్యోరే
యింటామె యిల్లూ వాకిలీ ఒకటయ్యేట్టు ఏడుస్తూ ఉంటే
్మముగిసిందయ్యా! గంగాధరం!" అంటూ వెంకటాచలమే
ాన్ని వెదుక్కొంటూ వచ్చాడు.

ుడి లేచాడు గంగాధరం. "అయ్యోరా! యింకొక జల్మలో
నీ కడుపున పుట్టి రుణం తీరస్తాలే". అంటూ పరుగందు
ఆ పరుగు పరుగు మండల కార్యాలయంలో అడుగు
 ఆగింది.

ుతే అక్కడ పరిస్థితి గమనించి కొయ్యబారిపోయాడు.

ఫీసులో పనిచేస్తున్న ఏడెనిమిది మంది ఎన్జీవోలు. రెండు
 చీలారు. వాళ్ళల్లోవాళ్ళు వాదులాడుకుంటున్నారు.
ుగా మూతపడిన ఆఫీసు మీద పడుతున్న వాళ్ళను వాళ్ళు
కోవడమేలేదు. గంగాధరం నేరుగా మండలాధికారి
్ళుడు తొలిపరిచయాన్ని నెమరేసుకుంటూ.

ం కొంచెంగా గంగాధరం గుండెలా కాలుతున్న సిగరెట్టు
ుడుకుంటున్నాడు మండలాధికారి. గంగాధరం గదిలో
ట్టడంతో ఆ ఆటకు భంగం కలిగినట్లుంది. మనసులో పుట్టిన
ుమంగా పైకి పాకి మొఖంలో చోటు చేసుకొంది. గంగాధరం
 గమనించే స్థితిలో లేడు. మండలాధికారిని చూస్తూనే
రెండుచేతులెత్తి నమస్కరించాడు. ఆ చేతులను దించి కట్టుకున్నాడు.
వొదిగి వొదిగి నిలబడ్డాడు.

"ఎవరునువ్వు? ఎందుకు నా గదిలో అడుగుపెట్టావ్?" అన్నట్లుగా అధికారదర్పం అదే తన పద్ధతి అన్నట్లుగా ఒక్కచూపు విసిరింది.

గంగాధరం నీరుకారిపోయాడు. ఎప్పుడో రెండురోజులక్రిందట యింటి యిల్లాలు పట్టుబలవంతంగా పెట్టిన అరముద్ద సంకటి... పేగులు అరుస్తున్నాయి. పెదావలు తడారి పిడచగట్టుకుపోతున్నాయి. చిరకాలం జబ్బుపడిన మనిషి మాట్లాడడానికి ప్రయత్నించినట్లుగా "అడుగంటినబాయి... ఎండిపోతున్న చెరుకు తోట... బాయిలో గొట్టం బాయి" అంటూ గొణిగాడు.

ఆ గొణుగుడు విని ఆ గది ప్రతిధ్వనించేటట్లుగా నవ్వాడు మండలాధికారి. నవ్వి నవ్వి ఆ నవ్వునుఆపుకోవడానికి గట్టి ప్రయత్నమే చేశాడు. అప్పుడు ఒక మహావేదాంతిలా.

"ఒరే పిచ్చోడా! ఈ లోకంలో ఎవరి పిచ్చి వాళ్ళకానందం - నీ పిచ్చి నీకు ఆనందమయినట్లు. అవునా కాదా చెప్పు. అవును కాబట్టే ఎన్జీవోల్లో ఒక వర్గం డ్యూటీలో చేరాలని.. యింకొక వర్గం తమ నాయకులద్వారా ఏదో తీరని అన్యాయం జరిగిపోయింది. కాబట్టి డ్యూటీలో చేరకూడదని వాదులాడు కుంటున్నారు. వాళ్ళ గోడు వాళ్ళది. నీ గోడు నీది. అవునా? అయితే వినే వాళ్ళెవరు? కాబట్టి ఈ ఒక్కపూట వాయిదా వేసుకో. రేపు రా చూద్దాం" అంటూ మండలాధికారి సిగరెట్టు పొగ వలయాలు వలయాలుగా వదులుతూ అందులో కనిపించని అందాలు వెదుక్కొంటున్నాడు.

"ఫైల్‌చేతికే యిస్తానన్న పెద్దమనిషి యితడేనా?" అని ఆశ్చర్యపడ్తూ గంగాధరం అటు ఇటూ కదలలేక నిలబడ్డాడు. అధికారిని రెప్పార్చకుండా చూస్తూ.

"ఏమిటాచూపు? ఎందుకలా నిలబడ్డావ్? చెప్పింది అర్థం కాలేదా? పోనీ... ఏ భాషలో చెప్పమంటావో చెప్పు".

మండలాధికారి ఎకసెక్కం. ఏడు బండ్లకెత్తినా ఇంకా కొంత మిగులుతుందేమో?

తిరగబడితే పిల్లికూడా పులి అవుతుంది. గంగాధరానికి కోపం వచ్చింది. అయితే ఫలితాన్ని సాధించలేని కోపం నిష్ప్రయోజనమని అతడికి తెలుసు. అందుకే పరుగుల మీద వచ్చినవాడు అడుగుమీద అడుగ్గా అడుగుకొక్క ఆలోచనగా యిల్లు చేరాడు.

అడుగంటిన బావిని... మోసులు ఎండిపోతున్న చెరకుతోటను మార్చి మార్చి చూస్తూ బావిగట్టున కూర్చున్న గంగాధరం ఆ రోజు పొద్దును చూస్తున్నాడు. ఆపొద్దు ఎప్పుడు పోతుందో.. పోయిన పొద్దు ఎప్పుడు మొలుస్తుందో అని!

ఆ మరుసటిరోజు పొద్దుతో పోటీపడ్తూ బయలుదేరి మండలా ఫీసుకు చేరాడు.

ోజు ఎన్జీవోలు డ్యూటీలో చేరారు. విషాదం మబ్బుకమ్మిన
రం కండ్లు ఒక్కసారిగా కాంతవంతమయ్యాయి. అయితే ఆ
తా నెలరోజులుగా దుమ్మునిండిన కుర్చీలను మేజాలను
ల్లో ఫైళ్ళను దుమ్ముదులిపే కార్యక్రమానికే పరిమితమయ్యారు
.

ాధరం అదేమీ పట్టించుకోలేదు. "అయ్యా మూడెకరాల
ోట... మోసులు .. ఎండిపోతా ఉండాయి. బాయి
టిపొయ్యింది... ఆ బాయిలో గొట్టం బాయి!"

ాపు ఏడుస్తున్నట్లుగా ఆఫీసులో నిలబడి చేతులెత్తి దండం

దుమ్మయినా దులుపుకోనిస్తారా లేదా మమ్మల్ని? అప్పుడే
ంపతెంచేదానికి తయారయ్యారే! ఇప్పుడేం కొంపలు
ోతున్నాయి?" అని అంటూ అందరూ కలిసి గంగాధరాన్ని
దుమ్ము దులిపారు.

ుబ్బతో గంగాధరం తల దిమ్మతిరిగింది.

నిజమే గదా! ఒకడి తొందర యింకొకడికి బాధే గదా?..
ోచించగా ఆలోచించగా గంగాధరానికి తెలివివచ్చింది. ఆ
రోజుకు తనకు తానుగా వాయిదా వేసుకున్నాడు. ఇల్లు

జు గడవడం గండం గడిచి పిండం బయటపడినంతపని
ి.

ాత్రి యిల్లాలు శత పోరితే అంత ఎంగిలిపడ్డాడు. నడవలో
ంచం మీద నడుం వాల్చాడు. మానసికంగా శారీరకంగా
శరీరం. నిద్రలోకి జారుకొంది. ఆ నిద్రలో కల.......
ాధికారి సంతకంచేసి ఫైల్ తన చేతికే యిచ్చినట్లు.....
మీద తాను కలెక్టర్ ఆఫీసుకువెళ్ళి ఆ ఫైలును అందజేసినట్లు
ాకాఏకిని బయలుదేరి వచ్చి బావిలో బోర్ వేస్తున్నట్లు.

రింది. గంగాధరం చాలా తెంపుగా నిద్రలేచాడు. స్నానం
నట్టింట దేవుడికి పూజా పునస్కారాలు చేశాడు. ముత్తైదు
ఎదురుగా రమ్మని తానే చెప్పి మంచి శకునమనుకొంటూ
ఫీసుకు బయలుదేరాడు.

ఆఫీసులో ఒక గుమస్తా కుర్చీనిండుగా కూర్చున్నాడు.
లో ఎక్కడో పెట్టిన సందేహానికి సమాధానం చెప్పాలని
ో వెదుక్కుంటున్నాడు. గంగాధరం అతడికి చేతులెత్తి దండం
గోడు వినిపించాడు. అతడు కూడా పాపం! గంగాధరం
ందా శ్రద్ధగా విన్నాడు. విని, ఇంకొక కుర్చీ చూపించాడు.

అది ఖాళీ కుర్చీ.... ఆ కుర్చీని గంగాధరం దేబెరించి చూస్తూ ఉంటే –

"పో పో! ఆ కుర్చీదగ్గర నిలబడు. ఆ కుర్చీలో కూర్చొనే గుమస్తా వస్తాడు. నాతో చెప్పినట్లు అతడికి చెప్పు" అని చాలా నెమ్మదిగా చెప్పాడా గుమాస్తా.

గంగాధరం ఆ కుర్చీదగ్గరికి వెళ్ళాడు. ఆ కుర్చీపక్కన చేతులు కట్టుకొని నిలబడ్డాడు. నిలబడి ఆఫీసువాకిలిని ఖాళీ కుర్చీని మార్చి మార్చి చూస్తూఉంటే ఆ గుమస్తా రానే వచ్చాడు. తనకు స్వాగతం పలకడానికన్నట్లుగా నిలబడి వున్న గంగాధరాన్ని ఎగాదిగా చూశాడు. నొసలు చిట్లించాడు. చూపుల్తో ఈసడిస్తూ తల ఎగరేశాడు. దర్జాగా కుర్చీలో కూర్చున్నాడు. నములుతున్న కిళ్ళీని నాలుకతో ఒక దవడ పక్కకు నెట్టుకొని "నీ ఏడుపేదో ఏడువు" అన్నాడు.

గంగాధరం నిజంగానే ఏడ్చాడు.

"రైతు సోదరా! మీరు దేశానికి వెన్నెముకలని ప్రభుత్వం చెప్తా ఉంది. అంటే ఒక శరీరంలో వెన్నెముక ఎంత ముఖ్యమో ఒక ప్రభుత్వానికి మీరూ అంత ముఖ్యమన్న మాట. అటువంటి మీరు ఎన్నుకొన్న ప్రభుత్వం ఏమని చెప్తున్నదంటే- సమ్మెకాలంలో మీరు పనిచేయలేదు. కాబట్టి మీకు జీతాలు యివ్వం" అంటున్నది. "జీతాలు ఇవ్వనప్పుడు మేమెందుకు పనిచేయాలి. అని మేమంటున్నాం. న్యాయం అవునా? కాదా? నువ్వే చెప్పు. నువ్వు రైతువి. ఒక కూలోణ్ణి పెట్టుకుంటావ్. కూలిస్తేనే కదా వాడు పనిచేస్తాడు. అవునా? కాదా? అవును కాబట్టి న్యాయం కూడా అదే కాబట్టి, యిప్పుడు నువ్వేం చేయాలంటే వెంటనే నీ తోటి రైతు సోదరులను కూడగట్టుకోవాలి. వెళ్ళి ప్రభుత్వంతో చెప్పాలి. అవసరమైతే ధర్నాలు చెయ్యాలి. అక్కడికీ లొంగకపోతే ఆత్మహత్యలు చేసుకుంటామని బెదిరించాలి. అలా చేసి మా సమ్మెకాలం జీతాలు మా కిప్పించండి. మీ పనులు మేం తలకెత్తుకొని చేస్తాం. ఇదంతా అయ్యేపని కాదంటావా? అయితే ఇంతకుముందు పెట్టిన అప్లికేషన్ కత మరచిపో. కొత్త అప్లికేషన్ పెట్టుకో!."

ఆ మాట విన్న గంగాధరం నడుములు విరిగాయి!

"మల్లా కొత్త అప్లికేషనా! అయ్యోరా సమ్మె ముగిసిందంటివే? ముగిసిపొయ్యిందా? మొదులయ్యిందా? చెప్పుఅయ్యోరా! చెప్పు!" మనోళ్ళనుకుంటే మోసుల్లోనే చీడపట్టిందంటే లేదంటివే? చెప్పు అయ్యోరా చెప్పు!. అని గొంతెత్తి అరవాలనుకున్నాడు. కానీ ఎండిన గొంతులోనుండి మాట వెలువడ్డంలేదు.

ఆ స్థితిలో గంగాధరానికి ఆత్మహత్యే శరణ్యం.

అయితే అతడు రాయలసీమలో రైతు!! ●

(విపుల, నవంబర్ 1998)

# చెమట చిరునామా

దిగులు పడవద్దన్నా రైతన్నా
నువ్వు ధీమాగా బతకాల ఓరన్నా!
కోటివిద్దెలెల్ల కొంద్రకేలోపనీ
లోకులకు తెలుసన్నా రైతన్నా
అయినా మట్టిలో పురుగను వాదునేవదిలిపెట్టి
మేడిపట్టి లోకాన్ని మేపేటి మొనగాడా
దిగులు పడవద్దన్నా రైతన్నా!

మాటను మంత్రం చేసి నియంత్రించలేకున్నా
మట్టిని నిట్టూర్పుల్లో మంచి చేసుకుంటావు
సాగని కాలువనే కన్నీటితో సాగిస్తావ్
పుడమితల్లి వొళ్లంతా పులకరింపచేస్తావ్
అరముద్ద సంకటితో ఆకల గుప్పిటపట్టి
పప్పన్నమే మాకు పెట్టే పరమాత్ముడివి
దిగులు పడవద్దన్నా రైతన్నా!

మట్టి తిని బతికేటి మనిషి లేడు లోకాన
మట్టినె మాకందిస్తావ్ మార్చి బువ్వరూపాన
పెట్టే దిక్కు నువ్వయితే పెట్టువాడు దేవుడని
పిచ్చోళ్ళు నమ్ముతుంటె గుండె గిచ్చినట్లుంది
దిగులు పడవద్దన్నా రైతన్నా!

కలం పట్టిన పోతన్న హలం గూడ పట్టెనంట
హలం పట్టిన కవిగూడ అందరి మాదిరిగానే
నీ కతలూ విడిచిపెట్టి హరికతలూ రాసుకుండె
కడుపు నింపలేని కతలు కలంనేసిన ఎండమావులు
దిగులు పడవద్దన్నా రైతన్నా!

కాడెద్దులు వొకడికీ కంకికొడవలొకడికీ
నాగలియింకొక్కడికీ ఆవుదుడ వేరొకడికి
గుడిసె గుర్తు వొక్కడికీ గుర్తులు గా యిచ్చేసి
గుర్తింపుకు నోచుకోక గొంతెత్తీ అరవలేక
సంఘటిత శక్తిని సమీకరించు యుక్తి లేక
చేతులు రెండు ముడుచుకొని చింతపడిపోతుంటే
ఆ చెయ్యి గూడ యింకొక్కడు చెప్పకుండా పెరుక్కుంటే
ఏమి చేత మిగలనోడు ఎట్టబతక పోతాడని
దిగులు పడవద్దన్నా రైతన్నా!

భ్రమపూరిత జీవితాల·బాటనీదికాదన్నా
చెమట చిరునామాను చెడుపుటెవడితరమన్నా?

(ఆంధ్రప్రభ, ఆదివారం అనుబంధం 24 మార్చి 1996)

# దాశరథి నాలుగక్షరాల అక్షరనిధి!



డేంది నాలుగడుగుల వాడు. నాలుగక్షరాల వాడు!" - అని న్నారట. నేను నాలుగడుగుల వాడినే కావచ్చు. నాలు ాడినే కావచ్చు. కానీ నాలుగక్షరాల్లో ఏ అక్షరాన్ని తీసేసినా ిలతాను.

- తీసేయండి - శరథి!
తీసేయండి - రథి !!
కూడా తీసేయండి - థీ!!!

ుగు అక్షరాల నాలుగు అడుగులమనిషి. దాశరథి - నిలువెత్తుల మనిషిగా పలికిన పలుకులివి !

ుగాక మొన్న... సెప్టెంబర్ 12వ తారీఖున కొత్తఢిల్లీలో ేశ్ భవన్ లోని అంబేద్కర్ ఆడిటోరియంలో ఆ వేదిక మీద దరాయ కులపతి, శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, శ్రీ దేవి ా. ముదిగొండ శివప్రసాద్, శ్రీ ఉత్పల సత్యన్నారాయణా , శ్రీ అక్కిరాజు సుందర రామకృష్ణ, శ్రీ రాజన్న కవి, శ్రీ వి. డారెడ్డి, శ్రీ అలిపెట్టి ప్రభాకర్ దేవీప్రియ ప్రభృతులు ఉన్నారు. వాళ్ళతో కలిసి నేనూ ఉన్నాను.

టోరియం ప్రవాసాంధ్రుల ఆనందంతో అందాలు పోతూ

డేంది నాలుగడుగులు వాడు. నాలుగక్షరాలవాడు!" అని కవిని ఎవ్వరు. హేళన చేసి ఉంటారు? ప్రజలంటారా? ాళ్ళు అంత కృతఘ్నులు కారే? ఇంకెవ్వరంటారు? అంటే ు... రచయితలే అని ఉండాలి. అయినా ఈ కాలం . రచయితలకు... యిదొక 'ఫ్యాషన్ అయిపోయింది. వీడెంత?' అనకపోతే ఆ పూట వీళ్ళకు నిద్రపట్టేటట్టుగా ని ఆలోచిస్తూ ఆ ప్రజాకవి వైపు చూస్తున్నాను.

త వేదన ఉంది ఆ మాటల్లో?

ునా సాటికవుల సరసన.... సరసులైన ప్రేక్షకుల ... ఏ అక్షరం తీసేసినా నేను మిగలతాను. అని రొమ్ము టడం స్వాతిశయమా? స్వాతిశయం గర్వానికి నిదర్శనమే ి ఆలోచిస్తూ ఉంటే కమ్మని కవిసమ్మేళనాన్ని వదిలి నా ితంలోనికి దారితీసింది.

డో పదేండ్ల కిందట 1977లో మహాకవి విశ్వనాథ తరువాత ఆస్థాన కవిగా నియమితులైనారు. నలుగురు నాలుగు విమర్శించినారు. అది తప్పని... ఎవరు నియమితులైనా ు మరొక విధంగా మాట్లాడడానికి అవకాశం ఉంటుందనీ

ఆయన నియామకాన్ని సమర్థిస్తూ అప్పుడు. నేను నిర్వహిస్తున్న స్థానిక పత్రికలో సంపాదకీయం రాస్తే ఎంతగా చలించిందా గుండె?

ఆ గుండెలో గర్వానికి చోటులేదు!

ఉంటే ఎవడో నా వంటి ఒక కోన్‌కిస్కాగాడు. ఒక చిన్న పత్రికలో రాసిన నాలుగు మాటల్ని ఆస్థాన కవి స్థానంలో నిలబడి లెక్క చెయ్యవలసిన అవసరమే లేదు. చలించి బదులు రాయవలసిన ప్రమేయం అంతకంటే లేదు.

అటువంటి 'గుండె కలిగిన' మనిషి 'ఏ అక్షరం తీసివేసినా మిగలతాను!' అంటే మిగల నివ్వకుండా విధి యింత తొందర్లో తుడిచేస్తాడని ఎవ్వరూ ఊహించలేదు. అదే ఆయనకు ఆఖరి అధ్యక్ష పీఠమవుతుందని... నాకంటే ఎందరో కవులకు ఆయన అధ్యక్షతన గళం విప్పే ఆఖరి కవి సమ్మేళనం అదే అవుతుందని.. ఎవరు అనుకొన్నారు? అయిందే అన్నభావన? బాధ మాటలకందదు.

కోటిరతనాల వీణ తెలంగాణా అయితే ఆ తెలంగాణాలోని గూడూరులో 1927లో జన్మించిన 'దాశరథి' కృష్ణమాచార్య 'దాశరథిగా' కోట్ల బాధితుల హృద్వీణ!

నేను సైకిలెక్కే తిరుగుతున్నా - సామాన్యుల్లో సామాన్యుల కండ్లు కప్పుతూ. సకల సౌకర్యాలతో కాకపోయినా సౌకర్యంగానే మేడలో బతుకుతున్నా. సినిమా సెట్టింగుల్లాంటి ఫిట్టింగులు లేకపోయినా ఫ్యాన్‌కు ఫోన్‌కు కొదువలేదు. కట్నాల మీద కవిత్వం రాస్తున్నా, ఆడపిల్లలు కాబట్టి సరిపోయింది కానీ - అదే మగపిల్లలై ఉంటే వాళ్ళ యిష్టానికి అడ్డుపడని సహృదయుడుగా ముద్రవేసుకొని నాకు యిష్టమైనంత కట్నాన్ని గుంజుకోవడానికి వెనుకాడే వాడిని కాను. వేదిక దొరికితే బూర్జువా తత్వం మీద ఉపన్యాసం దంచడానికి వెళ్ళడానికి కారులేదని వేదన చెందుతున్నా, బూర్జువాలబూజు దులపడంలోనే నిమగ్నమైన నేను నా బూజును గురించి ఆలోచించలేక పోతున్నా కానీ దాశరథి తన 19 యేటనే తనకు పట్టిన బూజును వదిలించుకొన్నాడు. ఆ తర్వాతనే 'మా నిజాం రాజు జన్మజన్మల బూజు!' అని అన్నాడు. ఇది 'థీ' మంతుని చిత్తశుద్ధి.

విప్లవ ఛాయలకే పోకుండా విప్లవాన్ని పలవరించే ప్రజాకవి గాదు దాశరథి. ఆయన లాఠీ దెబ్బలకు వెరవలేదు జైళ్ళంటే భయపడలేదు. రక్షణ కల్పించమని పోలీసుల ముందు దేబిరించలేదు. తానే ఒక విప్లవాగ్నిగా 'అగ్నిధారలు' కురిపించి 'రుద్రవీణలు' పలికించినాడు.

ీతల సమైక్యతను సాధించిన 'రథి' ఆయన! అన్యాయాన్ని ండెతో ఎదిరించు కానీ అన్యాయంగా నిండు ప్రాణాల్ని ు! అన్నది ఆయన సిద్ధాంతం.

ంగారాన్ని అంగ రంగ వైభవంగా పల్లకీల కెక్కించి వాడ తిరునాళ్ళు చేసి రాజుల రారాజుల మెప్పులందిన కవితా యం మనది. ముక్తిపేరుతో భక్తి తత్త్వాన్ని బండ్ల కొద్దీ సృష్టించి పునీతం చేయాలనుకొన్న పుణ్యాత్ముల వారసులం మనం. జగత్ సృష్టికి కారకులైన ప్రబంధ పరమేశ్వరుల అనుగ్రహానికి ం. ఈ వారసత్వ ప్రవాహానికి అతీతులైన కవులు ఈ ఆధునిక రో అరుదు. అరసంకవులైనా విరసం కవులైనా అక్కడి నుంచి ్న వాళ్ళే! ఈ అపవాదుకు అతీతుడు దాశరథి. కత్తిని కలాన్ని గా చేపట్టిన సవ్యసాచి అతడు. అందుకే ఆయన ప్రముఖుల ండా ప్రజాకవిగానే ప్రారంభమైనాడు. ప్రజాకవిగానే ుడు. ప్రజా కవిగానే నిష్క్రమించినాడు.

ల జీవరాసులకు అన్నం పెడ్తున్నది భగవంతుడంటారు. నేను ను. ఆ భగవంతునికి కూడా నైవేద్యం పేర బత్తెం యిస్తున్నది ంటాను. కండ్లు పులుముకొంటూ నిద్రలేచి కాఫీ సేవించింది కొని కండ్లు మూతలు పడుతున్న వేళ పండు తిని పాలుతాగి ీ వరకు సర్వం సమకూరుస్తున్నది రైతే! జొన్న కంకిమీద కులికే గువ్వకు... చెట్టు కొమ్మమీద కూర్చొని పలికే .. చెట్టు కొమ్మమీద ఉరికే ఉడతకు - ఎవ్వరో అన్నట్లు ురాసులకు బువ్వ పెడ్తున్నది రైతన్నే అయితే తరతరాలుగా ురాదరణకు గురిఅవుతున్నదీ ఆ అభాగ్యుడే! తలలు పండిన ులు కూడా తలకెక్కించుకోని ఈ సత్యాన్ని పందొమ్మిది ాల బాలుడు గుర్తించినాడు. సుష్టుగా భోంచేసి శృంగారం కాదు. కన్నీళ్ళను కడవల కెత్తడం కాదు. ఊహా సుందరుల్ని కెక్కించి ఊరేగించడం కాదు కావలసింది. 'రైతుదే! ుము రైతుదే!' అని గళము విప్పినాడు. తెలంగాణా రైతాంగ లో 'శరథి' అయినాడు. సేద్యంలో కానీ సాహితీ సేద్యంలో మనది బ్రాహ్మణ సేద్యం కాదు.

ుగు దినాలో కనీసం నాలుగుగంటలో జైల్లో ఉన్నట్లు 'జైల్ ' సంపాదించిన వాళ్ళంతా సమర యోధులే! నాలుగు లాఠీ నాలుగు తన్నులో తలవంచి తిన్నవాళ్ళూ సమర యోధులే! ్తన్నదని గ్రహించి కడపట కాలూనిన నేర్పరులూ స్వాతంత్ర్య ాధులే! తామ్ర పత్ర గ్రహీతలే! కానీ ఈ తంతు తిమిరాన్ని ంగా సమర రంగంలోకి దూకిన యోధుడు.. స్వాతంత్ర్య ాధుడు దాశరథి!

ీతుల పక్షాన నిలబడి అవిశ్రాంత నిరంతరపోరాట సాధనకు వేదిక... లేదా ఒక ముద్ర... లేదా ఒకనీడ కావాలని ఆరాటపడ్తున్న ఈ రోజుల్లో ... ఏదీ లేకుంటే భద్రత గుర్తింపు ఉండదని భ్రమపడ్తున్న ఈ రోజుల్లో ఏ గొడుగునీడలో చేరకుండా.. ఏ ఎండకా గొడుగు పట్టకుండా కడదాకా పయనించి తాను నమ్మిన సిద్ధాంతానికే కట్టుబడిన బాధితుల పక్షపాతి దాశరథి!

మానవ సేవ మీద ఆయన కున్న నమ్మకం మాధవ సేవలో లేదు. అలాగని దేవునితో ఆయనకు అణాకానీ పేచీ లేదు. నడిరేయి ఏ జాములో స్వామి నిను చేర దిగివచ్చునో? అని ఆయన సినిమా వాళ్ళ కోసం పాట రాసినా దేవుడు దిగిరావాలని ఎప్పుడు తపన పడలేదు. దిగిరాని ఆ దేవుని కోసం కొండ మెట్లెక్కినట్లు నేనెరుగను. భౌతిక వాదాన్ని బండ్ల కెత్తుతూ భార్యల కోసమని దేవాలయాలకు పోవడం ఆయన మనస్తత్వం కాదు.

విజ్ఞానానికి చిహ్నం వెలుగు. వెలుగంటేనే సూర్యుడు. ఆ సూర్యుడు ఒక్క సూర్యుండు సమస్త జీవులకు తానొక్కడై తోచుపోలిక దాశరథి ఒక్కొక్క వర్గానికి ఆ వర్గ ప్రతినిధిగా గోచరించినాడు. విప్లవ వాదులకు విప్లవకారుడుగా... అభ్యుదయ వాదులకు అభ్యుదయ కవిగా... పండితులకు పండితుడుగా... వక్తలకు మహావక్తగా... మానవతా వాదులకు మహామనీషిగా... సినీ లోకానికి సినిమా కవిగా... అనువాదకులకు ఆదర్శ ప్రాయుడుగా ఎవరు భావించిన రీతిలో వాళ్ళమనిషిగా! ఇది అనితర సాధ్యం.

నాలుగక్షరాల రాయగలిగినవాడు 'నాకు మించినవాడు లేడ'ను కొంటున్న ఈ రోజుల్లో నలభై యేండ్ల అవిశ్రాంత సాహితీ కృషితో హిమవన్నగ శిఖరాల ఎత్తుకెదిగిన మహాకవి కిందికి చూడడం అరుదైన గుణం.

నేనెరిగిన మట్టుకు దాశరథి ఆ గుణనిధి. ఏదో ఒక చిన్న కథను చదివి నాకు ఉత్తరం రాస్తూ 'బండ్లవీధిలో కూర్చొని సాహిత్యాన్ని బండ్ల కెత్తుతున్న కృష్ణారెడ్డీ!' అని సంబోధిస్తాడా? ఎన్నో కవి సమ్మేళనాల్లో పులికంటి గళం విప్పిన తర్వాత కష్టమే! అందుకే చివరికి నెట్టేస్తున్నా! అని కుండలు బద్దలు గొట్టినట్లు అనగలుగుతాడా? అదే ఆయన ప్రత్యేకత. మనస్సులో ఒకటి మాట మరొక్కటి కాక పోవడమే ఆయన ్వం. జన్మ జన్మలకు మరపురాని వ్యక్తిత్వం. నేను మొకరిల్ల వలసిన ్వం. దాశరథి కంటే గొప్ప వ్యక్తిత్వం.

'దాశరథీ కరుణా పయోనిధీ!' కవివాక్కు దాశరథి కరుణా సముద్రుడన్నాడు. దాశరథిలో కరుణ ఉండవచ్చు కానీ సముద్రమంత ఉండదు. ఉంటే ఎవ్వరో ఒక అనామకుడు ఏవో అన్నాడని సీతమ్మతల్లిని అగ్గిలో దూకమనడు. మాయ మాటలు చెప్పి మరిది వెంట కానలకు పంపడు. ఇది నేనెరుగని దాశరథి కథ, కానీ నేనెరిగిన దాశరథి సాటి రచయితల పట్ల దయా సముద్రుడు. కష్ట జీవుల పాలిట కరుణాసముద్రుడు. ఈ సమాజాన్ని పట్టి పీడిస్తున్న దోపిడీ దౌర్జన్యాలపై గర్జించిన కవితా సముద్రుడు! ●

(ఆదివారం ఆంధ్రజ్యోతి 29 నవంబరు 1987)

ర్రకథ

# గోరంత దీపాలు

మీదంటే భారతదేశం అంటాం
ఏదంటే భారతజాతీ అంటాం!

షు రొమ్మువిరిచి ఒక్కుమ్మడిపైకెక్కి
కొనకొమ్మున ఎగురవేసి మాజండా
ాకు సరి అంటాం? మాకు మేమెసరిఅంటాం ॥ఏదేశము॥

దకరాశిలోనా అందమైన స్వాతంత్ర్య
్మను మొట్టమొదట పొందినదీ మేమంటాం
త్మక వాదమందు మాకు మేమే సరిఅంటాం! ॥ఏదేశము॥

భేదాల మూటగట్టి మూలబెట్టి
త భావమ్మును చక్కదిద్ది చంకెలెత్తి
మా మతమంటాం!
ధనమున మాకు పట్టింపులు లేవంటాం! ॥ఏదేశము॥

తి బంధనముల తెగటార్చగ ప్రాణమ్ముల
మహాత్ములకు వారసులము మేమంటాం
ఘజాడులందు నడుచు అదృష్టమె మాదంటాం! ॥ఏదేశము॥

: అంటువంటి పవిత్రమైన ఈ భారతదేశంలో.. ఉత్తర స్థానంలో....

: ఒరే వొరే! నిలపరా నిలపరా నీకతబంగారంగానూ!

: కథే బంగారమైతే ఇక కావాల్సిందే ముందిరా? – కాలికి గండపెండేరం... చేతికి స్వర్ణ కంకణం...

: అంత ఆశపెట్టుకోవద్దురా నాయనా! ఈ దేశంలో ఇంకా అష్టావధానులు.... శతావధానులు... సహస్రావధానులు... మీసాలు మెలేస్తా...

: ఎందుకు వెయ్యర్రా – వాళ్లవిద్యలో వాళ్లుగొప్పోళ్లు కాబట్టి మీసాలు మెలేస్తారు.

: మీసాలేగాదురా ఉంటే ఇంకేమైనా మెలేసుకోనీ! నా ఏడుపు అదిగాదు – తూ బెహ! బుర్రకతచెప్పుకొనేవాడివి గండపెండేరాలకు స్వర్ణ కంకణాలకు వలేస్తే – వాళ్లు మీసాలు మెలేస్తా నీబుర్ర రాంకీర్తన పాడిస్తారు.

: నీతో పెద్దపీకులాటై పాయగదరా – నిన్ను పక్కన పెట్టుకొని...

: నన్ను పక్కలో పెట్టుకోని... నాతో పీకులాట.. హిహిహి...

: ఒరేతండ్రి! నీకొకదండం నీ అతి తెలివికి అర్వై ఆరు దండాలు. ఇంతకూ నువ్వు నన్ను కథనిలపమనింది ఎందుకో చెప్పరా?

: అట్టడుగు చెప్తాను. ఇంతసేపూ మాది భారతదేశం. మేమంతా ఒక్కటి అని రొమ్ము విరుచుకొంటివి. ఇప్పుడేమో ఉత్తర హిందూస్థానం, దక్షిణ హిందూస్థానం అంటా ముక్కలు చేసేదానికి మొదులు పెట్టావ్? – ఇంక కాసేపు పోతే తూర్పు హిందూస్థాన్ పడమటి హిందూస్థాన్ అంటూ కొంపను నాలుగు దోవలు చేసేటట్లుందే!

కథకుడు : ఒరే పిచ్చినాగన్నా!

వంత : నీ ఇష్టం వచ్చినట్లు వాగితే వొప్పుకోనన్నా!

కథకుడు : తాగిన వాళ్ళురా వాగేది. ఆనాడు మహాత్మా గాంధీ నుండి ఈరోజు మన ప్రధాని మురార్జీ దేశాయ్ వరకు బ్రాందీమా నండోయ్ అంటే – నాలుగు రోడ్ల కూడలిలో మహాత్ముణ్ణి శిలను చేసిన జాతికి వాళ్ల మొత్తుకోళ్లు చెవుల్లో పడ్తాయా?

వంత : వద్దనే వాళ్లు వద్దు వద్దని మొత్తుకుంటా ఉంటే కద్దు అనే వాళ్లు బుడ్డీమింద బుడ్డీ పట్టిస్తూనే ఉండారు. అది అలా ఉండనీ! – ఇప్పుడు నీ మొత్తుకోళ్లు –

కథకుడు : మొత్తుకోళ్లుకాదురా. యావద్భారత జాతికిగుండెకు హత్తుకోళ్లు. ఈ రోజు ఒక పర్వదినంరా!

వంత : ఎందుకు నా తండ్రీ! నువ్వు కాలికి గజ్జెకట్టి కరతాళం చేతబట్టి – తగుదునమ్మా అని బుర్రలు చెడగొట్టేదానికి బుర్రకత చెప్తుండావనా?

కథకుడు : బుర్రలు చెడగొట్టడం కాదురా పిచ్చినాగన్నా! బుర్రలు తిరిగి పోతాయ్ ఈ కథవింటే! ఒక మహానుభావుడు అవతరించిన పుణ్యదినంరా ఇది!

వంత : ఎవురబ్బా ఆ మహన్నబావుడు?

కథకుడు : ఎవరురా ఇంకెవరురా?
స్వాతంత్ర్యము మా జన్మహక్కని
చాటిచెప్పినది ఎవరురా?
శాంతి సమరమున తెల్లజాతిని
సాగనంపినది ఎవరురా?
దేశము కొరకు సర్వస్వమ్మును
ధారపోసినది ఎవరురా? –

ఈ విధంగా శాంతియుత పోరాటంలో స్వాతంత్ర్యాన్ని సాధించిన తరువాత –

వంత : ఆ! తరువాత –
ఎదురులేక ఈ దేశాన్నేలిన
ఏకైక నాయకుడెవరురా?
ఎల్లలోకముల శాంతిదూతగా
నిలిచి వెలిగినది ఎవరురా?
వాడేరా మన జవహరుడు
వాడేరా మన ప్రియతముడు!

: ఆహా! అయితే మన నెహ్రూ బాబు పుట్టింది ఈరోజేనన్నమాట!

: అవునురా. అందుకే ఇది మనకొక పర్వదినం. ఈ పర్వదినాన ఆ మహానుభావుణ్ణి సంస్మరించడం ప్రతిభారతీయుడి కర్తవ్యం. ఎందుకంటావా?

నేటి బాలలే రేపటి పౌరులు అని తలపోశాడు.
శిశుసంక్షేమమే దేశ క్షేమమని విశదపరచినాడు
పిల్లలందున పిల్లడుతానై ప్రీతిగ తిరిగాడు
పువ్వులందున తానొక పువ్వయి పులకరించినాడు
కలిమిలేముల తారతమ్యముల కలవరపడినాడు
మిట్టాగట్టూ చదనుచేయగా పట్టుబట్టినాడు
విసుగు విరామము లెరుగకుండగా విశ్వమంతటాను
భారతజాతి ప్రతిష్ట పెంచుటకు బాధలు పడ్డాడు!

టువంటి మహానుభావుడు ఉత్తర హిందూస్థానంలో-

: అదో అదో! అదే వద్దనేది. మాటంటే మాటే! మనమంతా ఒకటి అన్నావు బాగుంది. మరలా ఏందిరా ఈస్థానం ఆస్థానం అంటూనే పాకీస్థాన్ పోగొట్టుకొని పడరాని పాట్లు పడతా ఉండాం!

కు : నిజమే! ఆ రోజుల్లో మన నాయకుల్లో కొంత దూరదృష్టి లోపించిన కారణంగానే ఈ దురవస్థ దాపురించింది. భారతదేశం ఈ చీలికకు లోనుగా కుంటే యావత్ప్రపంచంలో అగ్రస్థానం మనదేకదా! -

: అందులో సందేహం లేదనుకో - అదేదో హిందూస్థాన్ అన్నావు. మరలా పాకిస్థాన్‌దాక పోతున్నావ్! - ఊరుచూడమంటే ఉత్తరం చూసే బుద్ధిపోలేదే నీకు? -

షు : ఆ! ఆ ఉత్తరభారతంలో -
ఉత్తరభారతమ్మునా సై
ఉన్నది అలహాబాదురా సై
చక్కదనాల చుక్కరా సై
సాటిలేని నగరమ్మురా సై
నగరానికి నాణ్యమ్మురా సై
భరతజాతి పుణ్యమ్మురా సై
మోతీలాల్ మొనగాడురా సై
నీతికి రాతికి ప్రీతిగా సై
న్యాయవాదము తనవృత్తిగా సై
మోతీలాల్ మొగలాయిరా సై
ఖ్యాతిమీద బ్రదుకుచుండెరా సై!
భళా నోయి భాయి తమ్ముడా!
మేల్ భళానోయ్ దాదానా!! -

అందమైన అలహాబాద్‌లో నీతికి రీతికి ప్రీతిని చేకూరుస్తూ లాల్ మహాశయుడు సకల సంపదలతో తులతూగుతూ ఆనంద ంలో హాయిగా జీవిస్తున్నాడు!

వంత : ఒరే నువ్వొక పిచ్చోడు. నేనొక ఎర్రోణ్ణి! - నువ్వుచెప్పింది నన్ను వినమంటావ్?

కథకుడు : ఊకొట్టేదేగదరా నీ పని!

వంత : కాదు. కాదు ఇట్టా వడ్డారం కథలు చెప్తే గూబలు అదర గొట్టేదిగూడా నాపనీ! -

కథకుడు : వడ్డారం కథనా? -

వంత : లేకపోతే ఎన్ని సిరిసంపదలతో తులతూగినా - అసలు కత లేకపోతే - అది ఎంత ఆనంద భవమైనా అంధకార భవనమేరా! - ఇంటికి దీపం ఎలానో ఇల్లాలు అంతే!

కథకుడు : ఇంటికి ఇల్లాలు లేకపోవడం ఏమిట్రా పిచ్చినాగన్నా! - మోతీలాల్ మహాశయుడు గుణవతి రూపవతి అయిన స్వరూపరాణిని వివాహమాడాడు. ఆనందభవనంలో ఆనందానికి హద్దులు వెదుక్కొంటూ జీవిస్తున్నారు. అయితే-

పదియున్నొక్క యేండ్లు గడచినా పాపఫలమ్మేమో
కడుపు పండక స్వరూపరాణి కలవరపడసాగె!
ముద్దు ముచ్చటలు తీరు టెట్లని మోతీలాల్ నెహ్రూ
వంశోద్ధారకుడు ఒక్కడు లేడని వాపోవుచునుండె!
ఎంతటెంతటి సిరులు దొరలినా శాంతి కొంతలేదు
వేయిదీపములు ఇంటవెలగినా శాంతి కొంతలేదు
శాంతి కాంతిలోపించిన భవనము చింతలో మునిగె
ఆనంద భవనమున అసంతృప్తియే ఆటలాడసాగె!

వంత : అంతేగదరా పాపం! - ఆడజన్మకు కడుపు పండితేనే గదా పండగ!

కథకుడు : నిజమే! ఆ మహాతల్లి నోచిన నోముల ఫలమో భగవత్సంకల్పమో పదకొండు సంవత్సరాల తరువాత ఆ ఇల్లాలి కడుపుపండింది.

వంత : అబ్బ! అబ్బ! ఎంతమంచిమాట చెప్పినావురా! ఆమాట చెవుల్లో పడేకుందికి -

నాకుశాలకునిషా ఎక్కితే - ఇంక వాళ్లకత చెప్పాలా?

కథకుడు : అవును. ఆ దంపతులు ఆనంద ప్రవాహంలో పూల తెప్పలమీద తేలిపోతుంటే కాలప్రవాహం తనపని తనదిగా సాగిపోయింది.

వెయ్యి దాటినా ఎనిమిది వందల ఎనభై తొమ్మిదిలో
నవరాత్రులు గడిచిన తదుపరీ నవంబరు మాసములో
పదనాల్గవతేదీన పుట్టినాడురా పరముడు జవహర్‌లాల్
వేయిదీపములు ఇంట వెలిగెరా వింతకాంతి తోడా!

ఒరే! ఆ పురిటిబిడ్డను ఏమనుకొన్నావురా!

వంత : ఏముకోమంటావ్‌రా! అందరి ఆడవాళ్లమాదిరిగానే ఆమె ఒక మగబిడ్డను కనింది.

: కాదురాకాదు!

బాలుడు వాడు కాడు రా సై
భరత భాగ్య విధాతరా సై
జాతిరత్నముదయించగా సై
మంచుకొండ లేకరిగెరా సై
గంగయమునలే పొంగెరా సై
కర్మసాక్షికనులు తెరిచిరా సై
బంగరు కాంతులు చల్లెరా సై
కొమ్మమీద కోయిలమ్మలూ సై
శాంతి గీతములు పాడెరా సై
భళా నోయిభాయి తమ్ముడా !
మేలు భళానోయి దాదానా !

ఆ జాతి నేత పుట్టుకతో ప్రకృతియే పరవశించింది. ఇక ఆ తల్లిదండ్రులమాట చెప్పాలా?

: అంతేగదరా పాపం ! లేక లేక కలగిన నలుసు. కింద దించితే మట్టి అవుతుంది. పైకెత్తు కొంటే గద్ద తన్నుకపోతింది. అని చాలాముదిగారంగా పెంచి ఉంటారులే!

: అవునురా! మోతీలాల్ నెహ్రూ అంటే కోట్లకు పడగెత్తిన కోటీశ్వరుడు! ఎంతటెంతటి సిరులున్న ఎమి ఫలము? ఎంత టెంతటి సుఖమున్న ఏమి ఫలము? చంటి పాపడునవ్వని స్వర్గసీమ వల్లకాడుగ తోచును! అని శ్రీమాన్ శంకరంబాడి సుందరాచారి సెలవిచ్చి నట్లుగా - ఆనంద భవనం బోసి నవ్వుల పూలసింగారాలతో వయ్యా రాలు పోతూ ఉంటే - మోతీలాల్ ఆ బాలునిలోనే సర్వస్వాన్ని చూచుకొంటూ ముద్దు ముచ్చటలు తింటూ మురిసి పోతున్నాడు. కాని తల్లి స్వరూపరాణి మాత్రం.

జో! జో! జో!

జోకొట్టలేనయ్య జోకొట్టలేనూ
నీజాతి పడు బాధ నేనోర్వలేనూ! ॥జో॥

ఆ తల్లిబాధల్ని ఆకసుగందు అర్థంచేసుకోలేకుండా బోసినవ్వులు పోతుంటే -
నవ్వకోయీ బాబూ! నవ్వబోకోయీ!
నీజాతి ఈ రీతి నలిగిపోతుంటే! ॥నవ్వకోయీ॥

ఎందుకంటావా?
అధమాధములు వారు ఆ తెల్లవారూ
నిన్ను నీజాతినీ నలుపు తున్నారు! ॥నవ్వకోయీ॥

అర్థమైనట్లుగా ఆబిడ్డ ఆదమరిచి ఆలకిస్తుంటే -
ఎదగాలి! ఎదగాలి! నీవు ఎదగాలి!
ఎద ఎదను రగిలేటి ఈ బాధ తొలగాలి
ఇంటింటా నీకీర్తి నిలవాలి! నిలవాలి! ॥నవ్వకోయీ॥

ఆతల్లి ఆశలు అడియాసలు కాలేదు. తండ్రి ఆంగ్లభాషాభి పరదేశీ ఆచార వ్యవహారాలమీద అమితమైన మోజుతో తనబిడ్డను ఫెర్డినాండ బ్రూక్స్ అనే ఆంగ్లేయుని అధ్యాపకునిగా నియమించి ఆంగ్లభాష నేర్పించినా... పై చదువులకని లండన్ మహా నగరానికే పంపినా... ఆ బాలుడు భారతీయుడుగానే ఎదిగాడు. తల్లి ఉగ్గుపాలతో రంగరించిపోసిన దేశభక్తితోనే ఎదిగాడు. లండన్ లో బార్ - ఎటీ లా చేసి స్వదేశానికి తిరిగి వచ్చాడు. వచ్చినవాడు ఏం చేయాలిరా!

వంత : నాలుగు చేతుల నల్లకోటు తొడుక్కొని కోర్టుకు పోవాలి!

కథకుడు : అక్కడే నీవు పొరబడ్డావు. అప్పుడు భారతదేశంలో పరిస్థితి ఎలా ఉందంటే?

వంత : ఎలా ఉందంటే? - ఉండినట్టే ఉంటుంది.

కథకుడు : కాదురా పిచ్చి సన్నాసి! -

మాతృదేశ పరదాస్య ముక్తికై మహాత్మాగాంధీ
ప్రేమశక్తితో ప్రజానురక్తిని పిడికిట పట్టాడు
నలువది కోటుల భారతీయులను కలిపినిలిపినాడా!
భారతమాతకు జై అంటేనే యావద్భారతమూ
నినదించినదీ దేశభక్తితో ఇనుమడించినాదీ
ముసలీముతకా పిల్లా జల్లా మూగి వచ్చినారూ
తమకు తాముగా స్వయంసేవకులు తరలివచ్చినారూ
కోటీశ్వరులు వలసిన ధనమును కుమ్మరించి నారూ
దేశ దాస్యమును సహింపజాలని ధీరుడు మన నెహ్రూ
గోఖలే పటేల్ తిలక్కులాదిగ గొప్ప నాయకులను
కలిసి పలుకుచూ కాంగ్రెస్‌తోనా కరము గలిపినాడూ!

జవహర్ లాల్ నెహ్రూ గాంధీ మహాత్మాకు కుడిభుజం కాగా వీరిద్దరికీ శాంతి అహింసలు తోడుకాగా స్వాతంత్ర్య సమరం ఆరంభమైంది.

వంత : ఏవిధంగా రా?

కథకుడు : కత్తులు కటార్లు లేవురా సై
కరకుటమ్ములూ లేవురా సై
మందు గుండూ లేదురా సై
మరఫిరంగులు లేవురా సై
విషవాయువులు లేవురా సై
వింత విమానాలూ లేవురా సై
వీర విహారాలు లేవురా సై
శాంతిని విల్లుగా గైకొని సై
వింటిని ఎక్కుబెట్టిరీ సై
అహింస బాణమ్మాయెరా సై
ఎదురులేని సమరమ్మురా సై
ఏకబిగిని సాగి పోయెరా సై
భళా నోయి భాయి తమ్ముడా!
మేలు భళానోయి దాదానా!

ఈ శాంతి సమరంలో ఎందరో మహానుభావులు ఎన్నెన్ని సార్లో జైలుకు వెళ్లారు. తమజాతి దాస్య విముక్తికై ప్రాణాలర్పించారు.

్వస్వాన్ని దేశానికై ధారపోశారు. అందులో నెహ్రూ గారికి ద్దపీట వేయాల్సిందే!

కాలుమీద కాలేసుకొని దర్జాగా కార్లోకూర్చొని కడుపులో లకుండా కష్టమంటే తెలియకుండా కాలం గడపాల్సిన ుడు – కష్టాలను కొనితెచ్చుకున్నాడు. కటకటాల మధ్య . హంస తూలికా తల్పంపై అర్ధాంగి కమలతో వలపు ు పండించుకోవలసిన కోడె వయస్సులో చెరసాల్లో కటిక రిమిత మయ్యాడు. అనురాగాల కల్పవల్లి అర్ధాంగి జబ్బు సం వైద్యసదుపాయం చేయించడానికి ప్రక్కన ోయాడు!

: ఒరే! నాకొక్క సందేహం, అడగనా?

: ఎందుకు సందేహం? వినే వాడికి చెప్పేవాడు ఎప్పుడూ లోకువే? అడుగు.

: ఆ! ఆమె పేరేమన్నావు? కమల – నిజంగా పెండ్లామేనా?

: ఒరే! నీ నాలుక ముక్కలై తెగి నేలపడా! అగ్నిసాక్షిగా పెండ్లాడిన అర్ధాంగిరా!

: కోరికలు నరాల్ను నిగ్గదీసీ వయసులో.. నీ తలపాడు నువ్వు పడు అంటూ ఆమెను ఏకాకినిచేసి ఏకంగా పోయి జైల్లోపడి జబ్బు పడ్తే మందుమాకు ఇప్పించేదాని గ్గూడా పక్కన లేకుండాపాయ. ఆమె ఎట్లా వొప్పుకొనిందిరా?

: ఆమె మహాసాధ్విరా! అదేమి చిత్రమోకానీ, – నెహ్రూ ఒక జైల్లో విడుదలై ఇంట్లో అడుగుపెట్టీ పెట్టకముందే మరొక జైలు ఆహ్వానం కాచుకొని ఉండేదట!

: అయ్యోపాపం!

: ఆమె జబ్బుపడిన కాలంలో అచ్చంగా ఇలాంటి సంఘటనే జరిగింది. నెహ్రూ జైల్లో నుండి విడుదలై ఇంట్లో అడుగు పెడుతూ ఉంటే పోలీసులు వారంటుతో ప్రత్యక్ష మయ్యారు. అనారోగ్యంతో అవస్థపడుతున్న అర్ధాంగి వైపు దీనంగా చూస్తూ తటపటాయించాడు నెహ్రూ. అప్పు డామె–

: బోరోమని కంటికి కడవెడుగా ఏడ్చింది.

: అదేపొరబాటు. ఆ వీరవనిత – వెళ్ళండి దేశం మిమ్మల్ని పిలుస్తూ ఉంది. దేశం కంటే మీ కనుల మీకు ఎక్కువ కాదు. అనిందట!

: ఒరె వొరే! అంతమాట అనిందా మహాతల్లి? అయితే చేతులెత్తి మొక్కాల్సిందే! ఆమెరా పెండ్లామంటే? – నాకూ ఉండాది. ఎందుమలే? – కడుపుచించుకుంటే కాళ్లమీదనే కదాపడేది!

: ఎందరో ఇలాంటి నిస్వార్థ సాధ్వీమణుల ప్రేరణతో స్వాతంత్ర్య సంగ్రామం కొనసాగింది. భారతీయుల సహనశక్తి తెల్లవాళ్లను తికమక పట్టించింది. వాళ్ల కుట్రలు కుయుక్తుల్ని శాంతిసహనాలు గుటుక్కున మింగేశాయి. తప్పదన్నట్లుగా మూటా ముల్లె సర్దుకొన్నారు 1947లో ఆగస్టు పదిహేనున భారతదేశ దాస్యశృంఖలాలు ఫెళ్లున తెగిపడ్డాయి. ఆరోజు భల్లుమని తెల్లారేసరికి –

స్వతంత్రోత్సవం దేశమంతటా స్వర్ణోత్సవములుగా
గాంధీపేరున వాడవాడలా ఘనముగ జరిపారు!
మూడురంగుల జండా మనది చూడ వేడుకాయె!
మేడలపైన మిద్దలపైన మెరసిపోవుచుండె
ఎవరినోటను జయధ్వానాలు ఎచ్చట జండాలు
తల్లిభారతి కన్నీళ్లాగిన తరుణమందుచూడ!
కొత్తదేశమున కొత్త కోరికలు కొత్త జాతికోర
నెహ్రూ నేతగ హిందూస్థానం నిలువ గలగినాదీ!

ఈ విధంగా స్వతంత్ర భారతావనిలో ప్రధాని పదవిని చేపట్టాడు నెహ్రూ. దినానికి కేవలం ఆరుగంటల విశ్రాంతితో పద్దెనిమిది గంటలు పనిచేస్తూ పద్దెనిమిది సంవత్సరాలు నిరాటంగా దేశాన్ని ప్రగతిపథంలో నడిపించాడు.

పువ్వులంటేనే ప్రాణమురా
పసిపాపలంటే అభిమానంరా
దేశప్రగతియే ధ్యానముగా
దేశప్రతిష్టను అద్భుతమ్ముగా
దేశ దేశాల ప్రాకచేసెరా!
ప్రగతికి మూలం పరిశ్రమలంటూ
పట్టుబట్టి స్థాపించినాడురా
సత్యాహింసలు సాధనమ్ముగా
శాంతిసాధనే తన ధ్యేయముగా
విసుగు విరామము లెరుగకుండగా
ఏలినాడురా భారతదేశం
రాజుగాని రారాజుగా నిలిచీ!
సాహితీ వేత్తకు సర్వప్రపంచం
శాంతి దూతయని సాగిలపడెరా!

అశేష విశేష ప్రజాభిమానాన్ని చూరగొని భారతజాతి భాగ్య విధాతగా కీర్తింప బడిన మహానుభావుడికి కూడా తప్పలేదురాచావు!

వంత : అయ్యయ్యో! ఆమహానుభావుడికి కూడా చావొచ్చిందా? –

కథకుడు : హుఁ! చావు, మనిషి జీవితంలో సహజమైన పరిణామం. ఒక సామాన్యుడి చావు అయితే అంతగా పట్టించుకోవాల్సిన అవసరం ఉండదేమోకానీ – ప్రతి నిముషాన్ని దేశం కోసం వెచ్చించిన మహానుభావుల కోసమే మనమంతా ఆలోచించా ల్సింది. ఆ చావు హృద్రోగం పేరుతో వచ్చింది. భారతదేశ భవిష్యత్తునే కొనిపోయిందా? అనిపించింది. ఆ మహాను భావుడు పోవడంతో ఆయన అమితంగా ప్రేమించిన పిల్లలు ఏడ్చారు. పువ్వులు ఏడ్చాయి. పిల్లలూ పువ్వులూ

ఏడుస్తుంటే లోకమే ఏడ్చింది. అందులో ప్రతినిత్యం అతని హృదయ సీమను అలంకరించిన గులాబీ విలాపం -

ఉదయగిరి కొనకొమ్మ అరుణకాంతులు క్రమ్మ
మోమునవ్వులు చిమ్మ ముందు నిలబడునమ్మ!

నిలిచి నాదెసచూచి వలపుమెయి తలయూచి
గోట చెక్కిలి మీట గుండెతత్తరపాటు!
సిగ్గులో నాబుగ్గ నిగ్గులను గమనించి
అనువుగా చనువుగా పొదివికొనుదము గా!
వాడునా ప్రియుడమ్మవాడునా ధవుడమ్మ
వానినే విడనాడి వసుధ మనలేనమ్మా!
ఎంతధీమంతుడో అంతవీరుడతండు
ఎంతవీరవరుండో అంతశాంతియుతుండా!
అది ఏమిరూపమో అది విశ్వమోహనము
అతడు మాటాడెనా అది శిలాశాసనము!
కలకాల మీరీతి కలిసి ఉందామంటె
కన్నుగుట్టెను విధికి కన్నుమూసెను తుదకు!
ఈ అందమింకేల? బ్రదికి ఈవెతలేల?
అతనితో ననుగూడ దేవకొని పోనేల?
తలదాచుకోదలచి దైవసన్నిధినిలిచి
కరుణింపుమని వేడకన్నీరు తావిడిచె!
దేవుడే ఏడ్చాడు! దేవుడే ఏడ్చాడు!
లోకమేనా కిపుడు చీకటై పోయినది!
బాపూజీ వారసుడు ఈపుడమికిక లేడు
నా సామి జవహరుడు నా వంక రాబోడు!
అతనికోసమే పుట్టి అతని కోసము పెరిగి
అతనితో చనలేక అవనిమిగిలిన దాన!
నా రాజురోజాను ఈరోజు పేరుకే
ఇలపైన మిగిలాను : -

: వింటా ఉంటేనాకూ ఏడుపువస్తా ఉందిగదరా!

: ఆయన పోయిన దానికి కాదురా మనం ఏడవాల్సింది. ఆ మహానుభావుడు ఎంతో సంయమనంతో సాధనా సంపత్తితో నిలిపిపోయిన అడుగు జాడలను ఈ జాతి స్వార్థం వివేకరహితంగా తుడిచేస్తుంటే విలపించాలి. ఆయన పువ్వుల్లోని అందాన్ని ప్రేమించాడు. పసిపిల్లల్లోని అమాయకతను ప్రేమించాడు. ఆ పువ్వులున్నాయి. పిల్లలూ ఉన్నారు. ఇప్పుడేకాదు - ఎప్పటికినీ ఉంటారు. ప్రేమ ఉంటుంది. వీటికెప్పటికీ చావు లేదు. ఇవి ఉన్నంతకాలం బాలల దినోత్సవాలు జరుగుతూనే వుంటాయి. మనప్రియతమ నాయకుణ్ణి బ్రతికిస్తూనే ఉంటాయి!

వంత : అవునుగదా! నిరుడు జరిగింది. ఈ ఏడు జరిగింది. రాబొయ్యే ఏడాదీ జరుగుతుంది.

కథకుడు : ఈ ఏడు మరో ఏడేకాదు. సూర్యచంద్రులున్నంతకాలం ఈ బాలల దినోత్సవాలు జరుగుతూనే వుంటాయి. అయితే వాటి సార్థకత ఎప్పుడంటే దేశ జనాభాలో సగానికి పైబడిన బాల బాలికలు నెహ్రూ ఆశయాలకు అనుగుణంగా ఎదిగినప్పుడు నెహ్రూ ఆత్మశాంతిస్తుంది. భారతదేశ గౌరవం ఇనుమడిస్తుంది. అందుకే భావి భారత పౌరులైన బాలబాలికల్ని మనం అభ్యర్థిస్తాం. ఏమని?

విన్నారు గద బాలలూ
మన పూర్వీకులెటువంటివారలో?
ధర్మనిరతిని గౌరవించారూ
కర్మయోగము స్వీకరించారూ.
స్వార్థచింతనలన్ని విడనాడి
ప్రజాహితార్థము కోరిపోరాడి
దేశప్రగతిని వారు కోరారు
మీరంత వారంత కావాలి!
గోరంత దీపాలు వెలగాలి
కొండంత వెలుగులే ఇవ్వాలి! ●

(1977 సం.రం నెహ్రూ జయంతి నవంబర 14, కడప ఆకాశవాణి ప్రసారం కోసం రాసింది 20-10-1977)

రిక

# మేకలూ మీకూ కొమ్ములున్నాయ్!



**పాత్రలు :**

య : బతుకును చాలా తేలిగ్గా తీసుకొన్న పూసాటుగాడు. తాగుబోతు. వయస్సు అయిదు పదులకు కొంచెం అటో ఇటోగా ఉంటుంది. ఎక్కడి కక్కడ జారిపోయే తత్త్వం.

మ్మ : ఈరయ్య ఇల్లాలు మాట పెళుసైనా మనసు కలిగిన ఉత్తమురాలు.

: ఈరయ్య కొడుకు, నలుగురు కొడుకుల తర్వాత కలిగిన నలుసు, కంట్లో నలుసే! అయితే మూగ!

య్య : ఈరయ్యకు వేలు విడిచిన మేనమామ.

చారక్ : కుటుంబ నియంత్రణ ప్రచారం చేసున్న ప్రభుత్వోద్యోగి. మనసున్న మనిషి కాబట్టి తగుదునని తలదూర్చే తత్త్వం.

ల కసిరెడ్డి : కలిగిన రైతు, సార్థక నామధేయుడు

ుట్టి : పేరు సింగంపుట్టి, కులము మంగల శెట్టి, పనులందు జగజెట్టి!

ాయలసీమ!... రతనాల సీమ!!

వడన్నా డీ మాట?-

వడో?-మీసాలకు సంపెంగనూనె రాసుకొనే వాడని ఉంటాడు. మెతుకులేదన్న అవగాహన వాడికి ఉండి ఉంటే 'రాళ్ళ సీమ' ు.

ది రాళ్ళ సీమ!

రాళ్ళసీమ విసిరేసిందొక పల్లెను ఒక మారుమూలకు! ఆ పల్లె దా గుడిసెను ఊరి చివరకు!-

ర్శక మహాశయా!

గుడిసె ముందరే నీవు ఆడిస్తున్న ఆట!

ళ్ళ సీమలో గుడిసె ఎట్లా ఉంటుందో వివరించాలా?

ముంది!

ండు కూసాలు, నాలుగు వాసాలు, పది పన్నెండు తాటిమట్టలు, ంటే వాదెడు బోద కసువు.

క్షకులకు ఎదురుగా ఆ గుడిసెను కట్టు. దానికి ఒక తలుపు లుపు పెట్టడం కష్టమనుకుంటే ఆ తలంపే కట్టిపెట్టు. అక్కడ ఖాళీ చేసి ఆ గుడిసెనే పక్కకు నెట్టు. గుడిసె పక్కన ఒక్క తడికెను మాత్రం అడ్డంగా పెట్టు. నా కోసం కాదు - నాటికకోసరం!

గుడిసె ముందర ఒక్కచెట్టు పెట్టు. అందుబాటు కాకుంటే ఆ మాటా వదిలిపెట్టు. ఎన్ని ఇబ్బందులున్నా గుడిసె పక్కన ఒక్క నులక మంచాన్ని మాత్రం నిలబెట్టు!

గుడిసె ముందర మాత్రం తప్పనిసరిగా మూడు రాళ్ళతో ఒక పొయ్యిని పెట్టు. ఆ పొయ్యి మీద ఒక పాత కడవను పెట్టు. ఆ కడవలో సగానికి నీళ్ళు పెట్టు. ఆ పొయ్యికి చుట్టుపక్కల రెండుమూడు పాత కుండలు వేసిపెట్టు!

గుడిసెలో మాత్రం ఒక ఖాళీ చేతి సంచీ, ఖాళీ సీసా, అగ్గిపెట్టె, మచ్చుకత్తి మరచిపోకుండా పెట్టించు. అన్నట్లు నిన్ను మరచిపోవద్దని నేనే మరచిపోతున్నా- ఒక్క పొరక, చేట కూడా పెట్టించు!-

అన్నీ సరిగ్గా అమరినాయో లేదో? ఒక్కసారి సరిచూచుకో!

ఇప్పుడా ఇల్లాలు గంగులమ్మను గుడిసెముందర వాకిట్లో కూర్చోబెట్టు. ఒక చినిగిన నిక్కరు చేతికిచ్చి కుట్టుతూ ఉండమని చెప్పు. ఆమె కుట్టుతూ ఉంటుంది. తెర తీయించేయ్!

రంగడు గుడిసెలో నుండి బయటికి వస్తాడు. చేతిలో అల్యూమినియం కంచం ఉంటుంది. ఒంటిమీద గుడ్డ ఉండదు ఒక్క

ునహాయిస్తే పొరబాటుగా దాన్నెక్కడైనా తొలగించేవ్ - వాడికి పైబడింది.

ంగడు ఎంగిలి కంచాన్ని కడిగినాడు. నీళ్ళు పారబోసినాడు. ోబోతున్నాడు.

ురయ్యను ప్రవేశపెట్టు!

ర్శక మహాశయా!

క్కరకంగా ఇక్కడికి తీరింది నీ బాధ్యత, ఇక నటుల సమర్థత!

: (ప్రవేశిస్తూ)

ఇనంద్రా యినంద్రా యినిపిస్తా యినంద్రా
తాగనో డంటేనే తలమాసి నోడురా!
తాగంద్రా! తాగంద్రా! గవర్నమెంటు సారాయి
ముక్కల్దాక తాగితే ముల్లోకాల్మనవిరా! ॥ఇనంద్రా॥

కోడిగుడ్డు కొండంత కొండేవో సీవంత
నువ్వే.వో ఏనిగంత ఏనిగేవో ఎలికంత
మారుతారు జేసేటి మాయదారి మందురా!
సందుగొందులందమ్మే సహకైనా మందురా! ॥ఇనంద్రా॥

తాగేదీ ఒక్కడైతే బతికేది ఎందుర్రా
తాగేవోళ్ళందురైతె తక్కవేవుందిరా!
ఆడదెచ్చి ఈడదెచ్చి సారాకొట్లొ జవకట్టే
కజానాల్లో కాళీలేక పారా హుషార్రా! ॥ఇనంద్రా॥

వాడెవడో నాయాలు!... బాగారాసినాడ్రా పాట! - వాడికి ండం- రొండు సేతులెత్తి!

ఆడరా! ఆడరా! సరసాలు ఆడరా!
సారాయి తాగేసి సరసాలు ఆడరా!
తాగినపుడు సరసాల్లో తవాసాల్లె ఏర్రా
ఆడ దొకటి పక్కనుంటె ఆ జోరే ఏరురా!
(గంగుల్ని గమనించి)

!... గంగులూ!..ఏయ్, గంగులూ!!

: (చివుక్కున తలెత్తి ఒక్క చూపు చూస్తుంది. ఆ చూపుల్లో ఆగ్గి కురుస్తుంటుంది. ఈరయ్య ఆదిరిపడినట్లు పడి తమాయించుకొని నిలబడతాడు. గంగులు మళ్ళీ తల వంచుకొని కుట్టడం జోరు హెచ్చిస్తుంది. గుడిసెలోకి పోబోతున్న రంగడు ఆట్లానే నిలబడి తండ్రివైపు తీక్ష్ణంగా చూస్తుంటాడు.)

: తాగింది నేనైతే దానెమ్మను గొట్టా దీని కెక్కినట్టుందే యవ్వారం!

ఎట్టబ్బా? (అని గొణుక్కొంటూ కొడుకును సమీపిస్తాడు. రెండు చేతులతో వాడి మొగాన్ని పొదివి పట్టుకొని) ఒరే, నా కొడకా! బంగార్నా కొడకా! మారిపాయ గదరా నీ దెశ! ఈ ఒక్కదినంలోనే మారిపాయ గదరా!- ఇంక నీకీ కంచమెందుకు, ఈ గుడిసెందుకు?...

రంగడు : (తండ్రి రెండు చేతుల్ని విదిలించి కొట్టి విసవిస లోనికి వెళ్లిపోతాడు.)

ఈరయ్య : ఒరే! నీ యవ్వా బడవా?-నీగ్గూడా అలుసైపోతిని గదరా?-అయితే కానీ సూస్తా.

(అని గుడిసింటివైపు ఉరుమురిమిచూచినాడు. అంతలోనే ఎక్కడ లేని ఆత్మీయతానురాగాల్ని మొగం నిండా పులుముకొని మెల్లగా గంగులు వద్దకు నడిచినాడు. ఆమె కుడి పక్కన కూర్చోపోతాడు. గంగులు వంచిన తలెత్త కుండా కుట్టడం జోరు హెచ్చిస్తుంది. సూది ఈరయ్యకు తగలపోతుంది.)

ఈరయ్య : దీనెమ్మను గొట్టా మైండ్ కాసింత డిమ్ము కొట్టేసి నట్టుండాది?- కుట్టేదాని కుడిపక్కన, ఏడ్చేదాని ఎడం పక్కన కూసోవద్దన్నారు, పెద్దోళ్ళు. పెద్దోళ్ళ మాట పెడసెవిని పెట్టచ్చునా? (అని అంటూ లేచి గంగులు ఎడం పక్కన గువ్వలా ఒదిగి కూర్చుంటాడు).

ఏఁవి. గంగులూ-ఏఁ వేఁ వి గంగులూ!
పిలుస్తుంటే పలక వేమె పిచ్చి గంగులూ!
నాబుజ్జి గంగులూ!
(అని ముదిగారంచేస్తూ బుగ్గ గిల్లపోతాడు)

గంగులు : ఛ ఫో! (అని కసిరికొడుతూ పైకి లేస్తుంది. అంతలోనే రంగడు గుడిసెలోనుండి వాకిట్లోకి వస్తాడు. గంగులు కుట్టినిక్కరు విదిలించి వాడికి తొడుగుతుంది. లోనికి వెళ్ళి మచ్చు కత్తి దెచ్చి వాడిచేతికిస్తుంది. రంగడు కత్తి చేదికందుకుంటాడు. చూరులో దారాలు లాక్కొని తిరిగి చూడకుండా వెళ్ళిపోతున్నాడు. గంగులు లోనికి పోబోతుంది.)

ఈరయ్య : (అడ్డుపడి)
పుత్తూరి సంతలోన పూలు నీకు గంగులూ
సిత్తూరి సంతలోన సీర నీకు గంగులూ
మదనపల్లె సంతలోన మంచిరైక గంగులూ!

గంగులు : హవ్వ! నీ మాటా! యిసికలో రాసి దుత్తలో పోసుకోవచ్చు. రాత్రంతా తాగనని సేతిలో సెయ్యేసి సత్తింజేసి తెల్లారేకాడికి తాగేసొచ్చినోడివి! నువ్వోక మొగోడివి!

ఈరయ్య : ఇద్దో, గంగులూ! దగ్గర ఉణ్ణంత సేపేనే మొగుడు!

గంగులు : కంచం ముంద రుణ్ణెప్పుడు కాదో?

ఈరయ్య : అవుననుకో! అయినా సట్టం ఏం జెప్తిందంటే - రాత్రి చెప్పినమాట పొగు లడగుడ్డు. పొగులు జెప్పిన మాట రాత్రగుడ్డూ అని!

గంగులు : అయితే ఇంకెప్పుడడగాల్నిన్ను?

ఈరయ్య : అవును గదా మరి! ఎప్పుడడగాల మరి!... (ఉన్నట్టుండి) ఎతుక్కోయే ఎతుక్కో! ఈ మద్దెలో యూలే.వన్నా ఉంటే ఎతుక్కో!-

: ఇద్దో యిట్లా! తలకేస్తే మొలకు! మొలకేస్తే తలకు!- ఏఁవిజల్మ.వే నీజల్మ.వు?

: మణిసి జల్మమే!-

జల్మమెత్తిన పిదప సుకఁవు కావాలంటే

మంచం వెయ్యవె ఎర్రి గంగులూ!-

: అఆఁ! ఈ మాట్లకేం తక్కవలే!

: గంగులూ! మొగుడు తాగేసొచ్చినప్పుడు పెండ్లాం సంతోసంగా తఁవాసగా జోతిలచ్చిం మాదిర పైపైన పడ్తా ఉంటే హె.! జమ్మని తలకెక్కదంటే?..

: తలకేం మాఁవా కర్మ?.. గుడి సింటి మీదిక్కూడా ఎక్కితింది.

: ఆఁ! ఆ!c ఆఁ!... నీ యమ్మను గొట్టా! ఏవో అనుకుంటి గదే?.. బలే తఁవాసగా మాట్లాడ్తావే నువ్వు!

: సీ! నోర్ముయ్! సిగ్గులేని మొగోడా!

: (బతివాలుతూ) గంగులూ! గంగులూ! అట్టనద్దే దిగిపోతుంది.

: దిగిపోతిందని దిగులు పడ్తావుండావా?

: హ్హె హ్హె హ్హె! నేనేకాదే?-మినిస్టయినా దిగిపోతే దిగులు పడ్తాడు. అట్ట పొయ్యి సూడే!... కరణాలు, మునసబులు కాకుల మాదిరి గోలజేస్తా ఉండారు. దిగిపోతే ఎవుడైనా అంతేనే...

: దిగిపోతే నా కెందుకు? దిగులుపడ్తే నా కెందుకు? రొంౘ్రోజుల్నుండీ కూడూ నీళ్ళూ లేకుండా పస్తులుబడి సస్తా ఉండాం! సాకలేని మొగోడికి సంసార.వెందుకు? పెండ్లాం బిడ్లెందుకు? నీ సిగ్గుజిఁవడ! నువ్వూ ఒకమొగోడి మాదిర తాగేసి తలకాయెత్తుకోని తిరగతా వుండావే?-

: (నంగేడుపు లేడుస్తూ) గంగులూ! నా పొరువు తీసేస్తా వుండావు గదే?- నువ్వే ఇట్లా మాట్లడ్తే ఇంకీ ఊళ్ళో నన్నెవురు లెక్క పెట్తారు? పనికిరాన్నాకొడుక్కూడా పైసాకు మతిస్తాడంటే?...

: (ఆశ్చర్యంగా) అయ్యు! అయ్యు! ఇప్పుడు నేనే.వన్నానని అట్లా ఏడస్తావుండావ్!

: (ముద్దుగా) ఏడ్సినానా?.. నేను!.. (తేలిగ్గా) లేదులేయే! ఏడ్సినట్టే తఁవాసకేడ్సినాను.

: తఁవాస కేడ్సినావా? అరెరెరెరె! మొగోడంటే నువ్వే మాఁవా! ఆడ్తావు, పాడ్తావు, నవ్వతావు, ఏడస్తావు, అడిగితే తఁవాసకంటావు. ఇట్టుండాల మా.వా మొగోడంటే! ఈ ఊళ్ళోగూడా ఉండారు మొగోళ్ళు! ఒక్కొక్కడికి మూతి మింద మీసాలు రాతి కూసాలున్నట్టుండాయి! ఎందుకూ? (లాలింపుగా) మాఁవా! మొగోడంటే నువ్వే!

ఈరయ్య : (దర్పంగా) అందుకే గదంటే అయిుదు వంది కొడుల్నిచ్చినాను. అయిదుమంది రత్నాలు గదంటే!-

గంగులు : ఆఆఁ! ఆ రత్నా లీ పూరికొంపలో ఉంటే దొంగలెత్తక పోతారని పెద్ద పెద్ద మిద్దిండ్లలో దొరల్దగ్గిర పెట్నావు.

ఈరయ్య : పెట్నాం కాబట్టే బద్రంగా ఉండారు. పొయ్ సూసుకోపో! పెద్దోడికి యిం... యిం.... యింతింత మీసాలొచ్చినాయి. మిగిల్నోళ్ళ క్కూడా వచ్చేస్తాయ్!- ఏం తక్కవే నీకు?-

గంగులు : ఇద్దో ఇట్లా తాగి తలకు బోసుకోని తందానాలాడే మొగుడుంటే నాకేం తక్కవే?-కట్టుకోను గుడ్డా?.. కడుపుక్కూడా... దీపానికిఁ ఁవురా?...

ఈరయ్య : ఆబయి.వే నీకొద్దే!-నే నిస్తానుగదే కాసు...

గంగులు : ఎక్కడ్డి మాఁవా నీకు దుడ్డు?

ఈరయ్య : అది నువ్వడగుడ్డు!...నే సెప్పగుడ్డు!!

గంగులు : పోనీ ఎంతుందో సెప్పు మా.వా?

ఈరయ్య : ఆఁ! ఆఁ!- సెప్తాను. అదీ సెప్తాను. ఎంతుందంటే...

(అని గునుస్తూ ఈరయ్య జోబిలో చెయ్యి వేస్తాడు, డబ్బు తీస్తాడే.వో అని ఆశగా ఎదురుచూస్తూ ఉంటుంది గంగులు. తీరా ఈరయ్య బీడీ పైకి తీస్తాడు. గంగులు తెల్లమొగం వేస్తుంది).

ఈరయ్య (బీడీ నోట్లో పెట్టుకొంటూ) నట్టింటి గూట్లో అగ్గిపెట్టుంటే తేబో!...సెప్తాను.

(గంగులు గుడిసెలోనికి వెళుతుంది).

ఈరయ్య : (మంచం వాల్చి కూర్చుంటూ) ఈ ఊళ్ళో ఎలక్సన్లప్పుడు నోటిచ్చి ఓటెయ్య మన్నె నా కొడుకులు నోటు దీసుకున్న ఈ నాకొడుకు ఓటేసినాడో, లేదో తెల్సుకుందాఁవని ముక్కల్దాకా సారాయి పొయ్యిస్తే నోరట్టా తెరవకుండా ముడుక్కోని పాణుకుణ్ణె మిడివేలఁవే నేను!-నీకు సెప్తానంటే?

గంగులు : (అగ్గిపెట్టె తెచ్చి) ఇందమాఁవా!

ఈరయ్య : (అందుకున్నట్లే అందుకోని జారవిడిచి) కింద పడిపోయ్ నట్టుండాది. సూడే.

గంగులు : (యాష్టంగా వంగి చేతికి తీసుకొని) ఇంద!

ఈరయ్య : (బీడీ వెలిగించుకొని ఓరగంటితో గంగుల్ని చూస్తూ) కాళ్ళేఁవో తెగ పీకేస్తా వుండాయి!- (అని ముఖం చిట్లిస్తూ తన కాళ్ళను తానే పిసుక్కోవడానికి ప్రయత్నిస్తాడు. గంగులు గ్రహించింది.)

గంగులు : (మంచం పక్కన కూర్చుని మగని కాళ్ళు పట్టుతూ ఉంటుంది.)

ఈరయ్య : (దర్జాగా బీడీ కాలుస్తూ) అయిదు కేజీలు బియ్యం దెచ్చుకోయే!

) : (ఆ మాట చెవిని పడేసరికి గంగుల్లో హుషారెచ్చింది. ఇంకొంచెం జోరుగా కాళ్ళు పట్టుతూ) పోనీలే మాఁవా! ఈ రొండు రోజులైనా కడుపునిండా కూడు తిని కంటారా నిద్ర పోతాఁవు.

: ఆఁ! ఆఁ! ఉప్పు... మిరపకాయ... సింతపాండు... సఁవురూ-నాలుగూ నాలుగు రూపాయలకు... ఆహాఁ! అయిదు రూపాయలకు దెచ్చుకోయే!-

) : (మరింత హుషారుగా పిసుకుతూ) అట్లానే తెచ్చు కుంటాలే మాఁవా!

: కొత్త సీర గూడ వొగిటి తెచ్చుకుంటా వంటే?

) : (ఆశగా) తెచ్చుకుంటాను మాఁవా!

. అట్నే రైగ్గడ్డ గూడా వొగిటి కొనుక్కో!-

) : (ఇంకా ఆశగా) కొనుక్కుంటాన్లే మాఁవా!

: కొత్త సీర... కొత్తరెక... ఒక కోడిని కూడా కోసుకుంటే...

) : (సందేహంగా) అవును మాఁవా! ఇంత దుడ్డు నీకు యాణ్ణుంచి వచ్చింది మాఁవా?

: ఆఁ! దొంగలించ కచ్చినానే!- మీ ఆడోళ్ళంతా ఇంతేనే!- తెస్తే ఒక బాద. తేకపోతే ఒక బాద!- తేకపోతే తేలే దంటారు. తెస్తే-ఎక్కడ దెచ్చినావు, ఎంత దెచ్చినావు, ఎట్ట దెచ్చినావు?... సిండకు పన్నెండాయాలు!-ఆడోళ్ళ కెందుకే ఇదంతా?-

: ఆడోళ్ళు మాత్రం మణుసులుకారా? సంసారం చేసే ఆడది ఆ మాత్రం అడగుడ్డా?-

: అయితే నా దగ్గిర లేదుబోయే!-

: (బతిమాలుతూ) మాఁవా! మాఁవా! తప్పయి పొయ్యిందిలే మాఁవా? ఇంకడగను. ఈ మాఁవా!

: ఏందే?

: నువ్వు దుడ్డీ మాఁవా!

: గంగులూ! నిజిం జెప్పమంటావా? అపద్దం జెప్ప మంటావా?

: నువ్వు నిజిం జెప్పిందెప్పుడు?

: (నెత్తిన చెయ్యి బెట్టుకొంటూ) సత్తింగా ఇప్పుడు సెప్తానే నిజిం!

: సెప్పు.

: తిట్టవుకదా?

: సత్తింగా తఁవాసకు జెప్పినానే నాదగ్గిర డబ్బుండా దని!- నేనేఁవన్నా మంత్రి కల్లుణ్ణా? మనూరికి సరపంచనా సంపాయించేదానికి?-

గంగులు : ఈ మొకానికాబయిసికూడానా?... సీ! పాపిష్టోడా!- నేనిట్లా ఆకిలితో అల్లాడ్తా, మారు గట్టుకోను సీర లేకుండా మగ్గిపోతా ఉంటే నాతో తఁవాసా పడ్తావా? (అంటూ ఏడుస్తుంది).

ఈరయ్య : (బ్రతిమాలుతూ) గంగులూ!... గంగులూ!... ఏడవద్దే- నీకు సిలమా సూపిస్తానే!

గంగులు : అదొక్కటే తక్కవ ఈ బతుక్కు!-

ఈరయ్య : పోనీ! సిల్మా ఆక్టర్లిసూపిస్తా! రంగారావ్నీ... సావిత్రినీ... రేలంగినీ....

గంగులు : మాఁవా! ఎలిక్కి పాణం పోతా ఉంటే పిల్లి సెలగాట వాడిందట!- కూడు లేకుండా కుఁవిలి సస్తావుంటే సిలమాలు... సిలమా ఆక్టర్ల్ని సూపిస్తాడంట!- ఇట్లా మొగోడితో సంసారంజెయ్యను నావల్ల కాదురా దేవుడో!... లబలబ నోరుగొట్టుకుంటూ...

ఈరయ్య : (గంగులు నోరు కొట్టుకుంటా ఉంటేతటాలున చేయి పట్టుకొని నడుం మీద ఒకచెయ్యి వేసి ఒయ్యారంగా నిలబడి) నీ యమ్మను గొట్టా! బలే ఉండావే మణిసి. ఇట్లాగానా పోటా తీసుకుంటే...

గంగులు : (వ్యంగ్యంగా) సిలమా వాళ్ళ మాదిరుంటాఁవు గద మాఁవా?

ఈరయ్య : ఇప్పుడు గదంటే ఈరడి పెండ్లాఁవంటే ఈ రాయినో...

గంగులు : (ఈరయ్య తనమీదవేసిన రెండు చేతుల్ని విదిలించికొడ్తూ) నీ సిగ్గుజిఁవడా నన్నూస్తే ఎగతాళా నీకు?- కోతి పిల్లనో కుక్కపిల్లనో ఆడించినట్లాడిస్తా ఉండావే?- ఇట్లా కాని ఉడకాడించినా వంటే నేనే బాయిలోనో గుంటలోనో దూకి సస్తాను.

ఈరయ్య : సచ్చి సుకపడి పోదాఁవనుకుంటా ఉండావా గంగులూ!- పోయే పో.. నువ్విట్ట సుకపడిపోతావు. నీబిడ్డలకేం? వాళ్ళు దొరల్లాగా బతకతా ఉండారు. నడిమిద్దె నేనేగదే అన్యాయఁ వయిపోతా ఉండేది!- పోతాన్లే యే! పోతాన్లే!... (బోరోమని ఏడస్తాడు)

గంగులు : ఎట్లమ్మా ఈ మొగోడ్తో ? ఈ డెవరో ఈయనకన్యాయం చేసేసినట్టు !... ఆయన్జేసేది అన్నాయం కానట్టు!...

ఈరయ్య : (తటాలున తేరుకొన్నట్టుగా) ఏఁవే!...ఏవన్నాఁవే!... ఇంకొక సారను!...నేనా? నా పెండ్లానికా?.... అన్నా యఁవా?... హె.! ఈ డంటే ఏఁవనుకున్నావే? ఇద్దో యిందే!- (జేబులో డబ్బు తీసి గంగులుకి చూపిస్తాడు. ఒక్కసారిగా గంగులు మొగంలో పువ్వులు పూస్తాయి. ఆనందంగా డబ్బు చేతికి అందుకోపోతుంది. ఈరయ్య గబుక్కున చేయి కిందికి దించేసి) ఒసే!... ఒక్క సారి!....ముసిముసిగా నవ్వుతూ గుడిసె వేపు చూస్తాడు.

: ఈ మాఁవా! నన్నెందు కిట్లా ఉడకాడిపిస్తావే?-

: ఆహా! ఒక్కసారే...

: తాగేసొస్తే మాఁవా నువ్వుండావే మణిసే గాదు మాఁవా!

: మణిసి కాకపోతే మాకా?-

: (మగని దగ్గర చేరి ఆప్యాయంగా) నే నట్టంటినా మాఁవా!- నా మాఁవ బంగారి కొండ... నా పగడాల దండ...నే నడగతానే దుడ్డిచ్చేస్తాడంట! నేనొక్క అడుగులో అంగిడికి పోతానంట!... పొయ్యి బియ్యం, ఉప్పు, పప్పు తెచ్చేస్తా నంట!... తెచ్చేసి కన్నట్టా మూసి తెర్చే లోపల ఉడకబెట్టేస్తా నంట!.. ఉడకబెట్టేసి గబగబ అంత తినేసి... తినేసి (నోటికి చేతిని అడ్డం పెట్టుకొని ఫక్కుమని నవ్వుతుంది గంగులు).

: ఆహాఁ! ఆఁ ఓల్‌రైట్ (నవ్వుతో నవ్వు కలుపుతాడు).

(ఇద్దరు కాసేపు హాయిగా నవ్వుకొంటారు. గంగులు ఈరయ్య చేతిలో డబ్బు నవ్వుతూనే లాక్కొంటుంది. ఈరయ్య మంచం మీద దర్జాగా కూర్చుంటాడు. గంగులు గుడిసెలోనికి వెళ్ళి సంచి తీసుకొని సామాన్లు తెచ్చు కోవడానికి బయలు దేరుతుంది. పక్కింట్లో వరదయ్యా ఎదురొస్తాడు).

: (ఆత్రతతో) పెదయ్యా! సుబ్బులికి వళ్ళెట్టుండాది పెదయ్యా?

: దర్మాసుపత్రిలో సేరిపిస్తి గదమ్మీ!

: ఆసిపత్రిలో సేర్సుకుణ్ణారా మాఁవా!... అయితే ఇంకేం బాద?... బతికిపొయ్‌నట్టే పో!

: ఏం బతికితిందో?ఏఁవో? నాకేం నమ్మకం కుదరటం లేదురా!

: అదేంది పెదయ్యా అట్టంటా వుండేవే?-వాళ్ళేం జాగర్తగా సూడ్డంలే?...

: ఏం జాగర్తో నాతాడు జాగర్త. జాగర్తగా సూసేదానికి వాళ్ళకు కడుపున పుట్టిన బిడ్డా? కట్టుకున్న పెండ్లావా? రొండు తెల్లమాత్తర్లు నోట్లో యేసి అన్ని రంగునీళ్ళు గొంతులో పోస్తా ఉండారు. అదేఁవంటే?- సారిసారి కొక సీటీ రాసిస్తారు. నేనేఁవన్నా లచ్చాదికార్నా రాసిచ్చినపుడంతా కొనక్కపొయ్యి ఇచ్చేదానికి?- ఊళ్ళో అడిగినోళ్ళనే అడగతా ఉంటే ఎంతకాలఁవని ఇస్తారు? ఎన్నాళ్ళని ఇస్తారు?... ఇద్దో ఇప్పుడు కూడా మొందుల్తెచ్చుకోమని ఈ సీటీ రాసిచ్చినారు.

: సీటీ దీసుకొని ఈడికొచ్చినావే!- ఈడేడుంది మాఁవా మొందులంగడి? పోపో!- తొందరగా పొయ్యి మందుల్తీసు కొని పో!-

: ఎట్లా తీసుకొని పొమ్మంటావురా?- సేతిలో సిల్లిగవ్వ లేదు. తెల్లార్నుండి తిరిగిన సోటు లేదనకుండా తిరగతా ఉండా!- అదా? మూసిన కన్నట్టా తెరవడం లేదు. ఈ పొద్దు గడిస్తే రేపు సెప్తానంటావుండారు.

గంగులు : (బాధగా) పెదయ్యా! మేవేం సచ్చినాఁవనుకున్నావా పెదయ్యా! ఇందా! ఈ యాభై తీసుకో! ముందుగా పొయ్యిమొందుల్తీసిచ్చేసి, మల్ల కావాలంటే ఏ పనైనా సూడు. అది బతికితే మల్ల కావాలంటే సూసుకోవచ్చు!-

వరదయ్య (ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ) నిన్నూ నీబిడ్డల్నీ దేముడు సల్లంగా సూస్తాళ్ళేమ్మీ! సల్లంగా సూస్తాళ్ళే! (అంటూ వెళ్ళిపోతాడు). (గంగులు వరదయ్య వెళ్ళినవైపే కా సేపు చూస్తూ నిలబడింది. ఈరయ్య గంగుల్ని కోపంతో చూస్తూ నిలబడినాడు. అది గమనించనట్లుగా గంగులు నిట్టూరుస్తూ గుడిసెలోనికి పోబోతుంది).

ఈరయ్య : (కోపంగా) గంగులూ!

(ఆ పిలుపుతో గంగులు అదిరిపడి నిలబడుతుంది. కొడతాడేమో అన్న భయంతో బెదిరిబెదిరి చూస్తూ నిలబడుతుంది. కండ్లల్లో నిప్పులు కురిసినంత కోపంగా చూస్తూ ఈరడు గంగులు వద్దకు నడస్తాడు. గంగుల్లో మెల్లగా వణకు ప్రారంభమయింది).

ఈరయ్య : (బాగా దగ్గరికి వెళ్ళి అనుకోని విధంగా) ఇప్పుడు నువ్వాముసలోడికిచ్చిందేందే?

గంగులు : (తెపరాయించుకొని తేలిగ్గా) డబ్బు మాఁవా!

ఈరయ్య : ఎంత తేలిగ్గా అన్నావే?- అదే ఉన్నోడైతే ఏఁవంటాడో తెలుసా?. డబ్బు. అంటాడు. అందుకేనే వాళ్ళు అట్లుండారు. మనం ఇట్లుండాం. ఆ డబ్బుకోసరం నేనెన్ని తిప్పలు పణ్ణానో నాకు తెల్సు. కుండలో నీళ్ళు ముంచి ఇచ్చినట్లిచ్చేస్తివి గదే మహా దరమదాత మాదిరి!-

గంగులు : (ఎత్తి పొడుపుగా) రేత్రి జెప్పింది పొగు లడగుడ్సు, పొగుల్జెప్పింది రేత్రి అడగుడ్డు అనే మొగోడికి నీ కెట్లా గ్యాపక ముటుందిలే!

ఈరయ్య : (దురుసుగా) ఏందే నువ్వనేది?

గంగులు : మాఁవా! అప్పుడు కాలిరిగిపోతే నువ్వు పుత్తూర్లో పొణుకోనుండావ్! నేనా కడుపుతో ఉండా. ఇంట్లో అంత కాసిపోసే దిక్కా లేదు. అప్పుడు నన్నూ నా బిడ్డల్నీ కండ్లల్లో వత్తులేసుకొని కాపాడిందెవురు? సుబ్బులే కద మాఁవా! దేవుడు సిన్నసూపుసూసి పాయాన్నే దాని పసుపూ కుంకుమ పెరక్కపాయ. గడపదాటి కాలు బయట పెట్టని ఆడది ఆ పొద్దుట్నుంచే గద మాఁవా! కూలీనాలీ సేసి ఆ బిడ్డల్ని, ముసిలోణ్ణి అట్టా సాక్కుంటా ఉండాది. ఇప్పుడున్నెట్టుండి దాని గెతేవన్నా అయిపోతే ఆ బిడ్ల గెతేం కావల్ల? ముసిలోడి గెతేం కావల్ల? ఇట్లాంటప్పుడు గూడా ఆదుకోకపోతే ఎట్లా మాఁవా!

: ఆదుకోవాల్సిందేనే!- కానీ ఇట్లాంటి ఆడదానికి మాత్రం సస్తావుంటే కూడా గొంతులో నీళ్ళన్ని పొయ్‌గుద్దే!-యదవ! యదవాట్లాడి కడుపు దెచ్చుకుంటే-

: మాఁవా! యిసంవుండే జంతువులగ్గూడా యిశ్వాస వుంటిందంట! సెయ్యెత్తి దండం పెట్టే పడిగెత్తిన పాఁవులు కూడా ఎనిక్కెనిక్కెళ్ళిపోతాయంట. కానీ కాళ్ళ మింద పడ్డేకూడా ఈ ఊళ్ళో పెద్దమణుసులకు కనికారం లేకపాయనే!-అందురూ దా నీడు ఆడకూతుర్లుండే అడ్డగాడ్డిలే!- దాని మింది కెగబడ్రి!...

ఎగబడ్డేమాత్రం?

మనబోటోళ్ళు కొండల్నెదిరించ గలగతాఁవా మాఁవా?

అదీ నిజఁవేనే?

ఇప్పుడు సెప్పు మా.వా! అది కడుపు తెచ్చుకునిందా? ఈ వూళ్ళో పెద్ద మణుసు లిచ్చినారా?

(బదులు సెప్పలేక తల గీరుకుంటాడు)

అది దేవత మాఁవా! దాన్నట్టనద్దు. అంటే కండ్లు బోతాయ్!

అవునే! తాగినోడు దేవుడితో సఁవానఁవే! అయితే ఒకొకప్పుడు దెయ్యఁవైపోతా వుంటాడు. కుయ్ రాని కూతలు కూస్తా ఉంటాడు. వాటితో యేం పని కానీ నువ్వు ముందు పని సూడు- (అంటూ జేబులో చెయ్యివేసి డబ్బు తీసుకోవడానికి ముంపి మళ్ళీ తటాలున జంకి) కాసిన్ని మంచినీళ్ళు తీసుకోయే!

(గంగులు మంచినీళ్ళు తేవడానికి గుడిసెలోనికి పోతుంది. ఈరయ్య గబగబ జేబులో నుండి నోట్లకట్ట బయటికి తీసి అందులో నుండి ఒక్క పది రూపాయలు కాగితాన్ని మాత్రం చేత పట్టుకుంటాడు. అంతలో గంగులు సత్తులోటాతో మంచినీళ్ళు తెస్తుంది. ఈరయ్య ఆ లోటాను అందుకొంటూ)

: గంగులూ! యిద్దో యీాదుడ్డు తీసుకో! నూకల్తెచ్చి సంకటంత కెలుకు, తినేసి సుబ్బమ్మను సూసొద్దాం.

(గంగులు డబ్బు తీసుకొని బయల్దేరపోతుంది).

: గంగులూ!

: ఏం మాఁవా?

: పోనీలే! ఆ సేతిలో ఉండేదేందో సెప్తావని!

: (తేలిగ్గా) డబ్బు మాఁవా!

: ఆ.! అదేనే వద్దనింది. అట్లా తేలిగ్గా సెప్పినంతకాలం మన బతుకు లిట్లానే తెల్లార్తా వుంటాయ్!

: (ఒయ్యారాన్ని ఒలకపోస్తూ) పారబాటై పొయ్యిందిలే మాఁవా! (వత్తి పలుకుతూ) ఇది 'డబ్బు' మాఁవా!

: ఆ.! అట్లను. బద్రం. బద్రఁవే! దీన్ని కూడా యింకెపుడైనా అడక్కముందే యిచ్చే సేవ్!

గంగులు : ఆ మాత్రం నాకు తెలుసులే మాఁవా!

(గంగులు సంచి చేతికి తీసుకొని బయలు దేరుతూ ఉంటుంది)

ఈరయ్య : (దర్జాగా) గంగులూ! ఏయ్ గంగులూ!

గంగులు : ఏం మాఁవా?

ఈరయ్య : నాలిక సవి సెడి పొయ్‌నట్టుండాది. రొండు తాటాకు శాపల్దెచ్చి పుల్సు పెట్టే!

గంగులు : (మెల్లగా దగ్గరికి వచ్చి, ముదిగారంగా) రొండు మాఁవిడి కాయల్దెచ్చి అంత ఊరుబిండి నూర్తాను మాఁవా!... పుల్లంగా బాగుంటుంది.

ఈరయ్య : (ఆశ్చర్యంగా) ఏఁవే? మాఁవిడికాయ ఊరిబిండి అంటావుండావ్! ఏం కత?

గంగులు : (సిగ్గుతో) నువ్వు పో మాఁవా!

ఈరయ్య : ఒ సె నీ... ఎన్నెల్లే?

గంగులు : (సిగ్గుతో ముసిముసిగా నవ్వుతూ ముక్కు తుడుచు కొనింది. అ తుడుచుకోవడంలో ఈరయ్యకు మూడువేళ్ళు కనిపించాయి).

ఈరయ్య : మూణ్ణెల్లా? ... అయితే నాలుగు, అయిదూ, ఆరూ, ఏడూ, ఎనిమిది, తొమ్మిది - యింకార్నెలల్లో మనం లచ్చాదికారన్నమాట! (ఓయ్! ఓయ్! ఓయ్! అంటూ ఈరయ్య గంగులు పొట్టమీద మూపుడు వేలితో సుతారంగా పొడుస్తాడు. ఇద్దరు కాసేపు హాయిగా నవ్వుకుంటారు. గంగులు వెళ్ళిపోతుంది. ఈరయ్య నీళ్ళు తాగి మంచం వాల్చి కూర్చుని బీడీ ముట్టించుకుంటున్నాడు.)

సింగంపుట్టి: ఏఁవూరయ్యా ఈ ఊరు? ... ఈ ఊర్ని ఊరణ్ణోణ్ణి, నా పెళ్ళాం పెతివ్రత అన్నోణ్ణి, జొన్నన్నాన్ని కూడన్నోణ్ణి చెప్పు తీసుకొని కొట్టాలయ్యా... ఏఁవూరయ్యా ఈ ఊరు? బుద్దుండే వాడెవుడుంటాడయ్యా ఈ ఊళ్లో!

ఈరయ్య : ఏఁవిరే సింగంపుట్టీ! పట్టేదానికి పగ్గాల్లేనట్టుంది గదరా యవ్వారం!

సింగంపుట్టి: లేకపోతే ఏందయ్యా?- అడవంఎత్తుకోని అడుగట్టా పెట్టే సాలు! నా గ్గొరుగు! నాగ్గొరుగు! తుడిఁచి తడిఁచి గొరిగించు కుంటారే? ఆ మాదిర్నే ఎంచెంచి యిస్తే గదా? రేపు రా! ఎల్లుండి రా! అంటే యీ పొద్దు నా పని ఒక పొద్దే గదా?

ఈరయ్య : పోనీలే రాబ్బా!

సింగంపుట్టి: పోనిచ్చేదా?

ఈరయ్య : పోనీకుండా పట్టుకోని పెరుకులాడ్తే యిప్పుడొరగబడ బొయ్యేది మాతఁవే వుంది? దాన్నట్టా దొంగల్దోలు. నేనే నీ దగ్గరికి రావాలనుకుంటా ఉంటే నువ్వే వచ్చేసినావ్!

సింగం పుట్టి: అద్దో-అద్దో! అదే గదా వద్దనేది!-గెడ్డం కూడా పెరగలేదే?

: ఒరె నీ యమ్మా బడవా! నీతో వచ్చిన గొడవే యిదిరా! మనకు తెల్సినోళ్ళది పెండ్లొకటుండాదిరా!-

ట్టి : ఎవర్దబ్బా?

: రొండు డోళ్ళుండాల, రొండు నాగసరా లుండాల. రొండొందలిస్తారు.

ట్టి : ఎవురయ్యా వాళ్ళంటే?

: సెంద్రగిరి సెంగఁవ నాయుడోళ్ళురా!

ట్టి : అవ్వ! వాళ్ళా?... అమ్మనంత పొద్దుకాడ దుడ్డికర్రెత్తు కొని నడ్డిరిగ కొట్టే వాళ్ళు...

: నీ కెందుకురా? - రొండొందలు తీసిచ్చే పూచీ నాది!

ట్టి : (ధీమాగా)మేళం సక్కరంగా జరిపించే పూసీ నాది!

: (గడ్డం తడుముకుంటూ) రే, సింగంపుట్టీ! నువ్వు గ్యాపకం చేస్తే గుర్తొచ్చింది. కొంచింగా మొక్కొచ్చి నట్టుంది. అట్లా గీకేస్తావా?

ట్టి : కూసో!

(ఈరయ్య కూర్చున్నాడు, సింగంపుట్టి నీళ్ళతో గడ్డం తడుపుతున్నాడు.)

: (సందేహంగా) ఒరే-మొన్న గొరిగిందాని క్కూడా యీలేదు గదా నీకు?

ట్టి : (గడ్డం తడిపేది తటాలున ఆపి) అంతకుముందు గొరిగిందానికిచ్చినావో!

: ఒరె- ఒరే! అవున్రే! యిది మూడోసారి గదా? - అంతా కలిపి...

ట్టి : ఆ.! అంతాగలిపి మూటగట్టి నా సెత్తిన బెట్టబోతావ్! - నేను మొయ్యలేక బండొకటి బాడిక్కి మాట్లాడుకో బోతా!- (అని అంటూ రాతిమింద కత్తి నూరుకొంటు న్నాడు దురుసుగా).

: ఏఁవిరే నీయమ్మా మొగడా! - నువ్వు నూరేది సూస్తాఉంటే గొంతు కోసేటట్టుగా ఉండాదే?

ట్టి : గొంతా!... కరకర తెగ్గోస్తే మాత్రం పాపముందా ఈ వూళ్ళో వాళ్ళని, (కత్తి చేతిమీద తిముడుతూ) నువ్వు ముందు బోణీచెయ్! -

: ఏందిరే? - ఊరంతా గొరిగేసొచ్చి నన్ను ముందు బోణీ చెయ్యమంటా ఉండావే? యిస్తానుగని కానిరాబ్బా!

ట్టి : అదంతా కాదు గనీ... నువ్వు ముందు బోణీ కానీ...

: ఒరె- ఒరె- ఒరే! ఈ గుడిసెత్తి నెత్తిన బెట్టుకోని గూడురికి పోతాననుకున్నావా?... యిస్తాను కానీ రాబ్బా!

ట్టి : నువ్వు గూడూరికన్నా పో!- గుంటూరికన్నా పో, అదంతా నా కక్కర్లేదు కానీ, నువ్వు ముందిక్కడ పెట్టు! (పైకిలేస్తాడు)

(ఈరయ్య జేబులో చెయ్యివేస్తాడు సింగంపుట్టి ఆశగా చూస్తా ఉంటాడు. ఈరయ్యా పదిరూపాయల కాగితం పైకి తీసేటప్పటికి సింగంపుట్టి గబుక్కున ఈరయ్యా ముందు కూర్చుని మళ్ళీ ఒకసారి గడ్డం తడపడానికి ప్రయత్నిస్తాడు. ఈరయ్యా పదిరూపాయలు మళ్ళీ జేబులో దాచుకొంటూ)

ఈరయ్య : ఒరే! ఈ పొద్దు మంగళారం గదా? నేను పస్జేసుకోన్రే! (అంటూ పైకి లేవబోతాడు.)

సింగంపట్టి : ఏందే? ఈపొద్దా మంగళారం? నువ్వువారం వర్జిం రొండూ తెల్నోడుగా ఉండావే? ఈ పొద్దు బుదోరం గనీ కూసోయ్యా! కూసో! - ఆడోళ్ళుగానీ యింటే అరగంట సేపు నవ్వబోతారు.

ఈరయ్య : (అయిష్టంగానే కూర్చున్నట్లే కూర్చుని అంతలోనే గబుక్కున ఏదో మతికి తెచ్చుకున్నట్లు!) ఒరే! నేను మర్సేపాయ్ నా్రా! మా ఆడది కడుపుతో ఉండాది. నేను గొరుక్కోగుడ్దు కదరా?

సింగంపుట్టి : అదే! అదే! అదేగదా నీ దగ్గిరొచ్చింది?

ఈరయ్య : (నెత్తిన చెయ్యి పెట్టుకొంటూ) మా యబ్బతో... సత్తింగా ...

సింగంపుట్టి : సీ! ఏం మణిసయ్యా నువ్వు! ఒకరి కిద్దరు కొడుకులు పెండ్లి కెదిగుంటే పెండ్లానికి కడుపొచ్చిందంటావ్! - ఆపరేసనన్నా సెయ్యించుకొని ఏడవగుడ్దా?

ఈరయ్య : (సందేహంగా) అదిగాదురా! మనం ఆపరేషన్ సేసు కుంటే ఆడదాన్తో సంతోషంగా, తవాసగా మాట్లాడే దానికి ఈలుంటుందంటావా?

సింగంపుట్టి : ఈలుంటుందా? - సిన్నంగంటా వామాట! కీలు కీలు రాంకీర్తన పాడదుద్దా?

ఈరయ్య : ఒరే ఒరే నీ యమ్మాబడవా? నువ్వుబలే తవాసగా మాట్లా డ్తావురా! (అంటూ అలవాటు మేరకు సింగంపుట్టి నట్లా పాడస్తాడు.)

సింగంపుట్టి : (పొడిచిన చోట తడుముకుంటూనే!) అట్లా సూడు. అవ్వి గోర్లా? సింతయేర్లా?

ఈరయ్య : అవునవున్రే! అనుకుంటానే మర్సిపాయ్ నా? ఆ గోరుగా ల్తీసుకోనట్లా కో సెయ్యిరబ్బా!

సింగంపుట్టి (ఈరయ్య చేతిని పట్టుకొని గోర్లవైపు చూస్తూ) ఈగోళ్ళల్లో మట్టి దీస్తే గుడి సింటికి గోడ పెట్టచ్చు గదయ్యా!

ఈరయ్య : ఆ.! బొచ్చు కత్తిరించి గుడిసె కప్పచ్చురా! ఇచ్చిత్రంగా మాట్లాడతావురా ఏంది మాట్లాడినా! మట్టి పిసుక్కునే గోళ్ళల్లో మట్టిగాక మాణిక్యాలా ఉంటాయ్?

ట్టి : మరి? ఆ గోళ్ళెట్టా తెగతాయ్? (అంటూనే గోర్లు కొయ్యడానికి ప్రయత్నిస్తాడు.)

: (అనునయంగా) ఒరెబ్బా! సింగంపుట్టీ! నువ్వు గొరిగేది నేర్సుకున్నాక ఎప్పుడైనా ఈ గోరుగాల్ని సానకిచ్చినా వంటాఁ!-

ట్టి : నువ్వొకసారి అట్లాయిచ్చుసూద్దాం!

: ('ఈ.య్!' అని యిచ్చి చూపిస్తాడు.)

ట్టి : నాగోరుగోలుకంటే నీపండ్లే బాగుండాయ్ గనీ, కూసోని తీరిగ్గా కొరుక్కో!

: ఒరెబ్బా! నీతో మాట్లాడేదే బుద్ధి తక్కవ! నువ్వు పోరా సాఁవీ!

ట్టి : యాందే! పోకుండా యాణ్ణేకూసుంటా ననుకుణ్ణావా? -అఁహ! నేనేమన్నా నువ్వనుకుణ్ణావా? - గోర్లు గొరుక్కొంటా కూసుండే దానికి!-

: ఒరెబ్బా! నాకు తెల్సులేరా? నువ్వేం తక్కువైనోడా?- ఊరికి ముందు పుట్నోడు గనీ నువ్వుపొయ్యి ఊళ్ళో పని సూడు.

ట్టి : నేనేం నీ మాదిర పనికిమాల్నోడు కాదులేయ్యా- కొడుకులు సంపాయిస్తావుంటే కూసోని తినేదానికి!- నాపని నాకు తెల్సులే! (అంటూ వెళ్ళిపోతాడు.)

: (సింగంపుట్టి వెళ్ళిపోయడనుకొని) అబ్బబ్బ! ఈడుండాడే మహా తగరాద మణిసి.

ట్టి : (ఉన్నట్టుండి తిరిగొచ్చి) ఏందే? తగరాదా?... నాదా తగరాద? మొదట నీది జూసుకోయ్యా!- కసిరెడ్డి నిన్ను ఉన్నపళాన ఎంటబెట్టుకొని రమ్మన్నాడు - నేనొక పనికిమాల్నోణ్ణి. వొచ్చిన పనే మర్సిపాయ్‌నా!

: (బ్రతిమాలుతూ!) ఒరే నాయనా! నీకు దణ్ణం పెడ్తాన్రా సాఁవీ! ఊళ్ళోలేడని సెప్పరా!

ట్టి : అయితే ఆ పదిమార్సు! పాత బాకీ యిట్టాగొట్టు. మొందుకన్నా అవుతుంది.

: మార్సకపోతే...

ట్టి : నేరుగా కసిరెడ్డికాడికి పోతా! నా కన్నా బుద్దుండుల్ల రెడ్డయ్యా వాడి కాడికి బొయ్యేదానికి!- పొయ్యి పిలిస్తే వాడేవన్నాడో తెలుసా?- వాడేంది? నన్ను రమ్మనే దేంది? యిష్టంవుంటే వాడే వస్తాడు. నడిమిద్దె నీదేందిరా బోడివేళం... బొచ్చు గొరుక్కోకుండా! అని అన్నాడు- అని సెప్తా!

: అయితే నేనూ పోతాన్లే!

ట్టి : యాడికి?- కసిరెడ్డి దగ్గిరికా!

: కాదు. మా వరదయ్య మాఁవ దగ్గిరికి!

సింగంపుట్టి : ఎందుకూ?

ఈరయ్య : (నిర్లక్ష్యంగా) సుబ్బుల్ని ఆసిపత్రిలో సేరిపించినాడంట! 'ఎవుర్రా! కడుప్పొయ్యేదానికి దీనికి నాటు మొందిచ్చి ప్రాణాల మిందికి తెచ్చింది. సెప్పరా పోలీసు కంప్లీటియ్యాల!' అని డాక్టర్లు గదఁవాయించి గదఁవాయించి అడగతావుండారంట. 'సింగంపుట్టే గదరా మొందిచ్చింది. సెప్పమంటావా?' అని యింతకు ముందే వచ్చి అడిగిపాయ. 'నే నొస్తా నువ్వు పద మాఁవా! ఆ యరవదాక నువ్వేం నోరుజారబాగ!' అని సెప్పి పంపినా!

సింగంపుట్టి : (తటాలున ఈరయ్య రెండు చేతులు పట్టుకొని) సాఁవీ! సాఁవీ! యివ్వి సేతులు గావు. అంత పన్జేసి నువ్వు కొంపమిందికే తెచ్చి పెట్టేవు.

ఈరయ్య : (తల గీరుకొంటూ) అయితే ఎట్లా సెయ్యాలబ్బా?... మామాఁవతో నే నొస్తానని సెప్పినే!-

సింగంపుట్టి : సెప్తే సెప్పినావు గనీ... నువ్వు కూసో సెప్తా! (అంటూ బలవంతంగా కూర్చోబెట్టబోతాడు.)

ఈరయ్య : మాయబ్బతోరే! నా పెండ్లాం కడుపుతో ఉండాదిరే!... సత్తింగా నేను గోరుక్కోన్నే! (కూర్చోనంటూ ఈరయ్య. కూర్చోబెట్టాలని సింగంపుట్టి యిద్దరు కా సేపు పెనుగులాడ్తారు. కడకు యిక తప్పదన్నట్లుగా ఈరయ్య కూర్చుంటాడు. సింగంపుట్టి బొడ్డులో దోపుకొన్న సారాయి సీసా బయటికి తీస్తాడు. ఈరయ్య వీరుడిలా పోజు పెట్టి కూర్చుంటాడు. ఇద్దరు మందు పట్టించడానికి ఆరంభిస్తారు).

ఈరయ్య : అయినా సరే సింగంపుట్టీ! యిట్టా శాతగాని పన్లు నీకెందుకురా?-

సింగంపుట్టి : నాకుశాతగాలేదు నిజవేనబ్బా! శాతైన ఆ దరమాసి పత్రిలో పొయ్యి సూడుపో! పాయ్‌నవారం మూడు కేసులు రా.!- మాతాత జేసె. మా యబ్బ జేసె. నేను సేస్తా వుండా!! యిదొగిటే కేసుగదయ్యా?- అయినా దాని తర్రాతట్టా రాసిపెట్టుంటే ఎవురు మాత్రం యేంజేస్తారు?-

ఈరయ్య : అందురికీ ఏవుర్రాస్తారోయేఁవో కానీ. దాని తర్రాత మాత్రం ఈ వూళ్ళో పెద్ద పెద్ద మణుసులే రాసినాఁరా!

సింగంపుట్టి : సిన్నంగంటావా ఆ మాట?- ఈ ఊళ్ళో నా కొడుకులుండారే ఆడదట్టా నవ్వితే సాలు. అయిదరాబాద్దాక నడ్సేపోతారు. ఆడదాన్ని అంగిడికి పంపించాలంటే కూడా అరిసేతిలో గుండెకాయిలు పెట్టు కోవాల్సిందే?... లంజాకొడుకులు...

ఈరయ్య : ఒరే నాయినా! నువ్వుండావే!- తాగితే బలే యవ్వారం మణిసిరా!

ట్టి : (పండ్లు పటపట కొరకతా) ఈ ఊళ్ళో నా కొడక లందర్నీ కరకర...

: ఒరె- ఒరె- ఒరె! నీకు దండం పెట్తా్రా సాఁవీ! నువ్వు పదరా నాయినా!-

ట్టి : పోతా! పోతా పోతా నీకొకమాట సెప్పేసి పోతా! ఈరయ్యా! నీకు బతకను తెలియక పోతే నేను సెప్తాను యినుః. నీకు గొరిగేది నేరిపిస్తా! ఈ ఊరుగాకుంటే తిరపతికి పో! శాతనైనకాడికి గొరుక్కోని బతుకు. తప్పులేదు. నీ కిష్టం లేకపోతే ఆ గుడి ముందరే నిలబడి యిడ్సి పెట్టి పొయ్యే సెప్పులకు కావిలి కాసి బతుకు తప్పులేదు. అదీ వద్దకపోతే ఉప్పెత్తుకోని ఊరూరు తిరిగి అమ్ముకోని బతుకు. తప్పేలేదు. అంతేకాని ఒకడికింద వొంగి శాకిరీ జేసేది మాత్రం శానా తప్పు. ఆ బతుకు బతికే దానికంటే ఉరుబోసుకోని సచ్చేది మేలు! (అంటూ సీసాలో మిగిండి గబగబ గొంతులో పోసుకొని చరచర వెళ్ళిపోతాడు. ఈరయ్య సింగంపుట్టి వాకిలి దాటించి వచ్చి మంచం మీద కూర్చుని)

: నాయాలు ఈడు జుట్లు కొరుక్కోని బతికితే ఆ జుట్లల్లో దూరిపొయ్యే నాకొడుకును నేను. నాకు జెప్తాడా యీడు నీతకాలు! (హ్హహ్హహ్హ) ...

(కు.ని. ప్రచారక్ ప్రవేశిస్తాడు.)

చారక్: (వాకిలికి అవతల్నే నిలబడతాడు. ఈరయ్య మంచం మీది దుప్పటిని తీసి విదిలించుకొంటూ గుడిసెలోనికి పోబోతున్నాడు కు.ని. ప్రచారక్: 'ఈరయ్యా!' అని పిలుస్తాడు. ఆ పిలుపు చెవిని పడడంతోనే గబుక్కున మంచంమీద ముడుక్కోని దుప్పటి ఒళ్ళంతా కప్పుకొని నిద్ర నటిస్తాడు. కు.ని. ప్రచారక్ అది గమనించి నవ్వుతూ మంచం దగ్గరికి వస్తాడు.)

చారక్: వీరయ్యా!... ఏఁవండీ వీరయ్యగారూ?

: (బాగా వినిపించేటట్టుగా గురక పెట్తాడు.)

చారక్: అయ్యా! వీరయ్యగారూ! నువ్వందరి జుట్లల్లో దూరి పోతే నీ జుట్లోదూరిపొయ్యే వాణ్ణి నేను!- పగటి నిద్ర పనికి చేటుకాని లేవండి.

: రాఁవ! రాఁవ! నిద్రలేసీ లెయ్యకముందే నీ మొకం సూడాల్నా తంవ్రీ!- (గొణుక్కొంటూ) ఎక్కిన కైపుకూడా దిగిపాయనే! అట్లా పక్కింటికన్నాపొయ్ రాబోయేఁవే!

చారక్: అట్లనకండి వీరయ్యగారూ! చిన్న కుటుంబమే చింతలు లేని కుటుంబం. ఇద్దరి కిద్దరు. లేకుంటే ముగ్గురన్నది ప్రభుత్వ నినాదమైతే మీరు అయిదు దాటేసినారు. అది నీకు ద్రోహం!- నీ యిల్లాలికి ద్రోహం!- నీ కుటుంబానికి ద్రోహం!... నీ ఊరికి ద్రోహం!... నీ మండలానికి ద్రోహం!... నీ జిల్లాకు ద్రోహం!... నీ రాష్ట్రానికి ద్రోహం!... నీ దేశానికి ద్రోహం!... నీ ప్రపం...

ఈరయ్య : (అదిరిపడేటట్టు అరుస్తూ) ఛూ! నిద్రలేస్తానే నువ్వు కడుపుకూ్కడు తిన్నావా? మైదాపిండి తిన్నావా?

కు.ని. ప్రచారక్: (ఆశ్చర్యంగా) మైదాపిండా?

ఈరయ్య : జిగట మాదిర పట్టుకుణ్ణావు గదయ్యా?

కు.ని. ప్రచారక్: వీరయ్యగారూ! పురుషులు చేసుకుంటే వంద. అదే స్త్రీలకైతే మరో పాతిక అదనం. ఇకపోతే - ప్రయాణపు ఖర్చులు పదిహేను... మందు ఖర్చులు ఎనిమిది... అదనంగా అయిదు. నా కిచ్చేది మూడు అదిగూడ నీకే యిచ్చేస్తాల్నే!

ఈరయ్య : ఇదంతా నాకేం వద్దుగానీ, ఈ తడవ వచ్చేటప్పుడు నా కంత దూది తెచ్చిపెట్టు!

కు.ని. ప్రచారక్: దూదా! యిప్పుడెందుకూ?

ఈరయ్య : నీ పోరు పళ్ళేక సెవల్లో దోపుకుండే దానికి!

కు.ని. ప్రచారక్: పోరంటావా వీరయ్యా?- కాదు. కానే కాదు. ఇది మన ప్రభుత్వం పెరుగుతున్న జనాభా పై సాగిస్తున్న పోరాటం! నీ భవితవ్యం బంగారు బాటపై సాగిపోవాలని నేపడుతున్న ఆరాటం!- నీ పొరుగింటావిడను చూడు. ఆమె నిత్యం నీళ్లు తెచ్చుకుంటున్న స్టీల్ బిందె ఆపరేషన్ చేసుకొంటే మేమును యిచ్చిందే! మీ ఎదిరింటాయన కట్టుకొనే మల్లు పంచలు నా చేజేతులా తీసి యిచ్చినవే! పోనీ! నీకేం కావాలో చెప్పు రేడియో...

ఈరయ్య : (అదిరిపడ్తూ) రేడియోనా?- అది సెప్పేది కూడా యిదే కదా? మల్లా అదొక టెందుకూ?

(గంగులు ప్రవేశించి, కొత్త మనిషిని అదోరకంగా చూస్తూ 'ఎవురు మాఁవా?' అన్నట్లుగా ఈరయ్యను సైగజేసి అడుగుతుంది.)

ఈరయ్య : ఈయనంటే?... ఈయన (కత్తిరించుకోమని చెప్పాడానికి వచ్చినాడని చేతుల్తో సైగజేసి చూపిస్తాడు.)

గంగులు : అయితే మన సింగంపుట్టికి అల్లుడా మాఁవా?

ఈరయ్య : (నవ్వుతూ) సింగంపుట్టికల్లుడైతే పైన కత్తిరించుకోమనే వాడే! ఈయన...

కు.ని. ప్రచారక్: అమ్మా! నేను కుటుంబ నియంత్రణ ప్రచారకుణ్ణి. గవర్నమెంటు తరపున ప్రచారానికి వచ్చాను.

గంగులు : అయ్యా! నువ్వు గవర్నమెంటు మణిసివి గదా? ఈదరలేం?- యిట అగ్గిపడి పోతా వుండాయే?- పది రూపాయ లెత్తకపోతే సంచిలో పళ్ళా!

ఈరయ్య : నీ దరల సంగ తట్టాదొంగల తోలే! గవర్నమెంటు సొరాయి?- వాళ్ళదీ ఈళ్ళదయినా పర్వాలేదు. పావురే

లేకుండా పొయ్యింది. దీని సంగతి ఏ నాకొడుకైనా అనుకుంటా వుంటాడా?

చారక్: అమ్మా! ధరలు పెరగడానికైనా, బడిలో సీట్లు దొరక్క పోవడానికైనా, బస్సుల్లో నిలుచుకోవడానిక్కూడ చోటు దొరక్కపోవడానికైనా కారణం అధిక జనాభా! మగ వాళ్ళు వినరు. వాళ్ళకేం బాధ?- బాధలు పడే మీరు మాతో సహకరించాలి. సహకరించకపోతే నిలవడానికి నీడ దొరకదు, పీల్చడానికి గాలి దొరకదు. తినడానికి తిండిదొరకదు. మనుష్యులంతా ఈగల్లాగా గిజగిజ లాడ్తారు. ఈగలన్నీ చోటు దొరక్క విలవిల్లాడ్తూ చస్తాయి!...

: థూమైదా సాఁవీ! ఈగల సంగతేఁవో కానీ యిప్పుడు మేఁవుపూపిరాడక చస్తా వుండాం!- అసలే దానొళ్ళు బాగాలేదు కానీ, దాన్నొదిలిపెట్టి నువ్విట్టా రా!- నే న్జేసుకుంటాలే!-

చారక్: ఆఁ! నువ్వు చేసుకుంటావా? (అంటూ ఆత్రతగా వస్తాడు.)

: (మంచంమీద తనతో కూర్చోబెట్టుకొంటూ) అయ్యా! మైదా సాఁవీ! యింతకూ నువ్వు ఆపరేసన్ సేయించు కుణ్ణావా?

చారక్: నా కింకా పెండ్లే కాలేదే?

: అయితే ఒక మాట సెప్తా యిను. బిడ్ల కనినమ్మ, బిచ్చం బెట్నవమ్మ ఎప్పిటికీ సెడిపోరు. నువ్వు మాత్రం పొరబాటుగా కూడా ఆపరేసన్ సేయించుకోవద్దు. నా కెంత మంది బిడ్డలో తెల్సా నీకు?

చారక్: అయిదుమంది కొడుకులు!

: సైరా మైదాసా.వీ! బలె గెట్టోడుగా వుండావే! అయిదు మంది అయిదు లచ్చిలనుకో!

చారక్: ఆ లక్షల సంగతి నాకుతెలుసు. వాళ్ళ లక్షణాలు నాకు తెల్సు!- ఆ మాటకొస్తే నీలాంటోళ్ళ బతుకులన్నీ నాకు తెల్సు!

నా బతుక్కేఁవయ్యా?-అయిదు మందిలో నలగర్ని నలగరి దగ్గర పెట్నా! ఒక్కొక్కడు నాలుగొందలు తెస్తావుండాడు. నాలుగు నాలుగులెంత?

చారక్: పదహారు!

పదారొందలు! నీ జీతఁవెంత?

చారక్: ఏడువందలు.

: హ్హె హ్హె హ్హె! ఏడొందలు, ఏడ్సినట్టుంది. అందుకే నిన్ను ఆపరేసన్ చేసుకోవద్దనింది. (గుడిసె వైపు చూస్తూ రహస్యంగా) మా ఆడది మల్లా నీళ్ళు పోసుకోనుండాది. వాడిక్కూడా ఈ పొద్దు అడ్వాన్సు తెచ్చేసినా!-

కు. ని. ప్రచారక్: నీలాంటి ద్రోహులుండబట్టే ఈ దేశం యిట్లా తగలబడి పోతావుంది.

ఈరయ్య : ఏందయ్యో? పెద్ద పెద్ద మాటలు మాట్లాడ్తా వుండావే?- నేనెవురికయ్యా ద్రోహం చేసింది?

కు. ని. ప్రచారక్: నువ్వు కట్టుకున్న పెండ్లానికి... కన్న బిడ్డలకి...

గంగులు : (ఆ అరుపులు విని గుడిసెలోనుండి బయటికి వస్తూ) ఏంది మాఁవా? సినికి సినికి గాలివానయిందని ఉత్తసంబడానికి మీరు జుట్లు జుట్లు పట్టుకునేటట్టుగా వుండాదే!- నాడు రాసిన రాతల్ని మార్చేదానికెవుడి తరం కానీ నువ్వు లెయ్ మాఁవా! పొయ్ ఆ పెద్దోణ్ణి పిల్సకరా! తాటాకు శాపల పుల్సంటే వాడికి బలే యిష్టం. రేత్రికి ఈణ్ణే అంత తింటాడు.

ఈరయ్య : అదేడవుతుంది కానీ నువ్వు లెయ్యే-

కు. ని. ప్రచారక్: అవునమ్మా! వాడి కెక్కడ తీరికుంటుంది?

ఈరయ్య : ఆఁ! ఈయన పొయ్యి సూసొచ్చినాడు.

కు. ని. ప్రచారక్: అవును. చూచినాను కాబట్టే చెప్తుండా!

ఈరయ్య : ఏందయ్యా నువ్వు సూసింది?

గంగులు : ఎందుకట్లా కసురుకుంటావే?- ఆయన సూసింది సెప్తానంటే!-

ఈరయ్య : పంగలేని మంగలోడు పిల్లి తలకాయి గొరిగినట్లు ఆయన సెప్తాడు. నువ్వూ...

కు. ని. ప్రచారక్: అమ్మా! పెద్ద సుబ్బారెడ్డి ఇంట్లో నీ పెద్ద కొడుకు కోడికూతతోనే కండ్లు నులుముకుంటూ నిద్రలేస్తాడు. అట్లానే పేడకళ్ళు దిబ్బకెత్తతాడు. పొద్దు మొలుస్తుంది. ఆవులకు నీళ్ళు చూపి, కసువేసి, తవుడు బెట్టి పాలు పిండేటప్పటికి గంట ఎనిమిదవుతుంది. నోట్లో అన్ని మంచినీళ్ళు పోసుకొని పుక్కిలించి ఉమ్మేస్తాడు. నిలువు కాళ్ళ మీదే సద్ది నీళ్ళన్ని గొంతులో పోసుకొంటాడు. సంకటి చిక్కాన్ని చంకలో తగిలించుకొంటాడు. ఆవుల వెంబడి పడి అడవికి పోతాడు. తిరిగి వాడు ఇంటికి వచ్చేటప్పటికి కను చీకటి పడుతుంది. మళ్ళీ గొడ్లను సుతారించి పాలు పిండేటప్పటికి ఊరు మాటు మణుగుతుంది. అప్పుడు కంచం చేత పట్టుకొని గొడ్లకొట్టంలో నిలబడుకొంటాడు. కాసేపటికి ముద్ద సంకటి కంచంలో పడుతుంది. తెల్లవార్తే మళ్ళీ మామూలే! వాడికెక్కడ తీరుతుందమ్మా నీ పిచ్చి కానీ...

గంగులు : ఏ లగ్గణాన కొంప వదిల్నారో బిడ్డలు!... ఒక మంచా? ఒక సెడ్డా?...

కు. ని. ప్రచారక్: తలనొచ్చినా జ్వరం వచ్చినా ఆసుపత్రికి వెళ్ళడానికి కూడా అవకాశం లేదు. ఇంతెందుకు? మొన్న రాత్రి వాడికి జ్వరం తగిలిందట. పైకి లేవలేక మూలుగు

తున్నాడు. అప్పుడు నేనక్కడే ఉన్నాను. రెడ్డిగారొచ్చి "నాలుగు బార్ల పొద్దెక్కుంటే యింకా నీలగతా వుండావే? లెయ్‌రా పైకి!" అన్నాడు. పాపం! ఆ పిల్లవాడు "రేత్తిరి నుండి వొగిటే సలీజరం సంపేస్తుండాదయ్యా!" అన్నాడు. "సలీ జరం నిన్ను చంపేస్తే ఉండే పనులు మమ్మల్ని చంపేస్తాయ్!... లెయ్‌రా నీ యమ్మా లెయ్!... లెయ్‌కుంటే ఎపుడు సేస్తా(డా నా కొడకా!" అన్నాడు.

: ఇన్నావా! ఇన్నావా? ఆ యదవన్న మాటలు!!

: నువ్వుండే!

: నువ్వు నోర్మూసుకో నుంటావా లేదా?

చారక్: అంతే! లేవలేక నిద్రలేచి పేడ తట్టనెత్తికెట్టుకున్నాడు. వాడి కథ అట్లా అయిందా? నిన్న చిన్న సుబ్బారెడ్డి ఇంటికి వెళ్ళినాను. నీ కొడుకు సంకటి తినడానికి చెయ్యట్లా కడుక్కున్నాడో లేదో- అంతలోనే కరెంటు వచ్చింది. "ఒరే! యీడుణ్ణుంట్టుండాల!... మోటా రెయ్యాల!... యింకా యిక్కణ్ణే వుండావా?" అని అరిచినాడు. అంతే! కడిగిన చెయ్యి కట్టిన గుడ్డకు తుడుచుకుంటూ పరుగందుకొన్నాడు.

: ఎంత ఆకిలో? ఏంవో నా బిడ్డకు!- అంత సంకటి కూడా తిన్నీకుండా తరువుకున్నాడే పాపిష్టోడు!-

: నువ్వుండే!

: నువ్వు నోర్మూసుకోనుంటావా లేదాతాగుబోతోడా?- నోరెత్తు సెప్తా! నీ పోరువు...

: సాఁమీ! సాఁమీ! మైదా సాఁమీ! నువ్వు మమ్మల్ని ఆపరేసన్ సేసుకోమని సెప్పేదాని కొచ్చావా? లేకుంటే సపరేసన్ సేసేదాని కొచ్చినావా?

చారక్: తల్లికి, బిడ్డలకు సెపరేషన్ చేసింది నువ్వు!... ఇంటికి బిడ్డలకు సెపరేషన్ చేసింది నువ్వు... ఇవి నాకు సంబంధం లేని విషయాలు. అయినా ఒక్కొక్క లక్షాధికారి యింట్లో నీ ఒక్కొక్క బిడ్డ పడుతున్న బాధలు కండ్లార చూచినాను కాబట్టి కడుపు రగిలి ఉండబట్టలేక కక్కేస్తున్నా! అయినా నీ లాంటి వాళ్ళకు ఎంత చెప్పినా ఏం ప్రయోజనం?

: అవున్నాయినా! తాగుబోతోళ్ళకు ఎంత జెప్పినా తల కెక్కదు. ఆయన్తేం పని కానీ నువ్వు సెప్పవయ్యా!

చారక్: పదిరోజుల కిందట శంకరప్ప నాయుడు పలమనేరు వరసలో మూడు వేలిచ్చి జోడు కోడెల్ని పట్టుకొని వచ్చినాడంట! కొత్త గిత్తలు. కుమ్ములాడుకున్నాయి. ఒక దానికి కొమ్ము విరిగింది. నీ కొడుకు అజాగ్రత్త వల్లనే అట్లా జరిగిందని నాయుడు గొడ్డును కట్టివేసే పగ్గం తీసుకొని గొడ్డును బాదినట్టు బాదుతుంటే... వాడు 'అమ్మో!... నాయినో!...' అని అల్లాడుతుంటే.

గంగులు : అయ్యో నా కొడకా!...

ఈరయ్య : నువ్వుండే!

గంగులు : ఉండుండని నా మింద పడ్తా వుండావే?- నేనేం సస్తావుండానా? నా కడుపున్మంట నీ కెదగా!- కన్నావా? కక్కినావా?... తాగుబోతోడా!...

ఈరయ్య : మాటమాటకు 'తాగుబోతోడా!!' అంటే నీ నక్కుళ్ళిం చేస్తా!

గంగులు : ఇంచెయ్!... సంపెయ్!... నా బిడ్డలు పడే బాద సూసే దానికంటే నీ సేతుల్లో సచ్చేదే మేలు! రాయే రా! నా నక్కుళ్ళించెయ్!... నన్ను సంపెయ్! (పైపైకి ఎగబడ్తుంది)

ఈరయ్య : సూసినావా? సూసినావా? అది పైపై కెగబడొచ్చేది?? ఇదంతా నీ వల్ల ముందు... దీనంతు తేల్చుకోని మల్లా సూస్తా నీ కత!... ఏఁవే? నేనేం మొగోడనుకున్నావా? ఏఁవను కున్నావో?... నీయ... (అంటూ జుట్టు పట్టు కొన్నాడు)

గంగులు : నీ సిగ్గు జీఁవడా!... నీ సేతులు పడిపోనానీ... నీ మొగతనం నా మిందనా?...

కు.ని. ప్రచారక్: (కలుగజేసుకుంటూ) వీరయ్యా! నీ కేమన్నా బుద్ధుందా?- వదులు - ఆడమనిషిపై చెయ్యి చేసుకోవడానికి సిగ్గులేదూ? (ఇద్దర్నీ విడిపిస్తాడు)

ఈరయ్య : లేకపోతే సూడయ్యా! ఇది కని కని ఆడపారేస్తే... నేను దీనికి తెచ్చే సేదా? దీని బిడ్లకి తెచ్చే సేదా?

కు.ని. ప్రచారక్: ఈ తెలివి నీకు ముందే వుండుంటే ఈ బాధలుండేవి గావు. ఇక్కడ మీరు బాధపడుతున్నారు. అక్కడ మీ బిడ్డలు బాధపడుతున్నారు. వీరయ్యా! ఒక్కసారి లోకం వైపు చూడయ్యా! తెలివి ఉన్న వాడేం చేస్తున్నాడు?- తన బిడ్డల్ని సంరక్షించుకోవడానికి నలుగుర్ని ఏదోవిధంగా మోసం చేస్తున్నాడు. ఆ తెలివి లేని వాడు దొంగతనానికైనా పాల్పడుతున్నాడు. రెండూ చేతకాని నీ లాంటి వాడు యింటికొక్కణ్ణి తాకట్టు పెడ్తున్నాడు. ఇన్ని అనర్థాలకు కారణమేమంటావ్?

గంగులు : మా తెలివి తక్కువే కద నాయినా!

(కంకణాల కసిరెడ్డి బయట నిలబడి)

కసిరెడ్డి : ఈరిగా!... ఒరే ఈరిగా!!

ఈరయ్య : (అడుగు ముందుకు వేసి పక్కకు తొంగి చూసి మళ్ళీ తిరుక్కున్నాడు.)

గంగులు : ఎవురు మాఁవా?

: (మంద్ర స్థాయిలో) కంకణాల కసిరెడ్డి!

: వాడొక సుద్ద యదవ. ఆడదాన్ని చూస్తే బూమ్మిందే నిలవడు.

: నువ్వు యింట్లోకి పోయే!

(గంగులు గుడిసెలోనికి వెళ్ళిపోతుంది)

: (ప్రవేశిస్తూ) రే ఈరిగా!... ఎక్కడ్రా నీ కొడుకు?

: రొండేండ్లప్పుడు నీ యింటికాడ యిడ్సిపెట్టినపుడు సూసిందే! మల్లా జూళ్ళా!- ఏ.వయి పొయ్‌నా డయ్యా నాకొడుకు?

: ఏఁవిరా! నాటకాలాడ్తావుండావా?... ఏవయ్యో?... నువ్వెవురో తెల్దుకానీ...

చారక్: ఆఁ! నేనండీ! కుటుంబ నియంత్రణ ప్రచారకుణ్ణి!.

: ఔనౌను!. యింటింటికీ తిరగతా వుంటావు గదా? చూసినాన్లే!-ఈడు అడ్డా వుండే నాటకం జూడు. నా దగ్గిరఅయిదొందలు అడ్వాన్సు తీసుకోని యీడి కొడుకు ను నా యింట్లో పెట్నాడా? పెట్నాడు. దేనికి? గొడ్లు మేపేదానికి. ఇప్పుడేం జేసినాడో తెల్సునా?- ఈడడిగి నప్పుడంతా నేను డబ్బు యీ లేదని నూర్రూపా యలు అడ్వాన్సు తీసుకోని నా క్కానోడింట్లో పెట్నాడు. ఏఁవి రా? నిజవేనా?

: (సమాధానం చెప్పకుండా తల వంచుకున్నాడు)

చారక్: నిజవే.నా ఈరయ్యా?

: అట్లా బెల్లం కొట్టిన రాయి మాదిరి నిలబడకుండా పోతే సెప్పు మాఁవా! నిజఁవే నేఁవో సెప్పు!

: నిజఁవే?

: నిజఁవా?

: అవునే!-ఏఁవయ్యో ప్రశారకుడా! విన్నావుగదా?-

చారక్: (వినినట్లు తలాడిస్తాడు.)

అవునుగదా? అయితే నా అయిదొందలక్కడ పెట్టు!

(ఆశ్చర్యంగా) అయిదొందలా?... అయిదొంద లిచ్చి నావా?

: ఒక్కసారిగా యిస్తేనే నంట్రా అయిదొందలిచ్చినట్లు!- అడిగినప్పుడంతా యిచ్చి యిచ్చిందంతా లెక్కరాసుకోని అయిదొందలైనాక అయిదొంద లయిందంటే- అది అయిదొందలు గాదో!-

: నువ్వేం తేరకిచ్చినట్లు మాట్లాడేస్తావుండావే?- నాబిడ్డ కష్టం జేసిందానికి జీతం కింద తిండిగింజలిచ్చినావు.

: థూ !

ఈరయ్య : (కు.ని. ప్రచారక్‌ను ఉద్దేశించి) యో! నిలువు రాయి మాదిరి నిలబడకపోతే సెప్పే.వే?... ఇయ్యర దాకా నాకేఁవేఁవో ఊదర గొడ్తివె?- యిల్లాలికి ద్రోహం... యింటికి ద్రోహం...దేశానికి ద్రోహఁవని. ఇది ద్రోహం కాదో?- నాబిడ్డ కష్టఁవంతా వడ్డీకే సరిపొయ్యిం దంట!-ఈయనిచ్చింది మాత్రం సెక్కు సెదరకుండా వుండాదంట!

కు.ని. ప్రచారక్: అదేంది ఈరయ్యా అట్లంటావే?- ఆయన బాకీ నువ్వు తీర్చాల్సిందే!- నీ బిడ్డ కష్టం ఆయన లెక్క గట్టా ల్సిందే!-

ఈరయ్య : ఈ మద్దిస్తం నువ్వు తీర్సలేవు. ఆయన బాకీ నేను తీర్సలేను. వొచ్చినప్పుడైదొందలన్నాడా?-ఇంకోచేపటికి ఎయ్యి రూపాయలంటాడా? మద్దేణాలకు మట్టసంగా రొండేలంటాడు!.. ఏలం పాట పాడ్నెట్టే గదా?...

కసిరెడ్డి : సూసినావంటే గంగులూ నీ మొగుడెట్లా మాట్లాడ్తా వుండాడో?- ఇట్లు మాట్లాడేవోడు యింకెట్లన్నా మాట్లాడ్తాడు.

గంగులు : సోదీనం లేకుండా మాట్లాడ్తా వుండాడులేయ్యా! ఈ పొద్దిటి కట్లా యిడ్సిపెట్టండి.

కసిరెడ్డి : ఈ పొద్దుపొయ్ రేపొచ్చినానంటే.. నాబిడ్డల్సొచ్చిగా వడ్డీ మొదలు నిన్ననే ఆడ పారేసినానంటాడు. నే నదంతా వొప్పుకోను. నా డబ్బిక్కడ పెట్టి కదలాల్సిందే!

ఈరయ్య : పెట్టకపోతే యేంజేస్తావ్?-

కసిరెడ్డి : (పండ్లు పటపట కొరుకుతూ) ఏం జేస్తానా?...

ఈరయ్య : (నంగిగా) సాఁవే!నా మైదాసాఁవే!! 'తాగేసుండాడు' ఈ పొద్దుపొయ్ రేపురా! ఒక్కమాట సెప్పేఁవే?....

కు.ని. ప్రచారక్: (మౌనంగా ఆలోచిస్తూ ఉంటాడు).

ఈరయ్య : నువ్వు జెప్తావా?... యవ్వారం పెట్టి ఏడిక జూసే మణిసివే?... నువ్వా జెప్తావు?

కు.ని. ప్రచారక్: (తెప్పరిల్లి) ఏ.వండీ!

కసిరెడ్డి : యో ప్రశారకుడా! నీ గోకుడు మూకుడేసిమూసిపెట్టు. ఈణ్ణి నే నమ్మను.

ఈరయ్య : నమ్మకుండాబోతే అద్దో ఆ యిల్లడమానం పెట్కో!...

కసిరెడ్డి : ఈ యిల్లా?

ఈరయ్య : వద్దకపోతే పోనోట్రాసుకో!-

కసిరెడ్డి : ఒరే ఈరిగా! నే న్నీకు డబ్బిచ్చింది నీ దగ్గిర పోనోట్రాసుకుండేదానికి, యిల్లడమానం పెట్టుకుండే దానిగ్గాదు. నీకొడుకు నా గొడ్లు మేపే దానికి!-

ఈరయ్య : అయితే ఆర్నెల్లు వాయిదా యీ!- (పెండ్లాం వైపు చూపిస్తూ) అది ఆర్నెలల్లో కంటాది. కంటానే బిడ్డన్దెచ్చి నీ యింట్లో వొదిలేస్తా!

: భేష్! బలేమాట్జెప్పినావురా!- సేతులు తట్టనా ఈ మాటకు!-ఏఁవే గంగులూ! యిన్నావు గదా నీ మొగుడన్నె మాట!- ఆర్నెలల్లో నువ్వు కంటే- ఆ బిడ్డన్దెచ్చి నా యింట్లో యిడిసిస్తే వాణ్ణినేను సాకి సంతరించాల!- వాడు పెరిగి పెద్దోడై గొడ్లు మేపల్ల!- బాగుండాది కదా వర్స? ఇప్పుడెవరు మేపతార్రా నీ తాత!... ఒరే ఈరిగా! మరేదగా సెప్తా వుండా!- నీ కొడుకును పంపించు!...

: ఈలుపడదు.

: ఈలుపడ్దా?- అయితే నాడబ్బు యిసిరాడ పారేయ్!- కావాలంటే యేరుకుంటా!-

: ఉంటే పారేసే వాణ్ణే! యిపుడు నా శాతావన లేదు.

: గంగులూ! యిన్నావు గదా మీ మొగుడన్నె మాట!- నాడబ్బు నాకిచ్చేదానికి సేత లేదన్నాడు. అన్నాడా?- ఏఁవే? అన్నాడు. అయితే యిప్పుడు నా గొడ్ల గతెట్ట? యో సాఁవీ!...ఏఁవి సాఁవి?... ఏదో ఒక సాఁవి!... సెప్పు!...పోనీ...నువ్వు జెప్పే!-(కు.ని. ప్రచారక్, గంగులు మౌనంగా ఉండేసరికి) మీ రెవురూ సెప్పలేరు. దీనికి పరిష్కారం నేనే జెప్తా?- ఆ పన్జెయ్యిరా! (ఈరయ్యా దగ్గరగా వచ్చి తీక్షణంగా వాడి మొగంలోకి చూస్తూ) నీ యమ్మను పంపించు.

: రెడ్డెయ్యా?

: (చాలా తేలిగ్గా) పోనీ! నీ పెండ్లాన్ని పంపించు.

: రెడ్డెయ్యా??

: వద్దు. నా డబ్బు నా కిచ్చెయ్యరా! ఈరా ఈ!!-

: నీకు బాకీ లేదు కానీ పో పోరా! (విసురుగా గుడిసెలోకి

: సెబ్బాస్! నీకు బాకీ లేదు. పో!...రా!... హ్హ హ్హ హ్హ! ఏఁవే గంగులూ?

: తాగేసిన కైపులో కూసిన కూతల్ని లెక్క పెట్టదం డయ్యా! - ఈ పొద్దుటికట్లా యిడ్సి పెట్టండీ సాఁవీ!

: ఈపొద్దు నీమొగుడన్నాడు-.పోరా!. అని. రేపు ఇంకొక డంటాడు-'పోరా నా కొడకా!' అని, అప్పుడు నా పౌరుఁవే వుంటుంది? నన్ను 'ఒరే!' అంటావంర్రా కూటి గ్గతిలేని కుండాకోర్ నా కొడకా!-రేయ్!! (అరుస్తూ గుడిసెలోకి దూర్తాడు).

: (కు.ని. ప్రచారక్‌ను ఉద్దేశించి) నాయినా! నాయినా! నువ్వన్నా అట్టిడిపించు నాయినా!-

వారక్): ఏఁవండీ!... ఆగండీ! (అంటూ కసిరెడ్డికి అడ్డు పడపోతే, రెడ్డి తలుపు మూసి గెడివేస్తాడు.)

గంగులు : (ఏడుస్తూ) ఓయమ్మో! యింకేఁవి జేసేది తంర్డీ!- సంపేస్తాడ్నాయినా! అన్నాయంగా సంపేస్తాడు.

కు.ని.ప్రచారక్: (తలుపు బాదుతూ) ఏఁవండీ! ఏఁవండీ!... నా మాట వినండి రెడ్డిగారూ! అతన్నేమీ అనవద్దండి. తలుపు తీయండి. నామాట వినండి!...

(రంగడు కట్టెల మోపు నెత్తిన పెట్టుకొని ప్రవేశిస్తాడు).

గంగులు : మీ నాయిన్ను సంపేస్తా వుండార్రో నాయినో!

రంగడు : (కట్టెల మోపు దభీమని కింద పారేసి) నాయినో! ఓ నాయినో! (ఏడుస్తున్నాడు)

గంగులు : ఇంకేఁవినాయిన్రా నాయినో! యియ్యాల్రవకే సంపెసుం టో(డ్రో కొడకో!

కు.ని.ప్రచారక్: (అసహనంగా) మీ రుండండమ్మా!... ఏఁవండీ రెడ్డిగారూ! తలుపు తీయండి. నామాట విని తలుపు తీయండి-చెబుతాను. (తలుపు తట్టుంటాడు).

(గంగులు, రంగడు బోరుమని యేడుస్తూ రంపు చేస్తున్నారు. వాళ్ళ ఆర్భాటాల్ని సహించలేనట్లుగా!

అబ్బబ్బబ్బ! మీ రుండండి!... ఇప్పుడేం కొంపలంటుక పోయాయని!... (అని అంటున్నాడు. అంతలోనే తలుపు తెరచుకునింది. గంగులు, రంగడు, కు.ని. ప్రచారక్ నిశ్చేష్టులై తలుపువైపు చూస్తున్నారు. ఒక్క నిముషం నిశ్శబ్దం. కసిరెడ్డి, ఈరయ్యా సిగరెట్లు తాక్కొంటూ వస్తున్నారు.)

కసిరెడ్డి : ఏందట్టా యిచ్చిత్రంగా సూస్తా వుండారే?- మా పెండ్లి పీపొద్దుటిదా? డబ్బేంది? యదవడబ్బు. ఈ పొద్దుం టాది. రేప్పోతాది. ఈరన్నా!... నేను పొయ్యొస్తునా?

ఈరయ్యా : నువ్వు పద రెడ్డయ్యా!

(కసిరెడ్డిని సాగనంపి ఈరయ్యా తిరిగివస్తూ)

ఈరయ్యా : ఏందట్టా యిచ్చితంగా సూస్తా వుండారే?- అదొక సిన్న కతలే? (అంటూ మంచాన్ని మధ్యలో వేసి దర్జాగా కూర్చుంటాడు. ఆ కథ వినడానికని ముగ్గురూ మంచం చుట్టూ మూగినారు.)

ఈరయ్యా : (సిగరెట్టు బాగా ఒక్క దమ్ము లాగి వలయాలు వలయాలుగా పొగ వదుల్తూ) నాకు కల్లు పిచ్చి. వాడికి పిల్ల పిచ్చి! యింట్లో దూర్తానే సంపేస్తాడనుకొని ఒక సిన్న కత అల్లేసినా! కతానాయకి నువ్వంటే పడిసస్తా వుంది రెడ్డీ అన్నా. అంతే! అవాంతంగా నారొండు సేతులూ పట్టుకొని - "ఈ యిరహ బాద నే బరించ లేన్రా ఈరిగా! ఎట్టన్నా మమ్మల్నిద్దర్నీ ఒగిటిచేసెయ్ రా!" అన్నాడు. ఓల్‌రైట్! అన్నా. వొదిలేసినాడు నాకొడు...

(మాట గొంతులోనే ఆగిపోయింది కసిరెడ్డి మళ్ళీ కనిపించేసరికి)

: ఇప్పుడు నువ్వు అల్లిన కత కట్టుకతనా? గెట్టి కతనా? యిందావనుకున్నా! అందుకే ఆడ నిలబడు కున్నా!– 'నీ కొడుకును పంపించారా అంటే! ఈలు గాదు పో! అంటావ్. పోనీ! నే నిచ్చిన డబ్బు నాకిచ్చెయ్యి రా అంటే! పోరా!' అంటావ్!– కూటిగ్గెతిలేని కుండాకొర్ నాకొడకా . నువ్వు నన్ను 'ఒరే!' అంటావట్రా! ఇప్పుడు నిన్నేం జెయ్యాల?– కుడికాలు చెప్పు ఎడం సేతికి తీసుకొని రూపాయి కొక దెబ్బ లెక్కన ఎంచెంచి కొట్టాల్రా! థూ! నీచపు నా కొడకా!– నిన్ను నా సేత్తో తాకడం కూడా తప్పేరా!... సూడు నిన్నేం జేస్తానో! (అంటూ బుసలుకొడ్తూ వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చి) నీకు గొరిగి పట్టెలు పెట్టి ఊరి మింద తిప్పాల్రా! (వెళ్తాడు)

(ఈరయ్య, గంగులు, రంగడు ముగ్గురూ మూడు దిక్కుల్లో నిలువు రాళ్ళ మాదిర నిలబడిపోతారు. వాళ్ళ మొగాల్లో భయం కొట్టొచ్చినట్లు కనుపిస్తూ ఉంటుంది. కు.ని. ప్రచారక్ గంభీరంగా ఈరయ్య దగ్గరికి నడుస్తాడు.)

వారక్: (అప్యాయంగా బుజంమీద చెయ్యివేసి) వీరయ్యా! నా నలుగురు కొడుకులు నాలుగు లక్షలు! వాళ్ళకేం దర్జాగా బతుకుతున్నారు అని మురిసిపోతూంటివే! ఏందయ్యా నువ్వు చూసింది? అని నన్ను దబాయిస్తివే?... ఇపుడు నువ్వే కండ్లారా చూశావుగా పోనీ! ఆ తల్లి!... తొమ్మిది నెలలు మోసి కని పెంచిన ఆ తల్లి ఏ మాశించింది? ఒక్క పూట యింటికి పిలిచి ముద్ద సంకటి తినిపించాలను కొనింది. ఆ ముచ్చట తీర్చే స్వతంత్రమైనా ఉందా నీ కొడుకు లకు!

: (ఆ మాట చెవిని పడడంతో నోట్లో గుడ్డ కుక్కుకొని కుమిలి కుమిలి యేడుస్తుంది)

: ప్రచారక్ : బంగారు పంజరాలని భ్రమించినావు. ఒక్కరికి నలుగురి బిడ్డల్ని యినుప కటకటాల మధ్య బంధించి నావు. ఇది నీ చేజేతుల నువ్వు చేసుకొన్న క్షమింపరాని నేరం. అటు చూడు. ఆ తల్లి గుండెల్లో బాధ చూడు రేపు నా గతికూడా యింతేనా! అనుకొంటున్న ఆ కుర్రవాడి కండ్లల్లో భయాన్ని చూడు! ఈ బ్రతుకులు వద్దు. ఛీ! యిట్లాంటి బ్రతుకులు వద్దే వద్దు. శత్రువుల క్కూడా వద్దు! (అంటూ వెళ్ళిపోతాడు).

: (అప్యాయంగా) రంగా!

: (ఈరయ్య వైపు తిరిగి కన్నార్పకుండా చూస్తూ నిలబడినాడు)

ఈరయ్య : (రంగడి దగ్గరికి మెల్లగావెళ్ళి అప్యాయంగా రెండు చేతుల్లోకి వాడి ముఖాన్ని తీసుకొన్నాడు. రంగడు ఒక్క చూపు చూసి చేతుల్ని విదిలించి కొట్టి గుడిసెలోనికి వెళ్ళిపోతాడు. వాడు వెళ్ళినవైపే కాసేపు చూసి జంకుతూ జంకుతూనే గంగులు దగ్గరికి వస్తాడు)

గంగులు : ఛీ! (అంటూ ఉరిమి చూసి లోనికి వెళ్ళిపోతుంటే)

(ఈరయ్య తల వాలిపోయింది. వంచిన తలెత్తకుండా వెళ్ళిమౌనంగా మంచం మీద కూర్చున్నాడు. అతని మనస్సులో మనస్సు లేదు. ఒక పక్క భయం. ఒక పక్క కోపం... మరొక పక్క తనమీద తనకే అసహ్యం – మనిషి స్తిమితంగా కూర్చోలేక పోతున్నాడు. గంగులు కడవ చంకన వేసుకొనింది. రంగడు దుత్త భుజాన పెట్టుకొన్నాడు. తల్లీ కొడుకు లిద్దరూ నీళ్ళు తేవడానికి బయటికి వెళ్ళినారు.)

నేపథ్యంలో

"ఈరయ్యా! నీకు బతకను తెలియకపోతే నేను సెప్తాను యిను. నీకు గొరిగేది నేరిపిస్తా! ఈ ఊరు గాకుంటే తిరపతికి పో! శాతనైన కాడికి గొరుక్కోని బతుకు. తప్పులేదు. నీ కిష్టం లేకపోతే ఆ గుడి ముందరే నిలబడి యిడ్సిపెట్టి పొయ్యే సెప్పులకు కావిలి కాసి బతుకు. తప్పులేదు. అదీ వద్దకపోతే ఉప్పెత్తుకోని ఊరూరు తిరిగి అమ్ముక్కొని బతుకు. తప్పేలేదు. అంతేకానీ ఒకడి కింద వొంగి శాకిరీ జేసేది మాత్రం శానా తప్పు. ఆ బతుకు బతికే దానికంటే ఉరుబోసుకోని సచ్చేది మేలు!...

(ఈరయ్య తల గిర్రున తిరుగుతుంది. తట్టుకొని కూర్చో లేకపోతాడు. అక్కడ కూర్చోలేక, లేచి నిలబడలేక కాసేపు మనిషి గిలగిల లాడ్తాడు. ఆ తరువాత పడ్తూ లేస్తూ వెళ్ళి యింకొక చోట కూర్చుంటాడు.

– నేపథ్యంలో –

"బంగారు పంజరాలని భ్రమించినావు. ఒక్కరికి నలుగురి బిడ్డల్ని యినుప కటకటాల మధ్య బంధించి నావు. ఇది నీ చేజేతుల నువ్వు చేసుకొన్న క్షమింపరాని నేరం. అటు చూడు. ఆ తల్లి గుండెల్లో బాధచూడు. రేపు నాగతికూడా యింతేనా? అనుకొంటున్న ఆ కుర్రవాడి కండ్లల్లో భయాన్ని చూడు. ఈ బ్రతుకు వద్దు. ఛీ! యిట్లాంటి బ్రతుకులు వద్దే వద్దు! శత్రువులకు కూడా వద్దు వీరయ్యా! ఛీ! యిట్లాంటి బ్రతుకులు వద్దే వద్దు! శత్రువులకు కూడా వద్దు వీరయ్యా వద్దు వీరయ్యా!

ఈరయ్య : (కలవరపడి బిగ్గరగా) గంగులూ!

గంగులు : (చంకన నీళ్ళ కడవతో అప్పుడే వాకిట్లో అడుగు పెట్టిన గంగులు ఆత్రతతో) ఏం మామా? (అని గబగబ

ఈరయ్య దగ్గరికి వచ్చి అతని అయోమయ స్థితిని గమనించి) ఏఁవయింది మాఁవా?.... ఎందుకట్లా అరిసినావే?

: (ఆవేశంతో) వద్దు గంగులూ! మనకొద్దు గంగులూ! ఈ నీచపు బతుకులు మనకొద్దు. మన బతుకులు మనఁవే బతకదాం. సొతంత్రంగా బతకదాం! మన బిడ్డలు మనతోనే ఉండాల్నే!

: (పట్టించుకోకుండా గుడిసెలోనికి పోబోతుంది. రంగడు దుత్త బుజాన పెట్టుకొని నిశ్చలంగా వాళ్ళవైపు చూస్తున్నాడు)

: (గంగులు వెంటపడ్తూ) నీ మింద పెమాణం జేసి సెప్తావుండానే!

: (ఏంది నువ్వు సెప్పేది? అన్నంత నిర్లక్ష్యంగా తిరిగి చూస్తూ నిలబడుతుంది)

: నేనింక తాగనంటే నువ్వు నమ్మతాఁవంటే?

: (నమ్మలేనన్నట్లుగా చూస్తుంది)

: (నెత్తిన చెయ్యిబెట్టుకొని) సత్తింగానే...

(ఏడుస్తూ వరదయ్య ప్రవేశిస్తాడు)

: అమ్మీ గంగులూ!... ఒరే నాయనా ఈరయ్యా!... సుబ్బులాసిపత్రి లోనే సచ్చిపొయ్యిందిరా!

: అయ్యో సుబ్బులూ! (అంటూ అట్లానే చంకన కడవ జారవిడిచింది).

: ఎంతన్నాయం జరిగిపొయ మాఁవా?...

(రంగడు గంభీరంగా ముందుకు నడిచి దుత్త దించి కింద పెట్టాడు. గంగుల్ని చూసి ఈరయ్య, ఈరయ్యను చూసి గంగులు ఏడుస్తుంటారు.)

: ఎందుకురా ఎర్రోళ్ళ మీది రేడస్తా వుండారే? బగవంతుడి క్కూడా కనికరం లేదురా మనబోటి పేదోళ్ళమింద!

: (రెచ్చిపోతూ) బగమంతుడి కుంటిందేఁవో కానీ లేంది ఈ వూళ్ళో నా కొడలకే మాఁవా!

: ఒరే ఈరయ్యా! మనం పేదోళ్ళం. పేదోళ్ళు యింతింత పెద్ద పెద్ద మాటలు మాట్టాడగుడ్దురా!

: ఏం మాట్లాడ్తే? వాడు! ఊరోళ్ళ సొత్తు ఉక్కళంగా తినే నా కొడుకు... నా బిడ్డ సేత శాకిరీ సెయ్యించుకుంటా నన్ను లెక్కపెట్టి రూపాయ కొక దెబ్బ లెక్కన సెప్పుతో కొడ్తానంటాడా? వాడు మాట్లాడిన మాటలకు మాట కొక్క పోటు పొడ్సి సంపితేమాత్రం...

: ఏంది మాఁవా... ఆగ్గరంవొచ్చినాపట్లేం నిన్ను, ఆనందఁ వొచ్చినా పట్లేం! ఆడికి సాలుగని గమ్మునుండున మాఁవా!

వరదయ్య : అవున్రా ఈరయ్యా! మనం పేదోళ్ళం. మన సేతుల్లో ఏఁవుండాది రా?

గంగులు : మనకు కోరట్లుండాయ్ మాఁవా!

వరదయ్య : ఉండాయిరా! ఆడ నాయం ఉండాది. వాళ్ళ సేతుల్లో దుడ్డుండాదిరా! ఆ దుడ్డుకు సెగితుండాదిరా! ఆ సెగితి ముందర మనం నిలబళ్ళేఁవురా! వద్దురా! ఈరయ్యా! వద్దు! నిన్ను సంపేస్తారు!... నన్ను సంపేస్తారు!! ... అందర్నీ సంపేస్తారా! సంపేస్త్రా!... సుబ్బుల్ని సంపినట్టు సంపేస్త్రా! అయ్యో! కూతురా!.. (అని ఏడుస్తూ వెళ్ళిపోతాడు.)

(ఈరయ్య, గంగులు సుబ్బుల్ని చూడడానికి బయలు దేర్నారు. అంతలో కసిరెడ్డి ఎదురుపడినాడు. వెంట సింగంపుట్టి ఉన్నాడు.)

కసిరెడ్డి : సింగంపుట్టీ! ఈడు... ఈ పూటకుంటే యింకొక పూటకు లేన్నా కొడుకు... నన్నే అవుమానం చేస్తాడా? గొరగరా! .. ఈడి తల పట్టెలు పట్టెలుగా గొరగరా!

గంగులు : అయ్యా! రెడ్డెయ్యా! నీకు సేతులెత్తి దణ్ణం పెడ్తానయ్యా! నా మొగోణ్ణి అవుమానం పాల్జెయ్య ద్దయ్యా!

కసిరెడ్డి : అయితే యిప్పిటికీ మించిపొయ్యిందేఁవీ లేదు. నీ కొడుకును పంపించు.

ఈరయ్య : పంపించను. ఈణ్ణేగాదు. ఇంక నా కొడుకుల్ని యింకొక నాకొడుకు గడప తొక్కనియ్యను.

కసిరెడ్డి : (వ్యగ్యంగా) ఒరే నా కొడకా! రాళ్ళ కాలవలో రాళ్ళు దొర్లినట్లు దొర్లతా వుండాయ్ గదరా తప్పొడు కూతలు! (కోపంగా) రేయ్ సింగంపుట్టీ! యింకా నూస్తా నిలబడు కున్నా వేఁవిరా?... కానీ రా!...

గంగులు : (బ్రతిమాలుతూ) అయ్యా! రెడ్డెయ్యా!

కసిరెడ్డి : నీ మొగుడు 'కొడకా' అంటాడు నువ్వు అయ్యా! అను సరిపోతింది.

గంగులు : (ఇంకా బ్రతిమాలుతూ) నీకాళ్ళు పట్టుకుంటా నయ్యా!

కసిరెడ్డి : కాళ్ళే పట్టుకుంటావో? సేతులే పట్టుకుంటావో? నీ మొగుణ్ణి వొప్పించి నీ కొడుకును గొడ్లు మేపేదానికి పంపించు.

ఈరయ్య : ఈలుగాదు. పంపించను.

కసిరెడ్డి : ఇదయ్యేపని గాదు గానీ... రేయ్ సింగం పుట్టీ!...

గంగులు : (హెచ్చరించినట్లుగా) రెడ్డెయ్యా! మీలాంటోళ్ళకి తగిన పన్లు కావయ్యా!

కసిరెడ్డి : (అవహేళనగా) నువ్వు నాకు నీతులు నేర్పుతావంటే తాగుబోతు నా కొడుక్కి తడికె నా లంజా!...

: (కోపంగా) రెడ్డెయ్యా! నీ కొకడికే గాదు నోట్లో నాలి కుండేది? ఇంతకాడి కొచ్చింది కాబట్టి యిప్పుడు నేను సెప్తుండా - యిను! ఏది నా మొగుడి మీద సెయ్యేట్టా పడనీయండి సూద్దాం!

: ఒరె! యిదేవో బలే నిగడ్తావుందే లంజ! వాడి సంగతి తరవాత సూద్దాం. ముందు దీని కొప్పు కత్తిరించరా!

(సింగంపుట్టి తూలుతూ గంగులు దగ్గరికి వెళ్ళు తుంటాడు. రంగడు కట్టెలమోపులో చెక్కి వున్న కత్తిని చేతికి తీసుకొన్నాడు. సింగంపుట్టి గంగులు కొప్పు మీద చెయ్యి వేయబోయేసరికి చెంప 'ఛెళ్ళు' మనింది. రంగడు వికృతంగా అరుస్తూ కత్తితో మంచంకోడును నరుకుతాడు. అందరూ దిగ్భ్రమతో అటువైపు చూస్తారు)

: ఒరె నా కొడకా! ఈడ్చి కాలిస్తే నా గోసిపేతంత లేవు! నన్ను నరకలేక గదరా నువ్వు మంచం కోడును నరికింది! రేయ్! (అంటూ ఎగిరి ఒక్క తన్ను తన్నినాడు. రంగడు విసరకపాయ్ పడినాడు. తలకు బాగా గాయం తగిలింది. రక్తం కారుతూ ఉంది. ఈరయ్య ఒక్క అడుగులో వెళ్ళి కొడుకును కసి కసిగా చూస్తున్నాడు. గంగులు సర్రున చీర కొంగు చింపి గాయానికి కట్టుతూ)

: ఇంకా సూస్తా నిలబడుకుణ్ణావా మాఁవా? ఆలి కొప్పు మింద చెయ్యేస్తే గుండెజ్జీల్చి నెత్తురు తాగినాడంట మాఁవా పావుడు. వాడు మాఁవా మొగుడు! సీవ! సెనికితే కుట్టేసస్తుంది మాఁవా! రోసఁవంటే అది! సింగంపుట్! కట్టె పొయ్యి గొడ్డల్లో దూర్తే కట్టెల్నే కదా నరికేది? పేదోడు పొయ్యి పెద్దోళ్ళతో సేతులు కలిపితే పేదోళ్ళనే కదా కొట్టేది? ఒక కుక్క జోలికి పో! పది కుక్క లొక్కసారిగా ఎగబడ్తాయి. మనకంటే ఆ కుక్కలే నయం! నోర్లేని నా బిడ్డకుండే రోసం మీ కుంటే... సీ! మేకలకు కొమ్ములుండాయ్! మీకు మొగతనం ఉండాది. ఎందుకూ?

సింగంపుట్టి : సెబాస్ సెల్లెమ్మా! సెబాస్! నువ్వు కొట్టిన దెబ్బతో కైపు దిగిపొయ్యిందమ్మా! అడిగిన మాటలకు పిరికితనం పారిపొయ్యిందమ్మా జై! గంగులమ్మకూ! రెడ్డీ! నువ్వింక ఈ నోర్లేని వాళ్ళ నెత్తుర్తో సెలగాటం ఆడద్దు!

కసిరెడ్డి : (కోపంతో) నీగ్గూడ కొమ్ము లొచ్చినాయంట్రా సింగం పుట్టీ!

సింగంపుట్టి : అవ్వి కొత్తగా మొల్సినా యనుకుంటా వుండావా నా బంగారు పట్టీ!

కసిరెడ్డి : ఒరే! నా కొడకల్లారా! ఊరికే ఉండేకొద్దికి రెచ్చిపోతూ వుండారు గదరా? చెప్పు చేతికి తీసుకున్నానంటే దిక్కు కొకరిగా తరిఁవి తరిఁవి కొడ్తా నా కొడకల్లారా!.... ఏఁవనుకున్నారో? యేవో!

సింగంపుట్టి : రెడ్డీ! మేఁవు దిక్కు కొకరుగా వుణ్ణెప్పుడు నిజంగా దిక్కులే నోళ్ళఁవే! ఇప్పుడంతా ఒకే దిక్కున నిలబణ్ణాం!

కసిరెడ్డి : ఎన్ని పుంగనూర్లయితేరా ఒక్క బెంగుళూరయ్యేది బేవ్‌కూఫ్ నా కొడకా! (అంటూ తటాలున మంచం కోడులో దిగబడిన కత్తిని పెరుక్కుంటాడు. సింగంపుట్టి మీదికే కత్తి నెత్తతాడు. వెనుకనుండి గంగులు దుడ్డుకర్రతో చేతిమీద బలంగా కొడుతుంది. కసిరెడ్డి చేతినుండి కత్తి జారి కిందపడుతుంది ఈరయ్య తటాలు కత్తి చేతికందు కొంటాడు. సింగంపుట్టి మంగలి కత్తిని విప్పుకొంటాడు. రంగడు కట్టెల మోపు నుండి ఒక కర్రను లాక్కొంటాడు. నలుగురు నాలుగు దిక్కల్లో నుండి కసిరెడ్డిని కమ్ముకొంటున్నారు! ఎక్కడి నుండో ఎర్రటి కాంతి ఎగజిమ్మింది.

నేపథ్యంలో

మేకలూ! మీకూ కొమ్ములున్నాయ్!... మేకలూ! మీకు కొమ్ములున్నాయ్!... మేకలూ! మీకు కొమ్ములున్నాయ్!! (వినిపిస్తూంటే)

- తెర-

# సూర్యుడు ఉదయించడ

సృష్టి ఆరంభం, జలమయం నుండి భూమి వేరుపడింది. ిన భూమి తనచుట్టూ తాను తిరుగూతూ ఉంది. సూర్యుడు స్తున్నాడు. జలచరాలు ఉత్పన్నమయ్యాయి. ఆ జలచరాల క్షులు... పశువులు... వన్యమృగాలు.. వానర సంతతి వరకు రిగింది. భూమి మీద చెట్టు చేమలు క్రమ వికాసంతో ు.

ఊపుతో తరులతాదులు తలలు ఊపుతున్నాయి. ళ్ళు పరవళ్ళ మీద ఉన్నాయి. వాటితో పోటీలు పడుతూ లేళ్ళు ు తీస్తున్నాయి. కోయిల కుహు కుహూ రాగాలు తీస్తున్నది. ద్ధమైన రాగానికి నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. పాము పడగ డుతూఉంది.

ృతి ఒక అద్భుతమైన వర్ణచిత్రంగా రూపొందింది!

శంలో ఇంద్రధనుస్సు విరిసింది. ఆ ఏడురంగుల ంగా ప్రకృతి కాంత నింగినుండి నేలకు దిగుతుంది. ఈ న్ని చూసి పొంగి ఉప్పొంగి పోతుంది.

**ప్రకృతి కాంత**

ఈ జన్మమే ధన్యము! ఏ జగజ్జేగీయ రాగమో

ఈ జన్మమే ధన్యము!
ఏ చేతి చిత్రమో అందాల ఈ సృష్టి
ఈ జీవితానికే సమకూరె సంతృప్తి!
ఆదిత్య కిరణాలు ఉదయాద్రి శిఖరాన
వెండి మబ్బులకెంత వింత కాంతులు పులిమె!
సెలయేళ్ళ పరవళ్ళ పరువాలు పైకొని
పరుగందుకొను లేళ్ళు గుండె లోతుల తడిమె!
ఆనీల గగనాన ఏడు రంగుల ధనుసు
ఈ నదీ తీరాన కేకి ఈకల సొగసు
కొమ్మల రెమ్మల కుసుమించు గుచ్ఛాలు
నీలాంబరరచ్ఛాయ నిత్యసత్యాలు!

ి పాడుకుంటూ ప్రకృతికాంత పులకరించిపోతుంది. శంలో తన్నుతాను మరచి ప్రకృతిలో నాట్య భంగిమల్లో విహరిస్తుంది.

ఉన్నట్లుండి సృష్టిలో ఏదో స్తబ్ధత ఆవరించింది. చెట్టుచేమల్లో ది. సెలయేళ్ళ గమనం మందగించింది. పరుగులు తీస్తున్న చెట్టు కిందనో బద్ధకంగా పడుకొంటున్నాయి. కొమ్మ మీద మూగ పోయింది. నాగరాజు పడగ ముడిచి పుట్టలో

ున్నాడు. నెమలి పింఛము ముడిచి దిక్కులు చూస్తూఉంది.
ఒక రకమైన వెలితి కొట్టవచ్చినట్లు కనిపిస్తూఉంది.

తి కాంత గమనించింది.

ం ఊహించలేక ఆమె తహతహలాడింది. సృష్టిని ఉత్తేజ
కి ప్రకృతి కాంత ప్రయత్నించింది!

ముందు గంతులు వేసింది. నెమలి ముందు నాట్యమాడింది.
ని తనపైటతో కవ్విస్తూ పరుగులుతీసింది. నాగరాజు
నిలబడి నాగస్వరం వినిపించింది. కోయిల ముందు
లు తీస్తే అది లేచిపోయింది. ఎంత ప్రయత్నించినా సృష్టిలో
ి ఉత్సాహం లేకపోయింది.

రుస్తూ ప్రకృతి కాంత ఒక చెట్టుకు చేరగిల పడింది!

### పంచభూతాలు

కలత చెందిన ప్రకృతి తల్లీ
ప్రాణికోటికి కల్పవల్లీ!
మా విన్నపాలు వినుము తల్లీ!!

వెదుక బోయిన తీగ కాలికి
తగిలినట్టీ తరుణ మాయెను!
మనసు విప్పి చెప్పుకొనగా
మంచి సమయము నేడు దొరికెను!

ఎన్నోనాళ్ళుగ వేచి వేచి
మాలో మేమే కుమిలినాము!
తల్లి వొడిలో తావు దొరికీ
అసంతృప్తికి ఆనవాళ్ళము!

### ప్రకృతి కాంత:

ఏమంటిరి? ఏమంటిరి?
అసంతృప్తికి ఆనవాళ్ళా
నోరు వాయిలేని కూనల
గుండెలోతుల గుచ్చు ముళ్ళా!

కొండగాలులు తాకి తాకి
మంచు కొండలు కరిగెను
పిల్లగాలులు సోకిసోకి
బండ గుండెలు పాడెను!

పుట్లకొలదీ పూలుపూసీ
చెట్టుకొమ్మలు నవ్వెను
మకరందము గ్రోలిగ్రోలి
మధు పచయము తూగెను!

కనుల విందగు వర్ణచిత్రం
కంటి ముందుగ నిలుపుతుంటిని

ంద్రైన మధుర
రిని ముంచుతుంటిని!

డిలో హాయికన్నా
ఏమున్నది?
ప్పకి కారణం
ఎందున్నది?

## పంచ భూతాలు

ప్తకి కారణం వివరించగా
గుండెబరువు యిప్పుడైనా తీరగా
,రె విన్నవింతుము ఉన్నదీ ఉన్నట్లుగా
కుము ప్రకృతి తల్లీ! విన్నదీ విన్నట్లుగా!

## వనలక్ష్మి

మ్మల పూలగుత్తులు
ంత్తులుగా ఫలమ్ములు
కల వంపు సొంపులు
ళ్ళ మోసే తేటనీళ్ళు
క తేలిసాగే
ం పిల్లగాలులు
రకు? ఎవరి కొరకు?
'నలబండరాళ్ళకు!

## జలకన్య

ంములునింగిపై
కడయాడగా –
విప్పినేలపైన
ాట్యము సేయగా
ుటున వొదిగి కోయిల
ంహహామని పాడగా –

## బృందగానం

రకు? ఎవరికొరకు?
కల బండరాళ్ళకు!
ంలో నిండెకానీ
దన లేదె మాకు?

## ప్రకృతి కాంత

గదా? అవును గదా?
పగ తగును కదా?
వా ఆనందమైనా
ునికి రాకపోతే
లే లేదుగా?

**ఆశరీర వాక్కు**

ఈ గాలీ ఈ వెలుతురు ఈ నేల ఈ నీళ్ళు
ఈ ఆట ఈ పాట ఈ పూవుల సయ్యాట
రావాలీ రావాలీ అనుభవానికి రావాలి
అనుభవానికి రావాలంటే అర్థమైన ప్రాణి ఏది?
ఎవరు ... ? ఎవరు .... ?? ఎవరు .... ???
మనిషి..! మనిషి.. !! మనిషి ..... !!!

ులో మరికొన్ని గొంతులు కలసి –

శిశువు కేక వినిపిస్తుంది. ఆ కేక పలు కేకలుగా మారుతుంది. ంపు కేక మాటగా మారుతుంది. పాటగా పద్యంగా ుతుంది.

ుకు అక్షరాన్ని పలకమీద దిద్దుకొన్న మనిషి కంప్యూటర్ వరకు ాడు.

ల నుండి తన నివాసాన్ని అందాల భవనాలకు మార్చు ు.

ాణాన్ని నడకతో ప్రారంభిస్తాడు. పల్లకి నిర్మించుకొంటాడు. ఏనుగుల్ని వాడుకొంటాడు. బండి బస్సు రైలు విమానాలతో ూణాన్ని సుఖమయం చేసుకుంటాడు.

తో వేట ప్రారంభిస్తాడు. విల్లంబులు తయారు టాడు. ఈటె బల్లెం చాకుతో తుపాకి వరకు వేటకేగాక ు సాధనాలుగా తయారుచేసుకొంటాడు.

ులో ప్రారంభమైన పనిముట్లు తయారీ ఫ్యాక్టరీల వరకు ుంది!

ుదాయ వ్యవసాయమునుండి ఆధునిక వ్యవసాయానికి చెలుగా ఎదుగుతాడు.

సృష్టించుకొన్న మనిషి స్వయం సమృద్ధిని సాధించు ప్రకృతి కాంత ఉప్పొంగిపోతుంది.

**ప్రకృతికాంత**

అద్భుతం! అద్భుతం పరమాద్భుతం
మనిషీ! నీ తెలివితేటలు అద్భుతం!
ఆకులలములు చుట్టి మొలకు
అడవులందున తిరుగుతుంటివి
ఆశించిన సుఖమ్ములన్నీ
అరచేతికి తెచ్చుకొంటివి!

ఆకసమ్మున ఎగిరేపక్షికి
పాఠములు నేర్పించుతుంటివి
నేల నాలుగు చెరగులను
నీ గదికి గోడలు చేసుకొంటివి!

పంచభూతముల పంచకీడ్చి
ప్రగతి బాటలు తీర్చుతుంటివి!
తల్లి ఆశయ సాధన కృషిలో!
ఋషివిగా రూపొందుతుంటివి!

'గరీకుడయ్యే కొద్దీ చేతలు విపరీతంగా తయారయ్యాయి. రొదలయ్యాయి. పాటలు వెర్రికేకలయ్యాయి. నాట్యాలు ంలయ్యాయి. విమానాలు బాంబులు కురిపిస్తున్నాయి. టాడిన మనిషి రాకెట్ యుద్ధాలకు తలపడ్డాడు. అడవుల ఃనారణ్యాలు వెలిశాయి. ఆహారం కోసం జంతువుల్ని చంపిన ంనందంకోసం అలంకరణల కోసం వేటాడుతున్నాడు. నాశనం చేస్తున్నాడు. పర్వతాలను బద్దలుచేస్తున్నాడు. తి కాంత సహించలేకపోయింది!

### ప్రకృతి కాంత

ఆగుమోయి మానవా! ఆగాగుమోయి మానవా!
నీ ఆగడాలు పోకడల నిక్కనైన మానవా!
నీ మనుగడకే ముప్పుదెచ్చు ప్రయోగాల పాటెందుకు!
పర్యావరణం రూపుమాపే ప్రగతి కాంక్ష నీకెందుకు?

### మానవుడు

ఆగడాల పోకడలా! కాదు కాదు
మనిషి ప్రకృతి పై సాధించిన అద్భుతాలు
ఎవరు నీవు? ఎవరు నీవు? ఆగమనగాభావ్యమా?
ప్రగతికోరెడి మనిషికిది సంభావ్యమా?

### ప్రకృతికాంత

అద్భుతాలు కావు కావు అరిష్టానికి మార్గాలే!
వాగి వాగి విర్రవీగి బోర్ల పడకు మానవా
పడకముందే మేలుకో విపరీత చర్యలు మానుకో
కాలుష్యపు బారినుండి కడతేరు టెటులో నేర్చుకో!

### మానవుడు

కాలుష్యమునుండి పుట్టితి
కాలుష్యము మధ్య పెరిగితి
కాలుష్యమే ప్రగతి సాధన
పరికరముగా ప్రలోభపడితి
ప్రగతిసాధన కాలుష్యపు
పడగనీడ శరణ్యమైతే –

## ప్రకృతికాంత

ుట్ట వేదాంతము - లేదా దీనికి అంతము
ఎంత స్వార్థము - ఎంత చెప్పినా వ్యర్థము
ంపక పంచభూతములు ఆశించిన పరమార్థము
తమై పరిణమించగా తప్పదు ప్రాయశ్చిత్తము!

## మానవుడు

తమౌనీ వాగుడును
ఆపు!
ంలులొసుగులు ఉంటేగింటే
ాపు!

## ప్రకృతికాంత

విన్నారా! ఓ కూనల్లారా!
షి వాగుడును విన్నారా!
కన్నారా! నా కన్నల్లారా!
ధోరణులు కన్నారా?
ృష్టించుకొన్న ఈ
ుతిక స్వరూపుడమ్మా!
ుతముల పాలిటయముడై
ుర్చున్న ఘనుడితడమ్మా
దోమకు హాని తలపని
మూర్తికి చెప్పండి!
ొసుగులు ఉంటేగింటే
ెందుకు విప్పండి!

## వనకన్య

సీ కాయకాసీ
ిగ నీడనిచ్చి
్యం సాధించగా
చిన చెట్టును
ారమ్మయిన
ువుపట్టును
లకు కట్టెగా
ెలిన బొగ్గును!

## జలకన్య

ంత చినుకునేనై
డి దిగితినేలకు!
ినుకు కలసివాగై
నల హొయలు మీరితి

జీవకోటికి దప్పితీర్చితి
చెట్టుచేమకు ప్రాణమొసగితి
యాంత్రికమైనట్టి జగతికి
ప్రాణాంతకమై మిగిలితి!

### వాయుపురుషుడు

రూపరహితమ్మయిన నేను
నీ రూపు నిలపగకారణమ్మును
ఒళ్ళు బలసిన కారణమ్మున
వాహనమ్ముల రొదలు సొదలు
ప్రగతి సాధన చాటు మాటున
పరిశ్రమల భుగల పొగలు
జీవకోటికి ప్రాణదాతకు
జీవశక్తే హరిస్తున్నది!

### మానవుడు

ఆపండి...! ఆపండి...!!
నా తప్పు లెన్నుటిక ఆపండి!
తమ గొప్పలు చాలిక వినలేనండీ!
పంచభూతముల ప్రతిరూపముగా
మనిషేకావాలన్నారు!
మీరూహించని ఎత్తుకు మనిషి
ఎదిగిపోయిన కారణమ్మున
అసూయ పడితే అర్థమున్నదా?
నింగికెగిసే మేధాశక్తిని
నిరోధిస్తే విరోధిస్తే
నీకు వొరిగే దేమున్నది?

### ప్రకృతికాంత

ఎరుకేలే? ఎరుకేలే?
నీ తెలివి తేటలు చురుకేలే?
పంచభూతములు నినుకోరుకొన్నది
సహకరించి కాపాడుకొన్నది
వంచనకు గురికావడానికే
స్వయంకృతమ్మని ఏడ్వడానికే!–

మైకుల హోరు... హారన్ శబ్దాలు జోరు.... బస్టాండ్లల్లో
న్లలో గందరగోళం... ఫ్యాక్టరీల్లో లేచిన పొగలు సూర్యుణ్ణి
ముత్నాలు... ఆ ఫ్యాక్టరీల
బయట పడిన కుళ్ళుతో నదుల్లో కాలుష్యం .........
ైన కాలుష్య వాతావరణంతో లోకం నిండి పోతుంది.

## ప్రకృతికాంత

ుదే సాధించిన ప్రగతి
ాగితే తప్పదధోగతి!
ృ నడయాడెడు పొలములు
ఎ్రలుగ మారుతున్న వీ
ర్వలెడారులైనిను
వేయగ తలపడుతున్నవి!

దక్షిణ ధృవాలలో
తలే హెచ్చి పోయెరా
పొరలో పడిన తూట్లే
కోరలై నిను కొల్చనుండెరా 1
యిరువది మిలియను టన్నుల
సృష్టికే కారకుడా!
ాధన వ్యామోహములో
ు మరచిన పామరుడా!

ంతగా అంతకంతగా
ము నిన్నావరించే
ఝంఝను విస్మరిస్తే
సే యికలేదు లేదురా!

## మానవుడు

వి? ఏమంటివి?
మాట్లాడుతుంటివి?
ృతి సృష్టి చేసిన
కించుతుంటివి!
ాన్యంలో తిరుగుతూ...
్ ఆడుకొంటూ... రిమోట్
తో బాంబులు పేలుస్తున్నాడు.
ాసించు రోబోట్
తాలాటకట్టు
హారమ్ము చీల్చిన
ుట్టుకకే మరోమెట్టు!

## పంచభూతాలు

ాటకు విముఖుడు
టుకు సుముఖుడు
ార్ఖుడు! వాడు మూర్ఖుడు!
తో వాదనెందుకు?
కదలదు! అవనేకదలదు!
కదలదు! సృష్టేకదలదు!

**మానవుడు**

కదలదా? కదలదా?
ఈ సృష్టి కదలదా?
కదలనంటే కదిలించెడు
యుక్తిని! నేను మేధాశక్తిని!
నేల విడిచిన సాము కృషిలో
సాటిలేని జీవ శక్తిని!

నా మేధాశక్తికి అద్దంపట్టే
గ్రహాల మీద గృహాలు కట్టి
నిర్మిస్తాను! నిర్మిస్తాను!
మరో ప్రపంచం నిర్మిస్తాను!
మానవాళినే కదిలిస్తాను!

రాగం ఉన్నట్లుండి ఆగిపోతుంది. వీచేగాలి... పారేనీరు .. ణం అంతా ఆగిపోతుంది. సూర్యుడు ఉదయించడు. అంతా ీ చీకటిలో మనిషి నిస్సహాయుడైపోతాడు. ఎటుచూసినా ్లు.. అడుగు తీసి అడుగువేయలేని ఆక్రందనలు.. పెరిగి కకు మృత్యువాకిట గిలగిల తన్నుకొంటున్న ఒక్క మనిషి గా మిగిలిపోతుంది. మనసు వికృతమైన మనిషికి ండా వికృతమైపోతుంది! – ఆ దశలో

**మానవుడు**

కనికరింపుము ప్రకృతి తల్లీ
కన్నబిడ్డను రక్షింపుతల్లీ!!

విర్రవీగితి విర్రవీగితి
వెర్రివాగుడు వాగితీ
కన్ను మిన్ను కానకుండా
పెడదారులందు సాగితీ!

నీ వొడిలో వొదిగినాను
నీ బడిలో చదివినాను
నీ చేతుల ఎదిగినాను
కడకు నిన్నెదిరించినాను!

మితి మీరిన జనాభాతో
మతి చలించిన పోకడలతో
సృష్టికే ప్రతిసృష్టిచేసితి
అంతకంతకు నష్టపడితి!

కాలుష్యము అదుపు తప్పిన
కలుగు ఫలితము అనుభవించితి
సమస్త సృష్టీ స్తంభించిన
మనిషి సత్తు తెలుసుకొంటిని!

తెలిసివచ్చెను తప్పు తల్లీ
చేయబోనిక మళ్ళీ మళ్ళీ
పర్యావరణ పరిరక్షణమ్మో
ప్రాణికోటికి రక్ష తల్లీ!

౦ంత మనిషిని మన్నించింది! సృష్టిలో చలనం ప్రారంభ ది... భూపాల రాగంతో సూర్యుడు ఉదయిస్తున్నాడు. స్తూఉంది. సెలయేళ్ళు ప్రవహిస్తున్నాయి. కోయిలలు న్నాయి. నెమళ్ళు ఆడుతున్నాయి. ప్రకృతి పరమాద్భుత ంగా శోభించింది. మానవుడు ఆనందంతో గంతులు

**మానవుడు**

సర్వేజనా సుఖినోభవంతు!

**పంచభూతాలు**

అహంభావీ!.... నీ నైజగుణాన్ని వదిలావు కావు!

ంభ్రమ చెంది ప్రకృతి కాంతవైపు సందేహంగా చూస్తూ పోతాడు. పంచభూతాలు అతన్ని చుట్టుముట్టి -

**పంచభూతాలు**

సర్వేజనా సుఖినోభవంతు కాదు! - సకలసృష్టీ స్సుఖినోభవంతు!

**మానవుడు**

అవును తల్లీ ! అవును !
సకల సృష్టీ స్సుఖినోభవంతు! సకల సృష్టీ స్సుఖినోభవంతు! సకల సృష్టీ స్సుఖినోభవంతు !!! ●

కం

# నా
# ...కాలలో
# ...నితలు

సమస్త శాశ్వత ఘనకార్యాలకూ, ప్రయత్నాలకూ, వాఙ్మయాలకూ వెనక వున్నదిస్త్రీశక్తి అన్నారు చలం. జీవనయాత్రలో ముఖ్యమైన మలుపులు, నవభావాలకు ప్రేరణ, జయాప జయాలు, ఆశలు, ఆశయాలు... అనురాగం, విషాదం.... ఇలా పలు అంశాలవెనుక ప్రత్యక్షంగానో, పరోక్షంగానో స్త్రీశక్తి అంత ర్లీనంగా వుంటుందనేది నిర్వివాదాంశం. ఈ శీర్షకలో - వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు - తమ జీవితాల్లో మరపురాని వనితలుగా భావించినవారి గురించి వివరిస్తారు. సుప్రసిద్ధ రచయిత, (డా. సి.నా.రె. మాటల్లో) ఒక చట్రంలో యిమడని సాహితీ త్రివిక్రమూర్తి శ్రీ పులికంటి కృష్ణారెడ్డి రచనతో ఈ శీర్షికను ప్రారంభిస్తున్నాము.



మనిషి జీవితానికైనా స్త్రీ ఒక మధుర వరం! అది బంగారు ...న జీవితమే కావచ్చు లేదా - బాధామయజీవితమే కావచ్చు! ...ం ఒక మధురవరం!

...ధురమైన జీవితానికి ఆమె ఒక మణిపూస! బాధామయ ...ొక వెన్నుపూస!!

...యినా శాపగ్రస్థ!

...ందుకంటే? - ప్రతిక్షణం ఆమె అవసరమున్నా అనుక్షణం ...మరచిపోతూనేవున్నాం. అందుకే ఒక విధంగా ఆలోచిస్తే ఆమె ...లకట్టలేనిది. ఇంకొక విధంగా ఆలోచిస్తే విలువలేనిది!

...కుంటే - సాహితీలోకం ఆమె గురించి ఈ దృక్పథంతో ...వలసిన అవసరం ఉండేదికాదేమో?

...ేలు ప్రకృతి స్వరూపిణి అయిన స్త్రీ జీవితమే మరపురానిదైతే ...ని స్త్రీ అంటే? -

...న్నతల్లియా? కట్టుకున్న పెండ్లామా? కాసేపు ఆనందాబ్ధిలో ...తేల్చి మురిపించి ఆ మధురక్షణాల్నే మరపింపచేసే ...లా? ఎవరు?.... ఎవరు? - అని తర్కవితర్కంలో పడితే ...నపడడం కానీ, సమాధానం దొరకడంకానీ - అంత ...కాదు.

...వయస్సులో నిలబడి ఒక్కసారి వెనక్కు తిరిగి నాకు తెలిసిన ...న్ని విలోకిస్తే, ఎందరో? ఎందరెందరో? - ఇప్పటికీ మనస్సులో ...కున్నవాళ్ళు. వాళ్ళందరూ మరపురాని స్త్రీలేనా? కాదు.

...యితే యింకెవ్వరు?

...తివ్యక్తికి కన్నతల్లి మరపురానిదే! కానీ ప్రతి కన్నతల్లీ మరపురాని ...జాలదు.

...తి వ్యక్తికీ జీవితభాగస్వామిని మరపురానిదే! కానీ ప్రతి భార్యా ...ి మనిషి కాజాలదు.

...యితే నా జీవితంలో మరపురాని వారు, నా జ్ఞాపకాలలో ...యిన వనితలెవరు?

తల్లికిప్పుడు నూటపదేండ్లు. ఇప్పటికీ తింటూ తిరుగుతూ ...ంద్రగిరికి సమీపాన శానంబట్ల గ్రామంలో ఒక యింటికి పెద్దకూతురుగా పుట్టి అదే తాలుకాలో ఒక మారుమూల గ్రామమైన జక్కదనలో ఒక యింటికి చిన్నకోడలయింది.

ఏడాది తిరుగకముందే వేరు కాపురం పెట్టిస్తే - పారా పలుగు చేతబట్టి పొలం పనుల్లో మా నాన్నకు అండ దండగా నిలబడింది. తన కష్టఫలితాన్ని సంతల్లో త్రాసుచేతపట్టి తానే అమ్మి కుటుంబానికి ఆర్థికంగా తోడ్పడింది. ఆమె వ్యాపారం సంతలకే పరిమితంకాలేదు. తిరుపతి మార్కెట్టులో తిరుగులేని చెయ్యిగా వ్యవహరించింది.

అది 1947. అప్పుడు నేను తిరుపతిలో దేవస్థానం హిందూ హైస్కూల్లో థర్డ్‌ఫారం చదువుకొంటున్నాను. బండెడు చింతపండుతో మా అమ్మ తిరుపతికి వచ్చింది. ప్రతిరోజు ఉదయం గంపెడు చింతపండు మోసుకొని మార్కెట్టుకు వెళ్ళి అమ్ముకొని వస్తూవుండేది.

ఒక రోజు మార్కెట్టులో ఆమెకు నూరురూపాయల నోటు దొరికింది. ఆ మాట నాతో అన్నప్పుడు ఎగిరి గంతేసి .అమ్మా నాకొక చొక్కా నిక్కరు కుట్టించమ్మా, పెన్నొకటి కొనిపెట్టమ్మా! నాకు సరిగ్గా యింగ్లీషురాదు. ఒక డిక్షనరీ కొనిపెట్టవమ్మా!. అని వరసబెట్టి అడుగుతూంటే ఆమె పక పక నవ్వి - .ఎవుర్దో పాపం! వాళ్ళదొళ్ళ కిచ్చేసినాన్రా నాయినా!. అంది.

ఆ మాటతో నాకు అరికాలిమంట ఉచ్చికెక్కి మూతిముడుచు కొని కూర్చుంటే-

"ఒరే అబ్బోడా! అప్పటికి నువ్వు పుట్టలేదు. మీ నాయన బానా తొండం పెట్టించాలని కొత్త సెర్మం కొనుక్కొనొచ్చేదానికి కోడికూసే యాళకు ముందే లేచి సిత్తూరికి నడ్సిపోయినాడు. సిత్తూర్రేటుకు ఏలూర్రేటుకు రొండురూపాయలు తేడా కనిపిస్తే, ఆణ్ణుంచి అట్లానే ఏలూరికి నడ్సిపోయినాడు. కొత్త సెర్మం కొనుక్కొని సగంరేత్రికిల్లు జేర్నాడు. రొండు రూపాయలు మిగల బెట్టేదానికి మీ నాయన కాలికి కాలుకొట్టుకుంటా నలభై నలభై ఎనభైమైళ్ళు నడ్సినాడే- నూర్రూపా యిలు మిగలబెట్టేదానికెంత కష్టపడుండాల? దాన్ని పోగొట్టుకున్న మణిసి బాదెంతుండాల? ఈన్ని గొడ్డుమాదిర మార్కట్టులో ఆయన ఈ పక్కాపక్కకు తిరగతావుంటే నా కడుపులో సెయ్యేసి దేవినట్లయింది. నేనే పిల్సి అయన్నోటాయనకిచ్చేసినా! మనబాదొగిటి. ఇంకొకళ్ళ బాదింకొకటి కాదురా!" అని బాధతత్వాన్ని ఎరిగించి, బాధామయ జీవితాల్నే కథావస్తువుగా స్వీకరించే స్ఫూర్తినిచ్చిన నా తల్లిని మరపురాని స్త్రీ అందునా?

కుంటే -

దివింది పదవతరగతి వరకే అయినా, పలుబాట్లు పడకనే ఉద్యోగం వచ్చింది. నా తల్లినేర్పిన బాధ్యత- బాధ్యతాయుతంగా ేడేండ్ల సర్వీసుకొనసాగింది. అసిస్టెంటు స్టేషన్‌మాస్టర్ ు. పచ్చజెండా చేతబట్టి పచ్చంగా బతకవలసిన తరుణం. ఎంత సులభంగా ఉద్యోగాన్ని సంపాదించుకొన్నానో ఆ దశలో టే సునాయాసంగా వదులుకొన్నాను - రంగుపిచ్చిలోపడి!

ప్పటికే ముగ్గురు పిల్లలు. ఆత్మస్థైర్యం తప్పితే తల్లిదండ్రుల ంక్రమించిన ఆస్తిపాస్తులు పెద్దగాలేవు. ఈ విశాల ప్రపంచంలో చెప్పుకోడానికి జానెడు జాగాలేదు. నిలబడడానికి నీడలేదు. పరిస్థితి! కుటుంబాన్ని పోషించడానికి తిరుపతిలోనే కట్టెలమ్మ చ్చింది. అయ్యో! పువ్వులమ్మిన చోటనే కట్టెలమ్ముతున్నాడే అని ాళ్ళు వాపోతుంటే, కానివాళ్ళు ఎగతాళి చేస్తున్నారు. అయినా త్రం పల్లెత్తుమాట అనలేదు. కట్టెలమ్మడం మానుకొని కాఫీ ్తకొని గడప గడప తిరిగినపుడు, కంటతడి పెట్టలేదు. అతి తో సాధించుకొన్న అచ్చుకూటమిలో కార్మికుడైనపుడు డలేదు.

ంసారంగుట్టు, వ్యాధిరట్టు!' అన్న సత్యాన్ని జీర్ణించుకొన్న ్వ ఆమె! ఏ పూటకాపుట తిన్నామో లేదో కూడా బయటికి ండా ఒక్కొక్క పైసాకు ఒక్కొక్క రూపాయి విలువగట్టి, ఖాల్ని పంచుకుంటూ నా స్వయంకృపరాధాల్ని సహిస్తూ, కల్ని భరిస్తూ సంసారనౌకను ఈడ్చుకొస్తున్న నా సతీమణిని ాని స్త్రీ అందునా!

కుంటే -

ట్టెలమ్మడం మానుకొని కాఫీపొడి వ్యాపారం తలపెట్టినపుడు జానెడు జాగా కోసం తలపట్టుకొని కూర్చోవలసివచ్చింది. ఆ ంలో ఎవరో ఒక మిత్రుడు తిరుపతి గోవిందరాజస్వామి లో ఒక యిల్లు ఖాళీ అయిందని, ఆ యిల్లుగల వ్యక్తి ముల వీధిలో ఉంటున్నారని చెబితే వెదుక్కొంటూ వెళ్ళినాను.

ద్దయిల్లు. ఆ పెద్దింటికి తగినంత పెద్దహాలు. ఆ హాల్లో అందమైన రవివర్మచిత్రాలు. ఏ వస్తువు ఎక్కడ ఏ విధంగా ందగిస్తుందో బాగా ఆలోచించి అమర్చిన తీరు... ఒక పెద్ద ండుగా పుస్తకాలు - ఆ యింటావిడ కళాత్మక హృదయాన్ని ్తున్నాయి. నేను ఆ యింట్లో అడుగుపెట్టేటప్పటికీ ఆమె హాల్లో ుయ్యాల మీద కూర్చొని వుంది. ఆ కూర్చోవడంలో ఠీవి వుంది. ాజసం ఉట్టిపడ్తూవుంది. తూగుటుయ్యాల ఊపకనే మెల్లగా వుంది.

క్కక్షణం ఆ వాతావరణానికి చలించి, అంతలోనే తేరుకొని ా నిలబడి నమస్కరించినాను!

వరూ?" అనిందామె నావైపు తేరిపారచూస్తూ.

ా పేరు పులికంటి కృష్ణారెడ్డి!" అన్నాను.

థలు రాస్తుంటారు మీరేనా?"

వునండీ!."

"ఎంత భాగ్యం?... ఎంత భాగ్యం?? .... ఒక రచయిత నాయింటికి రావడం మహాభాగ్యం!. అంటూ తూగుటుయ్యాల మీదనుండి తటాలున దిగింది. ఇంటి నిండుకూ పిలిస్తే నౌకర్లు. అయినా తానే 'కూర్చోండి! కూర్చోండి!... వస్తున్నా!' నంటూ లోనికి వెళ్ళింది. నిముషాలమీద మళ్ళీ ప్రత్యక్షమయింది కాఫీగ్లాసుతో!

.అదేమిటి కూర్చోమంటే నలబడినారెందుకూ?... కూర్చోండి!. అని వత్తిపలుకుతూ ఒక కుర్చీ చూపించింది.

నేను ఇంకా ఇంకా వొదిగి వొదిగి నిలబడినాను!

"దీనిని అతివినయం అనవచ్చునా?" అన్నది పకపకా నవ్వుతూ.

ఆ దెబ్బతో గూబగుయ్యమనింది. మారుమాట్లాడకుంటా కూర్చున్నాను. కాఫీ యిచ్చింది. తాగినాను. వచ్చిన పనేమిటని అడిగింది. చెప్పినాను.

కాసేపు ఆలోచించింది. 'అయ్యో! యింతకు మునుపే ఎవరికో మాటయిచ్చేసినానే!' అని మధనపడింది. అయినా 'రేపురండి చూస్తాం. అనింది'.

ఆ మరుసటి రోజువెళ్ళితే మారు మాట్లాడకుండా తాళాలు చేతికిచ్చింది. రాతకోతల విషయంలో చాలా జాగ్రత్త పడింది. అది వేరే విషయం!

అప్పుడు పుట్టిన మూడోకూతురు పరిమళపేరు నా పేరు జతజేర్చి, అందులోని కొన్ని అక్షరాల్ని మాత్రం ఏరుకొని వాటిని కలగలిపి .మాలికో!. అన్నపేరు పెట్టే .బాగుంది, బాగుంది. అంటూ మురళిబాబు అంత కంటే మంచి బోర్డు రాసిపెట్టాడు. అయితే ఆర్థికపు ఇబ్బందులమూలాన వ్యాపారం ప్రారంభించడం ఆలస్యమయింది. కానివాళ్ళు కాచుకొని కూర్చున్నారు కదా? .మాలికో కాఫీ! మానుకో కాఫీ!. అని ఎగతాళి చేయడానికి ఆరంభించినారు. ఆ మాటలు పడలేక బాధపడ్తూ వుంటే - ఆమె .ఒక రచయితగా స్పోర్టివ్‌గా తీసుకోకుండా హర్ట్ అయితే ఎట్లయ్యా?- .మాలికో కాఫీ!... ఏలుకో కాఫీ!.అని రొమ్ముమిరుచుకొని తిరగాలి కానీ!. అని గుండె నిబ్బరాన్నేకాదు అప్పుగా డబ్బులిచ్చి ఆదుకొనింది.

ఆమె సాహిత్యాభిమాని!

కాఫీపొడి అంగట్లో కమ్మని కాఫీపొడి అమ్మకంతోపాటు అంతకంటే కమ్మని సాహిత్యచర్చ జరుగుతూ వుండేది. ఆమె మనుచరిత్రను మొదటి పద్యం నుంచి చివరి పద్యం వరకు ఒక్క గుక్కలో అప్పచెబుతూ వుంటే ఆశ్చర్యంగావుండేది. మహాకవి చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ, శ్రీమాన్ శంకరంబాడి సుందరాచారి, శ్రీ పింగళి లక్ష్మీకాంతం, శ్రీ వేదాంతం శరచ్చంద్రబాబు ప్రభృతులు తరచు అక్కడ సమావేశమవుతూ వుండేవారు. పింగళి వారిరాకతో ఆ సభ నవరసభరితమయ్యేది.

ఒక రోజు సరసుడైన పింగళివారు ఆమె చేతినిండుకు తొడుక్కొన్న బంగారుగాజుల్ని గమనించి - .ఏం కమలా? అది అసలు సరుకా? నకిలీ సరుకా?. అన్నారు నవ్వుతూ.

అంతకంటే సరసురాలైన ఆమె -

"మనదెప్పుడూ అసలుసరుకే!" అనింది.

"నిజమా?"

ందుకు సందేహమా? పరీక్షకు సిద్ధమే!" అని అంటూ ఆమె
ుందుకు చాపింది. పింగళివారు ఆమె చేతిని తన చేత్తో
్నారు. గాజుల్ని చేతికి తీసుకున్నారు. అటుతిప్పి యిటుతిప్పి
ి పరిశీలించినారు. "అవును. అసలు సరుకే?" అని అంటూ
ికి తొడిగినారు.

హా! హతవిధీ! పింగళికాంతుడు ముండమోపికి గాజులు
ఏమి ఈ కాలవైపరీత్యము?" అనిందామె నాటకఫక్కీలో

ంగళికాంతుడికి తలదిమ్మదిరిగింది. అయినా నిబ్బరించుకొని
కాంతుడుండగా ఈ కాంత ముండమోపి ఎలా అవుతుందే?"

ంగట్లో కాఫీపొడికంటే మించిన కమ్మదనం గుబాళించింది.
ి అమ్ముకొని బతుకుతున్నావే? అన్న తలంపును మరపింప

మె యిప్పుడు లేదు!

ని ఆమె విక్రయించిన యిల్లుమాత్రంవుంది.

వ్వగలిగినంత తీసుకొంటూ, అదిగూడా యిచ్చినపుడు
టూ నాకు నిలువనీడకల్పించి, నా బ్రదుక్కే ఆధారాన్ని
ి ఈ సాహితీ బాంధవిని మరపురాని స్త్రీ అందునా?

దనపల్లెకు సమీపాన కలిచెర్ల గ్రామం. ఆ గ్రామ పెద్ద కలిచెర్ల
రెడ్డి. సార్థకనాముడు. ఆ గ్రామానికే కాదు ఆ ప్రాంతానికి
రెడ్డి ఒక సింహం. ఆయన యిప్పుడు కీర్తిశేషులు.

యన బ్రతికున్న రోజుల్లో కలిచెర్లలో ఏటేటా ఎద్దుల .పరుష.
ేవాడు. ఈ పశుప్రదర్శనలో భాగంగా సాంస్కృతిక
మాలు నిర్వహించేవాడు. ఒకరోజు హరికథ. ఒకరోజు
కం. ఒకరోజు తోలుబొమ్మలాట. ఒకరోజు అష్టావధానం.
ి కవిసమ్మేళనంగా ఈ సాంస్కృతిక కార్యక్రమం
ండువుగా జరిగేది. ఆ పల్లె ప్రజలతో కలిసి కూర్చుని ఆయన
క్రమాల్ని ఆనందంగా అనుభవించేవాడు. ఒక ఏడు
ళనానికి నాకూ పిలుపువచ్చింది. వెళ్ళినాను. బహుభాషా
ు, మహాకవులు డా.. పుట్టపర్తి నారాయణాచార్యులువారు
వహిస్తున్నారు. ఆ కవి సమ్మేళనంలో ప్రముఖ కథారచయిత
కొలను సదానంద కూడా పాల్గొంటున్నారు. మా యిద్దరిదీ
రదుల సరసం! అందుకే అతడు .జానపదమా! నువ్వు
లోనే కవిత్వం చెప్పాలి!. అన్నాడు.

"నిలునిలూ నిలువమ్మీ
నిలసీ ఒకమాటినవమ్మీ
ఎదలోనా మతిలోనా
మెదిలేటి నా అమ్మీ!."

ి పాట ప్రారంభించాను. ఆ పాటంతా విని,

రే! నీ అమ్మితో నువ్వు తిరణాల్లో తిరిగి, దాన్ని అనుభవించి,
లాంటి కొడుకును కొనుక్కోవాలను కోవడం పచ్చి శృంగారం.
అయినా ఎంత పకడ్బందీగా చెప్పినావురా!" - అని మహాకవి భుజంతట్టే
ఒక మామూలు ముసలావిడకు ఏమనిపించిందో ఏమో? నేరుగా
వేదికమీదికి వచ్చేసింది. ముడతలుపడిన వొళ్ళు... గుంటలు పడిన
కళ్ళు... ముగ్గుబుట్టవంటి తల - అందరూ ఆశ్చర్యంగా ఆమెవైపు
చూస్తుంటే ఆమె బొడ్డులోనుండి .వక్కాకు తిత్తిని. చేతికి తీసుకొనింది.
అందులో తారాడి తారాడి ఆకులు, వక్కలు, సున్నం మధ్యపడి
నలిగిపోయిన ఒక రూపాయినోటును చేతికందుకొనింది. .రెడ్డయ్యా!
ఈ రూపాయి ఆయనకు సదివించండి..అనింది.

ఆ "పరుష"లో వేలాదిమంది వున్నారు. నా పాట విన్నారు.
అయితే ఆ అందరిలో ఆ ముసలావిడ ఒక్కతే ముందుకొచ్చి నన్ను
సన్మానించింది ఒక రూపాయి నోటుతో - నోటమాటరాలేదు. నివ్వెరపడి
చూస్తూ నిలబడిపోయినాను.

ఆమెను మరపురాని స్త్రీ అందునా?

కన్నబిడ్డను తల్లి కన్నగసాట్లుపడి సాకుతుంది. అందులో
స్వార్థముంది. జీవితాంతం భార్య కష్టసుఖాల్ని పంచుకొంటుంది.
అందులో బాధ్యతవుంది. ఒక సాహిత్యాభిలాషి ఒక రచయితకు
నిలువనీడనిస్తుంది. అందులో సాహిత్యాభిమానంవుంది. భర్త స్నేహితుణ్ణి
భార్య ఆదరిస్తుంది. అందులో ఆమె విధేయతవుంది. గురువు
ప్రచారానికి శిష్యులు పాటుపడతారు. అందులో కీర్తికాంక్ష
యిమిడివుంది. మహారాజకీయవేత్తలు అనుయాయుల్ని
అభినందిస్తారు. అందులో అందలమెక్కాలన్న తపనవుంది. కొందరు
కొంతమందిని జాగ్రత్తగా వాడుకొంటారు. అందులో లౌక్యముంది.

మరి - చదువూ సంధ్యాలేని ఒక అమాయకురాలి అభినందనలో
ఏముంది? హృదయముంది. అందుకే నా హృదయం అంతగా
కదిలింది.

నటుడుగా, కథారచయితగా, కవిగా యిప్పటికి దాదాపు
మూడువందలకుపైబడిన సభల్లో వివిధాంశాల మీద ప్రసంగించి
వుంటాను. ప్రసంగించిన ప్రతిచోటా ప్రతిఫలంగా అంతోయింతో
యిస్తున్నారు. నేను అందుకొంటూనే వున్నాను. అయితే అట్లా
అందుకొనేటప్పుడు అందిస్తున్న మనిషి నాకంటపడడంలేదు.
అందుకొంటున్న మొత్తమూ ఆలోచనకు రావడంలేదు!

అందిస్తున్న మనిషి స్థానంలో ఆ ముసలామె! అందుకొంటున్న
మొత్తం స్థానంలో నలిగి నల్లబడిన ఆ ఒక్కరూపాయే నా కంటపడు
తున్నాయి. ఆ మధురానుభూతి నేనెప్పటికీ మరువలేనిది. అందుకే
అది నన్ను వెన్నంటి వస్తూనేవుంది.

దానం ఒక ప్రచారప్రక్రియగా కొనసాగుతున్న ఈ రోజుల్లో,
ఊరూపేరూకూడా చెప్పకుండా చెమటోడ్చి సంపాదించిన కష్టార్జితాన్ని
కళకోసం ఆనందంగా యివ్వడం కళాత్మకహృదయాలకే చెల్లు! ఆ
హృదయం ఆమెకు వుంది. అందుకే నా జీవితంలో ఆమె మరపురాని
స్త్రీ -

రామాయణంలో ఎన్నో ఉదాత్తమైన పాత్రలు!

కాని శబరి పాత్ర శబరిదే.! ●

(వనిత, జూలై 1987)

అమ్మిపదం

# పెదవి

ాన పెదవి అమరినదన్నచో
ుమిడియున్న లొసుగులెన్ని?
ంట మీద ముసుగులా పెదవులు!
ెలుసుర పులికంటి మాట!

దలకుండ కమ్మని పలుకులు
గలదు వలపు చిలుకగలదు
పలుకు వెనుక భీత్కార మరయరా!
ుసుర పులికంటి మాట!

ాకవచ్చి గొంతులో కొట్లాడి
ొనను చేరి నలుగుమాట!
ంటకున్నపెన్నెట్లుదాటును?
ెలుసురపులికంటిమాట!

ంపులందు యింపును జతచేర్చి
ార్థు చేయు మంచి పెడుల!
లరు పెదవిమాట మంత్రమ్ముగా
ెలుసుర పులికంటిమాట!

ిపి మరిగి పెడదారులందున
ిరిగి కడకు తిక్కకుదిరి
ాల్చుకొన్న పెద్దలెందరుభువి?
ుసురపులికంటిమాట!

ెలుపగలదు పలుకుబడినిగూడ
ందుకొంపముంచగలదు
ెవడికైన పెట్టనికోటరా!
ుసురపులికంటి మాట!!

# నీడ జాడచాలు...

పోరే పడలేనంటావూ
పోతాపోతా పోతానంటావ్
పోతే పోయ్‌నావు గానీ
పోతా పోతా ఒక్కమాట
ఇనిపించుకోయే అమ్మీ!

ఊరిముందర వంకొకటుంది -
వంక పక్కగా ఒక్కవారగా
అడుగు మిందగా అడుగేసుకుంటూ
నడ్సినువ్వు పొయ్‌నావంటే
అడుగునొక్క ముద్దిడుతుంటా
అక్కణ్ణే పడిగాపులుంటా!

అదిగూడ నీవల్లకాదంటివంటే -

దారి పక్కనా గుంటొకటుంది
గుంటనిండుకు దామరపూలే
పువ్వుల్లో పువ్వయి పోతే
పువ్వులాంటి నీ ముద్దుమొకమూ
పొద్దస్తమానం పూజించుకుంటా!

అదిగూడ నీవల్లకాదంటి వంటే -

ఎక్కడైనా ఎండపొద్దనా
నీడకోసం నిలబడి నువ్వా
నీడజాడ నిలిసిపోతే
నీడలోనే మేడగట్టీ
మేడలోనే కలవరిస్తుంటా!

అదిగూడ నీవల్లకాదంటివంటే -

నువ్వు పొయ్యేదోవలోనా
నిలువురాయీ ఒకటుండాది
నీరూపూరాసేసిపోతే
మాపురేపూ చూసు కొంటుంటా! ॥పోరే॥

# ఆనందం !.... ఆనందం !!

ఆనందం! ఆనందం!
అపుడు గదా మహదానందం ॥ఆనందం॥

యోగజాతకులరాశిఫలమ్ములు
శని వీక్షణతో వక్రిస్తే
భోగములందున భాగములందిన
పేదలకన్నులు ప్రజ్వలిస్తే! ॥ఆనందం॥

సొగలు పెరిగిన సోమరితనము
సొమ్మసిల్లిపడిపోతే -
దారం తెగిన గాలిపటమ్ములు
కాడికి గట్టిన గితలెతే

కొండకొమ్ములను తాకిన స్వార్థం
కొండలోయలో పడిపోతే
కొనలు సాగని పేదల కోర్కెలు
కొత్తమలుపులను చేకొంటే ॥ఆనందం॥

చుక్కలనంటిన సమతామనుతలుమ
ఒక్కసారిగా దిగివస్తే
సతమతమయ్యేపేదల బతుకులు
ఒక్కుమ్మడిగా వికసిస్తే! ॥ఆనందం॥ 



# ముఖ్యమంత్రి యువశక్తి పథకము

## (CHIEF MINISTER'S EMPOWERMENT OF YOUTH)

### చిత్తూరు జిల్లా

ధ్రరాష్ట్రాన్ని స్వర్ణాంధ్రగా రూపొందించాలన్న సత్సంకల్పంతో ముఖ్యమంత్రి చేపట్టిన వివిధ కార్యక్రమాలలో యువశక్తి పథకం విశిష్టమైనది. నది. కారణం యువత ఏదేశప్రగతికైనా జీవనాడి కాబట్టి!

ఖ్యమంత్రి యువశక్తి పథకం రాష్ట్రంలోని ఇతర జిల్లాలతో పాటు చిత్తూరు జిల్లాలో 1996 వ సం॥రం డిసెంబరు 1వ తారీఖున ప్రారంభమైంది. ష్యత గల నిరుద్యోగ యువతీ యువకులను సంఘాలుగా ఏర్పాటుచేసి వారు స్వయం ఉపాధిని చేపట్టి ఆర్థికంగా నిలదొక్కుకొనేందుకు ఽ సహాయ సహకారాలను అందించి తద్వారా జాతీయ స్థూల ఉత్పత్తిని పెంపొందించడమే ఈ పథక ముఖ్యోద్దేశ్యము.

ు. యం. ఇ.వై. పథకం క్రింద చిత్తూరు జిల్లాలో ఇంతవరకు 17.66 కోట్ల రూపాయల వ్యయంతో 1800 యూనిట్ల స్థాపనకు ఆర్థిక ం జరిగింది. ఈ 1800 సంఘాలలో దాదాపు 10119 మంది యువతీ యువకులు లబ్ధిపొందారు.

స్థాయిలో నిర్వహించిన రాపిడ్ అప్రైజల్ సర్వే రిపోర్టు ప్రకారము రాష్ట్రవ్యాప్తంగా ఈ పథకము 82% విజయవంతం కాగా చిత్తూరు జిల్లాలో యిలో 94% విజయవంతమై ప్రథమ స్థానాన్నిపొందడం విశేషం. అదేవిధంగా రుణాల వసూళ్ళలో కూడా ఇంతవరకు 62.76 లక్షల ు వసూలు చేసి తన ఆధిక్యతను నిలుపుకొంది.




ి రాష్ట్రస్థాయి సి. యం. ఇ.వై. వర్క్షాపును ప్రారంభిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీ పి.వి. యణ మూర్తి, ఐ.ఎ.ఎస్. మరియు రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ కమీషనర్, శ్రీ యల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఎ.ఎస్.



ఉపాధి కల్పనతో ఉత్సాహవంతులైన యువకులు - నేతాజీ యువజన సంఘం సోంపల్లె గ్రామం మొలకల చెరువు మండలం - డిష్‌యాంటిన్

ువశక్తి ఉద్యమం : ముఖ్యమంత్రి యువశక్తి పథకం అమలులో ఎదురైన లోటుపాట్లను దృష్టిలో ఉంచుకొని 2000-2001 ఆర్థిక ి నుండి ఈ పథకానికి కొన్నిమార్పులు అనివార్యమైంది. ఆ మారిన నిబంధనల ప్రకారము ప్రతి సంఘములో 18-35 సం.ల వయస్సు ువతీ యువకులు 15 లేక అంతకన్న ఎక్కువ మంది వుండాలి. వీరంతా వేరు వేరు కుటుంబాలకు చెందినవారై ఉండాలి. సంవత్సరానికి 000/- ఆదాయము కల్గి దారిద్ర్య రేఖకు దిగువ గలవారై ఉండాలి. వీరిలో కనీసం ఇద్దరైనా 7వ తరగతి పాసై ఉండాలి. వీరంతా తమ మండల యూత్ ఎంపవర్‌మెంటు ఆఫీసరు ద్వారా జిల్లా యువజన సంక్షేమ అధికారి వద్ద తమ సంఘాన్ని నమోదు చేసుకోవాలి. తమకు ులోని ఏదైనా బ్యాంకు నందు వారి పొదుపు ఖాతాను ప్రారంభించి ప్రతిసభ్యుడు ప్రతి రోజు రూ. 2/- తగ్గకుండా కనీసం 6 నెలలు పొదుపు ఈ 6 నెలల పొదుపు కాలంలో వారికి వివిధ అంశాలపై శిక్షణ ఉంటుంది.

ణా కాలాన్ని విజయవంతముగా ముగించుకొని పొదుపులో ఉత్తమ ప్రమాణాలు పాటిస్తూ, సాంఘిక సేవా కార్యక్రమములలో చురుకుగా ా ఉత్తమ గ్రూపులుగా ఎంపికైన వారికి ప్రభుత్వము ఈ క్రింద విధంగా ఆర్థిక సహాయము అందిస్తుంది.

| | |
|---|---|
| ంఘ తాలూకు పొదుపు | 6 నెలల కాలంలో కనీసం రూ. 5,000/- మించి వుండాలి. |
| ివాల్వింగ్ ఫండ్ | సంఘ నిధికి 100 రెట్లు (రూ. 1,00,000/-) మించకుండా. |
| ూర్జిన్ మనీ | సంఘ నిధికి 50 రెట్లు (రూ. 50,000/-) మించకుండా. |
| ్యాంకు ఋణము | మార్జిన్ మనీకి సమానంగాని అంతకన్న ఎక్కువ గాని (రూ. 50,000/- లేదా అంతకన్నా ఎక్కువ) |
| ుొత్తము | ఒక సంఘానికి అందే ఆర్థిక సహాయము విలువ కనీసం 2 లక్షల రూపాయలు. |

2.00 లక్షల ఆర్థిక సహాయముతో సంఘ సభ్యులు వారి అభిరుచికి తగిన ఆర్థిక కార్యకలాపాలను ఒకటిగా కానివేరు వేరుగా కాని ఏర్పాటు ప్రభుత్వానికి చెల్లించాల్సిన రూ. 50,000/- ల మార్జిన్‌మనీ 8 శాతము వడ్డీతో తిరిగి సకాలములో చెల్లించాలి. లేనియెడల రెవిన్యూ రికవరి ుము మార్జిన్‌మనీతోపాటు లక్షరూపాయలు రివాల్వింగ్ ఫండ్‌కు వడ్డీ కట్టి మొత్తము వసూలు తప్పనిసరి. అవసరమైన పక్షంలో ఐ.పి.సి. సెక్షన్ ారము ఛీటింగ్‌కేసు నమోదు చేసి క్రిమినల్ చర్యలు కూడా తప్పవు.

ుథకము క్రింద ఇంతవరకు 1956 సంఘాలు ఏర్పాటై, దాదాపు 2 కోట్ల రూపాయలు పొదుపుచేసుకొన్నాయి. ప్రస్తుతము 3 శిక్షణాంశాలు ొని 4వ శిక్షణాంశములోకి అడుగిడుతున్నారు. యువత శ్రామిక జీవన సౌందర్యమే జాతి ఘనత!

**బి. గోపాలకృష్ణ, బి.టెక్**
ముఖ్య కార్యనిర్వహణాధికారి, సెట్విన్, తిరుపతి
రియు జిల్లా యువజన సంక్షేమ అధికారి, చిత్తూరు

**పి.వి. సత్యనారాయణ మూర్తి, ఐ.ఎ.ఎస్.**
జిల్లా కలెక్టరు మరియు చైర్మన్

# శ్రీ దుర్గామల్లేశ్వర స్వామివార్ల దేవస్థానము

ఇంద్రకీలాద్రి : విజయవాడ. ఫోన్స్ : 423600, 425744, ఎస్.టి.డి. : 0866



**కార్యక్రమములు**

| ...ు – రుసుములు | రూ. పై. |
|---|---|
| ...మ్మవారికి సహస్ర నామార్చన ఒకరోజుకు | 50.00 |
| ...మ్మవారికి అష్టోత్తర నామార్చన ఒక రోజుకు | 25-00 |
| ...ల్లేశ్వరస్వామివారి రుద్రాభిషేకం ఒకరోజుకు | 20-00 |
| ...మ్మవారికి సం. నకు 52 శుక్రవారములు ...స్ర నామార్చన | 2,600-00 |
| ...మ్మవారికి సం. నకు 52 శుక్రవారములు ...త్తరం | 1,300-00 |
| ...ల్లేశ్వర స్వామివారి రుద్రాభిషేకం సం. నకు ... సోమవారములు | 1,040-00 |
| ...డీ హోమం (ఒకరోజుకి) | 116-00 |
| ... కుంకుమార్చన (ఒకరోజుకి) | 1,000-00 |
| ...తి కళ్యాణము (ఒకరోజుకి) | 500-00 |
| ...క్రనవావరణార్చన | 516-00 |
| ...ల్లీదేవ సమేత సుబ్రమణ్యస్వామి ...లయములో జరుపబడు పూజలు | |
| ...సర్పదోష నివారణ | 116-00 |
| ...సహస్ర నామార్చన | 10-00 |
| ...అష్టోత్తరం | 5-00 |
| ... శుక్రవారములు శ్రీ అమ్మవారి అంతరాలయ ...నం (క్యూలైనుద్వారా ఒక్కరికి మాత్రము) | 1,000-00 |
| ...కీ సేవ . | 116-00 |

...జలు – రుసుములు :

| | | |
|---|---|---|
| 1. | ...మ్మవారికి శాశ్వత సహస్రనామార్చన ... శుక్రవారములు | 26,000-00 |
| 2. | శ్రీ అమ్మవారికి శాశ్వత అష్టోత్తరం 52 శుక్రవారములు | 13,000-00 |
| 3. | శ్రీ మల్లేశ్వరస్వామివారి శాశ్వత అభిషేకం 52 సోమవారములు | 10,400-00 |
| 4. | శాశ్వత సహస్రనామార్చన సంవత్సరములో ఒకరోజు | 500-00 |
| 5. | శాశ్వత అష్టోత్తర సంవత్సరంలో ఒకరోజు | 250-00 |
| 6. | పల్లకీసేవ | 1,116-00 |
| 7. | శాశ్వత శాంతి కళ్యాణం | 10,000-00 |
| 8. | శాశ్వత లక్ష కుంకుమార్చన | 10,000-00 |
| 9. | శాశ్వత శ్రీచక్ర నవావరణార్చన | 6,000-00 |
| 10. | శాశ్వత సర్పదోష నివారణ | 1,116-00 |
| | ఎ) శ్రీ వల్లీ దేవసమేత సుబ్రమణ్యస్వామి ఉపాలయములో జరుపబడును. | |
| | బి) శాశ్వత సహస్ర నామార్చన సుబ్రమణ్యస్వామి ఉపాలయములో జరుపబడును. | 150-00 |
| | సి) శాశ్వత అష్టోత్తరం సుబ్రమణ్యస్వామి ఉపాలయములో జరుపబడును | 100-00 |
| 11. | శాశ్వత నిత్య ప్రసాదం స్కీము ఉపాలయములో జరుపబడును | 1,116-00 |
| 12. | శాశ్వత అన్నదానం 10 మందికి సంవత్సరములో ఒకరోజు | 1,116-00 |
| 13. | శాశ్వత అన్నదానం 50 మందికి సంవత్సరములో ఒకరోజు | 5,116-00 |
| 14. | శాశ్వత అన్నదానం 10 మందికి సం. లో ఒకరోజుకు చెల్లించినవారికి శ్రీ అమ్మవారి సిల్వర్ కోటెడ్ ప్రతిమ ఉచితంగా ఇవ్వబడును. | 1,201-00 |

...: దాతలు చెల్లించినసొమ్ము 1 సంవత్సరం తర్వాత వచ్చిన వడ్డీతో మాత్రమే పూజ జరిపించబడును.

కార్యనిర్వహణాధికారి మరియు
జాయింటు కమీషనరు

...ు చేయు ఉద్దేశ్యమున్న భక్తులు పైకమును కార్యనిర్వహణాధికారి, శ్రీ దుర్గా మల్లేశ్వర స్వామివార్ల దేవస్థానం, ఇంద్రకీలాద్రి, ...డ పేరున డి.డి. ద్వారాగాని, ఎం.ఓ. ద్వారా గాని పంపవచ్చును.

... చిరునామా, గోత్రములు, విపులముగా తెలుపుచూ, పూజా వివరములు వివరముగా పంపవలయును.

| | లబ్ధిదారులు | వ్యయము (లక్షలలో) |
|---|---|---|
| ున్న నీటివనరులు | 1307 | 96.731 |
| ంట తోటలు | 177 | 2.719 |
| ూమి కొనుగోలు | 111 | 13.136 |
| ంల్బరీ | 27 | 5.311 |
| ాడి పరిశ్రమలు | 319 | 48.599 |
| ్వయం ఉపాధి పథకాలు | 433 | 143.124 |
| ్వయం ఉపాధి పథకాలు | 18 | 12.553 |
| ాతమ్మల పునరావాసం | 262 | 26.680 |
| ర్మకారులకు ఆర్థిక సాయం | 291 | 48.910 |
| ుువతకు కంప్యూటర్ శిక్షణ | 97 | 21.742 |
| ుువతకు ఇతర శిక్షణా కార్యక్రమాలు | 164 | 6.428 |
| .ఎం.ఇ.వై. యూనిట్లకు మార్జిన్‌మనీ | 307 | 55.00 |
| ్వంత రిక్షా పథకము | 41 | 2.460 |
| మొత్తము | 3554 | 483.393 |

మార్జిన్ మనీ తిరిగి చెల్లించండి. సంఘ అభివృద్ధికి తోడ్పడండి. మాతమ్మల వ్యవస్థ చట్ట వ్యతిరేకం. ని రూపు మాపుటకు నడుంబిగించండి.

చిన్నకుటుంబం – అక్షరాస్యత – స్వయంశక్తి

అభివృద్ధికి సోపానాలు – ఆలోచించండి – ఆచరించండి.

ఎస్. ముక్తేశ్వరరావు (ఎం.ఎ.)
కార్యనిర్వాహక సంచాలకులు
జిల్లా షెడ్యూల్డు కులాల
సహకార సంస్థ లి., చిత్తూరు జిల్లా

పి.వి. సత్యనారాయణమూర్తి
ఐ.ఎ.ఎస్.
జిల్లా కలెక్టర్ / అధ్యక్షులు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు



(రిజిష్టరు నెంబరు. 18/94)

తి.తి.దేవస్థానముల పరిపాలన భవనం, కె.టి.రోడ్డు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)

య్య, ఐ.ఏ.ఎస్.
హణాధికారి

న దాతలకు,

న్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. మనదేశంలో ఆకలిగొన్నవారికి, పేదవారికి అన్నదానం చేయటమన్నది సేవ మాత్రమే కాదు, వేదకాలం నుంచి వస్తున్న పవిత్ర సంప్రదాయం! అన్నదానం చేసిన వారికి దేవతల ప్రక్కన చోటు దని పెద్దలంటారు.

రుమలకు వచ్చే యాత్రికులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించే ఉద్దేశ్యంతో 1985లో శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ారంభించినప్పటి నుండి అపూర్వాదరణ చూరగొని దేశమంతటి నుండి సహృదయులైన దాతల నుండి విరాళాలు న్నాయి.

**కం విశేషాలు :**

వరైనా ఐదు లక్షలు, దానికి రెట్టింపు మొత్తం (ఎ) ఒక వ్యక్తి, (బి) కుటుంబంలో ఐదు మంది కలిపి, (సి) రెండు వ్యాపార స్థలు కలిపి, విరాళం ఇవ్వవచ్చు. వీరికి ఈ క్రింది సౌకర్యాలు లభిస్తాయి.

దాతల పేర్లు భోజనశాలలో ప్రదర్శిస్తారు.

దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజుల పాటు ఉచిత వసతి ఏర్పాటు చేయబడుతుంది.

దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజులు, 5 మందికి మాత్రం వైకుంఠం క్యూ కాంప్లెక్స్ ద్వారా దర్శనము.

దాతలకు శ్రీ వేంకటేశ్వరస్వామి మరియు శ్రీ పద్మావతిఅమ్మవారి వెండి బొమ్మలకు బంగారు పూత పూసిన జ్ఞాపిక బహూకరింపబడుతుంది. (ఒక పర్యాయం మాత్రమే)

ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80(జి) క్రింద పన్ను మినహాయింపు.

సదరు దాతల విరాళాలను జాతీయ బ్యాంకులలో ఫిక్సెడ్ డిపాజిట్ల ద్వారా ప్రతి ఏటా వచ్చు వడ్డీతో మాత్రమే అన్న దానానికి ఉపయోగింపబడుతుంది. ప్రస్తుతం ప్రతిదినం 15,000 మందికి ఉచిత భోజన సదుపాయం కలుగజేయబడుతున్నది.

. 1,000/-లు లేదా దానికి ఎన్ని రెట్లు మొత్తమైనా, ఈ శ్రీ ఎస్.వి. నిత్య అన్నదాన పథకమునకు విరాళమిచ్చి సరమగువారు ఈ మొత్తానికి కూడా ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80(జి) క్రింద పన్ను మినహాయింపు పొందవచ్చును.

ు లక్షల రూపాయలు, ఆ పైన ఇచ్చు దాతలకు ఒక వస్త్రము, పది చిన్న లడ్లు బహుమానముగా ఇవ్వబడును.

**ు పంపే పద్ధతి :**

తలు విరాళాలను ఏ జాతీయ బ్యాంకు నుండి అయినా "శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదానం ట్రస్ట్, తిరుపతి" పేరు మీద ు డ్రాఫ్టును తీసి "కార్యనిర్వాహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)" వారికి ను. ఇతర వివరాలకు –

**కార్యనిర్వాహణాధికారి**
**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తి.తి.దే. పరిపాలన భవనం, తిరుపతి-517 501.**

**న్నదానంతో ఆదుకోండి!! ఆత్మ సంతృప్తిని పొందండి!!**

సుప్రసిద్ధకవి, కథారచయిత

# శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

70వ సంవత్సరంలో పాదం మోపుతున్న శుభసందర్భంలో

ఆయన నిండునూరేండ్ల జీవితం పండించుకోవాలనీ...

లోక కళ్యాణం కోసరం

సాహిత్యాన్ని మూడుపువ్వులారుకాయలుగా పండించాలని ఆశిస్తూ -

| | |
|---|---|
| **NANI**<br>THIMMANAIDU PALEM | **GANAPATHI**<br>KARAKAMBADI |
| **MOUNIKA**<br>R. MALLAVARAM | **VENKATA SAI**<br>PADMAVATHIPURAM |
| **SRINIVASA**<br>MUTHYALAREDDIPALLI | **MAYURI**<br>MUTHYALAREDDIPALLI |
| **SAPTHAGIRI**<br>THATITHOPU | **PARTHA**<br>NEAR I.S. MAHAL<br>TIRUPATI |
| **BALAJI**<br>NEAR LEELA MAHAL<br>TIRUPATI | **UDAYA**<br>K.T. ROAD<br>TIRUPATI |

# ప్రగతిపథంలో ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.

: 1997 సంవత్సరం అక్టోబరు నె 20వ తేది

: దక్షిణాది రాష్ట్రాలయిన ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, కేరళ, పాండిచ్చేరి రాష్ట్రాల భాషలు, సాహిత్యం, చరిత్ర సంస్కృతుల ుమే ప్రధాన లక్ష్యం.

**ులు :** 1) ప్రొ. వి. ఐ. సుబ్రమణియం, ప్రో-చాన్సలర్, 2) ప్రొ. పి.వి. అరుణాచలం, వైస్-చాన్సలర్, 3) ప్రొ. బి. రామకృష్ణారెడ్డి,

**పర్యవేక్షణ కమిటి :**

ు : డి. సి. రంగరాజన్, గవర్నర్, ఆంధ్రప్రదేశ్.

: ఐదు దక్షిణాది రాష్ట్రాల ఉన్నత విద్యాశాఖామాత్యులు; యు.జి.సి. మరియు యమ్. హెచ్.ఆర్.డి. ప్రతినిధులు.

**ండలి ప్రస్తుత సభ్యులు :** 1) ప్రొ. పి.వి. అరుణాచలం, వైస్-చాన్సలర్, 2) శ్రీ జి. సుధీర్, ఐ.ఎ.ఎస్., సెక్రటరీ, ఉన్నత విద్యాశాఖ, కె. రస్తోగి, ఐ.ఎ.ఎస్., సెక్రెటరీ, ఆర్థికశాక, 4) శ్రీ బి. కృపానందం, ఐ.ఎ.ఎస్., కమీషనర్, కళాశాలల విద్యా విభాగం, 5) ప్రొ. కె. ప్రొఫెసర్, ద్రావిడ విశ్వవిద్యాలయం, 6) ప్రొ. సి. సుబ్బారావు, చైర్మన్, ఉన్నత విద్యాకౌన్సిల్ విభాగం, 7) శ్రీ పి. కృష్ణయ్య, ఐ.ఎ.ఎస్., హణాధికారి, టి.టి.డి.

్యటి విద్యాత్మక కార్యక్రమాలు : రెండు విభాగాలు ప్రారంభించబడ్డాయి. 1) తులనాత్మక ద్రావిడ సాహిత్యం మరియు తత్త్వ శాస్త్రం, 2) ర్ సైన్స్. తులనాత్మక ద్రావిడ సాహిత్యం మరియు తత్త్వశాస్త్రం విభాగం క్రింద పి.హెచ్.డి. మరియు ఎంఫిల్ రీసర్చి కోర్సులు కంప్యూటర్ గం క్రింద బి.యస్సీ (Computer Science, Mathematics and Statistics) కోర్సు.

**్శటి ప్రచురణలు :**

**తిరుక్కురల్ :** శ్రీ డి. జగన్నాథం, సంపాదకులు : ఆచార్య పి.వి. అరుణాచలం

**వేమన కవితాతత్త్వం** : (సెమినార్ ప్రొసీడింగ్స్) సంపాదకులు : ఆచార్య పి.వి. అరుణాచలం

**ద్రావిడ సాహిత్య సేతువు :** (చల్లా రాధాకృష్ణ శర్మ) డా. ద్వా. నా. శాస్త్రి, సంపాదకులు : ఆచార్య పి.వి. అరుణాచలం.

**ిన విద్యాత్మక సదస్సులు :**

వేమన సాహిత్యం తత్త్వం - హైదరాబాదు, మార్చి 98. 2) అఖిల భారత ద్రావిడ భాషాశాస్త్రజ్ఞుల సమావేశం - హైదరాబాదు, జూన్ ిజన్ 2020 - కుప్పం, ఫిబ్రవరి 99. 4) బసవేశ్వర సాహిత్యం -బెంగుళూరు, మార్చి 2000. 5) ద్రావిడ జానపద, గిరిజన శాస్త్ర ం - కుప్పం, మే 2000. 6) కుప్పంలో భాషల వాడుక : సామాజిక భాషాశాస్త్ర పరిశోధన : కుప్పం, ఆగష్టు నవంబర్ 2000. 7) ాత్యం, బసవ జయంతి - మైసూరు, సెప్టెంబరు 2000. 8) గుర్రం జాషువ 106వ జయంతి ఉత్సవం - కుప్పం, సెప్టెంబరు 9. తిరువళ్ళువర్, సాహిత్య తత్త్వాలు - చెన్నై, అక్టోబర్ 2000.

**యం :** 95 లక్ష రూపాయలు విలువ చేసే 14500 గ్రంథాలు వున్నాయి.

షన్ టెక్నాలజీ లాబొరేటరీ : అన్ని హంగులతో కూడిన అధునాతనమైన హైటెక్ లాబ్.

**లయమునకు విచ్చేసిన ప్రముఖులో కొందరు :**

డా. సి. రంగరాజన్, గవర్నర్, ఆంధ్రప్రదేశ్. 2) శ్రీ నారా చంద్రబాబునాయుడు, గౌ. ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్. 3) డా. వి.యస్. గవర్నర్, కర్నాటక. 4) శ్రీమతి కె. ప్రతిభా భారతి, స్పీకర్, ఆంధ్రప్రదేశ్. 5) భారత రత్న శ్రీ సి. సుబ్రమణ్యం. 6) పద్మభూషణ్ శ్రీ గోపాలకృష్ణయ్య. 7) ప్రొ. యన్. మార్కండన్, ఉపాధ్యక్షులు, గాంధీగ్రాం రూరల్ ఇన్స్టిట్యూట్. 8) జస్టీస్ వి.యస్. మాలిమత్. 9) శ్రీ ంద్రరావు, ఉన్నత విద్యాశాఖమాత్యులు, ఆంధ్రప్రదేశ్. 10) ప్రొ. కె. అన్బళగన్, ఉన్నత విద్యాశాఖామాత్యులు, తమిళనాడు. 11) డా. ్వర, ఉన్నత శాఖామాత్యులు, కర్నాటక. 12) శ్రీ ఎన్. రామకృష్ణారెడ్డి, పార్లమెంటు సభ్యులు, చిత్తూరు. 13. డా. యన్. శివప్రసాద్, ్శాఖ, పౌర సంబంధాల శాఖామాత్యులు, ఆంధ్రప్రదేశ్ 14. డా. ఎం. తమిళకుడిమగన్, తమిళభాష, సాంస్కృతిక శాఖ, దేవాదాయ ్యలు, తమిళనాడు. 15) డా. శ్రీమతి విద్యావతి, ఉపాధ్యక్షులు, కాకతీయ విశ్వవిద్యాలయం. 16) శ్రీ కె. వెంకటశివయ్య, ఐ.ఎ.ఎస్. 17. శ్రీ ఎ. రాధాకృష్ణ రాజు, చైర్మెన్, అంతర్జాతీయ తెలుగు కేంద్రం, బెంగుళూరు. 18) ప్రొ. డి. జవేరేగౌడ, మాజీ ఉపాధ్యక్షులు, యూనివర్శిటి. 19) డా. డి. శ్రీనివాస్, అయ్యంగార్, మాజీ ఉపాధ్యక్షులు, దక్షిణ భారత హింది ప్రచార సభ.

**లు :** రూ.4 కోట్లతో తత్త్వవేత్తలు వేమన, నారాయణ గురు, తిరువళ్ళువర్, బసవేశ్వర గార్ల పేరిట నాలుగు భవనముల నిర్మాణం.

**ణ :** విశ్వవిద్యాలయ ఆధీనంలో యున్న 1094 ఎకరములలో, ఖాళీ ప్రదేశములలో టి.టి.డి. వారి సహకారంతో 71400 చెట్లను క్షింపబడుచున్నవి.

పరిశుభ్రత, జన్మభూమి కార్యక్రమాలు : బోధన, బోధనేతర సిబ్బంది, విద్యార్థినీ విద్యార్థులతో కలసి ఈ కార్యక్రమం నిర్వహించుచున్నాము.

, మీరు-నీరు, కార్యక్రమాలు : విశ్వవిద్యాలయం ప్రాంగణములో వివిధ ప్రదేశాలలో వాటర్ షెడ్‌లు, పూట చెరువులు, ట్రెంచ్‌లు ్తాయి.

**క్షరాస్యత :** గుడుపల్లి మండలంలోని కొన్ని గ్రామాలను దత్తత తీసుకొని అక్షరాస్యత కార్యక్రమాలు చేపడుతున్నాం.

| | |
|---|---|
| **పి.వి. అరుణాచలం** | **ఆచార్య బి. రామకృష్ణారెడ్డి** |
| ఉపాధ్యక్షులు | రిజిష్ట్రార్ |

పోదాం! పోదాం! పదండి పోదాం!

పొగ సెగలు పగబట్టని లోకంలోకి

సిగరెట్టు చుట్టలు బీడీల్

ప్రొగాల్ తోడని ప్రపంచంలోకి!

–డా॥ ప్రేమానంద్



# తిరుపతి కో-ఆపరేటివ్ బ్యాంక్ లిమిటెడ్

**ఫిక్స్‌డ్ డిపాజిట్లపై - 13.00%**

**క్స్‌డ్/టర్మ్ డిపాజిట్లపై వడ్డీ రేట్లు (25-05-2000 నుండి)**

| | |
|---|---|
| 15 రోజుల నుండి 30 రోజుల వరకు<br>15 Days to 90 days | **7.50%** |
| 91 రోజుల నుండి 180 రోజుల వరకు<br>91 Days to 180 days | **8.50%** |
| 81 రోజుల నుండి 1 సం.ల వరకు<br>81 Days, upto and inclusive of 1 year | **10.00%** |
| సం. పైన 2 సం.ల వరకు<br>Over 1 year, upto and inclusive of 2 years | **11.00%** |
| 2 సం.ల పైన 3 సం.ల లోపు<br>Over 2 years and less than 3 years. | **12.00%** |
| 3 సం.ల పైన 10 సం.ల వరకు<br>3 years, upto and inclusive of 10 years | **13.00%** |

## బాలల సంక్షేమ డిపాజిట్ పథకం
## Children's Welfare Deposit Scheme

| Deposit Amount Rs. | Maturity Value Rs. for 15 Years | Maturity Value Rs. for 20 Years |
|---|---|---|
| 6,000 | 43,963 | 85,387 |
| 12,000 | 87,925 | 1,70,775 |
| 15,000 | 1,09,906 | 2,13,468 |

**ouble your money in 66 months under our Special Term Deposit Scheme**

★ మీ డిపాజిట్లకు కేంద్ర ప్రభుత్వపు డిపాజిట్ ఇన్సూరెన్సు పథకం క్రింద ఇన్సూరెన్సు భద్రత.

★ అన్ని డిపాజిట్లకు చట్టబద్ధమైన నామినేషన్ సౌకర్యం.

**టి.రామమూర్తి రెడ్డి**, చైర్మన్ **టి.ఆర్. వెంకటకృష్ణ**, వైస్‌చైర్మన్

డైరెక్టర్లు

వెంకటేశరెడ్డి, పి. బాలనరసింహారెడ్డి, ఎన్. శ్రీనివాసులురెడ్డి, ఎస్. కె. బాబు, ఎం. నాధమునిరెడ్డి, జె. శేఖర్ బాబు
టి.ఎస్. స్వామినాథ్, బి. దొరైరాజ్, డి. శ్రీనివాసులు రెడ్డి, కె. చిరంజీవి.

**ఎస్. రామకృష్ణ**, డిప్యూటి రిజిస్ట్రార్ / మేనేజింగ్ డైరెక్టర్ (FAC)

**రుపతి కో-ఆపరేటివ్ బ్యాంక్ లిమిటెడ్**

సీమకే గర్వకారకుడు రాయలసీమ చిన్నోడు

సరస్వతీ పుత్రులు

**పులిక**

70వ సంవత్సరంలో పాదంమోపుతున్న శుభసందర్భంలో

హార్దికాభినందనలతో



స్వర్ణభారతి సాహిత్య వేదిక సౌజన్యంతో.......




# తిరుపతి పురపాలక సంఘము






తిరుమల బైపాస్‌రోడ్ మున్సిపల్ పార్క్



మంచాలవీధి మున్సిపల్ పార్క్

## ...రుపతి పట్టణ పరిసరాలను పరిశుభ్రంగా పచ్చదనంతో ఉంచండి.

...చ్చని పరిసరాలు అభివృద్ధికి సోపానాలు.

...త్తా చెదారములను వీధులలో వేయకుండా డస్ట్‌బిన్‌లను ఉపయోగించి పరిసరాల ...రిశుభ్రతను పాటించండి.

...క్కలు నాటండి - పర్యావరణాన్ని పరిరక్షించండి.

...రపాలిక, తుడా వారి అనుమతి పొందని లేఅవుట్‌లలో స్థలములను కొనకండి.

...కాలంలో పన్నులు చెల్లించి పట్టణంలోని వివిధ ప్రాంతాలలో చేపట్టబోవు అభివృద్ధి ...ర్యక్రమాలకు సహకరించండి.

... ఇంటికి భూగర్భ డ్రైనేజి కనెక్షను తీసుకోండి - ఇంటి చుట్టూ మురుగు, దోమలు ...కుండా నివారించండి. నవంబరు 2000 నెలాఖరులోగా భూగర్భ డ్రైనేజీ కనెక్షను ...సుకొనేవారికి మున్సిపాలిటీ ప్రత్యేక రాయితీలు కల్పించింది. మీ ఇంటి వద్దకు వచ్చే ...న్సిపల్ అధికారికి సహకరించండి. 1/3వ వంతు డిపాజిట్ చెల్లించి వెంటనే కనెక్షను ...సుకోండి.

**మీ అందరి తోడ్పాటుతో అభివృద్ధి కార్యక్రమాలను**
**చేపట్టడానికి సహాయ సహకారాలను అందిస్తారని ఆశిస్తూ...**

కమీషనర్
...రుపతి మునిసిపాలిటి

స్పెషలాఫీసర్
తిరుపతి మునిసిపాలిటి

**Twenty Fiv... rs**
**...e a ...**
**with Destiny... to**
**Share the Farme 's**
**'ision.**



'rity and progress
'eam come true for
an Indian farmer.
|h the finest of farming
:s. Against the toughest
enges.

**Kisaan"**, we have shared that
from the very start. By providing
:ts that include high quality seeds
l by in-house research, powerful
sers and effective pesticides.

Making them available through an extensive dealer network and skilled field marketing professionals. Who render hands-on support in analysing soil samples. Provide guidance on fertiliser application. Render crop management advice.

Most importantly, by building relationships based on bonds of **"Jai Kisaan"** trust.




**PLANTING VISIONS FOR A BETTER TOMORROW**

Zuari Industries Limited, Goa

